

శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# యాదవాభ్యుదయ మహాకావ్యమ్

## సుబోధినీ వ్యాఖ్యా సహితం

ప్రథమ భాగం




వ్యాఖ్యాత :

వాచస్పతి, పండితరత్న

శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు



శ్రీమాలోల గ్రంథమాల, హైదరాబాదు



# శ్రీవణ్ శఠకోప
# శ్రీ రంగనాథ యతీన్ద్ర మహాదేశికన్

**శ్రీ అహోబిలమఠం 46వ పీఠాధిపతులు**

శ్రీ యదువంశభూషణాయ నమః

శ్రీ వేదాన్త దేశిక ప్రణీతమ్

# యాదవాభ్యుదయ మహాకావ్యమ్

ప్రథమ భాగము

సుబోధినీ వ్యాఖ్యా సహితమ్


వ్యాఖ్యాత :

వాచస్పతి, పండితరత్న

**శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు**



ప్రచురణ

**శ్రీమాలోల గ్రంథమాల**

అహోబిలమఠం, హైదరాబాద్

శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

**యాదవాభ్యుదయ మహాకావ్యమ్** (ప్రథమ భాగము), (సుబోధినీ వ్యాఖ్యా సహితమ్)

వ్యాఖ్యాత : **శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు**
c/o. డా॥ కె.వి. రమణాచార్యులు ఐ.ఏ.ఎస్. (రి)
సి-501, నఫీజ్ రెసిడెన్సీ, ఏ.సి. గార్డ్స్
హైదరాబాద్- 500 028.
ఫోన్: 040-2330 6899



ప్రథమ ముద్రణ : విజయనామ సంవత్సరం 2013

ప్రతులు : 500

మూల్యము : **రూ. 200/-**

ప్రాప్తిస్థానము : **శ్రీ మాలోల గ్రంథమాల**
శ్రీ అహోబిల మఠము
2-2-20/28. డి.డి. కాలనీ,
హైదరాబాద్- 500 013

ముద్రణ సహకారం : **"పుస్తక శిల్పి" తాళ్లపల్లి మురళీధర గౌడు**
సెల్: 9393 176 552

ముఖచిత్రం : **కాళీయమర్దనం**
ముఖచిత్ర రూపకల్పన : **టి. మల్లేశ్**

అక్షరాలంకరణ : **కె.బి.టి. కొండయ్య**

ప్రచురణ కర్తలు : **శ్రీ మాలోల గ్రంథమాల**
హైదరాబాద్- 500 013

.ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
విద్యానగర్, హైదరాబాద్ - 500 044
ఫోన్ : 040-2761 8261

SRI AHOBILA MUTH
SRI DASAVATHARA SANNIDHI
NORTH GATE
SRIRANGAM, TRICHY-6





श्रीमदहोबिल मठम्  ஸ்ரீ அஹோபில மடம்  Sri Ahobila Math

శ్రీవణ్ శఠకోప శ్రీరంగనాథ యతీన్ద్ర మహాదేశికన్
అహోబిలమఠం 46వ పీఠాధిపతులు



# ఆశీస్సులు

**మ**న సన్నిధి శిష్యులైన హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ ఉ.వే. కె.వి. రాఘవాచార్యులు శ్రీ వైష్ణవ సంప్రదాయ గ్రంథములైన దేశిక స్తోత్రములలో యతిరాజ సప్తతి, పాదుకా సహస్రము, దయాశతకము, గోదాస్తుతి, అభీతి స్తవము మొదలగు స్తోత్రములను తెలుగు భాషయందు వ్యాఖ్యానం చేసి యున్నారు. ఈ విషయము తెలిసి సంతోషిస్తున్నాము.

ఈ స్వామి ఇప్పుడు మన ఆచార్య సార్వభౌములు, కవితార్కిక సింహము శ్రీనిగమాంత దేశికుల యాదవాభ్యుదయ కావ్యమునకు ఆంధ్రభాషయందు వ్యాఖ్యానమును వ్రాయుచున్న విషయము తెలిసినది. 24 సర్గలలో నాల్గు సర్గలుగల ప్రథమ భాగముగా ఈ గ్రంథము ప్రకాశింపబడుచున్నది. ఆ స్వామి ప్రయత్నము సఫలము కావాలని ఆశీర్వదించి శ్రీ మాలోల కృపాకటాక్షములను అనుశాసిస్తున్నాము.

నారాయణ నారాయణ

శ్రీరంగం
25-09-2013

H. H. THE JEER OF
SRI AHOBILA MUTT



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ**
**రామానుజ జీయర్‌స్వామివారు**
వేద విశ్వవిద్యాలయ ప్రాంగణము
శ్రీరాంనగరం, శంషాబాద్, హైదరాబాద్

# మంగళాశాసనాలు

**శ్రీమతే నారాయణాయ నమః**

ప్రియస్వామినః! అనేక మంగళాశాసనాలు.

దేవరవారు వ్రాసిన యాదవాభ్యుదయ వ్యాఖ్యను స్థాలీపులాకన్యాయంగా చూశాము. నిగమాన్త దేశికుల గ్రంథాలకు ఒక ప్రహతమైన వ్యాఖ్యానమార్గాన్ని వేసికొని ముందుకు సాగుతున్న దేవరవారి లేఖినికి వార్ధకం అడ్డుకాదు. అది నిత్యయౌవనోత్సాహంతో ముందుకు సాగటం మాకు చాలా ఆనందాన్ని కలిగిస్తోంది. ఇప్పటికే తమ తెలుగు వివరణల ద్వారా తెలుగు పాఠకలోకంలో ఒక చెరగని ముద్ర వేసిన తమరు ఈ ప్రస్తుత వివరణంతో మరింత చేరువైనారు.

***శక్త్యా శౌరికథా స్వాదః - స్థానే మందధియా మపి।***
***అమృతం యదిలభ్యేత - కిం న గృహ్యేత మానవైః॥***

యాదవాభ్యుదయంలోని దేశిక శ్రీసూక్తి త్రికాలాబాధసత్యం. కృష్ణ కథాస్వాదనమ్ కదా మర్త్యులకు అమర్త్యతను సాధించేది? అలాంటి కథను వినూత్న కవితా శిల్పంతో లోకానికి మహాకవులకు దీటుగా అందించిన శ్రీ మద్దేశికులు కవితార్కిక సింహులే. అలాంటి సింహాన్ని మీ వ్యాఖ్యాకర స్పర్శచే ముద్దుగా దువ్వి స్వాధీన పరచుకున్న మీరు ధన్య జీవనులేననటం సత్యం.

**"దేశికాచార్య సద్వాణీ వర్ధతాం పరివర్ధతామ్"** అని మంగళాశాసనాలు చేస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ

30-09-2013

CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEYAR

'శాస్త్రరత్నాకర' 'శాస్త్రవిద్వన్మణి'
**డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు**
డైరెక్టర్, ఎకడమిక్ కౌన్సిల్-జీవ,
శ్రీరామనగరం-ముచ్చింతల్ రోడ్,
పాలమాకుల పోస్టు- 509 325, ఆర్.ఆర్. జిల్లా



# యాదవాభ్యుదయ వైభవం

నిగమాన్త దేశికులు దర్శన ప్రతిష్ఠాపకులుగా మాత్రమే కాక, సంస్కృత మహాకవిగా ప్రసిద్ధులు. కాళిదాస కావ్యరచనకు ప్రతిగా వీరి రచనలు సాగాయి. సారస్వత ప్రపంచంలో వీరు స్పృశింపని కవితాప్రకియలేదు. ఖండకావ్య- మహాకావ్య- నాటకాది ప్రక్రియలన్నీ వీరు తమకు అభిమతమైన శ్రీ వైష్ణవ సంప్రదాయ- దార్శనిక రీతులను ఆవిష్కరించడానికే స్వీకరించారు. మేఘసందేశానికి దీటుగా హంస సందేశం, రఘువంశానికి దీటుగా యాదవాభ్యుదయం వీరి నిర్మాణ శిల్పానికి నిదర్శనం. యాదవాభ్యుదయం ఒక మహాకావ్యం. భాగవతకథను ఆలంబనంగా తీసికొన్నది. మాఘకావ్యంలా కృష్ణకథను (జన్మకథతోపాటు) ఆలంబనంగా చేసికొని దీన్ని 'కృష్ణాభ్యుదయం'గా వ్రాసినట్లు రామాభ్యుదయంలో దిండికవి, వైభవ ప్రకాశికలో మహాచార్యుడు ఉట్టంకించారు. ఇది 24 సర్గలలో కూర్చబడిన మహాకావ్యం. ప్రబంధ లక్షణలక్షితం.

*నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్*
*ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవాః।*
*విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్*
*ఏతానియత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే॥*

అని మహాకావ్యలక్షణంలో చెప్పబడిన వాటిలో శైలవర్ణనం, గోవర్ధనవర్ణనం (6వ సర్గలో) చంద్రాస్తమయాది వర్ణనం, పృథివీవర్ణనం (18వ సర్గలో) 23లో మహాభారత యుద్ధకథ ఇవన్నీ ఈ మహాకావ్యానికి మహాకావ్యతను సంతరించే విశేషాలు.

ఇక భాగవతాదుల్లోలా స్తవనాలన్నీ వేదాన్త తత్త్వభారాలు. ప్రథమసర్గలో, భూమిని పురస్కరించుకొని, దేవతలు క్షీరాబ్ధిలో స్వామిని స్తుతించిన రీతి తత్త్వనిర్భరం. ఇక్కడ పురాణశైలి స్పష్టంగా గోచరిస్తుంది.

*త్రివేదీ మధ్యదీప్తాయ, త్రిధామ్నే పంచహేతవే।*
*వరదాయ నమస్తుభ్యం బాహ్యాన్తర హవిర్భుజే॥*

ఇత్యాది శ్లోకాల వివరణం మన స్వామివారికి చక్కటి విందుభోజనమే. 43వ శ్లోకంనుంచి 64వ శ్లోకం దాకా ప్రతి శ్లోకం వివరణ సాపేక్షమే. వీటిని వివరించడంలో స్వామివారి వ్యాఖ్య విశ్రాన్తి తీసుకోలేదు. 'స్థేమ' మొదలైన శబ్దాల వివరణం వ్యాకరణ శాస్త్రానుసారంగా బాగా చేశారు.

ఇక మూడవ సర్గలో 15వ శ్లోకం నుంచి 22వ శ్లోకం దాకా వసుదేవుడు చేసిన స్తుతి మరొక విశిష్టవర్ణనా ఘట్టం. మన స్వామివారు ప్రస్తుతం నాలుగు సర్గల వరకు తమ వివరణాన్ని అందిస్తున్నారు. గ్రంథం అంతా వీరి వివరణం అప్రతిహతంగా సాగాలని ఆశిస్తూ వీరికి అందుకు కావలసిన దైహికశక్తి పాటవాలను నిరామయస్థితిని యాదవాభ్యుదయ నాయకుడైన మన కృష్ణస్వామి అనుగ్రహించి వారిని, మనలను కృతార్థులను చేయాలని స్వామి శ్రీచరణాలచెంత శరణాగతి చేస్తున్నాను. ఇంతటి మహాకృత్యాన్ని అవిశ్రాంతంగా చేస్తున్న మన రాఘవాచార్యస్వామివారికి సహస్రథా స్వరూపానురూపంగా ప్రణతులు సమర్పిస్తూ...

జీవాప్రాంగణం — దాసుడు
శ్రీరామనగరం — **రంగరామానుజాచార్యులు**
05-10-2013

మహా మహోపాధ్యాయ,
కవిశాబ్దిక కేసరి, శాస్త్ర రత్నాకర,
ఉ.వే. మహోదధి, శ్రీమాన్
**డా॥ శ్రీ.న.చ. రఘునాథాచార్యులు**



# మధుర ప్రశంస

శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులుగారు ఉభయ వేదాన్తముల యందును నిష్ణాతులు. వీరి రచనలలో వ్యాఖ్యాన గ్రంథములే ఎక్కువ. శ్రీ దేశిక విరచిత స్తోత్రములకు వీరి వ్యాఖ్యలు అచటచ్చట గ్రంథ గ్రంథులను విప్పుచూ జిజ్ఞాసువులకు భావావిష్కారకములై యున్నవి. పాదుకా సహస్ర స్తుతికి ఆంధ్ర వ్యాఖ్యను ప్రసాదించిన వీరు ఇప్పుడు 2630 శ్లోకాలతో 24 సర్గలతో విలసిల్లుతున్న శ్రీ యాదవాభ్యుదయ మహాకావ్యాన్ని వ్యాఖ్యానింప నారంభించినారు. ఈ శ్రీదేశిక కావ్యానికి సర్వతంత్ర స్వతంత్రులైన శ్రీ అప్పయ్య దీక్షితుల వారు విపుల వ్యాఖ్యను సంస్కృతంలో వ్రాసి యున్నారు. దానిని అనుసరిస్తూనే శ్రీమాన్ రాఘవాచార్యులవారు అక్కడక్కడ సంవాద రూపంగా ఆళ్వారుల దివ్య ప్రబంధ పాశురాలను కూడా ప్రమాణీకరించటం వీరి ఉభయ వేదాన్త పరిశ్రమకు నిదర్శనము. వీరు నిత్య సాహిత్య క్షేత్ర కృషీవలులు.

ఆకలిగొన్నవానికి చేసే అన్నదానం సార్థకము ఔతుంది. ఒక సత్రం కట్టి నిత్యాన్నదానం ఏర్పాటు చేస్తే ఎంతో మంది ఆర్తులు తమ ఆకలిని తీర్చుకొని తృప్తి పడతారు. అట్లా ఉపకరించే పవిత్ర సత్రం వంటిదే శ్రీ రాఘవాచార్యులవారి నిరంతర గ్రంథ రచనామహోద్యమము. స్తోత్రాలలోని తత్త్వార్థాలను తెలుసుకొని ఉజ్జీవించాలనే ఎందరో జిజ్ఞాసువులకు వీరి సద్గ్రంథాలు మహోపకారాన్ని చేస్తున్నందుకు మా హృదయ పూర్వకమైన ఆనందాన్ని ప్రకటించటమే ఈ మధుర ప్రశంసా ప్రయోజనము.

ఇట్లు

వరంగల్ — శ్రీ న.చ. మహామహోపాధ్యాయ
03-9-2013 — రఘునాథాచార్యః



పండితరత్న, వేదాన్త వాచస్పతి,
సత్సంప్రదాయ సుధాంబుధి,
ఉ.వే. శ్రీమాన్ **డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు**
(తిరుపతి)

# సుబోధక సుబోధినీ సుధ

*శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ।*
*వేదాంతాచార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది॥*

వేదాంత దేశిక, కవికథక సింహాది బిరుదాంచితులు శ్రీ మద్వేంకటనాథుల శతాధిక గ్రంథాలలో యాదవాభ్యుదయం, సంకల్ప సూర్యోదయం, సుభాషిత నీతి, పాదుకా సహస్రం, హంస సందేశం- అనే అయిదు పంచ కావ్యాలుగా ప్రశస్తిని పొందాయి. వీటిలో, పాదుకా సహస్రం నిత్యాను సంధేయ స్తోత్రమైనా, అందులోని కావ్యగుణ పౌష్కల్యాన్ని బట్టి కావ్యపంచకంలో ఒకటిగా అభిజ్ఞులచే పరిగణింపబడింది. శ్రీ వైష్ణవ సంప్రదాయ స్తోత్రాలలో భగవద్యామున ప్రణీతమైన ఆళవందార్ స్తోత్రానికి "స్తోత్రరత్న" మనే ప్రసిద్ధి కలిగినట్లే, సంస్కృత మహాకావ్య ప్రపంచంలో యాదవాభ్యుదయం కావ్యరత్నంగా సంభావింపబడుతున్నది. ఈ మహాకావ్యం చివరలో శ్రీదేశికులే స్వయంగా "వ్యతనుత యదువీర ప్రీతి మిచ్ఛన్ ప్రభూతాం కవి కథక మృగేంద్రః క్షేమదం కావ్యరత్నమ్"- అని అంటూ కావ్యరత్న శబ్దంలో దీనిని నిర్దేశించడం గమనించదగినది. ఈ కావ్యాన్ని కావ్యరత్నంగా దేశికులు పల్కడంలోని తాత్పర్యాన్ని వ్యాఖ్యాత అప్పయ్య దీక్షితులు "కావ్యాంతరేభ్యోఽస్య కావ్యస్యోత్కర్షః కథమితి చేత్, ప్రబంధృ గౌరవేణ, నాయక గౌరవేణ, శబ్దార్థ చమత్కార కథా, సందర్భ సౌభాగ్య కథా సత్యత్వ రూపేణ, స్వతః ప్రబంధ గౌరవేణచ తదుత్కర్షః" అని వివరించడం కూడా గమనార్హం. ఒక ప్రబంధానికి ఉత్కర్ష కల్గించడంలో గల హేతువులు- ప్రబంధ నాయకుడు, ప్రతిపాద్య వస్తువు, కవి – అనేవి మూడు. ఈ విషయాన్ని శఠకోపసూరి తిరువాయ్ మొళి ప్రబంధంలో "ఏఱ్ఱుమ్ పెరుమ్వుకళ్ వానవరీశన్ కణ్ణన్ తనక్కు

ఏఱ్కుమ్ పెరుమ్పుకళ్ వణ్ కురుకూర్ శడకోపన్శొల్, ఏఱ్కుమ్ పెరుమ్ పుకళ్ ఆయిరత్తుళ్ ఇవైయుమోర్పత్తు" (3-9-11) అని అంటూ తెలియజేశారు. తిరువాయ్మొళి ప్రబంధానికి వలె ఈ యాదవాభ్యుదయ కావ్యానికి కూడా ఈ మూడు హేతువులు వైలక్షణ్యాన్ని కలిగించాయి. ఈ విషయమే పూర్వం ప్రస్తావించిన అప్పయ్య దీక్షితుల వారి వివరణం ద్వారా స్పష్టపడుతున్నది. "రత్నం స్వజాతి శ్రేష్ఠేఽపి"- అని అమరకోశ వచనం. ఆయా జాతులలో శ్రేష్ఠమైనది రత్నంగా వ్యవహరింప బడుతుంది. "రత్నహారీచ పార్థివః"అనే సూక్తి రత్నం వంటి శ్రేష్ఠమైన వస్తువులను ప్రభువు చేజిక్కించుకుంటాడని తెల్పుతున్నది. కావ్యరత్నమైన యాదవాభ్యుదయాన్ని "రాజాధి రాజః సర్వేషామ్" అని, "అమరర్ పెరుమాన్" అని కీర్తింపబడే యదుకుల సార్వభౌముడు శ్రీదేశికుల ద్వారా నిర్మింపజేసి, స్వయంగా హృదయరత్నంగా పరిగ్రహించాడు. ఇంతకు ముందే ప్రౌఢ గంభీరమైన రఘువీర గద్య ప్రబంధాన్ని మహావీర చరితమనే పేరుతో రచించి శ్రీరామచంద్ర ప్రభు సద్గుణ కీర్తనాన్ని చేసి ధన్యులైన దేశికులు, ఈ యాదవాభ్యుదయ కావ్య రత్నాన్ని నిర్మించడం ద్వారా శ్రీకృష్ణభగవానుని కల్యాణగుణ కీర్తనాన్ని చేసి ధన్యధన్యులయ్యారు. సంస్కృత భాషలో శ్రీకృష్ణభగవానుని చరిత్రను సమగ్రంగా వర్ణించే కావ్యం ఇది ఒక్కటే. మాఘుని శిశుపాల వధ మహాకావ్యమైనా, అది కేవలం శిశుపాలుని సంహారాన్ని గూర్చి మాత్రమే వర్ణిస్తున్నందువల్ల శ్రీకృష్ణచరిత్రను పూర్తిగా వర్ణించే కావ్యం కాదు.

భారత, భాగవత, హరివంశ, విష్ణుపురాణాదులలో శ్రీకృష్ణుని చరిత్ర పూర్తిగా వర్ణింపబడినా, వాటిలో ప్రసక్తాను ప్రసక్తంగా గంగా-గాంగేయాది అన్యవృత్తాంతాలు అనేకం ప్రస్తావింపబడి, అసత్కీర్తనం చేయబడింది. ఇక, యాదవాభ్యుదయంలో అయితే, ఆదినుండి అంతంవరకు శ్రీకృష్ణభగవానుని చరిత్ర మాత్రమే ప్రతిపాద్య వస్తువు అయినందువల్ల, భారతాదులకంటే ఈ కావ్యరత్నానికిగల వైలక్షణ్యం సుస్పష్టం.

ఈ మహాకావ్యం గాయత్రీ మంత్రాక్షర సంఖ్యలో ఇరవై నాలుగు సర్గలతో నిబద్ధమైనది. ఇరవైనాల్గు వేల శ్లోకాలతో కూడిన శ్రీరామాయణం శ్రీరామచంద్ర కల్యాణ గుణ ప్రథను కీర్తించగా, ఇరవైనాల్గు సర్గలను కల ఈ కావ్యం శ్రీకృష్ణ భగవానుని పవిత్ర చరిత్రను గానం చేస్తున్నది.

యాదవాభ్యుదయమనే కావ్యనామం కూడా విలక్షణమైనది. శ్రీవిష్ణు పురాణంలోని "అయంస కథ్యతే ప్రాజ్ఞైః పురాణార్థ విశారదైః, గోపాలో యాదవం వంశం మగ్నమభ్యుద్ధరిష్యతి" (5-20-49) అనే శ్లోకార్థాన్ని ఈ నామం స్మరింప జేస్తుంది. యయాతి శాపవశంచేత రాజ్యార్హతను కోల్పోయిన యదువంశాన్ని గోపాలుడైన శ్రీకృష్ణభగవానుడు కంసుని వధించి, ఉగ్రసేనునకు పట్టాభిషేకాన్ని చేయడం ద్వారా ఉద్ధరించిన వృత్తాంతాన్ని ఈ శ్లోకం స్మరింపజేస్తుంది.

*"ప్రార్థితోఽపి సరాజ్యాయ ప్రభావజ్ఞైః యదూత్తమైః*
*అరోచయత రాజానముగ్ర సేనం వయోధికమ్"* (10-97)

అని అంటూ దేశికులు ఈ సందర్భాన్ని యాదవాభ్యుదయంలో ప్రస్తుతించారు కూడా. అభ్యుదయ శబ్దానికి దివ్యుల ఉదయమని (సూర్యుని ఉదయమని), ఔన్నత్యమని, శ్రేయస్సు అని, విజయమని- ఈ విధంగా పలు అర్థాలున్నవి. "స్పృశంతి నః స్వామిన మభ్యుదయాః" అనే రత్నావళీ ప్రయోగం, "భవోహిలోకాభ్యుదయాయ తాదృశామ్" అనే రఘువంశ ప్రయోగం (3-14) ఇత్యాదులు స్మరణీయాలు. అందువల్ల యాదవాభ్యుదయ శబ్దానికి "యాదవస్య- శ్రీకృష్ణస్య, అభ్యుదయః వైభవమ్" అనే వివరణంతోపాటుగా, "యాదవానామ్ అభ్యుదయః యస్మాత్ సః" అనే వివరణం కూడా సరసమే.

"స్వబలాదుద్ధృత యాదవ ప్రకాశః" అనే యతిరాజ సప్తతిలోని దేశికుల సూక్తి భావ్యం. "వెఙ్గతిరోన్ కులత్తుక్కు ఓర్ విళక్కు" (సూర్యవంశానికి అద్వితీయ దీపం)గా శ్రీరాముడు కీర్తింపబడినట్లే యాదవ కులాన్ని ప్రకాశింపజేసిన అచ్యుతభానుడుగా, యదుకులమణిగా కదా శ్రీకృష్ణుడు కీర్తింపబడుతున్నాడు. ఇక ఈ కావ్యానికి ఈ పేరును శ్రీదేశికులే పెట్టారు- అనే విషయాన్ని ఆఱవ సర్గలోని చక్రబంధంలో కవినామంతోపాటు కావ్యనామం యాదవాభ్యుదయ మని నిర్దేశింపబడడం తెలియ జేస్తున్నది.

పూర్వం ప్రస్తావించిన "గోపాలో (భూత్వా) యాదవం వంశం మగ్నమభ్యుద్ధరిష్యతి" అనే ప్రాజ్ఞ పురాణార్థవిదుల సూక్తి క్రమంలోనే ఈ కావ్య రచన సాగింది. మొదటి తొమ్మిది సర్గలలో శ్రీకృష్ణావతారం నుండి గోపాలుడై రేపల్లెలో పెరిగి, అక్కడ ప్రదర్శించిన సౌలభ్య సౌశీల్య ప్రధానాలైన దివ్య లీలలు వర్ణింపబడగా

మిగిలిన 15 సర్గలలో పరత్వ సూచకాలైన యాదవ కులోద్ధరణాదులు ప్రస్తుతాలు. ఈ వృత్తాంతాలను దేశికులు భారత, భాగవత, విష్ణుపురాణ, హరివంశాదులను ఆధారంగా చేసికొని రచించారు. కొన్ని కొన్ని సందర్భాలలో కొన్ని చిన్న మార్పులను కూడా చేశారు. శ్రీవిష్ణు పురాణం హరివంశాదులలో చంద్రుడు అత్రిమహర్షి పుత్రునిగా చెప్ప బడినా, ప్రకృతంలో భగవన్మనోభవునిగా "జగదాహ్లాదనో జజ్ఞే మనసస్తస్య చంద్రమాః" (1-10) అని పల్కడం "చంద్ర మా మనసో జాతః" అనే పురుషసూక్త ప్రక్రియను అనుసరించి (శ్రుతి ప్రమాణ ప్రాధాన్యాన్ని బట్టి). అదే రీతిలో, రుక్మిణీదేవి వివాహానికి ముందు గౌరీదేవి ఆలయాన్ని ప్రవేశించిన సందర్భాన్ని ఇంద్రాణీ భవనాన్ని ప్రవేశించినట్లుగా పల్కడం కూడా ఇంకొక ఉదాహరణ. యదుకుల క్షయాది వృత్తాంతాలు అనౌచిత్యమనే భావనతో ఉపేక్షింపబడ్డాయి.

యాదవాభ్యుదయంలోని ప్రయోగాలు పలువురు మహాకవుల కావ్యాలలోని ప్రయోగాలకు ఉత్తమోత్తమ సంవాదాలు. "నక్షత్ర తారాగ్రహ సంకులాపి జ్యోతిష్మతీ చాంద్రమ సైవ రాత్రిః" అనే రఘువంశంలోని (6-22) మహాకవి ప్రయోగాన్ని "సత్యేవతారానికరే త్రిలోకీ చక్షుష్మతీ చంద్ర దివాకరాభ్యామ్" (11-74) అనే సూక్తి తలపింపజేస్తుంది. మాఘకావ్యంలోని "లాజ కుసమై రవాకిరన్... మౌక్తిక ప్రకరైరివ ప్రియరథాంగ మంగనాః" (13-37) అనే ప్రయోగాన్ని "ప్రచార వేగాత్ త్రుటితేన చక్రే హారేణ ముక్తాఫల వర్షిణా౽న్యా, అదూరతః సంనిహితస్య శౌరే రాచార లాజాంజలి పూర్వ రంగమ్" (13-50) అనే సూక్తి స్మరింపజేస్తుంది. ఇది "అవాకిరన్ బాలలతాః ప్రసూనైః, ఆచార లాజైరివ పౌరకన్యాః" అనే రఘువంశ ప్రయోగానికి కూడా (2-10) సంవాదం. ఇటువంటి అద్భుత సుందర శబ్దార్థ సంవాదాలు కోకొల్లలుగా దర్శనమిస్తాయి. భారతం సభాపర్వంలోని "తదాత్వ- ఆయతి" పదాలను "తదాత్వే నూతనం సర్వ మాయత్యాంచ పురాతనమ్" (1-6) అని ప్రయోగించారు. ఇది "పురాణమిత్యేవ నసాధు సర్వమ్" ఇత్యాది మాళవికాగ్ని మిత్ర ప్రయోగాన్ని గుర్తు చేస్తుంది. కావ్యాంతరాలలో కూడా కన్పించని ఎన్నో అద్భుత అపూర్వ వర్ణనా రీతులు ఈ కావ్యంలో ఎన్నో గోచరిస్తాయి. ఇందువల్లనే వ్యాఖ్యాతలైన అప్పయ్య దీక్షితులు విద్ధులై "ఇత్థం విచింత్యాః సర్వత్ర భావాః సంతి పదే పదే, కవితార్కిక సింహస్య

కావ్యేషు లలితేష్వపి" అని సాశ్చర్యంగా పలికారు. ఈ కావ్య వైభవాన్ని నిరూపించడానికి ఇంతకంటే ఇంకొక నిదర్శనం అక్కఱ లేదు కదా! "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్" ఇత్యాదిగా మహాకావ్యంలో విధింపబడిన అష్టాదశ వర్ణనలు అన్నీ ఈ కావ్యరత్నంలో గోచరించడం మరొక గమనార్హమైన విషయం.

శ్రీదేశికుల రచనా వైభవానికి మచ్చుతునకగా ఒక్క శ్లోక రత్నాన్ని గూర్చి మాత్రం ప్రస్తావిస్తాను. ఆఱవ సర్గలోని శ్లోకం ఇది. గోపాలురు పరంపరగా చేసే ఇంద్రపూజను శ్రీకృష్ణుడు అడ్డగించి, గోవర్ధనగిరిని పూజించమని హితవు పలికే సందర్భంలోనిది. ఉపాసించదగిన దైవాన్ని ఉపాసించకుండా, అన్యదేవతారాధనను చేసేవాడు ఉభయతః భ్రష్టుడై, పాపాన్ని పొందుతాడు. భూమిని ధరించేది, జలంతో, వనాలతో నిండినదైన ఈ గోవర్ధనగిరినే దైవంగా పూజించాలి. మనలను రక్షించని ఇంద్రుని పూజించి ఏం ప్రయోజనం?" అనేది శ్రీకృష్ణ బాలకుని ఉపదేశ సారాంశం. శ్రీ భాగవతంలోని "అంజసాయేన వర్తేత తదేవాస్య హిదైవతమ్, ఆజీవ్యైకతరం భావం యస్త్వన్యతరము పధావతి, నతస్మాద్విందతే క్షేమం జారాన్నార్యసతీ యథా" అనే శ్లోకాలు ఈ అర్థాన్నే తెలుపుతున్నాయి. ఈ సారాంశాన్ని వశ్యవాక్కులు, మహర్షి తుల్యులైన శ్రీ దేశికులు- "అతియజేత నిజాం హృది దేవతామ్, ఉభయ తశ్చ్యవతే జుషతేఽ పృథుమ్, క్షితిభృత్తైవ సదైవత కావయం వనవతాఽ నవతాకి మహి ద్రుహో" (6-4) అనే శ్లోకాన్ని అనుగ్రహించారు. ఈ భావం శ్రీవిష్ణు పురాణంలో కూడా- "యోఽ న్యస్య ఫలమశ్నన్వై పూజయత్యపరంనరః, ఇహచప్రేత్య చైవా సౌ తాత! నా ప్నోతిశోభనమ్... కిమస్మాకం మహేంద్రేణ గావ శ్శైలాశ్చదేవతాః" (5-10-31) అనే శ్లోకాల ద్వారా తెలుపబడింది. కాని, దేశికుల శ్లోకంలోని విశేషమేమంటే- అది శ్రుతివాక్యాన్ని శబ్దతః, అర్థతః అనుసరించడం. ఈ శ్లోకం "యోవైస్వాం దేవతా మతి యజతే, ప్రస్వాయై దేవతాయై చ్యవతే, నపరాం ప్రాప్నోతి, పాపీయాన్ భవతి" (యజుర్వేదం- ద్వితీయ కాండం- పంచమ ప్రశ్న) అనే శ్రుతి వాక్యాన్ని శబ్దతః, అర్థతః అనుసరిస్తున్నది. "యస్య నిశ్వసితం వేదాః" అనే రీతిలో భగవానుని నిశ్వాస రూపమైన శ్రుతివాక్యాన్ని శ్రీకృష్ణ భగవానుని ముఖతః శ్రీ దేశికులు పల్కించడం ఇంకొక అద్భుతౌచిత్యం.

ఇంతటి ప్రౌఢ సుందర కావ్యాన్ని వ్యాఖ్యానించగలగాలి అంటే- దానికి తగిన ప్రతిభావ్యుత్పత్తులు, అగాధమైన శాస్త్ర వైదుష్యంతోపాటుగా కవి గంభీర మధుర

హృదయపుటంచులను స్పృశించగలిగే సహృదయత, భావుకత్వం కావాలి. ఈ వైలక్షణ్యాలను అన్నిటిని పుష్కలంగా కల్గిన విద్వద్వరేణ్యులు అప్పయ్య దీక్షితులు దీనిని సమగ్రంగా, అందంగా వ్యాఖ్యానించడం సాహిత్య రసికులు చేసికొన్న పుణ్యఫలం. వక్తవ్యాంశాలను వేనినీ విడువకుండా అన్నిటినీ వీరి వ్యాఖ్య వివరిస్తున్నది. ఈ కావ్యానికి ఇంకొక వ్యాఖ్య ఏదీ రచింపబడలేదు. షష్ఠ సర్గలోని కొన్ని ఏకాక్షర- ద్వ్యక్షర శ్లోకాలను మాత్రం దేశికులు వివరించారు. "ఏవం క్వచిత్ మూల కోశ కారవ్యాఖ్యానం దృష్టమ్" అని అంటూ అప్పయ్య దీక్షితులు పల్కడం దీనిని సూచిస్తున్నది. ఎన్నో శాస్త్రీయ సాహిత్యాది విశేషాలతో పాటు వైష్ణవ సాంప్రదాయిక, సిద్ధాంత విశేషాలతో నిండిన ఈ కావ్యానికి తదనుగుణమైన వ్యాఖ్య వెలువడకపోవడం మాత్రం లోటుగానే తోస్తుంది. శ్రీ దేశికుల సూక్తులలో దివ్య సూరి సూక్తుల గ్రంథాలు పరిమళిస్తాయి అనేది అత్యంత మార్మికమైన సంప్రదాయజ్ఞులు మాత్రమే గుర్తించగలిగిన అంశం. శ్రీ దేశికుల సూక్తి గాంభీర్యాన్ని గూర్చి వివరించడం సాహసమే అయినా, ఒక్క శ్లోకాన్ని గూర్చి యత్కించిత్ విన్నపించి నా విజ్ఞప్తిని ముగిస్తాను.

ప్రథమ సర్గలోని చివరి శ్లోకం ఈ విధంగా సాక్షాత్కరిస్తుంది. "ఆశ్వాస్య వాగమృత వృష్టిభి రాదితేయాన్ దైతేయ భారనమితాం పృథివీంచ దేవీమ్, ప్రాదుర్బు భూషురనఘో వసుదేవ పత్న్యాం పద్మాపతిః ప్రణిదధే సమయం దయాయాః" అనేది ఆ శ్లోకం. దీని భావం ఏమంటే- "తన వాగమృతంతో దేవతలను, అసురుల భారంతో కుంగిన తన పత్ని భూదేవిని సమాధాన పఱచి అనఘుడైన శ్రియఃపతి, తాను వసుదేవ పత్ని దేవకీదేవి గర్భంలో పుత్రునిగా అవతరించాలని తలచి, ఆ విధంగా కరుణించే సమయం కోసం ధ్యానించాడు" అని.

ఈ శ్లోకంలో "అనఘః" అనే విశేషణం (మూడవ పాదంలో) భగవానునకు ప్రయోగింపబడింది. దీనిని వ్యాఖ్యాతలైన అప్పయ్య దీక్షితుల వారు- "అనఘః నిరవద్యః - తత్తత్ కర్మాను రోధితయా వైషమ్య నైర్ఘృణ్య దోషరహితః" (అనఘః- దోషాలు లేనివాడు. జీవులు చేసే కర్మలను అనుసరించి వాటికి తగినట్లుగా ఫలాలను ప్రసాదిస్తాడు కనుక, వైషమ్య- నైర్ఘృణ్యాలనే దోషాలు లేనివాడు) అని వ్యాఖ్యానించారు. ఈ వివరణం సార్థకం, సరసం, సందేహం లేదు. అయితే, ఈ విశేషణాన్ని ఇంకొక

రీతిలో కూడా ఇంతకంటే ప్రకరణోచితంగా వివరించవచ్చునని కాంచీమహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారు తెలిపారు. వారి వివరణ సారాంశం ఇపుడు ప్రస్తుతింపబడుతున్నది.

దేవతల వేడికోలును అంగీకరించి భగవానుడు దేవకీపుత్రునిగా అవతరించి, తన కరుణను ప్రకాశింపజేయాలని తలచిన రీతిని ఈ శ్లోకం తెల్పుతున్నది. ఈ శ్లోకములోని ఉత్తరార్ధంలో "ఆవిర్బుభూషుః" అని పల్కిన వెంటనే, "అనఘః" అనే ఒక విశేషణం ప్రయోగింపబడింది. దోషరహితుడని దీని అర్థం. అఖిల హేయ ప్రత్యనీకుడని తాత్పర్యం. భగవానుడు ఏ దోషం లేదనే విషయాన్ని ఆయా ప్రకరణాలకు అనుగుణంగా కదా ఉపపాదించాలి. వేదంలోని (అంతర్యామి బ్రాహ్మణంలోని) "యః పృథివ్యాం తిష్ఠన్ సత అంతర్యామ్యమృతః" అనే వాక్యంలోని "అమృతః" అనే విశేషణం భగవానుడు అచిత్తులో అంతర్యామిగా ఉన్నా అచిద్గత దోషాల స్పర్శను లేనివాడనే అర్థాన్ని తెలుపుతున్నాడనే పూర్వాచార్యుల వివరణం భగవానుని హేయ ప్రత్యనీకత్వాన్ని నిరూపించేది అయినా, అది ఆ ప్రకరణాలను గుణమైనది కావడం ఇక్కడ ముఖ్యంగా గమనించదగిన అంశం. లేకపోతే, అమృత శబ్దానికి కల, పలు అర్థాలలో దేనినైనా చెప్పి ఉండవచ్చు కదా! అందువల్ల విశేషణాన్ని వివరించేటప్పుడు ఆ వివరణం తత్ప్రకరణానికి తగినదిగా ఉండడం యుక్తం కదా!

ప్రకృతంలో "ఆవిర్బుభూషుః" (అవతరించ గోరినవాడై) అని పల్కిన వెంటనే "అనఘః" (అవద్యం లేనివాడు) అని పల్కినందున, ప్రకృత ప్రకరణాను గుణంగా, అస్మదాదుల జన్మకు మనం చేసిన సత్కర్మ- దుష్కర్మలు కారణమైనట్లుగా, భగవానుని అవతారాలకు కూడా కర్మలు కారణమా?- అనే ప్రశ్న కల్గుతుంది. దానిని సమాధానించడం కోసమే "అనఘః" అనే పదం సాభిప్రాయంగా, సమాధానాత్మకంగా ప్రయోగింపబడింది- అనేది స్పష్టం. భగవానుడు కర్మకారణంగా కాకుండా, కేవలం తన కరుణ కారణంగానే అవతరిస్తాడు కనుక, కర్మమూలకంగా జన్మించడమనే దోషానికి తావులేదు- అనేది ఈ విశేషణంలోని ప్రకరణోచితమైన తాత్పర్యం.

అలంకార శాస్త్రంలో పరికరమనే ఒక అలంకారం ఉన్నది. "అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే" అని దాని లక్షణం. ఒక అభిప్రాయంతో విశేషణాన్ని

ప్రయోగించిన సందర్భం పరికరాలంకారంగా చెప్పబడుతుంది. ఈ అలంకార దృష్టితోనే శ్రీ దేశికులు ప్రకృతంలో "అనఘః" అనే విశేషణాన్ని ప్రయోగించారు. ఈ అంశాన్ని వారే స్వయంగా నాల్గవ పాదంలో "పద్మాపతిః ప్రణిదధే సమయం దయాయాః" అని అనడం ద్వారా సూచించారు కూడా. అందువల్ల "అనఘః" అనే విశేషణానికి- కర్మవశ్యుడై జన్మించనివాడు కనుక భగవానుడు కర్మవశ్యత అనే దోషం లేనివాడనేదే ఇక్కడ కవికి వివక్షితాభిప్రాయం.

జగత్సృష్టి ప్రకరణంలోనే వైషమ్య- నైర్ఘృణ్యశంక ఉదయించే అవకాశం ఉన్నది. అందువల్లనే శారీరక మీమాంసలో కూడా జగత్సృష్టి ప్రకరణంలోనే "వైషమ్య నైర్ఘృణ్యేన, సాపేక్షత్వాత్" అనే సూత్రం ద్వారా ఈ శంక పరిహరింపబడింది. ఈ విషయాన్ని పరాశర భట్టర్ కూడా శ్రీరంగ రాజస్తవం- ఉత్తర శతకంలో "నిమ్నోన్నతంచ కరుణంచ జగత్ విచిత్రం కర్మ వ్యపేక్ష్య సృజతస్తవ రంగశేషిన్!, వైషమ్య నైర్ఘృణతయోన ఖలు ప్రసక్తిః తత్ బ్రహ్మసూత్ర నచివాః శ్రుతయో గృణంతి" అనే శ్లోకం ద్వారా విశదీకరించారు. ఈ శ్లోకానికి ముందు శ్లోకంలో- "అచిదవిశేషితాన్ ప్రళయ సీమని సంసరతః" ఇత్యాదిగా సృష్టి ప్రస్తావన చేయడంవల్ల తదనంతరం "నిమ్నోన్నతమ్" ఇత్యాది శ్లోకాన్ని భట్టర్ ఆ రీతిలో రచించవలసి వచ్చింది. ప్రకృత శ్లోకంలో సృష్టి ప్రస్తావన లేదు. భగవదవతార ప్రస్తావమే ఉన్నది. కనుక తదనుగుణంగా "కర్మ వశ్యత్వమనే దోషం లేనివాడు"- అనే అర్థమే "అనఘః" అనే విశేషణానికి ప్రకరణాను గుణంగా మిక్కిలి పొసగుతుంది. ఈ రీతిలోనే ప్రకరణానుగుణంగా ఈ విశేషణానికి వేతే వివరణాన్ని అభిజ్ఞులు అభ్యూహించవచ్చు. ఈ వివరణం అంతా ఉద్దండ పండితులు, ఆలంకారిక మూర్ధన్యులైన అప్పయ్య దీక్షితుల వారి వివరణంలో దోషోద్భావనతో చేయబడలేదని, ప్రకరణానుగుణంగా సరసతరమైన ఇంకొక అర్థాన్ని చెప్పే అవకాశం ఉన్నదని తెలుపడం కోసమే ఈ వివరణం చేయబడిందని సహృదయులు భావించగలరు. దివ్యసూరుల ప్రబంధాలను వ్యాఖ్యానించిన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యలలో ఈ రీతిలోనే విశేషణ వివరణాన్ని ప్రకరణానుగుణంగా చేయడంలోనే దృష్టిని సారించారనే విషయం సుస్పష్టం. భగవద్రామానుజులు కూడా పలు శ్రుతి వాక్యాల వివరణలో ప్రకరణానికి ప్రాధాన్యాన్ని ఇచ్చి వివరించడం కూడా ప్రసిద్ధమే. దేశిక సూక్తిలోగల పరికరాలంకార ప్రాచుర్యాన్ని అప్పయ్య దీక్షితులు ప్రథమ శ్లోక వ్యాఖ్యలో ఆ అలంకారాన్ని నిరూపించడం ద్వారా సూచించారు కూడా.

మహాకావ్యరత్నమైన యాదవాభ్యుదయానికి అప్పయ్య దీక్షితుల వ్యాఖ్య సంస్కృత భాషాత్మకమైనందున అది సామాన్యులకు అందుబాటులో లేదు. ఇంతవరకు ఈ కావ్యానికి తెలుగు భాషలో సమగ్రమైన అనువాదంగాని, వ్యాఖ్యానంగాని రచింపబడినట్లుగా తెలియలేదు. ఆ లోటును తీరుస్తూ ఇప్పుడు వాచస్పతి, శాస్త్రవిద్వన్మణి, పండితరత్నేత్యాది సార్థ బిరుద భూషితులైన ఉ.వే. శ్రీమాన్ డా॥ కె.వి. రాఘవాచార్యస్వామి వారి సుబోధినీ అనే సార్థకమైన, అందమైన ఆంధ్రవ్యాఖ్య మొదటి నాలుగు సర్గలకు వెలువడడం అస్మదాదుల భాగ్య విశేషం. పరమ గంభీరాలైన దేశిక సూక్తులలోని మెలకువలను, అందాలను చక్కగా వెలువరించ గలిగిన ప్రతిభా వ్యుత్పత్తులను, అకుంఠిత దీక్షను, అంతకు మించి శ్రీ దేశికుల పరిపూర్ణానుగ్రహాన్ని కల్గిన శ్రీమాన్ రాఘవాచార్యస్వామి వారి ద్వారా యాదవాభ్యుదయం వ్యాఖ్యానించ బడడం అత్యంతం సముచితం. ఎనభైనాల్గు సంవత్సరాల వయస్సులో శారీరకమైన అశక్తిని, శ్రమను ఏ మాత్రం లెక్కించకుండా, కేవలం లోకోజ్జీవనం కోసం పాటుపడే శ్రీ స్వామివారి సన్నిధిలో సాంజలిబద్ధంగా, సజల నయనాలతో ప్రణమిల్లుతున్నాను. ఆంధ్ర పాఠకలోకం శ్రీస్వామి వారివల్ల అధమర్ణం అయినదనడం అత్యంతం వాస్తవం. మిగిలిన ఇరవై సర్గలను త్వరలోనే శ్రీస్వామివారు ఇదే రీతిలో సుబోధకంగా వ్యాఖ్యానించి, ఈ మహాజ్ఞాన సత్రాన్ని పూర్తి చేయాలని. ఆ విధంగా వారిని యదుకులమణి, ఎమ్బెరుమానార్, శ్రీ దేశికులు కటాక్షించాలని ప్రార్థిస్తున్నాను. శ్రీమాన్ స్వామివారు అప్పయ్య దీక్షితుల వ్యాఖ్యా విశేషాలనే కాక, పలు సాంప్రదాయికమైన విశేషాలను కూడా వివరించారు. మొదటి శ్లోకంలో "వందే" అనే క్రియ ద్వారా ఆశ్రయణం తెలుపబడినందున, ఆశ్రయణ సౌకర్యాపాదక గుణాలైన సౌశీల్య- స్వామిత్వ వాత్సల్య- సౌలభ్యాలనే నాలుగు గుణాలు శ్లోకంలో సూచింపబడ్డాయని, ఇవి వరుసగా "వల్లవీజనవల్లభం, వైజయంతీ విభూషణం, బృందావనచరం, జయంతీ సంభవమ్" అనే పదాల ద్వారా ప్రకటితమయ్యాయని, ఈ విధంగా సేవించే వేళలో ఈ నాలుగు గుణాల అనుసంధాన క్రియ నమ్మాళ్వార్లు తరువాయ్ మొళి ప్రబంధంలో మొదటి శతకంలో ఈ నాల్గు గుణాల అనుసంధించిన క్రమాన్ని అనువర్తిస్తున్నదని వివరించడం దీనికొక నిదర్శనం. ఈ విధంగా పలు విశేషాలతో కూడుకొన్న శ్రీస్వామివారి సుబోధినీ వ్యాఖ్య ఒక సుధాకలశం. దీనిని సహృదయ పారీణులు ఆస్వాదించి ఆనందిస్తారని

నమ్ముతున్నాను. నా పట్ల పుత్ర నిర్విశేషమైన వాత్సల్యాన్ని సదా ప్రదర్శించే శ్రీమాన్ స్వామివారు ఈ విధంగా వాచిక కైంకర్యాన్ని చేసికొని కృతార్థతను పొందే గొప్ప అవకాశాన్ని ఇవ్వడం వారి ఔదార్యానికి చిహ్నం. వారికి మఱొక్క మారు నా కార్తజ్ఞ్యాన్ని వ్యక్తం చేస్తూ "నమో నమో రాఘవార్య దేశికాయ నమో నమః" అని అసకృత్ ప్రణమిల్లుతున్నాను. స్వస్తి.

*యాదవాభ్యుదయ వ్యాఖ్యా సైషాసార్థా సుబోధినీ!*
*రాఘవార్య బుధ ప్రోక్తా విదుషాం హృదయం గమా॥*

తిరుపతి
29-9-13

ఇట్లు నివేదించు
భాగవత వశంవదుడు
***ఈ.ఏ. శింగరాచార్యులు***

శ్రీశో ఉ వ్యాత్

# విన్నపం

శ్రీ వేంకటేశ్వర ఘంటావతారులు, వేదాంతాచార్య, కవితార్కిక సింహేత్యాది బిరుదాంచితులు, భగవద్రామానుజ సిద్ధాన్త నిర్ధారణ సార్వభౌములు, జ్ఞానవైరాగ్య భూషణులైన శ్రీ వేంకట నాథాచార్యులు ఈ భూమండలమందు వేంచేసి యున్న కాలం క్రీ.శ. 1268-1369. వంద సంవత్సరాలు.

వేదాన్త దేశికులు, శ్రీ విద్యారణ్యస్వామివారు సమకాలికులు, సహాధ్యాయులు కూడా. విద్యారణ్యస్వామివారు విద్యానగర చక్రవర్తిచేత దేశికులకు సన్మానం చేయింప దలచి రాజభటుల ద్వారా ఆహ్వానపత్రాన్ని పంపించారు.

"జఠరాగ్నిని ఉంఛవృత్తిచే శమింపజేయవచ్చు. మల్లెపూల పరిమళాన్ని వెదజల్లే మాటలతో క్షుద్రభూపతులను గడ్డిపరక కోసమైనా యాచించను. పైతామహం ధనం- బ్రహ్మను కన్న తండ్రియే- నాకు ధనం"- అనే తాత్పర్యంగల ఐదు శ్లోకాలను- వైరాగ్య పంచకాన్ని- వ్రాసి ఆ భటులతోనే పంపించిన దేశికుల శుద్ధ వైరాగ్యానికి విద్యారణ్యస్వామి వారు ఆశ్చర్య పడినారు. ఆహా! "యం విష్ణోరవతారం మేనే, సేవే తమాగమాంత గురుమ్"- నిగమాన్త గురువులు సాక్షాత్తు విష్ణువు యొక్క అవతారులే- అని ప్రశంసించారుట.

వేదాన్త దేశికులు ప్రౌఢ, సరళ సంస్కృత, ప్రాకృత, ద్రవిడ, మణి ప్రవాళ భాషలలో రచించిన శాస్త్రకావ్యాత్మకాలైన శతాధిక గ్రంథాలలో "యాదవాభ్యుదయం" కావ్యరత్నమని పండిత ప్రకాండులచే పరిగణింపబడింది. ఇతివృత్తం పౌరాణికమే అయినా, ఇందు మహాకావ్య లక్షణాలు సంపూర్ణంగా నున్నాయి.

"కవికథక మృగేంద్రః క్షేమదం కావ్యరత్నమ్"- అని దేశికులే ఈ గ్రంథం యొక్క చివరి శ్లోకంలో ప్రకటించారు.

క్రీ.శ. 1550లో జన్మించి, ఉద్దండ పండితులైన శ్రీమదప్పయ్య దీక్షితులవారికి విజయనగర సంబంధం పరంపరగా ప్రాప్తించింది. విజయనగర రాజులు శ్రీ వైష్ణవ

సంబంధులు. 1574-1585 చిన్న తిరుమల రాయల రాజ్యకాలం కదా! చిన్న తిరుమల రాయల ప్రేరణవల్ల అప్పయ్య దీక్షితులు యాదవాభ్యుదయ మహాకావ్యానికి సంస్కృత భాషలో సహృదయులకు ఆహ్లాదకరమైన వ్యాఖ్యానాన్ని రచించారు. తరువాత వేంకటపతి రాజు కాలాన దీక్షితులు 'కువలయా నందం' అనే అలంకార శాస్త్రగ్రంథాన్ని రచించారని ఆ గ్రంథం వల్లనే తెలుస్తున్నది.

ఇక నేను ఈ మహాకావ్యానికి 'సుబోధిని' అనే పేరుతో తెలుగు భాషలో వ్యాఖ్యానాన్ని రచించడానికి ఉపక్రమించిన కథా క్రమంబెట్టిదనిన- 2008లో రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం T.T.D. నాకు 'వాచస్పతి' బిరుదును ప్రదానం చేసిన సందర్భమది. మరునాడు తిరుపతిలోనున్న నాతో శ్రీమాన్ నెమ్మాని వెంకటరమణయ్య గారు (T.T.D. ఆర్ట్స్ కాలేజిలో తెలుగు లెక్చరర్‌గా ఉండి విశ్రాంతులై యున్నవారు) కలిసి, శ్రీ మదప్పయ్య దీక్షితులచే వ్యాఖ్యాతమైన యాదవాభ్యుదయ మహాకావ్యానికి తెలుగు వ్యాఖ్యను మీరే వ్రాయాలని కోరినారు. ఇప్పటికే న్యాసవింశతి, దయాశతకం, వరదరాజ పంచాశత్, అచ్యుత శతకం- నాలుగు ఐదు గ్రంథాలకు వ్యాఖ్యను వ్రాయదలచాను. యాదవాభ్యుదయమనే 24 సర్గల మహాకావ్యాన్ని వ్యాఖ్యానించ దగినంత కాల మహిమ ఈ వృద్ధునికి తెల్యదు కదా! ఈ దివ్యక్షేత్రమందున్న విద్వత్తల్లజులను మీరు కోరితే బాగుంటుంది- అని విన్నవించాను.

ఆ ప్రయత్నాలన్నీ చేశాను. పుస్తకాన్ని రెండు మాసాలు తమవద్ద ఉంచుకొని, మాకు తీరిక లేదండి అంటూ పుస్తకాన్ని తిరిగి ఇచ్చారు- అని తమ బహువిధ యత్నాలను వివరించారు. చివరకు, వయోజ్ఞాన వృద్ధులై, సత్కార్య ప్రేరకులైనవారు సప్తగిరీశుని కృపతో మీరే సాధించగలరని జీర్ణగ్రంథాన్ని నా చేతికి ఇచ్చారు. ఆ గ్రంథం దీక్షితుల వ్యాఖ్యతోనే కాక, శ్రీమాన్ ఉత్తమూర్ టి. వీర రాఘవాచార్య స్వామి వారి సంస్కృత టిప్పణి, తమిళానువాదంతో కూడియున్నది. పైన చెప్పిన నాలుగు ఐదు గ్రంథాలకు వ్యాఖ్య వ్రాసి ప్రకాశింపజేసిన తర్వాత, గత సంవత్సరం నుంచి నేటికి నాలుగు సర్గలను తెలుగులో వివరించి ప్రథమ భాగంగా ప్రకాశింపజేయ గోరినాను. గ్రంథ నిర్మాతలకు ముద్రణ దశలో ముప్పుతిప్పలు తప్పవు కదా!

హైదరాబాదు శ్రీమదహోబిలమఠంవారు, శ్రీ మాలోల గ్రంథమాల పక్షాన ఈ కావ్యాన్ని ముద్రించడానికి పూనుకున్నారు. విరాళాలను సేకరించారు. గుంటూరు

వాస్తవ్యులు డా॥ ఈయుణ్ణి రామానుజాచార్యులు (U.S.A.) తమ తండ్రి కీ.శే. భావనాచార్యులవారి స్మృత్యర్థం తమ పవిత్ర ద్రవ్యాన్ని సమర్పించారు. కీ.శే. పరవస్తు నరసింహాచార్యుల వారి జ్ఞాపకార్థం వారి పుత్ర రత్నం శ్రీమాన్ పి. శ్రీనివాసాచార్యులు (మేనేజర్, అహోబిలమఠం, హైదరాబాదు) తమ ద్రవ్యాన్ని వినియోగించారు. శ్రీమాన్ భట్టర్ వేణుగోపాలాచార్యులు (హోటల్ మేనేజ్‌మెంట్‌లో ఉద్యోగి) శ్రీ S.V.N. రవికుమార్ భట్టర్ స్వామి, శ్రీ పి.వి.రాజిరెడ్డిగారును తమ ధనాన్ని సమర్పించగా ఈ కృతి చక్కగా ముద్రింపబడింది. ఆ మాలోలస్వామి ఈ ద్రవ్య దాతలను ఆయురారోగ్య సంపదలనిచ్చి కటాక్షించుగాక.

ఈ కృతికి ప్రార్థించిన వెంటనే మంగళాశాసనాలను కృపజేసిన (శ్రీరంగం) శ్రీ మదహోబిలమఠం 46వ పీఠాధిపతులు శ్రీవణ్ శఠకోప శ్రీరంగనాథ యతీంద్ర మహాదేశికుల వారి తిరుత్తామరచరణ సన్నిధిలోనూ.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి పాద పద్మ సన్నిధిలోనూ ప్రత్యేక సహస్ర ప్రణామాలను సమర్పిస్తున్నాను.

- ◊ శాస్త్ర రత్నాకర, శాస్త్ర విద్వన్మణి డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారికి–
- ◊ మహా మహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్ర రత్నాకర డా॥ శ్రీ .న.చ. రఘునాథాచార్య స్వామివారికి–
- ◊ పండిత రత్న, వ్యాఖ్యా తృ చక్రవర్తి డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారికి– దండవత్ప్రాదాభివందన మాచరిస్తున్నాను.

ఈ మహాకావ్యాన్ని శ్రీ మాలోల గ్రంథమాల పక్షాన ముద్రించడానికి ఆమోదించిన శ్రీ మదహోబిలమఠం చైర్మన్ శ్రీ వి. రాఘవన్‌గారికి– శ్రీ ఆర్. నీలమేఘన్ మరియు శ్రీ ఎమ్.ఎస్. చారి వైస్ చైర్మన్ గార్లకు కృతజ్ఞతా పూర్వకంగా అంజలిని ఘటిస్తున్నాను.

అక్షరాలంకరణ మొదల్కొని ప్రబంధరూపకల్పన వరకు శ్రద్ధ వహించిన పుస్తక శిల్పి, ప్రముఖ కవి శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు గారికి ధన్యవాదాలు.

ఓర్పు-నేర్పులతో డి.టి.పి. చేసిన శ్రీ కె.బి.టి. కొండయ్యగారికి- అందమైన ముఖచిత్రాన్ని రూపొందించిన శ్రీ మల్లేశ్ గారికి- గ్రంథాన్ని మనోజ్ఞంగా ముద్రించి ఇచ్చిన 'కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్' అధినేత శ్రీ జగన్మోహన్‌రెడ్డిగారికి హార్దిక కృతజ్ఞతలు.

ఈ కావ్యాన్ని బాల్యమందే పఠించిన వారికి శీఘ్ర వ్యుత్పత్తి, తత్త్వార్థ జ్ఞానం, సద సద్వివేకం అవశ్యంగా కలుగుతుంది.

ఆంధ్ర జనావళి శ్రీ వేదాన్త దేశికుల వారి వాగమృతాన్ని ఆస్వాదించి ఉజ్జీవిస్తారని దృఢంగా విశ్వసిస్తున్నాను.

*సాంస్కృతీభిర్ద్రావిడీభి ర్బహ్వీభిః కృతిభిర్జనాన్।*
*యః సముజ్జీవయామాస తస్మై సేవ్యాయమంగళమ్॥*

విజయవత్సర విజయదశమి
14 అక్టోబర్ 2013

బుధజన విధేయుడు
కె.వి. రాఘవాచార్యులు
(కె.వి. రాఘవాచార్యులు)

శ్రీలక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః
శ్రీకృష్ణాయ పరస్మై బ్రహ్మణేనమః
శ్రీమతే నిగమాన్త మహాదేశికాయ నమః
కవితార్కిక సింహ శ్రీమద్వేదాన్త దేశిక విరచితం

# యాదవాభ్యుదయ మహాకావ్యమ్

## ప్రథమ భాగము

## సుబోధినీ వ్యాఖ్యా సహితమ్

*శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ!*
*వేదాన్తా చార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది॥*

*1. వందే బృందావనచరం*
*వల్లవీజన వల్లభమ్।*
*జయంతీ సంభవం*
*ధామ వైజయంతీ విభూషణమ్॥ 1*

**అర్థం:** బృందావన చరం= బృందావన మందు నడయాడునట్టి; వల్లవీజన వల్లభం= గోపస్త్రీలకు ప్రియమైనట్టి; జయంతీ సంభవం= పుణ్యదినమందు ఆవిర్భవించినట్టి; వైజయంతీ విభూషణం= వనమాలయే భూషణంగా కలిగియున్నట్టి; ధామ= పరంజ్యోతిని; వందే= నమస్కరిస్తున్నాను-స్తుతిస్తున్నాను.

**తా॥** జయంతినాడు ఆవిర్భవించిన, బృందావనమందు సంచరిస్తూ గోపీజనులకు చాలా ప్రియమైయున్న, వైజయంతిని భూషణంగా కలిగియున్న, వాసుదేవాఖ్య పరంజ్యోతిని నతిని, నుతిని చేస్తున్నాను.

సుబోధినీ వ్యాఖ్య:- కావ్యారంభమందు ఇష్టదేవతా నమస్కార రూపమైన మంగళాచరణ శ్లోకం.

యాదవాభ్యుదయ కావ్యమందు ప్రతిపాద్యవస్తువు "బ్రహ్మణోదేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనోమ్" అనే నారాయణోపనిషద్వాక్యం చేత శ్రుతమయ్యే యదువంశ భూషణుడైన శ్రీకృష్ణ భగవానుని దివ్య చరితం. "ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశో వాపితన్ముఖమ్"- అనే శాస్త్ర లక్షణాన్ని బట్టి "సర్వతంత్ర స్వతంత్ర, కవితార్కిక కేసరీ" బిరుదాంచితులైన శ్రీమద్వేదాన్త దేశికులచేత రచింపబడిన ఈ మహాకావ్య మందు మొదట కావ్య ప్రతిపాద్య వస్తురూపమైన ఇష్టదేవతకు నమస్కారాత్మకమైన మంగళాచరణం సుశ్లోకితం.

జయంతీ సంభవం:- జయమూ, పుణ్యమూ (ధర్మమూ) ఈ రెండింటిని విస్తరింపజేసే ముహూర్తమందు ఆవిర్భవించిన భగవానుడు శ్రీకృష్ణుడు. "జయం పుణ్యంచ తనుతే జయంతీ తేన తాం విదుః" అని పౌరాణికులు 'జయంతీ' శబ్దార్థాన్ని చెప్పినారు. శ్రావణ బహుళ అష్టమీతిథి నాడు అర్ధరాత్రి రోహిణీ నక్షత్ర ప్రాధాన్యం కలది 'జయంతి' అని వ్యవహరింపబడుతున్నది. "జన్మాష్టమీ జయంతీతిసా ద్విధా పరికీర్తితా" 'జయంతి' అంటే శ్రీకృష్ణ జన్మాష్టమి అని వ్యవహృతం.

"జయంత్యాః సంభవః యస్మాత్ ఇతి జయంతీ సంభవః" శ్రీకృష్ణావతారంవల్ల 'జయంతి' శబ్దం నిరుపపదంగా ఏర్పడింది. అవతార దినానికి 'జయన్తి' అనే మాట కృష్ణుడు ఆవిర్భవించిన తర్వాతనే వాడుకలోకి వచ్చింది. తర్వాత కాలాన 'మత్స్యజయంతి, కూర్మజయంతి' అని సోపపదంగా వ్యవహరింపబడుతూ, నేడు లోకంలో మహాపురుషుల జన్మదినం కూడా 'శ్రీరామకృష్ణ పరమహంస జయంతి, గాంధీజయంతి' అనునంతవరకు వాడుకలోకి వచ్చింది.

దేశికులు 'జయంతీ' సంభవం' అనే విశేషణ పదాన్ని ప్రయోగించడంవల్ల భగవానుని సౌలభ్య గుణం ప్రకటింపబడిందని ఈ మహాకావ్యానికి వ్యాఖ్యానాన్ని రచించిన ఉద్దండ పండితులైన శ్రీమదప్పయ్య దీక్షితులు విశదీకరించారు.

'యస్యావతార రూపాణి'- అనే పురాణోక్తి భగవంతునికి అవతార రూపాలన్ని ఆయన సౌలభ్యగుణాన్ని తెల్పుతున్నవనడం ప్రసిద్ధమే. "నసందృశేతిష్ఠతి రూపమస్య" అనే ఉపనిషద్వాక్యం భగవానుని రూపం మనకు గోచరించదు- కంటికి కనబడదు- అని తెల్పింది. శ్రీకృష్ణుడవతరించినందువల్ల, ఆయన సౌలభ్యగుణంచేత ఇప్పుడు భగవద్రూపం, కంటికి కనబడదనే భయం తొలగిపోయి, అందఱు సుఖంగా సేవించదగినట్లు ఉపయుక్తమైనది.

'జయంతి' శబ్దం జయశీలత్వాన్ని సూచించడంవల్ల శ్రీకృష్ణుని చరితం వీరరసమయమని స్పష్టమవుతున్నది కదా!

బృందావనచరం:- మధురానగరానికి దగ్గరగా ఉన్న 'బృందా' అనే పేరుగల అరణ్యమందు సంచరించువాడు శ్రీకృష్ణుడు. 'బృందా' శబ్దానికి ఐదు ముండ్లు కలిగిన పెద్ద పల్లెరుకాయ తీగల సముదాయమని అర్థం (పంచముఖ కంటక లతా ప్రతానం).

*"శుభేన మనసా ధ్యాతం గవాం వృద్ధిమభీప్సితా!"* గోవుల వృద్ధికి కారణమైన కొత్త లేత పచ్చిగరుకను స్వచ్ఛమైన మనస్సున తలచుకొంటూ శ్రీకృష్ణుడు బృందావనమందు చరించాడు. వెంటనే పెద్ద పల్లెరుకాయ తీగలున్న అడవి నేల అంతా శాద్వలభూమి- పచ్చిగడ్డిగల నేలగా మారింది.

గోసముదాయం-ఆలమందల-యొక్క రక్షణకోసం సంచరించడంవల్ల కంటకాలు తొలిగిపోయినాయి. అనిష్ట నివృత్తి, ఇష్టప్రదమైన వనంగా పరిణమించింది. బృందం యొక్క అవనం కోసం చరించాడు. సాధుబృందమైన గో గోపగోపీజనం యొక్క సర్వాపేక్షితమైన రక్షణను సమృద్ధిగా సమకూర్చే వనంగా ఉండాలని శ్రీకృష్ణుడు ప్రసన్న హృదయంతో ధ్యానిస్తూ సంచరించాడు కదా! కాబట్టి 'బృందావనచరం' అనే విశేషణ పదంవల్ల భగవానుని వాత్సల్యగుణం వెల్లడియైనది. వాత్సల్యంవల్ల సేవకునికి స్వాపరాధ భయం తొలగిపోయి సుఖంగా

సేవించే అవకాశం కలుగుతుంది. శ్రీకృష్ణుడు మనస్సులో తలచుకొంటూ తిరగడం వల్ల కంటక వనమంతా నవతృణ సమృద్ధిగల వనంగా మారడం అద్భుత రసంగా గోచరిస్తుంది. 'చర' శబ్దంవల్ల ఇంతకుముందు గోకులమందు ఉండేవాడని గ్రాహ్యం.

వల్లవీజన వల్లభం:- గోపజాతి స్త్రీజాతిని వల్లవీజనమంటారు. *"గోపేగోపాల గోసంఖ్య గోధు గాభీర వల్లవాః"*- (అమరం). 'వల్ల-సంవరణే'- 'వా-గతి గంధన యోః'- గోమహిష్యాదికం వల మానాః వాంతీతి= వల్లవాః, గోవులను, గేదెలను చుట్టుకొనిపోయేవారు. గొల్లవారని అర్థం. 'వల్లవ' శబ్దం పుంలింగమైతే, 'వల్లవీ' శబ్దం స్త్రీలింగం. వల్లవ్యులు అనే జనులు 'వల్లవీ జనులు' అని సంభావనాపూర్వ పదకర్మధారయ సమాసపదం.

*"జనోలోకే, మహర్లోకాత్ పరలోకేచ పఠ్యతే"*- (విశ్వప్రకాశ నిఘంటువు) 'జన' శబ్దానికి- మనుష్యునికి, మహర్లోకం కంటె పైనున్న జనలోకానికి అని రెండు అర్థాలున్నాయి. వల్లవీ జనులకు వల్లభుడు శ్రీకృష్ణుడు. *"దయితం వల్లభం ప్రియమ్"* (అమరం) మనస్సుకు ప్రియమైన వస్తువు అని అర్థం. 'వల్లతి ప్రీణాతీతి వల్లభం'-'వల్ల-ప్రీతౌ'-ప్రీతిని కలుగజేసేది వల్లభమ్. *"త్రిష్వధ్యక్షేఽపి వల్లభః"* - (అమరం) అధ్యక్షునికి, ప్రియునికి కూడా అర్థం వర్తిస్తుంది. *"వల్లభస్తు ప్రధానాశ్వః"*- ముఖ్యమైన గుఱ్ఱానికీ 'వల్లభ' శబ్దార్థం ఉంది (శేష నిఘంటువు).

*"సత్యవాగార్జవరతై రుపకుర్వన్ ప్రియం వదన్।*
*భజతే యః స్వయం పూర్ణః ప్రియః సభవతి స్త్రి యాః॥"*

సత్యం పలుకడం, మనస్సు, మాట, చేష్ట ఒకే రీతిగా ఉండడం 'ఆర్జవం' (త్రికరణాలలో ఋజుత్వం ఉండాలని అర్థం). 'రత' మంటే స్త్రీ పురుష సంగమం, ఇలా సత్యవాగార్జవ రతులచే ఉపకరిస్తూ, సంతోషకరమైన మాటలను చెబుతూ, ఎవడు తనను విడువకుండా సేవచేస్తుంటాడో, అతడే మగువకు ప్రియుడు అని ప్రియుని లక్షణం చెప్పబడింది.

వల్లవీజనవల్లభుడనే విశేషణ పదంచేత నికృష్ట జాతియందు తాను కలిసియున్న శ్రీకృష్ణుని 'సౌశీల్యం' అనే గుణం ప్రదర్శింపబడింది. *"సౌశీల్యం-మహతోమంద్రైస్సహనీ రంధ్ర సంశ్లేష స్వభావః"* మహోన్నతుడు అల్పులైన పామర జనులతో గాఢంగా కలిసి మెలసి యుండే స్వభావాన్ని 'సౌశీల్యం' అంటారు. సౌశీల్య గుణంవల్ల సర్వేశ్వరుడు దగ్గరికి పోరానివాడు (అనభిగమ్యుడు) అనే భయం తొలగిపోయి సుఖసేవ్యత్వం ఉపయుక్తం. వల్లవీజన వల్లభుడనడం వల్ల శృంగార రసమాస్వాదింపబడుతున్నది.

*వైజయంతీ విభూషణమ్:* - వనమాలయే భూషణంగా కలవాడు శ్రీకృష్ణుడు. వైజయంతి అంటే వనమాల. "ఆపాద పద్మం యామాలా వనమాలేతిసామతా" పాదాల దాకా వ్రేలాడే పుష్పమాలిక వనమాల అనబడుతుంది.

*"పంచ రూపాతు యామాలా వైజయంతీ గదాభృతః।*
*సాభూత హేతు సంఘాతా భూతమాలా చ వైద్విజ॥"*

- (వి.పు. 1-22అ. 73 శ్లో.)

తత్త్వాలన్నిటిని భగవానుడు తనకు ఆభరణాలుగా, ఆయుధాలుగా కలిగి యున్నాడు. అనే సందర్భమందు చెప్పబడింది.

*"విరు పూదమాలై వనమాలై యాక"*- (అధికార సంగ్రహం- 41పా.) పంచభూత తన్మాత్రలు, పంచభూతాలు అనే సూక్ష్మ స్థూల రూపాలై, రెండు విధాలైన భూతాల వరుసను 'వైజయంతీమాలగా భగవానుడు అలంకరించు కొన్నాడు.. 'వైజయన్తి' భూతతన్మాత్రాధిష్ఠాన దేవత- అని సారాంశం.

*"సకారణం కరణాధిపాధిపః"* అనే శ్రుతిరీత్యా జగత్కారణ బ్రహ్మరూపత్వం అభివ్యక్తమవుతున్నది. తత్ఫలితంగా 'వైజయన్తీ విభూషణం' అనే విశేషణ పదంవల్ల 'స్వామిత్వం' ద్యోతకమవుతున్నది. శ్రీకృష్ణుడు సర్వాయుధ భూషణాలతో కూడిన చతుర్భుజ రూపంతోనే ఆవిర్భవించినందువల్ల వైజయన్తీ విభూషణ ధామత్వం

కూడా విలక్షణంగా అనుసంధింపబడింది. స్వామిత్వం వల్ల సర్వవిధాలైన భయం తొలగిపోయి అవశ్యంగా ప్రభువును సేవించడమే ప్రయోజనమని స్పష్టమవుతున్నది.

ధామ:- "గృహదేహత్విట్ప్రభావాధామాని"- (అమరం) 'ధామన్' శబ్దానికి ఇల్లు, దేహం, కాంతి, ప్రభావం అని నానార్థాలు ఉన్నాయి. 'ధీయతే ఇతి ధామ'- ధరింపబడేది ధామం. "ధామస్థానేచ జన్మని" (శేషనిఘంటువు). ఈ కావ్యమందు స్వప్రకాశ జ్యోతిర్మయ వస్తువు వాసుదేవుడే.

వందే:- 'వది- అభివాదనస్తుత్యోః'- 'వర్తమాన సామీప్యే ఇతిలట్'. ఒక్కసారి ప్రపత్తి చేస్తేనే భగవానుడు అభీష్టప్రదుడని తెలిసినా, భక్తివశులై సత్పురుషులు సర్వదా నమస్కరించడం, స్తుతించడం స్వాభావికం. స్తుతిస్తుంటాను అనడం సముచితమే.

సేవించడానికి ఉపయోగపడే బహుగుణాలలో శ్రీమచ్ఛఠకోప దివ్యసూరులు మొదటి (తి.వా.యొుషి) శతకంలో అనుగ్రహించిన రీతిగా, సౌశీల్య స్వామిత్వ వాత్సల్య సౌలభ్యాలనే నాలుగు గుణాలు ఈ శ్లోకమందు ప్రదర్శింపబడినాయి. ఇందు సాభిప్రాయ పదాల విన్యాసంవల్ల 'పరికర'మనే అర్థాలంకారం.

వందే-బృందా, వల్లవీ వల్లభం, జయంతీ వైజయంతీ, అనే పదాలు వర్ణ సమత్వం కలవి. కాబట్టి, అనుప్రాసమనే శబ్దాలంకారం. యుగ్మవిపులా వృత్త రచితశ్లోకమిది. ఈ శ్లోకం 'గోపాల వింశతి' స్తోత్రమందు మొదట సుశ్లోకితం.

*2. యదేకైక గుణ ప్రాంతే*
*శ్రాంతా నిగమవందినః।*
*యథా వద్వర్ణనే తస్య*
*కిముతాన్యే మితం పచాః॥* 2

**అర్థం:** నిగమవందినః= వేదాలు అనే స్తుతిపాఠకులు; యదేకైక గుణప్రాంతే= యత్= ఏ భగవంతుని యొక్క; ఏక+ఏక= ఒక్కొక్క; గుణప్రాంతే= గుణం యొక్క అగ్రభాగమందు; శ్రాంతాః= అలసిపోతున్నారు; తస్య= ఆ భగవంతుని యొక్క ; యథావత్= తగినట్లు; వర్ణనే= (గుణస్తుతి) వర్ణనయందు; అన్యే= ఇతరులు; మితంపచాః= అల్పులు-శక్తిచాలనివారు; కిముత= ఏమి చెప్పవలెను?

**తా॥** వేదాలు అనే వంది వైతాళికులు భగవానుని ఒక్కొక్క గుణాన్ని స్తుతింపబూనుకొని, ఒక్క గుణం స్తుతియొక్క ఆరంభదశలోనే అలసిపోయారు. ఇక ఆ భగవానుని యొక్క గుణాలను యథార్థ్వంగా వర్ణించడమందు ఇతరులు- మానవులు- శక్తిలేనివారని చెప్పవలెనా?

**వ్యాఖ్య:-** భగవానుని గుణాలను వర్ణింప నలవియగునా? అని ఆక్షేపించే శ్లోకం.

అపరిమేయ, అనంత కల్యాణ గుణాలు కలవాడు భగవానుడు.

*"యథా రత్నాని జలధే రసంఖ్యే యాని పుత్రక।*
*తథా గుణాశ్చ దేవస్య త్వసంఖ్యేయాహి చక్రిణః॥"*

సముద్రంలో లెక్కపెట్టరాని రత్నాలు ఉన్నట్లే, చక్రియైన భగవానుని యొక్క గుణాలు అసంఖ్యేయంగా ఉన్నాయి అని పౌరాణికోక్తి.

"ఉయర్వఱ ఉయర్నలముడై యవన్"- నిస్సమోద్యద్గుణుడు, నిస్సమాభ్యధిక ఆనందగుణుడు శ్రియఃపతి, అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

*నిగమ వందినః:-* నియంత గమ్యతే ఇతి= నిగమః. నియంతగా పొందబడునది అని, 'నిగమ' శబ్దం యొక్క వ్యుత్పత్త్యర్థం. "వణిక్పథః పురం వేదో నిగమః"- (అమరం) నిగమశబ్దానికి అంగడివీథి, పట్టణం, వేదం- అని నానార్థాలు ఉన్నాయి.

*"వందినః స్తుతి పాఠకాః"*- (అమరం) *"వైతాళికా బోధకరాః" "స్యుర్మాగధాస్తు మగధాః"* (అమరం). వందంతే ఇతి వందినః. పరాక్రమాదులను స్తోత్రం చేయు వారని అర్థంలో 'వందిన్' శబ్దం యొక్క ప్రథమా విభక్తి బహువచనమిది. తాళవాద్యాలతో గుణ సంపదలను కీర్తిస్తూ రాజులను మేలుకొలిపే వారు వైతాళికులు. 'మగధ-స్తుతౌ'-మగధ్యంతి (స్తువంతి) ఇతి=మాగధాః, మగధాః, వంశావళిని స్తుతించేవారు మాగధులు లేదా మగధులు అనబడుతారు. ఈనాడు జనం వంది వైతాళికులు, వందిమాగధులు అని ఏకార్థంగా వ్యవహరిస్తున్నది.

నిగమాః వందిన ఇవ- వేదాలు స్తుతిపాఠకుల వంటివి అని ఉపమిత సమాసం కూడా కావచ్చు. అయినా, ముఖ్యార్థ శ్రమసంబంధం వల్ల 'నిగమా ఏవ వందినః' వేదాలే స్తుతిపాఠకులు, అని ఉత్తర పదార్థ ప్రధానమైన 'అవ్యయ పూర్వపద కర్మధారయ (రూపక) సమాసమని నిర్ణయం. స్తుతి పాఠకులు లేని స్వాభావికాలైన అనవధికాతి శయా సంఖ్యేయ కల్యాణ గుణాలను స్తుతించడానికి ప్రవర్తించాయి.

*"పిణంగి యమరర్ పిదత్తుమ్ కుణంగెషు కొళ్గైనానే"*- వైకుంఠమందు నిత్యసూరులలో ఒకరికొకరు తాము అనుభవించే భగవంతుని గుణాలే శ్రేష్ఠమైనవని వివాదపడుతూ, ఆడుతూ పాడుతూ అంజలిని ఘటిస్తుంటారని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

*యదేకైక గుణప్రాంతే శ్రాంతాః*:- అయితే వేదాలు భగవానుని యొక్క ఒక్క గుణాన్ని కూడా సమగ్రంగా వర్ణించలేక ఆరంభమందే ఆయాసపడినాయి. శ్రామ్యం తీతి= శ్రాంతాః. 'శ్రము తపసి, ఖేదేచ' బడలిక చెందాయి. *"నకిరింద్ర త్వదుత్తరః, విశ్వస్మాదింద్ర ఉత్తరః"*- అనే రీతిగా, ఇంద్రాది ఇతర దేవతలయందు లేని గుణాన్ని కూడా ఆరోపించే స్తవన శీలురు స్తుతిపాఠకులు. సముచితంగా స్తుతింపబూనుకొన్న వేదాలు కూడా *"బ్రహ్మణ్యో దేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనోమ్"* అనబడే భగవానునికి స్వాభావింకంగా ఉన్న ఒక్క గుణాన్ని

కూడా ఆనంద మీమాంసయందు "యతో వాచో నివర్తంతే" (ముందుకు సాగలేక నివర్తిస్తున్నాయి) అన్నట్లు, స్తోత్రం చేయడానికి శక్తిలేని వయ్యాయి.

యథావత్ వర్ణనేతస్య అన్యే మితం పచాః:- 'యథా' అనే పదానికి అర్హార్థమందు 'వత్' ప్రత్యయమేర్పడినందువల్ల 'యథావత్' అంటే 'తగ్గినట్లు' అని అర్థం.

"కదర్యే కృపణక్షుద్ర కిం పచాన మితం పచాః"- (అమరం) మితం పచంతి ఇతి= మితం పచాః. కొద్దిగా వండుకొనేవారు అల్పులు, క్షుద్రులు అని అర్థం. హేయ ప్రత్యనీక కల్యాణగుణైక తానుడైన భగవానుని ఒక్క గుణాన్ని కూడా పూర్తిగా వర్ణించడానికి మానవులు మితంపచులు- అశక్తులే.

*"చతుర్ముఖాయు ర్యది కోటి వక్త్రో భవేన్నరః క్వాపివిశుద్ధ చేతాః।*
*సతే గుణానా మయు తైక మంశం వదేన్నవాదేవ! వరప్రసిద్ధః॥"*

చతుర్ముఖ బ్రహ్మయొక్క ఆయుస్సువంటి ఆయువునూ, కోటి ముఖాలనూ, పరిశుద్ధమైన మనస్సునూ కలిగియున్న మానవుడెక్కడనైనా ఒకవేళ ఉన్నట్లైతే అతడు కూడా వరప్రసిద్ధుడవైన ఓ భగవానుడా! (నీ వరప్రభావంచేత భూలోకంలో వెలసి యున్నప్పటికీ) నీ గుణాలలో ఒక పదివేల భాగమంతనైననూ స్తుతిస్తాడో? స్తుతించలేడో? సందేహమే అని అర్షస్తవం.

కిముత:- ఇక మావంటి క్షుద్రులను గూర్చి చెప్పేదేమి? భగవద్గుణ లేశాన్నైనా వర్ణించడానికి మాకు ఎలా శక్యమవుతుంది? అశక్తులమని భావం.

కావ్యారంభంలోనే కవి తన వినయాన్ని ఆవిష్కరించడం కోసం తన అశక్తిని ప్రతిపాదించడం ప్రస్తుత విషయం. అది సామాన్యంగా చెప్పబడింది. అప్రస్తుతమైన సామాన్యం కంటె ప్రస్తుత విశేష ప్రతీతివల్ల అప్రస్తుత ప్రశంసాలంకారం.

కైముతిక న్యాయాన్ని బట్టి అర్థాపత్త్యలంకారం. 'నిగమ వందినః' అని అభేదారోపంవల్ల రూపకాలంకారం. ఈ అలంకారాలు పరస్పరంగా అనుప్రాణితాలు కాబట్టి సంకరాలంకృత శ్లోకమిది.

3. శక్త్యా శౌరికథాస్వాదః
స్థానే మందధియామపి।
అమృతం యది లభ్యేత కిం
న గృహ్యేత మానవైః॥ 3

**అర్థం:** మందధియాం, అపి= అల్పబుద్ధి కలవారికి కూడా; శక్త్యా= శక్తిచేత; శౌరి కథా+ఆస్వాదః= శ్రీకృష్ణుని యొక్క కథను ఆస్వాదించడం; స్థానే= యుక్తమే; అమృతం= అమృతం; యది, లభ్యేత= పొందబడినట్లైతే; మానవైః= మనుష్యులచేత; కిం, న, గృహ్యేత= గ్రహింపబడదా యేమి?

**తా॥** మందబుద్ధి కలవారు కూడా శక్తి ఉన్నంతవరకు శ్రీకృష్ణుని చరిత్రను వర్ణించడం సముచితమే. ఒకవేళ అమృతం లభిస్తే, మానవులు దాన్ని ఆస్వాదించ కూడదా?

**వ్యాఖ్య:-** భగవానుని స్తోత్రం చేయడం శక్యం కాదని కైముత్యంచేత దృఢ పరచిన అక్షేపణకు సమాధానం ఈ శ్లోకం.

శౌరి అనే పేరు శ్రీకృష్ణునికి వర్తిస్తుంది. వసుదేవుని తండ్రిపేరు శూరుడు. కాబట్టి 'శూరస్య అపత్యం పుమాన్= శౌరిః' అని అపత్యార్థక తద్ధితంవల్ల వసుదేవుడని అర్థం. వసుదేవ శబ్దం వల్ల వ్యవహితాపత్యం కదా! (నడుమ ఎడమున్న సంతానమని భావం) ఎలా చెల్లుతుంది? అంటే, శబ్దశాస్త్రంలోని "ఏకోగోత్రే" అనే నియమం వల్ల గోత్రం, వంశమందున్న ఒక వ్యక్తికి, అంటే వ్యవహిత సంతానానికి కూడ ఆ పేరు చెల్లుతుంది.

*శౌరికథాస్వాదః:-* కృష్ణుని చరిత్రను వర్ణించడం అని ప్రస్తుతార్థం 'ఆస్వాద' శబ్దంచేత కావ్యనిబంధనం లేదా కథను వర్ణించడం అనే అర్థం నిగరణమయింది కప్పిపుచ్చబడింది.

'స్థానే' – అనే పదం అవ్యయం, యుక్తమే, ఉచితమే, తగును అని అర్థం. "యుక్తే ద్వే సాంప్రతం స్థానే"– (అమరం) "స్థానే స్యాదుచితేఽవ్యయమ్"– (రత్నమాల).

*మందధియా మపి శక్త్యా శౌరి కథాస్వాదః స్థానే:* – మందబుద్ధి కలవారు కూడ భగవద్గుణాలను సంపూర్ణంగా వర్ణించే శక్తిలేని వారైననూ, వారి బుద్ధికి ప్రసరించే శక్తి ఉన్నంతవరకు గుణవర్ణనం చేయడం, కథను నిబంధించడం యుక్తమే, సముచితమే. వర్ణించే శక్తి ఉన్నంత దాకా శక్యాంశాన్ని ఉపేక్షించకూడదు. ఈ మాటకు దృష్టాంతం చెప్పబడుతున్నది.

*అమృతం యది లభ్యేత కిం న గృహేత మానవైః:* – మానవులకు అమృతం ఏ మాత్రమైనా లభించినట్లైతే, అది దేవతలకే అర్హమైనదని వారు వదలిపెడతారా? లభించిన అమృతాన్ని తప్పక ఆస్వాదిస్తారు. అలాగే, బుద్ధి తక్కువ ఉన్నవారు భగవద్గుణాలను సాకల్యంగా వర్ణించే అధికారం లేనివారైననూ, రసజ్ఞులైనందు వల్ల అది ప్రాజ్ఞులు చేసేపని కదా! అని ఊర్కోరు. శక్తి ఉన్నంతవరకు అవశ్యంగా వర్ణిస్తారు.

కాబట్టి దేశికులు కూడా యథామతి శ్రీకృష్ణ చరిత్రను వెల్లడించే కావ్యనిర్మాణానికి పూనుకోవడంలో దోషమే లేదని భావించారు. ఇందు అప్రస్తుత ప్రశంసాలంకారం భాసిస్తునే ఉంది.

భగవచ్చరితం ఉపమేయం. అమృతం ఉపమానం. వీటిని ఒకచోట నిబంధనమని మరొకచోట ఆస్వాదనమని వేర్వేరు సామాన్య ధర్మాలతో బింబ ప్రతిబింబ భావంగా రెండు వాక్యాలచేత నిర్దేశించడం వల్ల దృష్టాంతాలంకారం. 'ఆస్వాద' శబ్దంచేత 'నిబంధన'ను నిగరణం చేసి ఆధ్యవసించడం వల్ల భేదమందు అభేద రూపాతిశయోక్త్యలంకారం. నిగరణం చేసి అధ్యవసించడమందు కూడ తృష్ణాతిరేక విషయత్వం లక్షణామూలమైన వ్యంగ్యం. ఈ వ్యంగ్యం కూడ దృష్టాంతానికి ఉపస్కరించడం వల్ల గుణీభూత వ్యంగ్యమని సుస్పష్టం.

ఈ శ్లోకం, రఘువంశంలో కాళిదాస మహాకవి "మందః కవియశః ప్రార్థీ". ('మందుడు' అంటె శనైశ్చరుడు. శని మహర్దశ 19 సం॥లు. 'కవి' అంటె శుక్రుడు. శుక్రదశ 20 సం॥లు. మందుడు కవియొక్క యశస్సును పొందగోరిన విధంగా) మందబుద్ధికలవాడనై మహాకవియొక్క కీర్తివంటి కీర్తిని పొందగోరినవాడను- అని వినయాన్ని ప్రకటించిన శ్లోకాన్ని స్మరింపజేస్తున్నది.

4. *వసుధా శ్రోత్ర జే తస్మిన్*
*వ్యాసేచ హృదయస్థితే।*
*అన్యేఽ పి కవయః*
*కామం బభూవు రనపత్ర పాః॥* 4

**అర్థం:** తస్మిన్= ప్రసిద్ధుడైన; వసుధా శ్రోత్రజే= భూమికి చెవ్వుగా ఉన్న పుట్టయందు పుట్టిన వాల్మీకి; చ= మరియు; వ్యాసే= వేదవ్యాసుడు; హృదయస్థితే= మనస్సునందు ఉంటుండగా; అన్యే, అపి= ఇతరులు కూడ; కామం= మిక్కిలి; అనపత్రపాః= సిగ్గులేనివారైన; కవయః= కవులు; బభూవుః= అయినారు.

**తా॥** ప్రసిద్ధుడైన వాల్మీకి, మనస్సులో స్ఫురిస్తుండగానే వ్యాసుడు కవి అయినాడు. ప్రసిద్ధులైన (వాల్మీకి, వ్యాసులు) ఆ ఇద్దఱు మనసులో ఉంటుండగా, ఇతరులు కూడా మిక్కిలి సిగ్గులేనివారైన కవులు ప్రకాశించారు.

**వ్యాఖ్య:-** వాల్మీకి, వ్యాసుడు ఇద్దఱే ప్రసిద్ధ కవులని మనస్సులో ఉన్ననూ, ఇతరులు కూడా కవులుగా వెలిశారని, ఇతిహాసకవులను ప్రశంసించే శ్లోకం.

మంద బుద్ధులు యథామతి భగవద్గుణామృతాన్ని ఆస్వాదిస్తూ కావ్యరచన చేయడం దోషం కాదని పూర్వశ్లోకం వివరించింది. అందువల్ల, ఈ నాల్గవ శ్లోకానికి పూర్వశ్లోక భావమే హేతువని గ్రహించడం ఆవశ్యకం.

*వసుధా శ్రోత్రజే తస్మిన్:-* 'వసుధా' అంటే భూమి. శ్రోత్రం అంటే చెవి. వసుధా శ్రోత్రమంటే వల్మీకం, పుట్ట అని అర్థం. "వామలూరుశ్చ భూశ్రవః"

(రత్నకోశం) "వామలూరుశ్చ నాకుశ్చ 'వల్మీకం పుం నపుంకసమ్"- (అమరం) "శ్రోత్రం హ్యేతత్ పృథివ్యాః యద్వల్మీకః"- 'భూదేవికి శ్రవణేంద్రియం వల్మీకం' అన్నది వేదవాణి. వసుధా శ్రోత్రమందు జన్మించినవాడు వాల్మీకి.

వ్యాసేచ హృదయస్థితే:- ఇతిహాస మనబడే శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని రచించిన వాల్మీకి ముని 'ఆదికవి' అని ప్రసిద్ధిని పొందినాడు. వ్యాసుని హృదయ మందు ప్రసిద్ధుడైన వాల్మీకి స్ఫురిస్తుండగా, మహాభారతమనే గొప్ప ఇతిహాస గ్రంథాన్ని రచించి లోకంలో ప్రసిద్ధకవిగా ప్రకాశించాడు. ఇలాగా దేశికులు రామాయణ, మహాభారతేతిహాస గ్రంథకర్తలైన వాల్మీకి వ్యాసమహర్షు లిద్దరినీ సుశ్లోకించారు. వీరు హృదయంలో ఉన్నారు.

అన్యేఽపి కవయః కామం బభూవు రనపత్రపాః:- అనపత్రపాః:- "మందాక్షం హ్రీ స్త్రపావ్రీడా లజ్జా"- సిగ్గు పేర్లు. "సాఽపత్రపాఽన్యతః"- నికృష్టాత్రపా 'అపత్రపా'- చెడ్డసిగ్గు. పరులు దగ్గర ఉన్నందువల్ల కలిగిన సిగ్గుపేరు. అపత్రపా లేనివారు 'అనపత్రపులు' (అమరం).

లోకుల హృదయాల్లో వాల్మీకి వ్యాసులిద్దతే ప్రసిద్ధకవులుగా భావింప బడుతున్నారు. రామాయణ భారతాలను చూచి ఇతరులెందఱో స్వయంగా కావ్యాలను రచించారు. వీరి ప్రవృత్తి సిగ్గులేనిది, అంటూ వాల్మీకి వ్యాసమహర్షులను ప్రశంసిస్తూనే, ప్రాచీన మహాకవుల ప్రబంధాలు ఉండగా స్వకీయ ప్రబంధాలను నిర్మించి ఎందఱో కవులుగా భాసించారని కావ్య రచనకు పూనుకోవడం అనౌచిత్యం కాదని విశదపరచారు దేశికులు.

యథామతి కావ్యాన్ని రచించడంలో సిగ్గుపడడమెందుకు? అని అనౌచిత్యాన్ని పరిహరిస్తూ తమ వినయాన్ని వెల్లడించారు. రామాయణ మహాభారతాలు ఉండగా, నా కంటే పూర్వకవులు ఎలాగా కావ్యాలను రచించారో, అలాగా నా చేత కూడా కావ్య రచన చేయబడునని దేశికులు సుశ్లోకించారు.

"చాపలాయ ప్రచోదితః" (రఘువంశం) అన్నట్లు చాపలం సిగ్గును తొలగిస్తుంది కదా!

సిగ్గు పడకుండా, ఖ్యాతిలాభాది నిరపేక్షంగా, అందఱు భగవద్గుణానుభవ రూపమైన కావ్యాన్ని యథామతి నిర్మించదగును అని స్పష్టీకృతం.

*5. సకవిః కథ్యతే స్రష్టా రమతే యత్ర భారతీ।*
*రస భావ గుణీ భూతై రలంకారైర్గుణోదయైః॥* 5

**అర్థం:** రసభావ గుణీభూతైః/ రస= శృంగారాది రసాలతో; భావ= ఆయా రసాలకు ఉచితమైన విభావానుభావ సంచారి భావాలతో; గుణీభూతైః= అప్రధానమైన వ్యంగ్యార్థాలతోనూ; అలంకారైః= అనుప్రాసాది శబ్దాలంకారాలతో, ఉపమాద్యర్థా లంకారాలతోనూ; గుణ+ఉదయైః= మాధుర్యాది గుణాలతో, ఆ గుణాలకు తగిన వర్ణ సమాస రచనా విలాసాలతో కూడిన; భారతీ= సరస్వతి- వాగ్దేవి; యత్ర= ఎవని యందు; రమతే= రమిస్తుందో; సః= ఆ; స్రష్టా= అపూర్వ సృష్టి కర్తయైన బ్రహ్మయే; కవిః= కవియని; కథ్యతే= చెప్పబడుతాడు.

**తా॥** అనురాగంచేత ఏర్పడిన చిరునవ్వులతో, ఓరచూపులతో వివిధ రసాను భావాలను ప్రసరిస్తూ, కటక కేయూరాది భూషణాలతోనూ, రూపయౌవనాది గుణాలతో కూడిన విలాసాలతో రతిభావోద్దీపన చేస్తూ భారతీదేవి నలువను అలరింపజేస్తుంటే, సరస్వతీ విహారాస్పదీభూతుడైన ఆ చతుర్ముఖ బ్రహ్మ లోకాలను నిర్మించి కవి యని కీర్తింపబడినాడు. "తేనే బ్రహ్మాయ ఆదికవయే"- పద్మనాభుడు పంకజాసనుడైన బ్రహ్మకు వేదాన్ని విస్తరింపజేశాడు. ఆ బ్రహ్మయే లోక నిర్మాతయైనందువల్ల 'ఆదికవి' యని ప్రసిద్ధిని పొందినాడు. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అని ఉపనిషద్వాణి. శృంగారాది రసోచితమైన విభావానుభావసంచారీ భావాలతో, గుణీభూత వ్యంగ్యార్థాలతో, అనుప్రాస ఉపమాద్యలంకారాలతో, మాధుర్యాది గుణోచిత

రచనా విలాస విన్యాసాలతో సరస్వతీదేవి ఏ వ్యక్తియందు స్వయంగా నిరర్గళ ప్రవాహరూపమై వర్తిస్తుందో అతడే, ప్రతిభతో అపూర్వ కావ్యనిర్మాతయై 'కవిబ్రహ్మ' యని వ్యవహరింపబడుతాడు. "అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః". కవియే బ్రహ్మ కదా! తాత్పర్య స్పష్టం.

విశిష్ట కవితాశాలియే 'కవి'గా చెప్పబడును, అనడంవల్ల ఉపమాలంకారం ధ్వనిస్తుంది. అటువంటి కవిత్వ విధానంచేత- అట్టి రసభావ చమత్కారం లేకుండా ప్రబంధాలను రచిస్తున్న పరోచ్ఛిష్టోప జీవులైన వారు కవులు కారని కవిత్వ నిషేధాభాసరూపమైన ఆక్షేపాలంకారం ద్యోతకమవుతుంది.

కుకవులను ఉపాలంభనం చేయడంవల్ల దేశికులు అట్టివారు కారని తమ కవితా ప్రౌఢిని ప్రకటించడం వల్లను, గత శ్లోకంచేత సారతరమైనదని తోచడమే శబ్దశక్తిమూలక వస్త్వలంకార ధ్వనిపరంపరగా అనురణిస్తున్నది. ఇందు కవి లక్షణం సుశ్లోకితం.

*6. తదాత్వే నూతనం సర్వమాయత్యాంచ పురాతనమ్।*
*న దోషాయై తదుభయం న గుణాయచ కల్పతే॥* 6

**అర్థం:** సర్వం= కావ్యసముదాయం; తదాత్వే= అప్పుడున్న కాలమందు; నూతనం= కొత్తది; ఆయత్యాం= ఉత్తర కాలమందు; పురాతనం= పాతది; చ= ఇంతే కాదు; మరియు; ఏతత్= ఈ; ఉభయం= రెండు (నూతనత్వం, పురాతనత్వం) దోషాయ= దోషం కోసం; గుణాయ చ= గుణంకోసం కూడ; న, కల్పతే= కల్పింపబడ లేదు.

**తా॥** కావ్యమేదైనా రచించిన కాలమందు కొత్తది. రాగల కాలమందు పాతది. పాత, కొత్త ఈ రెండు దోషం కోసమో గుణం కోసమో కల్పింపబడలేదు.

**వ్యాఖ్య:-** కావ్యమందు కొత్త అని దోషకల్పన చేసే వ్యక్తులను గూర్చి సుశ్లోకితం.

*తదాత్వే నూతనం:-* కావ్యరచన ఎప్పుడు జరిగినా, ఆ కావ్యం రచించిన కాలానికి అది కొత్తదే. ఆ కావ్యమే భావికాలంలో పాతది అనబడుతుంది. "తత్కాలస్తుతదాత్వం స్యాత్". తదా ఇతి అస్యభావః= తదాత్వం. అప్పుడున్న కాలానికి అది వర్తమాన కాలమనియే భావం కాబట్టి 'తదాత్వం' అనబడుతుంది. 'ఇణ్- గతౌ' అనే ధాత్వర్థాన్ని బట్టి 'ఏష్యతి ఇతి ఆయతిః'. రాగల కాలం 'ఆయతిః' అనబడుతుంది. ఎప్పుడో వ్రాసిన కావ్యాన్ని ఇప్పుడు పాతకావ్యం అనుకోవడం లోకంలో నైసర్గికం.

'చ' కారం వల్ల ఈ క్రమం భిన్నంగానూ ఉంటుంది అని అర్థం. అంటే, ప్రాచీన ప్రబంధం దోషభూయిష్ఠమని, వర్తమాన కాలంలో రచించిన ప్రబంధం గుణవంతమైనదనే భావన కలవారూ ఉంటారు అని సారాంశం.

*నదోషాయైతత్ ఉభయం నగుణాయచ కల్పతే:-* ఈ రెండు- అంటే ప్రాచీన గ్రంథమైనంత మాత్రాన గుణాలుంటాయని, నవీనగ్రంథం కాబట్టి అందు గుణాలు లేకుండా అన్నీ దోషాలే ఉంటాయనుకోవడమూ భావ్యం కాదు.

"పురాణ మిత్యేవ నసాధు సర్వం,
నచాపి కావ్యం నవమిత్య వద్యమ్॥"

ప్రతి ప్రాచీనకావ్యం మంచిదని, కొత్త కావ్యమూ చెడ్డదని చెప్పతగనిది. కావ్యమందలి గుణదోషాలను పరీక్షించిన సద్విమర్శకులచేత కావ్యం మంచిదో, చెడ్డదో చెప్పబడుతుంది- అని కాళిదాస మహాకవి సూక్తి.

పురాణత్వం నూతనత్వమనే దాన్ని బట్టి కావ్యాన్ని త్యజించరాదు, గ్రహించనూరాదు. ప్రాచీనత, నవీనత అనేవి ఆయా లక్షణ వైకల్య సాకల్యాలే కదా!

7. ప్రవృత్తామనఘే మార్గే ప్రమాద్యంతీ మపిక్వచిత్।
నవాచ మవమన్యంతే నర్తకీమివ భావుకాః॥ 7

**అర్థం:** అనఘే= పాపాన్ని నశింపజేసే; మార్గే= మార్గమందు; ప్రవృత్తాం= వర్తించునట్టి; వాచం= కవితను; క్వచిత్= ఒకప్పుడు; ప్రమాద్యంతీం, అపి= పొరపడినదైనను; భావుకాః= భక్తులు; అనఘే= దుఃఖాన్ని తొలగించే; మార్గే= మార్గమనే నృత్తమందు; ప్రవృత్తాం= సుశిక్షితయైన; నర్తకీం, ఇవ= నాట్యకత్తెను వలె; భావుకాః = రసజ్ఞులు; న, అవమన్యంతే= అవమానించరు.

**తా॥** దురితాన్ని దూరంచేసే మార్గకవిత యందు ప్రవర్తించిన వాక్కును ఒకవేళ దోషం కలదైనా కూడా భగవద్భక్తులు, వినోదాన్ని కలిగించే మార్గాఖ్య నృత్తమందు నేర్పుగల నర్తకిని వలె, రసజ్ఞులు అవమానించరు.

**వ్యాఖ్య:-** భగవచ్చరిత్రయొక్క సంగ్రథన రూపమైన కవితను భక్తులు ఆదరిస్తారనే శ్లోకం.

*ప్రవృత్తా మనఘే మార్గే:-* కవులు భగవానుని చరితాన్ని వ్రాసి అనఘు లవుతారు. "*కావ్యేభగవచ్చరణారవిందస్తవాదినా ధర్మప్రాప్తిః*" అని సాహిత్య దర్పణ వాక్యం. 'అనఘ' మంటే అఘానికి విరుద్ధమైనది. పుణ్యమైనది అని అర్థం. ధర్మవిరుద్ధమైనది 'అధర్మ'మన్నట్లు ఇది నఞ్ సమాసం.

"*అఘశబ్దో భవేత్ పాపే దుఃఖవ్యసనయోరపి*"- (అజయ నిఘంటువు) కవిత్వం మార్గ కవిత్వం, దేశికవిత్వ మని రెండు విధాలుగా ఉన్నది. భగవద్గుణ చేష్టలను వర్ణించే కవిత్వం మార్గ కవితకు వర్తిస్తుంది.

*వాచం ప్రమాద్యంతీమపిక్వచిత్:-* పావనమైన భగవల్లీలా కథారూపమైన కవితయందు ప్రామాదికంగా ఏదైనా దోషం ఉండవచ్చుగాక. అయినా-

*నవాచమవమాన్యంతే భావుకాః:-* భగవద్భక్తులు సూక్ష్మ దోషయుక్తమైన భగవచ్చరితాత్మక కవితను కూడా గౌరవిస్తారు, అవమానించరు.

*"స వాగ్విసర్గో జనతాఘ విప్లవో యస్మిన్ ప్రతిశ్లోక మబద్ధవత్యపి।*
*నామాన్య నంతస్య యశోంకితాని శృణ్వంతి గాయంతి గృణంతి సాధవః॥"*

భగవద్విషయం ఏదో రీతిగా అబద్ధంగా ఉన్నప్పటికీ, సమస్త పాపరాశిని ధ్వంసం చేస్తుందనే మహా విశ్వాసంతో సాధువులు భగవత్కథను వింటారు. అనంత నామావళిని కీర్తిస్తుంటారు- అని శ్రీమద్భాగవత సూక్తి.

నావ మన్యంతే నర్తకీ మివ భావుకాః:- నృత్తం మార్గమని దేశి అనే పేర్లతో ద్వివిధమని సంగీత శాస్త్రోక్తం. మార్గాఖ్య నృత్తాన్ని బాగా నేర్చిన వనిత 'నర్తకి' (నర్తకుడు పురుషుడు). "నర్తకః సురభిః ప్రోక్తో మార్గనృత్తే కృతశ్రమః" (సంగీత రత్నాకరం). 'భావుకాః' అంటే, ఆయా భావాలను చేష్టలను బాగా తెలిసిన రసికులు.

*"భావా వినైవ చేష్టాభిర్న దృశ్యంతే కదా చన।*
*తస్మాచ్చేష్టా విశేష జ్ఞాః భావుకాః రసికాః స్మృతాః॥"*

చేష్టలు లేకుండా భావాలు కనబడవు. కాబట్టి చేష్టా విశేషాలను తెలుసుకొన్న వారు భావుకులు- రసికులు అని స్మరింపబడుతారు (శారదా తనయుడు). వేర్వేరు అర్థాలుగల 'మార్గే, భావుకాః' అనే శబ్దాలను ఒక్కసారి చెప్పడం వల్ల, శ్లేషాలంకారం.

శ్లిష్టపదాలచేత ఏర్పడిన అర్థాలకు ఉపమయందు సామాన్య ధర్మత్వం సిద్ధించడం కోసం అభేదాధ్యవసాయం వల్ల, అభేదాధ్యవసాయ మూలమైన అతిశయోక్త్యలంకారం. అతిశయోక్తిచే అను ప్రాణితమైన 'నర్తకివలె' అనడం ఉపమాలంకారం.

*8. విహాయ తదహంవ్రీడాం వ్యాసవేదార్ణవామృతమ్।*
*వక్ష్యే విబుధ జీవాతుం వసుదేవ సుతోదయమ్॥* 8

**అర్థం:** తత్= అందువల్ల; అహం= నేను; వ్రీడాం= లజ్జను; విహాయ= విడిచి; వ్యాసవేద+అర్ణవ+అమృతం= మహాభారతమనే సముద్రం యొక్క అమృతమైన; విబుధ

జీవాతుం= దేవతలకు అన్నం/ విద్వాంసులకు జీవన ఔషధం అయినట్టి; వసుదేవ సుత+ఉదయం= శ్రీకృష్ణునియొక్క అభ్యుదయాన్ని; వక్ష్యే= చెప్పగలను.

**తా॥** పైన చెప్పబడిన కారణంవల్ల, నేను సిగ్గువిడిచి మహాభారతమనే సముద్రమందు ఉదయించిన అమృతమైనట్టి, దేవతలకు అన్నమూ, విద్వాంసులకు జీవనౌషధమూ అయినట్టి శ్రీకృష్ణుణి అభ్యుదయ చరిత్రను వర్ణించగలను.

**వ్యాఖ్య:**- యాదవాభ్యుదయ మహాకావ్య రచనకు హేతువును చెప్పే శ్లోకం.

అద్భుత మహిమగల శ్రీకృష్ణచరిత్రను రచింపగోరే తనను అపహసించ గలరనే సిగ్గును విడిచినట్లు 'విహాయ తదహం వ్రీడాం' అనే మాటను దేశికులు ప్రకటించారు. భగవద్గుణానుభవం యథాశక్తి చేయడానికి సిగ్గువిడిచి కవులు ప్రస్తావిస్తారని కవులను ప్రశంసించారు.

*వ్యాసవేదార్ణవామృతం:*- వేదాలను విభజించిన వ్యాసమహర్షి రచించిన మహాభారతం పంచమ వేదమనే ప్రసిద్ధిని పొందినది. సముద్రమందు ఉద్భవించింది అమృతం. మహాభారతం అనేది మహార్ణవం అయితే అందున్న శ్రీకృష్ణచరిత్రయే అమృతం. యాదవాభ్యుదయ మహాకావ్యం అమృతం లాగా సారతమమైనది. *"పీయూష మమృతం సుధా"*- (అమరం).

*విబుధ జీవాతుం:*- 'విబుధ' శబ్దం విద్వాంసులకు, దేవతలకు వర్తిస్తుంది. *"త్రిదశావిబుధాః సురాః"*- (అమరం). *'జీవాతుః'*- అంటే భక్తం (అన్నం) అనీ, జీవనౌషధమనీ రెండు అర్థాలు. యాదవాభ్యుదయ మహాకావ్యం దేవతలకు ఆహారంవంటిది; పండితుల హృదయానికి ఆప్యాయమైనదని భావం. *"జీవాతుర్జీవితే భక్తే, జీవాతుర్జీవనౌషధమ్"*- (విశ్వనిఘంటువు).

*వసుదేవసుతోదయమ్:*- వసుదేవుని పుత్రుడు కృష్ణుడు. మహాభారతమందు కృష్ణుని దివ్యచేష్టలు వర్ణింపబడియున్నాయి. శ్రీకృష్ణుడు యదువంశ భూషణుడు. కాబట్టి, ఈ యాదవాభ్యుదయ మహాకావ్యాన్ని రచించగలనని ప్రతిజ్ఞ చేయబడింది.

'వ్యాసవేదార్ణవామృత' మనడం వల్ల, అశ్లిష్ట రూపకాలంకారం. 'విబుధజీవాతుం' అనడం వల్ల శ్లిష్ట శబ్ద నిబంధన రూపకాలంకారం. ఈ రెండు అలంకారాలచేత ఇది సంకరాలంకృత శ్లోకం.

9. *క్రీడా తూలికయా స్వస్మిన్ కృపారూషితయా స్వయమ్।*
*ఏకో విశ్వమిదం చిత్రం విభుః శ్రీమాన జీజనత్॥* 9

**అర్థం:** విభుః= నిరతిశయ వైభవం కల్గియున్న; శ్రీమాన్= లక్ష్మీయుక్తుడైన, పురుషోత్తముడు; ఏకః= ఒక్కడు; ఇదం= ఈ; విశ్వం= సమస్త జగత్తును; చిత్రం= ఆశ్చర్యంగా ఉన్న చిత్రపటాన్ని; కృపారూషితయా= దయారసంచేత తడిపిన; క్రీడా తూలికయా= లీల అనే కుంచెతో; స్వయం= తాను; స్వస్మిన్= తనయందు; అజీజనత్= జనింపజేసెను.

**తా॥** విభువు, శ్రీమంతుడు అయిన పురుషోత్తముడు ఒక్కడే ఆశ్చర్యకరమైన ఈ విశ్వమనే చిత్తరువును దయారసంచేత తడిపిన లీల అనే కుంచెతో తాను తనయందు జనింపజేశాడు.

**వ్యాఖ్య:-** శ్రీమంతుడైన పురుషోత్తముడు సమస్త జగత్తును సృష్టించాడని వర్ణితం.

పరబ్రహ్మ మానవాకారంతో కృష్ణుడనే పేరు కలిగి అవతరించిన యదువంశ చరిత్రను మానవుడు విని సర్వపాపాల నుంచి విముక్తుడు అవుతాడు.

*"యదో ర్వంశం నరః శ్రుత్వా సర్వ పాపైః ప్రముచ్యతే।*
*యత్రావతీర్ణం కృష్ణాఖ్యం పూర్ణం బ్రహ్మ నరాకృతిః॥"*

యదువంశ చరిత్రను వినడం పరమపావన మవడం వల్ల, యదువంశ పరంపర వర్ణన పూర్వకంగా భగవచ్చరిత్రను చెప్పే కోరికతో, మొదట భగవానుని చేత ఈ విశ్వం సృజింపబడిందని, కవికేసరి వర్ణిస్తున్నాడు.

*ఏకః:-* "నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"- భగవంతునితో సమానుడే లేడు, అతనికంటె గొప్పవాడు కననేబడడు- అనే వేదవాక్య ప్రమాణాన్నిబట్టి, అనేక కోటి బ్రహ్మాండాలు కూర్చబడిన ప్రపంచాన్ని మరొకరి సహాయం లేకుండా ఒక్కడే నిర్మించాడని వివరించే పదమిది.

*విభుః:-* ఒక్కడే ప్రపంచాన్ని అసహాయుడై నిర్మించడం అసంభవమనే శంకను నివారించడానికి ప్రయుక్తమైన పదమిది. అఖిల జగత్తును సృజించడానికి, పాలించడానికి, లయం చేయడానికి అనుకూలమైన వివిధ శక్తులు కలిగియున్నందు వల్ల భగవానుని నిరతిశయ వైభవాన్ని వెల్లడిస్తున్నది.

*శ్రీమాన్:-* నిత్యానపాయిని అంటే ఎల్లప్పుడు ఎడబాయని లక్ష్మీదేవితో కూడియుండే పురుషోత్తముడని అర్థం. పురుష సూక్తంలో ఉత్తరానువాకమందు "హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" అని పురుషునికి శ్రియః పతిత్వం చెప్పబడింది. శ్రియః పతియైన పురుషోత్తముడే జగన్నిర్మాత యని ప్రకటిస్తున్న పదమిది.

*ఏకోవిశ్వమిదం చిత్రమజీ జనత్:-* పురుషోత్తముడొక్కడే చిత్రమైన విశ్వమనే చిత్రపటాన్ని నిర్మించాడని అర్థం. అవాప్త సమస్తకాముడైన సర్వేశ్వరునికి ప్రపంచాన్ని నిర్మించడంవల్ల ప్రయోజనమేమి ఉంటుంది? అంటే, కోరికలన్నీ తీరిన వాడే అయినా సార్వభౌముడు లీలగా క్రీడకోసం ఒక బంతిని నిర్మించుకొంటాడు కదా! అనేదే సమాధానం.

*క్రీడాతూలికయా:-* భగవానుడు అట్లే లీల అనే కుంచెతో విశ్వాన్ని చిత్రించాడు అన్నారు. తన క్రీడ- లీలకోసమే అన్నట్లైతే, జీవరాశులను నరకమూ, గర్భవాసాది దుఃఖమూ అనే బురదలో ముంచుతున్నందువల్ల, భగవానుడు దయలేనివాడు అనవలసి వస్తుంది కదా! పైగా, తన నిఖిలహేయ ప్రత్యనీక సమస్త కల్యాణ గుణపరిపూర్ణత్వానికి హాని కదా? అంటే ఈ శంకను వారించడానికే 'కృపారూషితయా' అనే పదం వాడబడింది.

*కృపారూషితయా క్రీడా తూలికయా చిత్ర మజీజనత్:* – దయారసమనే రంగులో అద్దిన లీలాతూలికచే విశ్వమనే చిత్రాన్ని కల్పించాడు. చిత్తరువులో కుంచె కనబడదు కదా! కేవలం రంగు, వర్ణం మాత్రమే కనబడుతుంది. అట్లే విశ్వమనే చిత్రమందు దయారసమే దృగ్గోచరమవుతుంది. భగవానునికి నిర్దయ, పక్షపాతం లేదు.

"వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్"– అనే న్యాయాన్ని మీమాంసాశాస్త్రం తెల్పుతుంది. భుక్తినే కాదు, ముక్త్యుపాయాన్నీ ప్రతిపాదించే వేద భాగాలు ఉపదేశింపబడినాయి. భగవత్కృపతోనే ధాన్యాదులు సృజింపబడినాయి. అవ్యాజ కృపాళుడు భగవానుడు కాబట్టి 'ముకుందుడు' భుక్తినీ, ముక్తినీ ప్రసాదించేవాడు అని కీర్తింపబడుతున్నాడు. భగవత్కృపచేతనే విశ్వసృష్టి జరిగిందని భావం.

"ఆలేఖ్యాశ్చర్యయోశ్చిత్రం"– (అమరం). 'చిత్ర' శబ్దానికి చిత్తరువు, ఆశ్చర్యం అని రెండు అర్థాలు ఉన్నాయి.

"విశ్వం సమస్త జగతోః"– (విశ్వనిఘంటువు). విశ్వశబ్దం 'సమస్తం, ప్రపంచం' అనే అర్థద్వయం కలది.

*విభుఃస్వయం స్వస్మిన్ విశ్వమజీజనత్:* – సర్వశక్తిమంతుడై, స్వతంత్రుడైన శ్రియఃపతి తనచేత తానే తనయందే విశ్వాన్ని సృష్టించాడు. 'స్వయం, స్వస్మిన్' అనే రెండు పదాలచేత, ప్రపంచానికి నిమిత్త కారణుడు, ఉపాదాన కారణుడు భగవానుడే అని ఉభయవిధ కారణత్వం చెప్పబడింది.

(భగవానునికి నిమిత్తత్వం, ఉపాదానత్వం అనే ఉభయకారణత్వం వేదాన్త శాస్త్రమందు చెప్పబడింది. లోకమందు ఈ రెండు కారణాలు ఒకే వస్తువునందు ఉండవు. కుండను తయారు చేసే కుమ్మరి ఆ కుండకు నిమిత్తకారణమైనవాడు. కుమ్మరి కుండకు ఉపాదానకారణం కాజాలడు. మన్ను కుండకు ఉపాదాన కారణం. మట్టియే కుండ రూపంగా మారింది. మృద్వికారమే ఘటం కదా!

వికరించే మట్టి ఉపాదాన కారణం). కాబట్టి, పురుషోత్తముడే జగన్నిర్మాతయని సిద్ధిస్తున్నది.

*"ఇత్థం విచిన్త్యాః సర్వత్ర భావాః సంతి పదే పదే।*
*కవితార్కిక సింహస్య కావ్యేషు లలితే ష్వపి॥"*

'కవితార్కిక సింహ' బిరుదుగల దేశికులయొక్క కావ్యాలు లలితాలే అయిననూ, వాటిలో అంతట ప్రతిపదమందు ఈ రీతిగా ఆలోచించ దగిన భావాలు ఉంటాయి- అని ఈ కావ్య వ్యాఖ్యాతయైన అప్పయ దీక్షితులు దేశికులను ప్రశంసించారు- ఈ వ్యాఖ్యానమందు. అంతే కాదు-

*"తథాపి విస్తరాపత్తేః నైవ మగ్రే ప్రపంచ్యతే।*
*కావ్యవ్యాఖ్యాకృతాం రీతిః ప్రాచామేవానుగమ్యతే॥"*

భావపౌష్కల్యంగల పదజాలమున్నప్పటికీ ఇకముందు విస్తరించి చెప్పబడదు. కావ్యాలకు వ్యాఖ్యానం వ్రాసిన ప్రాచీనుల మార్గమే అనుమింపబడు నని విశదం చేశారు. సాభిప్రాయ విశేషణాలున్నందువల్ల పరికరాలంకారం. విశేష్య సాభిప్రాయత్వం పరికరాంకురాలంకారం. క్రీడకు తూలికత్వారోపం చేత రూపకాలంకారం. కృపారూషితకు రాగద్రవ్యత్వారోపం వల్ల ఏకదేశ వృత్తి రూపకాలంకారం. రూపకోత్థాపితమైన చిత్ర శబ్దమందు శ్లిష్టరూపకం. కాబట్టి, సంకరాలంకారమీ శ్లోకం.

*10. జగదాహ్లాదనో జజ్ఞే మనసస్తస్య చంద్రమాః।*
*పరిపాలయితవ్యేషు ప్రసాద ఇవ మూర్తిమాన్॥* 10

అర్థం: తస్య= ఆ పురుషోత్తముని యొక్క; మనసః= మనస్సు నుంచి; జగత్+ఆహ్లాదనః= లోకాలను ఆహ్లాదింపజేయునట్టి; చంద్రమాః= చంద్రుడు; పరిపాలయితవ్యేషు= రక్షింపదగిన వారియందు; మూర్తిమాన్= రూపం కలిగియున్న; ప్రసాదః, ఇవ= అనుగ్రహమో అన్నట్లు; జజ్ఞే= జనించెను.

**తా॥** పురుషోత్తమ భగవానుని యొక్క మనస్సునుంచి జగత్తును ఆహ్లాద పరచే చంద్రుడు, కాపాడదగినవారి విషయమై మూర్తీ భవించిన అనుగ్రహమన్నట్లు ఉదయించాడు.

**వ్యాఖ్య:-** యదువంశం సంక్షేపంగా వర్ణింపబడుతున్నది.

జగన్నిర్మాతయైన పురుషోత్తముని మనస్సునుంచి లోకాలను ఆహ్లాదపరచే చంద్రుడు ఉద్భవించాడు. *"యథాప్రహ్లాదనాత్ చంద్రః"*- ఆహ్లాదింపజేసేవాడు కాబట్టి 'చంద్రుడు' అని ప్రఖ్యాతిని పొందినాడు అని రఘువంశమందు కాళిదాస సూక్తి.

*'చది- ఆహ్లాదనే'- చందయతీతిచంద్రః:* - సంతోషపరచేది అని అర్థం. చంద్రం అంటే కర్పూరం. చంద్రేణ మీయతే ఇతి 'చంద్రమాః' కర్పూరంతో పోల్చబడేవాడు అనే వ్యుత్పత్త్యర్థం కలది 'చంద్రమస్' శబ్దం ('చంద్రమాః'- సకారాంతః పుంలింగః, ప్రథమావిభక్త్యేకవచనాంతః). శ్రీవిష్ణు పురాణాదుల యందు చంద్రవంశోపక్రమంలో 'చంద్రుడు' అత్రి పుత్రుడని చెప్పబడింది. అయినా, చంద్రవంశ్యులైన రాజుల ఆభిజాత్యం యొక్క అతిశయాన్ని జ్ఞాపకం చేయడానికి ఇక్కడ కవికేసరి 'చంద్రమామనసోజాతః' అనే పురుష సూక్త ప్రక్రియను అనుసరించాడు.

యథార్థంగా, చంద్రమండల దేవత భగవానుని మనస్సునుంచి జనించింది. మండలం మాత్రం అత్రి నుంచి ప్రభవించిందనే విభాగం వివక్షితమై యుండవచ్చు నని పరిశీలకుల అభిప్రాయం. అయినా, కాలభేదం చేత చంద్రజననం ఉభయత్ర సంభవమే కాబట్టి విరోధమని శంకింపరాదు.

*"తత్తత్కల్పాంత వృత్తాంత మధికృత్య మహర్షిభిః।*
*తాని తాని ప్రణీతాని విద్వాంస్తత్ర నముహ్యతి॥"* (వాయవీయోక్తి)

ఆయా కల్పాలలో జరిగిన వృత్తాంతాన్ని బట్టి మహర్షులు చెప్పినందువల్ల, విద్వాంసుడు భ్రమపడడు అని వాయు పురాణ వచనం.

పరిపాలయితవ్యేషు ప్రసాద ఇవమూర్తిమాన్:- పరిపాలింపదగిన వారి విషయమై చంద్రుడు భగవానుని మనస్సు నుంచి ఆకృతిని దాల్చిన కృతజ్ఞత మొదలైన గుణ సముదాయ మన్నట్లు పుట్టినాడు.

*"కృతజ్ఞతోప కర్తృత్వం భయోదోషానభిజ్ఞతా।*
*ఏషః ప్రసాదశ్చిత్తానాం లక్షణజ్ఞైరుదాహృతః॥"* (శారదా తనయుడు)

చేసిన మేలును మరువక సర్వదా స్మరించడం, ఉపకారం చేసే భావం, దోషాలను గుర్తెరుగక వర్తించడం- ఇవి చిత్తప్రసాద లక్షణమని శాస్త్రజ్ఞులు నిర్వచించారు.

చంద్రునికి జగదాహ్లాదనత్వాది నిమిత్తంగా భగవంతుని మనః ప్రసాద తాదాత్మ్యాన్ని సంభావించడం వల్ల ఉత్ప్రేక్షాలంకారం.

*11. యదపత్య సముద్భూతః పుణ్యకీర్తిః పురూరవాః।*
*సతామాహిత వహ్నీనాం విహార స్థేయతాం యయౌ॥* 11

**అర్థం:** యత్+అపత్య, సముద్భూతః= ఏ చంద్రునియొక్క సంతానమైన బుధుని నుంచి ఉద్భవించిన; పుణ్యకీర్తిః= పుణ్యకరమైన కీర్తి కలిగిన; పురూరవాః= పురూరవుడు; ఆహిత వహ్నీనాం= ఆహితాగ్నులైన; సతాం= సత్పురుషులకు; విహార స్థేయతాం= విహారమందు, వివాద విషయ నిర్ణేతృత్వాన్ని; యయౌ= పొందెను.

**తా॥** చంద్రునికి బుధుడు, బుధునికి పురూరవుడు ఉద్భవించాడు. పురూరవుడు పుణ్యకరమైన కీర్తిని ఆర్జించినవాడు. ఆహితాగ్నులైన సత్పురుషులకు ముందు కలుగబోయే పరలోక విహార విషయమై వివాదాన్ని నిర్ణయించే ధర్మాన్ని పొందినాడు.

వ్యాఖ్య:- ఈ లోకమందు పరలోకమందు భోగాలను అనుభవించిన పుణ్యకీర్తిమంతుడు పురూరవుడని వర్ణన.

*యదపత్య సముద్భూతః పుణ్యకీర్తిః పురూరవాః:* - చంద్రుని సంతానమైన బుధుని పుత్రుడు పురూరవుడు. అతడు అగ్ని త్రయాన్ని మథించి వేద విధి విహితంగా హోమం చేశాడు. పుణ్యకర్మల నాచరించిన కీర్తిచేత ప్రఖ్యాతిని పొందినవాడు. పుణ్యశబ్దం పుణ్యకరవాచి.

*సతామాహిత వహ్నీనాం విహారస్థేయతాం యయౌ:* - అగ్నిమథనం చేసి, ఆ యగ్నిచేతనే అనేక యజ్ఞాలను చేశాడు. ఈ లోక మందు ఊర్వశితో భోగమనుభవించాడు. బహువిధ యజ్ఞాలను చేసి ఊర్వశితో కూడా గంధర్వలోకాన్ని పొంది ఆమెతో అక్కడ కూడా భోగాలను అనుభవించి ఎడబాయకుండా, ఊర్వశీ సాలోక్య ఫలాన్ని పొందినవాడు పురూరవుడు.

మొదట అగ్ని ఒక్కటే ఉండింది. మన్వంతరకాలమందు ఐలునిచేత-పురూరవునిచేత మూడు విధాలుగా ప్రవర్తింపబడింది.

1) *గార్హపత్యం:* - యజమానునిచేత ఇతరాగ్నులకంటె ముందే సంస్కరింపబడిన అగ్ని.

2) *దక్షిణాగ్ని:* - వేదికి దక్షిణమైన అగ్ని.

3) *ఆహవనీయాగ్ని:* - ఆ కర్మ సమాప్తేః హోతవ్యః ఆహవనీయః క్రియా. పరిసమాప్తి పర్యంతం హోమం చేయదగిన అగ్ని ఆహవనీయం.

*"అగ్నిత్రయమిదం త్రేతా"*- (అమరం). త్రాణం త్రా, సదా త్రాం రక్షణం ఇతా ప్రాప్తా= త్రేతాం. ఎల్లప్పుడు రక్షణ పొందియుండేది అని అర్థం. శ్రౌతాగ్నిత్రయం ఒక్కమాటచే 'త్రేత' అనబడుతుంది.

*విహార స్థేయతాం:* - 'విహార' శబ్దానికి ఇక్కడ కాలాంతరమందు జరుగబోయే 'పరలోక విహార' మని అర్థం.

"స్థేయోవివాద విషయ నిర్ణేతరి, పురోహితే" (విశ్వనిఘంటువు). ఆహవనీయాది రూపంగా అగ్నులను విభజించి సమంత్రకంగా హోమం చేసిన పుణ్యకర్మరుడు. అందువల్ల ఆహవనీయాగ్నులైన సజ్జనులకు, కర్మలకు చెప్పబడిన ఫలం లభిస్తుందా? ఫలం లభించదా? అనే వివాదమేర్పడగా, ఫలం లభిస్తుంది అనే నిర్ణయానికి ప్రమాణంగా నిల్చినవాడు పురూరవుడు. అలాగే అగ్నిత్రయాన్ని కల్పించడమందు కూడా పురూరవుడే ప్రమాణభూతుడని సారార్థం. ఇది మీమాంసా శాస్త్రీయమైన కవితయే కాక ఐతిహాసిక మని కూడా స్పష్టమవుతున్నది.

అస్థేయమందు స్థేయత్వాన్ని ఆరోపించడం వల్ల రూపకాలంకారం.

*12. సమవర్ధత తద్వంశః ఉపర్యుపరి పర్వభిః।*
*యశోముక్తా ఫలైర్యస్య దిశోదశ విభూషితాః॥* 12

**అర్థం:** తద్వంశః= ఆ చంద్రుని వంశం అనే వెదురుచెట్టు; ఉపరి+ఉపరి= పైపైన ఉన్న; పర్వభిః= కాండముల (కణపుల) చేత; సమవర్ధత= బాగా వృద్ధిని బొందెను; యస్య= ఆ వంశం యొక్క; యశో ముక్తాఫలైః= కీర్తులు అనే ముత్యాలచేత; దశ, దిశః= పది దిక్కులు; విభూషితాః= అలంకరింపబడినవి.

**తా॥** ఆ చంద్రుని వంశ వృక్షం ఉత్తరోత్తర పర్వాలచేత బాగా పెరిగినది. ఆ వంశం యొక్క యశస్సులు అనే వంశతరువు యొక్క ముక్తాఫలాలచే దశదిశలు అలంకరింపబడినాయి.

**వ్యాఖ్య:-** చంద్రుని వంశం, తర్వాత జన్మించిన రాజుల కీర్తి పది దిక్కుల ప్రసరించి, బాగా వృద్ధిబొందిందని సుశ్లోకితం.

చంద్రుని వంశంలో ఉద్భవించిన రాజులు కీర్తిమంతులు. 'వంశ' శబ్దానికి కులమనీ, వెదురుచెట్టు అనీ రెండు అర్థాలు ఉన్నాయి. "ద్వౌవంశౌకుల మస్కరౌ"- (అమరం) 'వంశం' శ్లిష్టపదం. "శతపర్వా యవఫలో వేణు మస్కర తేజనాః"- (అమరం) వెదురు పేర్లు. వెదురు చెట్టుకు, అనేక కాండములు-కణుపులు ఉంటాయి. కాబట్టి, 'శతపర్వ' అని పేరు.

వంశవృక్షం మీద మీద పర్వాలచేత పచ్చగా పెరుగుతుంది. అలాగే, చంద్రవంశంలో పురూరవునికి ఆయువు, ఆయువుకు నహుషుడు ఈ ప్రకారం ఉత్తరోత్తరంగా ఉదయించిన రాజులు చెట్టుకున్న పర్వాలుగా అధ్యవసింపబడినారు.

యశోముక్తాఫలైః:- ఆ వంశమందు ఉద్భవించిన రాజులు ఆణిముత్యాల వంటి తెల్లని, శుభ్రమైన యశస్సులను ఆర్జించారు. ముత్యాల కాంతులు పలుదెసల వ్యాపించే విధంగా ఆ రాజుల కీర్తులు దశదిశలను అలంకరించాయని చమత్కృతి. వెదురుచెట్టు కణపుల్లో నుంచి ముత్యాలు పుట్టుతాయని శాస్త్ర ప్రమాణం ఉన్నది (యవలవంటి బియ్యంగింజలు కలిగి ఉండడంవల్ల వెదురుచెట్టును 'యవఫలః' అని నిఘంటువు పేర్కొన్నది కదా!

*"జీమూత కరిమత్స్యా (ద్రి) హి వంశశంఖ వరాహజాః।*
*శుక్త్యుద్భవాశ్చ విజ్ఞేయా అష్టౌ మౌక్తిక యోనయః॥"*

మేఘం, ఏనుగు, చేప, పర్వతం లేదా పాము, వెదురు, శంఖం, వరాహం- ఇవి ముత్యాలు పుట్టే స్థలాలు (కవి సమయం). ("ముచ్యతే శుక్తి సంపుటాత్ ఇతి ముక్తా" ముత్తెపు చిప్పనుంచి విడువబడేది ముత్యం).

ఉత్తర వాక్యార్థమందున్న (యస్య) యచ్ఛబ్దం, పూర్వవాక్యార్థమందున్న (తద్వంశః) తచ్ఛబ్దాన్ని అపేక్షించకుండా, పూర్వవాక్యంతో అన్వయిస్తుందని 'కావ్యప్రకాశిక' యందు చెప్పబడినవిధంగా ఈ శ్లోకంలో ఆ పదాలు ప్రయోగింపబడినవని వ్యాఖ్యాత అన్నాడు.

యశోముక్తాఫలమన్నచోట రూపక సమాసం. 'వంశం' శ్లిష్టశబ్దం. కాబట్టి, ఈ శ్లోకమందు శ్లిష్ట శబ్ద నిబంధన పరంపరిత రూపకాలంకార లక్షణమున్నది.

*13. బభూవ నహుషస్తస్మిన్ ఐరావత ఇవాంబుధౌ।*
*యమింద్ర విగమే దేవాః పదే తస్యన్య వీ విశన్॥* 13

**అర్థం:** తస్మిన్= ఆ వంశమందు; అంబుధౌ= సముద్రమందు; ఐరావతః, ఇవ= ఐరావత గజంవలె; నహుషః= నహుషుడు; బభూవ= ఉదయించెను; యం= ఆ నహుషుణ్ణి; ఇంద్రవిగమే= ఇంద్రుడు తొలగిపోగా; తస్య= ఆ ఇంద్రుని యొక్క; పదే= స్థానమందు; దేవాః= అగ్ని మొదలైన దేవతలు; న్యవీవిశన్= ప్రవేశింపజేశారు.

**తా॥** ఆ చంద్రవంశమందు నహుషుడు సముద్రమందు ఉద్భవించిన ఐరావత గజంలాగా ప్రకాశించాడు. ఇంద్రుడు తొలగిపోగా అగ్న్యాది దేవతలు నహుషుణ్ణి ఆ ఇంద్ర పదవియందు అధిష్ఠింపజేశారు.

**వ్యాఖ్య:-** దేవతలచేత నహుషుడు ఇంద్రపదవియందు పట్టాభిషిక్తుడని వర్ణితం.

చంద్రవంశమందు నహుషుడు ఐరావత గజంలాగా ప్రకాశించాడు. ఐరావతం సముద్రమందు ఉద్భవించింది. అయినా, ఇంద్రునిచే ఐరావతం తన వాహనంగా స్వీకరింపబడింది. గజానికి మదం బట్టడం. స్వాభావికమని సూచితం. చంద్రవంశాబ్ధి యందు ఉదయించిన నహుషుడు రాజ్యమేలుతూ నూరు యజ్ఞాలను చేశాడు. ఒకప్పుడు త్వష్ట కుమారుడైన వృత్రాసురుణ్ని సంహరించినందువల్ల ఇంద్రునికి బ్రహ్మాహత్యా దోషం కలిగింది. దాని ప్రభావంచేత ఇంద్రుడు తన ఇంద్ర పదవి నుంచి తొలగిపోయి, ఎక్కడో నిలీనుడయ్యాడు.

అగ్ని మొదలైన దేవతలు నూరు యజ్ఞాలను చేసినవాడే ఇంద్రపదవికి అర్హుడని భూలోకమందు రాజ్యమేలుతున్న ప్రభువైన నహుషుణ్ణి ఎన్నుకొని ఇంద్రపదవి యందు అధిష్ఠింపజేసి, అతనికి పట్టాభిషేకం చేశారు.

నహుషుణ్ణి ఐరావతంతో పోల్చడంవల్ల ఉపమాలంకారం. 'ఇంద్రవిగమే' అనే సమాసమందు గుణభూతుడైన ఇంద్రునినే 'తస్య' అనే సర్వనామం చేత పరామర్శించడం, వామనుడు చెప్పిన "సర్వనామ్నాను సంధిః వృత్తిచ్ఛన్నస్య" అనే లక్షణ వాక్యంచేత, యుక్తమే అని సమర్థింపబడుతున్నది.

*14. నరేంద్రాః పృథివీ చక్రే నామ చిహ్నైరలంకృతాః।*
*జంగమాస్తస్య వీరస్య జయస్తంభా ఇవాభవన్॥* 14

**అర్థం:** వీరస్య= వీరుడైన; తస్య= ఆ నహుషుని యొక్క; నామ చిహ్నైః= ఆయన పేరుతోనూ, చిహ్నాలచేతనూ; అలంకృతాః= అలంకరింపబడిన; నరేంద్రాః = శత్రురాజులు; పృథివీ చక్రే= భూమండలమందు; జంగమాః= నడయాడే; జయస్తంభాః, ఇవ= జయస్తంభాలవలె; అభవన్= ఉండినారు.

**తా॥** నహుషుడు వీరుడు. మిగత రాజులందరు నహుషుని పేరు పెట్టుకొని, అతనిచే జయింపబడిన లక్షణాలతో శోభించినవారే. కాబట్టి, భూమండలంలో ఆ రాజులు సంచరించే జయస్తంభాల లాగా ప్రకాశించారు.

**వ్యాఖ్య:-** నహుషుడు శత్రురాజులను జయించిన వీరుడని వర్ణితం.

నహుషుడనే మహారాజు గొప్పవీరుడు. భూమండలమందున్న రాజులు కొందఱు అతణ్ణి ఆశ్రయించి, ఆయన పేరు పెట్టుకొని జీవించారు. మరికొందఱు నహుషునిచేత జయింపబడిన చిహ్నాలతో సంచరిస్తూ శోభించారు. "పృథివీ చక్రం" అంటే భూమండలమని అర్థం.

*"చక్రే సైన్యే జలావర్తే రథాంగే చయరాష్ట్రయోః।*
*సంసారే మండలే వృత్తే ఛిద్ర భేదాస్త్ర భేదయోః॥"*

– (వైజయంతీ నిఘంటువు)

*నరేంద్రాః జంగమాః జయస్తంభా ఇవాభవన్:-* వీరుడైన రాజు శత్రుదేశాలను ఆక్రమించి యుద్ధంచేసి రాజులను గెల్చిన వెంటనే ఆయా ప్రదేశాల సరిహద్దు భూములయందు జయస్తంభాలను నిల్పుతాడు. ఈ దేశాన్ని ముట్టడించిన పలానా- అముక రాజుచే ఈ దేశప్రభువు ఓడింపబడినందువల్ల, ఈనాడు (తేది వ్రాసి) జయస్తంభం నాటబడింది అని జయశీలుడైన రాజును పొగడుతుండే జయస్తంభాలు భూమండలంలో స్థిరంగా వెలసి ఉంటాయి.

జయస్తంభాలమీద ఉండే చిహ్నాలవంటి నామ చిహ్నాలచే శోభించే రాజులు భూమండలమందు సంచరిస్తుంటారు కాబట్టి ఈ రాజులు జంగమ జయస్తంభాలు అని 'స్వరూపోత్ప్రేక్ష'గా చమత్కరింపబడినారు.

*15. శక్తి రప్రతిఘాతస్య శాత్రవైరపి తుష్టువే।*
*యథావత్ సాధకస్యేవ యావదర్థా సరస్వతీ॥* 15

**అర్థం:** తస్య= ఆ నహుషుని యొక్క; అప్రతిఘా= హింసలేని (హింసింప బడని); శక్తిః= బలం; శాత్రవైః, అపి= పగతుర చేతనూ; యథావత్= బాగుగా; సాధకస్య= సాధకుని యొక్క; యావత్+అర్థా= ప్రయోజన పర్యంతం ప్రతిపాదించే (అప్రతిఘా= కోపంలేని); సరస్వతీ, ఇవ= వాక్కువలె; తుష్టువే= స్తుతింపబడింది.

**తా॥** నహుషుని అప్రతిఘయైన శక్తి శత్రువులచేత బాగా సాధించే వ్యక్తియొక్క సాధింపదగిన కార్యాన్ని ప్రతిపాదించే కోపంలేని వాదంలాగా స్తుతింప బడింది.

**వ్యాఖ్య:-** శత్రురాజులు కూడా నహుషుని శక్తిని ప్రశంసించేవారని వర్ణితం.

నహుషుని శక్తి అప్రతిఘయైనది. ఎదురులేని బలమన్నమాట. జయించ గోరేవాడు ఎదిరిస్తాడు. శక్తిలేని శత్రువైతే "శేషంకోపేన పూరయేత్" అన్నట్లు కోపంతో ఉంటాడు కదా!

"ప్రతిఘౌ రుట్ ప్రతీఘాతౌ"- (వైజయంతి) 'ప్రతిఘ' శబ్దానికి కోపం, హింస అని అర్థద్వయం. హింసారహితమని శక్తిపరమైన అర్థం. కోపరహితమైనదని సరస్వతీ పరమైన అర్థం.

ఒక సాధకుడు తన మతాన్ని- ఇష్టమైన విషయాన్ని- స్థాపించడానికి వాదిస్తుంటాడు. తన ఉపన్యాసమందు పరపక్షానికి నిగ్రహం కలుగకుండా ప్రతిపాదించదగిన అర్థాన్ని సంపూర్ణంగా ప్రతిపాదిస్తాడు. ఆయన మాటల్లో పారుష్యంగానీ, కోపంగానీ ప్రకటితం కాకుండా ప్రసంగిస్తాడు. అనుగ్రహ పూర్ణమైన

ఆ సాధకుని సరస్వతిని- వాగ్విలాసాన్ని- స్ఫుటంగా పొగడలేని ప్రతివాదులు కూడా విన్న తరువాత పొగడకుండా ఊరక ఉండజాలరు.

సాధకుని అప్రతిఘయైన సరస్వతి ప్రతివాదుల చేతనూ స్తుతింపబడినట్లే, నహుషుని అప్రతిఘుయైన శక్తి శత్రురాజులచేతనూ స్తుతింపబడింది. ఉపమాలంకారం.

16. వీరో రస ఇవోత్సాహాన్నహుషాదభ్య జాయత।
యయాతిర్నామ యే నైంద్ర మర్ధాసన మధిష్ఠితమ్॥ 16

**అర్థం:** నహుషాత్= నహుషునివల్ల; యయాతిః, నామ= యయాతి అనే ప్రసిద్ధుడు; ఉత్సాహాత్= ఉత్సాహంవల్ల; వీరః, రసః, ఇవ= వీరమనే రసంవలె; అభ్యజాయత= జన్మించెను; యేన= ఆ యయాతిచేత; ఐంద్రం= ఇంద్రసంబంధమైన; అర్ధ+ఆసనం= సింహాసనం యొక్క సగ భాగము; అధిష్ఠితమ్= అధిష్ఠింపబడింది.

**తా॥** నహుషుని నుంచి యయాతి అనే ప్రసిద్ధ పురుషుడు, ఉత్సాహం నుంచి వీరరసంలాగా ఉత్పన్నమయ్యాడు. ఆ యయాతి మహారాజు ఇంద్రుని అర్ధసింహాసనమందు చిరకాలం కూర్చున్నాడు.

**వ్యాఖ్య:-** యయాతి జన్మకు నహుషుడు కారణభూతుడు అని వర్ణితం.

ఉత్సాహం నుంచి వీరరసముద్భవించినట్లు, నహుషుని నుంచి యయాతి జన్మించాడు. నామ శబ్దం ప్రసిద్ధిని ప్రభావాన్ని తెల్పుతుంది. "నామ ప్రభావే సంభావ్యే"- (రత్నమాల).

"ఉత్సాహ వర్ధనోవీరః"- (అమరం) ఉత్సాహమనేది స్థాయి భావం. భావమంటే మనోవికారం. ఉత్సాహమనే స్థాయి భావంచేత వృద్ధిని పొందేది వీర రసం. "భావోత్కర్షోరసః స్మృతః"- భావంచేత అతిశయించేది రసం. వీర రసానికి స్థాయి భావం ఉత్సాహం. స్థాయిభావమైన ఉత్సాహం కారణం. వీరరసం కార్యం. రసానికి స్థాయి భావానికి కార్యకారణ భావముంది. ఇంద్రునితో కూడి

అర్ధాసనమందు యయాతి కూర్చున్నాడు. యయాతి ఇంద్రుని యొక్క అర్ధసింహాసనమందు చాలకాలం ఉపవిష్టుడు. ఆసనస్య అర్ధం= అర్ధాసనం (అర్ధం- నపుంసకం) ఉపమాలంకార సజ్జిత మీ శ్లోకం.

*17. విశాల విపులోత్తుంగే యద్బాహు శిఖరాంతరే।*
*ఆసీ ద్వీర శ్రియా సార్ధం భూమి రర్ధాసనేస్థితా (రా)॥* 17

**అర్థం:** విశాల విపుల+ఉత్తుంగే= వెడల్పు, విస్తారం, ఎత్తు కలిగినట్టి; యత్+బాహుశిఖర+అంతరే= యయాతి యొక్క మూపునందు; వీర (శ్రియా, సార్ధం= శౌర్యలక్ష్మితోపాటు; భూమిః= భూమి; అర్ధ+ఆసనే= అర్ధాసనమందు; స్థితా= ఉన్నది (స్థిరా= స్థిరంగా; ఆసీత్= ఉండెను).

**తా॥** విశాలమైన, విపులమైన, ఉన్నతమైన యయాతి భుజస్కంధమందు వీరలక్ష్మితోపాటు భూమి అర్ధాసనమందు ఆసీనయై యున్నది.

**వ్యాఖ్య:-** యయాతి భుజశిఖరమందు వీరలక్ష్మి, భూమి విశ్రాంతిగా ఉన్నాయని సుశ్లోకితం.

యయాతి భుజస్కంధం విశాలమైనది, విపులమైనది, ఉత్తుంగమైనది. "విపులం పృధులే భావే మేరు పశ్చిమ భూధరే"- (విశ్వ నిఘంటువు) "బాహు శిఖరాంతరే" అంటే భుజశిఖరాల మధ్యస్థలం- మూపు.

"స్కంధో భుజశిరోఽంసోఽ స్త్రీ"- (అమరం) "నా విష్ణుః పృథ్వీపతిః" అన్నట్లు రాజు విష్ణ్వంశ సంభూతుడు. లక్ష్మీదేవి, భూదేవి ఇద్దఱు దేవేరులు విష్ణుమూర్తిని ఆశ్రయించినట్లే, శౌర్యలక్ష్మి, భూమి కూడా యయాతి భుజస్కంధం మీద విశ్రాంతి చెందుతున్నారు. ధనధాన్యసమృద్ధిగా భూమండలమందు యయాతి మహారాజు ప్రజలకు సుఖశాంతులు కలుగునట్లు రాజ్యమేలినాడని ప్రశంసించిన శ్లోకమిది.

పద్మా, భూదేవతలిద్దఱు రఘుమహారాజును సేవించారన్న కాళిదాస సూక్తి స్మారితం.

*18. నిదేశం తస్యరాజానో నశేకురతి వర్తితుమ్।*
*ప్రాప్త స్వపరనిర్వాహం ప్రమాణ మివ వాదినః॥* 18

**అర్థం:** తస్య= ఆ యయాతి యొక్క; నిదేశం= ఆజ్ఞను; అతివర్తితుం= ఉల్లంఘించడానికి; రాజానః= శత్రురాజులు; ప్రాప్త స్వపర నిర్వాహం= పొందబడిన తన, పరుల కార్య నిర్వాహంగల; ప్రమాణం= ప్రమాణాన్ని; వాదినః, ఇవ= వాది, ప్రతివాదులవలె; న, శేకుః= సమర్థులు కాక ఉండిరి.

**తా॥** యయాతి మహారాజు యొక్క ఆజ్ఞను మీరి వర్తించడానికి శత్రురాజులు, స్వపరకార్యనిర్వహణ యోగ్యమైన వేదశబ్ద ప్రమాణాన్ని వాది ప్రతివాదులవలె, శక్తిలేనివారుగా ఉండిరి.

**వ్యాఖ్య:-** యయాతి మహారాజు యొక్క శాసనాన్ని శత్రురాజులు కూడా ఉల్లంఘించక ఉండిరని వర్ణితం.

*ప్రాప్త స్వపర నిర్వాహం ప్రమాణ మివ వాదినః:-* 'ప్రమాణం' అంటే వేదం. శబ్ద ప్రమాణం వాదికిగానీ ప్రతివాదికిగానీ కార్యాన్ని సాధించేది కావడం వల్ల దాన్ని అందఱు అంగీకరిస్తారు. స్వపర భేదం లేకుండా, అర్థప్రమాపకత్వ రూపనిర్వాహంతో కూడిన వేద రూప ప్రమాణాన్ని వాది ప్రతివాదు లెవరైనా ఉల్లంఘించి ప్రవర్తించడానికి సమర్థులు కానట్లే, యయాతి యొక్క ఆజ్ఞను శత్రురాజులు కూడా మీఱి వర్తించడానికి సమర్థులు కాక ఉండిరి. రాజాజ్ఞ అనుల్లంఘనీయం. యయాతి యొక్క శాసనాన్ని సామంతరాజులూ, శత్రురాజులూ శిరసావహించి జీవించారు. ఉపమాలంకారం.

*19. తటాకమివ తాపార్తా స్తమింద్ర మివ నిర్జరాః।*
*భావా ఇవ రసం భవ్యాః పార్థివాః పర్యుపాసత॥* 19

**అర్థం:** తటాకం= జలాశయాన్ని; తాపార్తాః, ఇవ= ఎండచే బాధపడిన వ్యక్తులవలె; ఇంద్రం= దేవరాజును; నిర్జరాః, ఇవ= దేవతలవలె; రసం= శృంగారాది ప్రతిరసాన్ని; భవ్యాః= యోగ్యములైన; భావాః, ఇవ= విభావాను భావస్థాయి సంచారి భావాలవలె; తం= ఆ యయాతి మహారాజును; పార్థివాః= (శత్రు) భూపతులు; పర్యుపాసత= బాగా సేవించారు.

**తా॥** వేసవిలో సరస్సులోకి చేరి తాపం తీర్చుకొనే దాహార్తుల వలెనూ, ఇంద్రుణ్ణి కీర్తించడానికి పోయే దేవతలవలెనూ, శృంగారం మొదలైన ఒక్కొక్క రసాన్ని ఉత్కర్షింపజేసే ఆయా రసాలకు యోగ్యమైన విభావానుభావ స్థాయి సంచారి భావాల లాగా, యయాతి మహారాజును శత్రురాజులు ఆశ్రయించి ఉపాసించారు.

**వ్యాఖ్య:-** యయాతి మహారాజును ఉపాసించి శత్రురాజులెల్లరు తమ కోరికలను నెరవేర్చుకొన్నారని వర్ణించే శ్లోకం.

1) గ్రీష్మర్తువులో ప్రచండ మార్తాండుని తీక్షణ కిరణాల ఉష్ణోగ్రతకు తాళలేక దప్పిగొని దస్సిపోయిన వ్యక్తులు పెద్ద జలాశయంలోకి పోయి, నిండ మునిగి, నీరు త్రాగి తాపాన్ని ఉపశమింపజేసుకొంటారు. 'తటాక' మంటే చెరువు. "పద్మాకరస్తటాకో౽ స్త్రీ"(అమరం). 'తటాని అకతి ఇతి=తటాకః' (అక, అగ కుటిలాయాంగతౌ). గట్టులను కుటిలంగా పొందియుండేది. తామరులు ఉండే చెఱువు అని అర్థం. కొందఱు 'తడాగ' మంటారు. 'తడ-ఆఘాతే' ధాతువును బట్టి 'తడతి ఇతి= తడాగః' గట్టును కొట్టేది అని వ్యుత్పత్త్యర్థం.

2) ఇంద్రమివ నిర్జరాః– 'ఇది పరమైశ్వర్యే'– ఇందతి ఇతి= ఇంద్రః. పరమైశ్వర్య యుక్తుడు. దేవతలకు ప్రభువు.

'నిర్జరాః' ముదిమిలేనివారు. నవిద్యతే జరాయేషాంతే= నిర్జరాః. నిరస్తా జరాయైస్తే= నిర్జరాః. ఎవరిచే ముసలితనం తిరస్కరింపబడిందో వారు

నిర్జరులు. లేదా, జరాయాః నిష్క్రాంతాః= నిర్జరాః. ముదిమివలన విడువబడినవారు నిర్జరులు. దేవతలు అని అర్థం. (జ్యూష్-వయోహానౌ) "అమరా నిర్జరాదేవాః"- (అమరం) దేవేంద్రుణ్ణి కీర్తించి తమ తమ అభీష్ట సిద్ధిని పొందడానికి దేవతలు తమ ప్రభువు సన్నిధానమందు ఉండేవారు. దేవతలు ఎల్లప్పుడు 25 ఏండ్ల వయస్సులోనే ఉంటారు.

3) భావా ఇవరసం భవ్యాః:- శృంగారాది నవరసాలు దృశ్య (నాటక) కావ్యాలలో నాయికా నాయకులచేత- అంగ విక్షేపాది అభినయాలచేత ప్రదర్శింపబడి సామాజికులచేత ఆస్వాదింపబడుతాయి.

"రస్యంతే ఇతి రసాః"- ఆస్వాదింపబడేవి కాబట్టి 'రసాలు' అని భావం.

| | | |
|---|---|---|
| 1. శృంగార రసం | దీనియొక్క స్థాయీ భావం | రతి |
| 2. వీరరసం | ,, | ఉత్సాహం |
| 3. కరుణ రసం | ,, | శోకం |
| 4. అద్భుత రసం | ,, | విస్మయం |
| 5. హాస్య రసం | ,, | హాసం |
| 6. భయానక రసం | ,, | భయం |
| 7. బీభత్స రసం | ,, | జుగుప్స |
| 8. రౌద్రరసం | ,, | క్రోధం |
| 9. శాంత రసం | ,, | శమం |

విభావాలు, అనుభావాలు, సంచారి భావాలు మొదలైనవి మనో వికాసాన్ని గానీ వికారాన్ని గానీ కలిగించే చేష్టలు. ఇవి రసపోషణకు సహకరిస్తాయి. 'భవ్యాః' అంటే యోగ్యమైనవి అని అర్థం.

"భవ్యం సత్యే శుభే చాథ భేద్యవత్ యోగ్య భావినోః"- (విశ్వ నిఘంటువు). భేద్యం విశేష్యం, భేద్యంవలె- విశేష్యనిఘ్నం (విశేష్యమునకు అధీనం) అయిన

'భవ్య' పదం, యోగ్యమనే అర్థం, భావి (కా రాబోయే) అనే అర్థం కలది. ప్రతిరసానికి విభావాదులు ఉంటాయని తాత్పర్యం.

*తం (యయాతిం) పార్థివాః పర్యుపాసత:* – తటాకాన్ని తాపార్తుల వలెనూ, ఇంద్రుణ్ణి నిర్జరుల వలెనూ, రసాన్ని యోగ్యమైన భావాల లాగా, యయాతిని శత్రువులైన పార్థివులు ఉపాసించారు. శత్రువులు లేకుండా సామ్రాజ్యాన్ని పాలించిన ప్రభువు యయాతి అని సారార్థం. పృథివ్యాః ఈశ్వరః= పార్థివః. పృథివికి ప్రభువు అర్థం (పార్థివుడు).

"రాజ్ఞిరాట్ పార్థివ క్ష్మాభృన్నృప భూపమహీక్షితః"– (అమరం). ఒక్క ఉపమేయానికి అనేక ఉపమానాలను చెప్పి, (అన్నింటికి) ఉపాసన రూపమైన సాధారణ ధర్మం ఒక్కటే చెప్పబడినందువల్ల, మాలోపమాలంకృత శ్లోకమిది.

*20. యదుర్నామ తతోజజ్ఞే యత్సంతతి సముద్భవైః।*
*సమాన గణనాలేఖ్యే నిస్సమానైర్నిషద్యతే॥* 20

**అర్థం:** తతః= ఆ యయాతి వల్ల; యదుః, నామ= యదువు అనే ప్రసిద్ధుడు; జజ్ఞే= జనించెను; యత్, సంతతి, సముద్భవైః= ఏ వంశమందు ఉద్భవించిన; నిస్సమానైః= సాటిలేని రాజులచేత; సమాన గణనా= (వీరు) సమానులు అని గణించడం; ఆ లేఖ్యే= చిత్ర (పట) మందు; నిషద్యతే= పొందింపబడుతున్నది.

**తా॥** యయాతివల్ల యదువు జన్మించాడు. యదువంశోద్భవ రాజులెల్లరకు లోకంలో సమానులు ఒక్కడూ లేడు. ఒక వేళ సమాన గణనం చేయబడితే ఇతరులచేత యదువంశ సముద్భూతులైన రాజులే సాటిలేనివారుగా చిత్రఫలకం మీదే వ్రాయబడుతారు. మరొకచోట మాత్రం కాదు.

**వ్యాఖ్య:**– యదువంశరాజులు లోకంలో సాటిలేనివారని వర్ణితం.

ఈ శ్లోకంలో 'సమాన గణనాలేఖ్యే' అని ఒకే పదంగా భావించే అవకాశమున్నది యదువంశ పురుషునికీ అతనితో సమానుడైన పురుషునికీ

సామాన్యతను గణించడానికి వ్రాయబడిన చిత్రపటమందు, యదువంశ రాజులు సాటిలేనివారుగా సింహాసనోపవిష్టులై చిత్రింపబడినారు. యదువంశ పురుషుని సమీపమందు మరొక (వంశ) పురుషుడు చిత్రింపబడలేదు.

"యత్సంతతి సముద్భవైః నిషద్యతే" అని భావే ప్రయోగం. నిపూర్వక సీదధాతువుకు ఉపవేశార్థకత్వం, అకర్మకత్వం ప్రసిద్ధం.

'సమానగణనా'- అని ప్రథమాంతంగా విభజించినప్పుడు, చిత్రఫలకం మీద ఉన్న బొమ్మకు (ప్రతిమకు) మాత్రమే సమత్వమనే అర్థం వర్ణింపబడింది. ముఖ్యంగా యదువంశోద్భవ రాజులలో ప్రతిరాజు ఒక్కొక్కడూ అప్రతిముడనే అర్థం వివక్షితం. యదురాజులతో సామ్యానికి ఇతర రాజులలో సంభావ్యులైన వారికి చిత్రమందొకచోటనే నియమంగా ఉండడం వల్ల పరిసంఖ్యాలంకారం.

*21. దేహీతివదతాం ప్రాయః ప్రసీదన్ ప్రత్యువాచసః।*
*లలిత ధ్వనిభిర్లక్ష్మీ లీలాకమల షట్పదైః॥* 21

**అర్థం:** సః= ఆ యదుమహారాజు; దేహి, ఇతి= ఇవ్వుమని; వదతాం= పల్కుతున్న యాచకులకు; ప్రాయః= తరచుగా; ప్రసీదన్= మిక్కిలి సంతోషిస్తూ; లలిత ధ్వనిభిః= మంజుల ధ్వనులు గల; లక్ష్మీలీలాకమల షట్పదైః= లక్ష్మీదేవి యొక్క క్రీడాకమల మందున్న భ్రమరాలచేత; ప్రతి+ఉవాచ= మాఱుమాటాడెను.

**తా॥** ఆ యదుమహారాజు 'దేహి' అని అడుగుతున్న సమయమందే తన దానంచేత యాచకుల విషయమై సన్నిహితంగా ఉన్న లక్ష్మీదేవి యొక్క లీలాపద్మ మందున్న భృంగాల ధ్వనియే ఆయన సమాధానంగా ఉండెనని తాత్పర్యం. యాచకులకు తృప్తిని కలిగించే విధంగా ప్రత్యుత్తర మిచ్చాడని భావం.

**వ్యాఖ్య:-** యదువు యొక్క వితరణం మూడు శ్లోకాలచేత వర్ణింప బడుతున్నది.

యాచకులు యదుమహారాజును 'దేహి' అని అడిగారు. యదువు చాలా సంతోషిస్తూ సమాధాన మిచ్చాడు. యాచకులు అడిగిన సమయాననే ఆయన ఇచ్చే గొప్ప దానంచేత తృప్తిపడే విధంగా, తన సన్నిహితంగా ఉన్న లక్ష్మీదేవి విలాసంగా చేతపట్టుకొన్న కమలమందున్న భ్రమరాల మంజుల ధ్వనియే యదుమహారాజు యొక్క సమాధానంగా ఉండింది.

ఉత్తర శ్లోకం చేత ఈ సమాధానం స్పష్టపరచబడుతున్నది. ఈ శ్లోకమందు, లక్ష్మీలీలా కమల షట్పద ధ్వనులకు సంబంధం లేకున్నా, సంబంధమున్నట్లు చెప్పడం వల్ల అతిశయోక్త్యలంకారం. అతిశయోక్తి సిద్ధించిన షట్పద ధ్వనియందు ప్రతి వచనత్వారోపణం యొక్క ప్రకృతోపయోగం వల్ల పరిణామాలంకారం.

యాచకుల విషయమై ఆయన ప్రతివచన మిట్టిదే. కాని, లౌకిక ప్రతివచన విలంబం మాత్రం కాదు. కాబట్టి, ఇది పరిసంఖ్యాలంకారం.

*22. సచ వృత్త విహీనస్య నవిద్యాం బహ్వామన్యత।*
*నహిశుద్ధేతి గృహ్యేత చతుర్థీ చంద్ర చంద్రికా॥* 22

**అర్థం:** చ= ఇంక; సః= వదాన్యుడైన యదుమహారాజు; వృత్త విహీనస్య= ఆచార హీనుని యొక్క; విద్యాం= వేదాది రూపమైన విద్యను; న, బహ్వామన్యత= బహుమానించడు; చతుర్థీ చంద్ర చంద్రికా= భాద్రపద శుక్ల పక్ష చవితి నాటి చంద్రుని యొక్క వెన్నెల; శుద్ధా= విమలమైనది; ఇతి= అని; న, హి, గృహ్యేత= గ్రహింపబడదు కదా!

**తా॥** యదుమహారాజే కాదు, వదాన్యుడెవడైననూ ఆచార హీనుడైనవాని యొక్క వేదశాస్త్రాది విద్యను ఆదరించడు. భాద్రపద శుద్ధ చవితినాటి చంద్రుని చంద్రిక పరిశుద్ధమైనదని గ్రహించరానిదే కదా!

**వ్యాఖ్య:**– ఆ ప్రతివచనాన్ని విశదపరచే శ్లోకమిది.

శాస్త్ర విహితమైన వర్ణాశ్రమ ధర్మాలను అనుష్ఠించడం 'ఆచారం' అనబడును. నడవడి, నలుగురు మెచ్చే విధంగా లేనివాణ్ణి ఆచార హీనుడంటారు. యాచకులను సంస్కరించడానికి యదుమహారాజు దానమీయడానికి ముందు ఇలా చెప్పేవాడని జ్ఞాపకం చేస్తున్న 'ప్రాయః' అనే పదం పూర్వశ్లోకమందు ప్రయోగింపబడింది అన్నారు వ్యాఖ్యాతలు. ఆచార హీనుడు ఎంత గొప్ప విద్యావంతుడైనప్పటికీ దాత అతని విద్యను ఆదరించడు అని యదుమహారాజు 'దేహి' అని యాచించిన వారితో పలికేవాడు. విద్యావంతుడూ, ఆచారవంతుడూ ఈ రెండు ఉన్నవాడే దానం పొందడానికి సత్పాత్రుడని అర్థం.

*"నవిద్యయా కేవలయా తపసా వాఽపి పాత్రతా।*
*యస్య వృత్తమిమేచోభే తద్ధి పాత్రం ప్రచక్షతే॥"*

కేవలం ఒక్క విద్యచేతగానీ లేదా ఒక్క తపస్సు చేతగానీ పాత్రత- యోగ్యత ఏర్పడదు. జ్ఞానం మరియు అనుష్ఠానం (అంటే ఆచారం) ఈ రెండు కలిగి ప్రవర్తించే వ్యక్తికే 'పాత్ర' శబ్దం చెల్లుతుంది అని స్మృతి చెబుతుంది. కాబట్టి, కేవలం ఒక్క విద్యచేతనే పాత్రత కలుగదు. పాత్రత లేనందువల్ల అట్టి విద్యను ఎవడు బహుమానించడని భావం.

"ఆచార హీనం న పునంతి వేదాః"- ఇందుకు దృష్టాంతం చెప్పబడింది. భాద్రపద శుక్ల పక్ష చవితి చంద్రుని చంద్రిక ఎవనిచేతగానీ స్వచ్ఛమైనదిగా గ్రహింపబడదు కదా!

'నహి' అనేది అఖండమైన పదం కాబట్టి అది 'నఞ్' అర్థమందు వర్తిస్తుంది. "అభావే నహినో నాపి" (అమరం). 'న, హి' అని విభజిస్తే, 'హి' శబ్దం చెప్పబడిన అర్థం ప్రసిద్ధమని తెల్పుతుంది.

ఈ శ్లోకంలో 'చతుర్థీ' అనే శబ్దం భాద్రపద శుద్ధ చతుర్థిగానే చెప్పబడింది.

*"కన్యాగత చతుర్థ్యాంతు శుక్లే చంద్రస్య దర్శనమ్।*
*మిథ్యాభి దూషణం కుర్యాత్ తస్మాత్ పశ్యేన్నతంతదా॥"*

సూర్యుడు కన్యారాశియందు సంచరిస్తున్నప్పుడు శుక్లపక్షమందలి చవితి నాటి చంద్రుణ్ణి చూస్తే, లేనిపోని నింద కలుగుతుంది. కాబట్టి, ఆనాటి చంద్రుణ్ణి చూడకూడదు అని శాస్త్రం. అంటే భాద్రపద శుద్ధ చవితినాడు చంద్రదర్శనం నిషేధింపబడిందని భావం.

చంద్రికను దర్శించడం మాత్రం నిషేధింపబడలేదు, కాబట్టి ఈ శ్లోకంలోని 'చంద్రికా' అనే పదం వ్యర్థమే అనిపిస్తుంది. ఆవశ్యంగా చంద్రుని దర్శనమవుతుందనే భావంచేత, చంద్రిక-వెన్నెలలో విహరించడం కూడా తగదని చెప్పబడియుండ వచ్చును. "చతుర్థీ భాద్రచంద్రికా" అనే పాఠమూ ఉండవచ్చు.

వేదాది శాస్త్రాలు చదివినా, ఆ వేదాలే ఆచారహీనుణ్ణి పవిత్రం చేయ జాలవు. చంద్రకళ ఆహ్లాదకరమైనా, భాద్రపద శుద్ధ చవితినాటి చంద్రుణ్ణి పరిశుద్ధంగా ఉంచజాలదు.

*23. అపునః ప్రార్థనీయస్య ప్రార్థితాధిక దాయినః।*
*అర్థినః ప్రథమే తస్య చరమాన్ పర్యపూరయన్॥* 23

**అర్థం:** అపునః ప్రార్థనీయస్య= మళ్ళీ కోరతగని వాడైన; ప్రార్థిత+అధిక దాయినః= కోరబడిన దానికంటే ఎక్కువగా ఇచ్చునట్టివాడైన; తస్య= ఆ యదుమహారాజు యొక్క; ప్రథమే= మొదటి; అర్థినః= యాచకులు; చరమాన్= తర్వాతి వారిని; పర్యపూరయన్= పరిపూర్ణులను చేశారు.

**తా॥** యదుమహారాజు మళ్ళీ మళ్ళీ ప్రార్థింపదగనివాడు. యాచించిన దానికన్న అధికంగా దానం చేసేవాడు. యదువు దగ్గరికి మొదట వచ్చిన యాచకులు తర్వాత వచ్చిన యాకులను తృప్తిపరచారు.

**వ్యాఖ్య:–** యదుమహారాజు మహావదాన్యుడు అని సుశ్లోకితం.

*అపునః ప్రార్థనీయస్య:–* యాచకులు ఒక్కసారి 'దేహి' అని ప్రార్థించగానే వారి కోరికను ఫలింపజేయడంవల్ల యాచకులచే మళ్ళీ ప్రార్థింపబడే అవకాశ మీయనివాడు యదుమహారాజు.

*ప్రార్థితాధికదాయినః:–* ద్రవ్యమెంత ఇచ్చినా, యాచకులకు ఆశ పూర్తి కాదు. కాని, యదుమహారాజు యాచకుల కోరిక మేరను మించి దానం చేసే శీలం కలవాడు. కాబట్టి యదువును అర్థించిన యాచకుడు మరొకసారి వచ్చి యాచించే అవసరం లేనంత అధికంగా ద్రవ్యాన్ని ఇచ్చేవాడు. "కాంక్షాధికం వర్షతి"– కాబట్టి,–

*అర్థినః ప్రథమే తస్య చరమాన్ పర్యపూరయన్:–* త్యాగనిరతికల దాత వద్దకు యాచకులెందఱో ముందు వెనుక అనకుండా వస్తుంటారు. ఆశ్చర్య మేమిటంటే, మొదట వచ్చిన యాచకులు పొందిన ద్రవ్యం అపరిమితం కాబట్టి, వారే తర్వాత వచ్చిన యాచకులకు తమ కిష్టమైనంత తాము ఉంచుకొని మిగిలిన ద్రవ్యాన్ని ఇచ్చి, వారిని సంతోషింపజేసేవారు.

ఒక యాచకునికి మరొక యాచకుడు శత్రువుగా భావింపబడుతాడు అనే నానుడి ఉంది. కాని, ఒక యాచకుడు మరొక యాచకునికి తృప్తి కలుగునంత ద్రవ్యాన్ని ఇచ్చి 'దాత' అనిపించుకోవడం వింతయే కదా! యదుమహారాజు సన్నిధిలో యాచకుడు వచ్చి 'దేహి' అని యాచించడం అదే మొదటిసారిగా, చివరిసారిగా ఉండదగినంత ద్రవ్యాన్ని ఆ రాజు ఇచ్చాడంటే అతడెంత గొప్ప దాతయో! అని ప్రశంసించదగిన విషయమే కదా!

*24. శరాణాం శాత్రవాణాంచ సంధానేన మహౌజసః।*
*తస్యనిర్ధూత లక్షేణ ద్విః క్వచి న్నాప్య భూయత॥* 24

**అర్థం:** మహా+ఓజసః= గొప్పబలం గల; తస్య= ఆ యదుమహారాజు యొక్క నిర్ధూత లక్షేణ= గురిపెట్టబడని/ కపటంలేని; శరాణాం= బాణాల యొక్క; శాత్రవాణాం=

పగతుర యొక్క; సంధానేన= సంధానం చేత; క్వచిత్, అపి= ఎప్పుడు కూడా; ద్విః= రెండుసార్లు; న, అభూయత= కాలేదు.

**తా॥** మహాబలంగల యదుమహారాజుకు లక్ష్యభేదం కోసం శరసంధానం రెండు పర్యాయాలు చేయనవసరం లేకుండెను. అలాగే శత్రురాజులతో నిష్కపటమైన సంధానం ఎప్పుడైనా రెండుసార్లు చేయబడలేదు.

**వ్యాఖ్య:-** యదుమహారాజు గొప్పబలం కలవాడని వర్ణితం.

కీర్తిని పొందడానికి రెండు పద్ధతులున్నాయి: 1) త్యాగ నిరతులై దానం చేయడం వల్ల కీర్తిమంతులవుతారు. 2) చతురంగ బలం బాగా కలిగియుండడం వల్లనూ యశోవంతులవుతారు.

యదుమహారాజు యొక్క దానశీలం మూడుశ్లోకాలచే వర్ణింపబడింది కదా! ఇక రెండవ పద్ధతి ఇప్పుడు చెప్పబడుతున్నది

మహౌజాః:- యదుమహారాజు మహాబలవంతుడు. రాజులకు రథగజ తురగ పదాతి చతురంగ బలం సుశిక్షితమై యున్నదైతే, శత్రురాజులు కన్నెత్తి చూడజాలని గొప్ప బలం కలవారని పేరు వస్తుంది. 'మహౌజస్' శబ్దం యొక్క షష్ఠీ విభక్త్యేక వచనమే 'మహౌజసః' అనే పదం 'తస్య' అనే పదానికి విశేషణం.

*"ఓజో బలేచ దీప్తౌచ"*- (విశ్వ నిఘంటువు). *తస్య నిర్ధూత లక్షేణ శరాణాం శాత్ర వాణాంచ సంధానేన క్వచిదపి ద్విః నా భూయత*- 'లక్ష' శబ్దానికి 'గురి' అనీ 'కపట'మనీ రెండు అర్థాలున్నాయి. శ్లిష్టపదమిది.

"లక్షం శరవ్యే సంఖ్యాయాం లక్షం ఛద్మని కథ్యతే"- (ప్రకాశ నిఘంటువు) యదుమహారాజు ధనుస్సుమీద బాణాలను సంధించడం మొదట ఒక్కసారి చేయడం వల్లనే లక్ష్యాన్ని భేదించడం జరిగింది. ఒక్కొక్క గురికోసం ఒక్కొక్క బాణాన్ని సంధించడం వల్ల 'శరాణాం' అని బహువచనం ప్రయోగింపబడింది. మొదటనే లక్ష్య భేదంకోసం శరసంధానం చేయబడింది కాబట్టి రెండవసారి శరసంధానం చేయబడలేదని భావం.

యదువుకు సంధిని కోరే శత్రువుల విషయమై శరసంధానం చేయడం కపటం లేనిది. మొదట బాధించే నెపంతో శత్రువుల విశ్వాసాన్ని పొందాలనే భావమే లేకుండింది. ఎదిరించే శత్రువులపై శరసంధానం చేసి, రెండవసారి శరసంధానం చేయకపోవడం వల్ల, మొదటిసారే శత్రువులు అందఱు యదుమహారాజుకు లోబడి ప్రవర్తించారు. ఒక్కసారే శరసంధానమూ, శత్రురాజు లందఱు సంధిచేసుకొని యదుమహారాజు శాసనాన్ని మీరకుండా వర్తించడమనేది ఒక్కసారే జరిగింది. రెండుసార్లు ఎప్పుడూ జరుగలేదు. ఈ సంధానం నిష్కపటమైనది. అవ్యాజమైనది.

*ద్విః క్వచిత్ నా భూయత:*- రెండు సార్లు ఎప్పుడూ సంభవించలేదు. అంటే సరిపోతుంది. 'అపి' అనే పదం లేకున్నా అర్థం చెడదు. అయినా "అభావే నహినో నాపి" అనే అమరకోశం వల్ల 'నాపి' అనే పదం ఒక్కటే; అది అవ్యయం. కాబట్టి 'ఎప్పుడు కూడా' రెండుసార్లు యదుమహారాజు శరశాత్రవ సంధానం చేయడం జరుగలేదు అని యదువు 'మహౌజస్కు'డని శాశ్వత కీర్తిని సంపాదించిన వాడుగా ప్రకాశించాడు, ప్రశంసితుడయ్యాడు.

ఒక నీతిబద్ధ శ్లోకమూ గమనీయమే.

*"ద్విః శరం నాభిసంధత్తే, ద్విః స్థాపయతి నాశ్రితమ్।*
*నద్విర్దదాతి చార్థిభ్యః రామోద్వి ర్నాభిభాషతే॥"*

రాజ సంబంధమైన దగుటచేత ప్రస్తుత శరశాత్రవ సంధానాలకు ఏక క్రియాన్వయరూపమైన తుల్యయోగితాలంకారమిది. అది కూడా లక్ష శబ్దంచేత శ్లేషానుప్రాణితమైన సంకరాలంకారం.

*25. యుక్త దండ మమిత్రాణాం కృతాన్తం సమవర్తినమ్।*
*దక్షిణం లోకపాలం తమ మన్యంత దివౌకసః॥* 25

**అర్థం:** దివౌకసః= దేవతలు; యుక్తదండం= నేరానికి తగినట్లు శిక్షించునట్టి; అమిత్రాణాం= శత్రువులను; కృత+అంతం= నశింపజేయునట్టి; సమవర్తినం= సమానంగా మెలగునట్టి; దక్షిణం= సమర్థుడైనట్టి; లోకపాలం= మర్త్యలోకాన్ని పాలించే ప్రభువుగానూ; తం= ఆ యదుమహారాజును; అమన్యంత= బహుమానించారు; యుక్తదండం= తగిన దండం అనే ఆయుధాన్ని కలిగినట్టి; కృతాంతం= అంతం చేసే స్వభావం కలిగినట్టి; సమవర్తినం= పక్షపాతం లేకుండా ప్రవర్తించునట్టి; దక్షిణం= దక్షిణ దిక్కు ఉన్నట్టి; లోకపాలం= లోకాన్ని పాలించే యమధర్మరాజుగానూ; తం= ఆ యదువును; అమన్యంత= భావించారు.

**తా॥** దేవతలు ఆ యదుమహారాజును యుక్తదండుడని, శత్రువుల కార్యాలను నశింపజేసేవాడని, ప్రజలపట్ల సమభావంతో మెలిగేవాడని, పరిపాలించడమందు సమర్థుడని, నరలోకపాలకుడని బాగా ఆదరించేవారు. దేవతలు దక్షిణ లోకపాలకుడైన యమధర్మరాజుగానూ యదుమహారాజును భావించేవారు.

**వ్యాఖ్య:-** దేవతలు యదుమహారాజునందు యమధర్మరాజుయొక్క ధర్మాలను చూచి ఆయనను ఆదరించేవారని వర్ణితం.

దివౌకసులు అంటే స్వర్గమందు నివసించేవారు, దేవతలని అర్థం. 'దివ' శబ్దానికి స్వర్గమనే అర్థం ఉంది. "*నశోభతే తేన వినాతథాపురం మరుద్వతా వృత్రవధే యథా దివమ్*" అని సుభూతి చంద్రునిచేత ఉదాహరింపబడిందన్నారు వ్యాఖ్యాతలు. దివం ఓకః యేషాం ఇతి= దివౌకసః అని విగ్రహవాక్యం. స్వర్గం స్థానంగా గలవారు దేవతలని అర్థం. "*త్రిదివేశా దివౌకసః*" (అమరం).

*యుక్తదండం:-* యదుమహారాజు అపరాధులకు తగిన దండన విధించేవాడు. యముడు దండమనే ఆయుధంతో కూడి యుండేవాడు అనే శ్లిష్ట పదమిది.

"కాలో *దండధరః*"- (అమరం) ఆయుష్కాలాన్ని లెక్కపెట్టేవాడని, కాలదండాన్ని ధరించేవాడని యమునికి పేరు ఉంది.

*అమిత్రాణాం కృతాంతం:*- యదువు, శత్రువులు చేసిన కార్యాలను అణచివేసేవాడు. పగను అంతమొందించేవాడు కాని పగతురను నశింపచేసేవాడు కాదని అర్థం.

యముని పరమైన అర్థమందు- కృతః అంతః యేన సః= కృతాంతః. అంతమంటే వినాశమని అర్థం. వినాశం చేసేవాడు యముడు.

"*కృతాంతో యమునాభ్రాతా*"- (అమరం)

*సమవర్తినమ్:*- యదువు ప్రజలందఱియందు పక్షపాతంలేనట్టి సమమైన బుద్ధితో వర్తించేవాడు. యమధర్మరాజు కూడా 'సమం వర్తితుం శీలం అస్య ఇతి= సమవర్తీః' జీవులందఱి యందు ఎక్కువ, తక్కువ లేని సమాన దృష్టితో వర్తించే స్వభావం కలవాడే కదా! "సమవర్తీ పరేతరాట్"- (అమరం)

*దక్షిణం:*- ఏ కార్యాన్నైననూ త్వరగా చేసే సమర్థుడు, యదువు. "*దక్షిణే సరళోదారౌ*" (అమరం) 'దక్ష-వృద్ధౌ'- శీఘ్రార్థేచ. "*దక్షతే పరకార్యం శీఘ్రం కరోతీతి- దక్షిణః*" (అమరం). రాజ్య శాసన ప్రవీణుడని భావం. లోకపాలం= నరలోకాన్ని పాలించే ప్రభువు యదువు.

*దక్షిణంలోకపాలం:*- దక్షిణదిశను పాలించే దిక్పతి, యముడు.

*తం అమన్యంత:*- దేవతలకు యమధర్మరాజు యొక్క పరిచయం ఎక్కువ కాబట్టి, యమధర్మరాజుకున్న స్వభావాలన్నీ యదుమహారాజు యందున్నవని తలచి, యదువు పట్ల ఆదరభావంతో దేవతలు ప్రవర్తించేవారు.

యదుమహారాజుకు అన్వయించే విశేషణ పదాలన్నీ యముని ధర్మాలకూ వర్తించేవి. యముని పేర్లతో కూడినవే కాబట్టి అర్థ ద్వయప్రతీతివల్ల శ్లేషాలంకారం.

యుక్తదండుడు, కృతాంతుడు, సమవర్తి అనే లక్షణాలచేత దక్షిణ లోకపాలత్వం అనుమానింపబడడం వల్ల, అనుమానాలంకారం. యదుమహారాజు దేవతలచేత బహుమానింపబడేవాడని సారార్థం.

*26. యశః ప్రసూన సురభిర్యదు సంతాన పాదపః।*
*బభూవ విబుధ ప్రీత్యై బహుశాఖః క్ష్మాతలే॥* 26

**అర్థం:** యశః ప్రసూన సురభిః= కీర్తులు అనే పూలచేత పరిమళించునట్టి; బహుశాఖః= అనేక శాఖలు/ వేదశాఖలు కలిగినట్టి; యదు సంతాన పాదపః= యదు మహారాజు అనే సంతానమనే పేరు కలిగిన కల్పతరువు; క్ష్మాతలే= భూతలమందు; విబుధ ప్రీత్యై= దేవతల ప్రీతికోసం; బభూవ= ఉండెను.

మరొక అర్థం:-

యశః ప్రసూన సురభిః= యశస్సులు అనే పుష్పాలచేత సువాసన ప్రసరించునట్టి; బహుశాఖః= అనేక అవాంతర సంతతులు అనే కొమ్మలు కలిగినట్టి; యదు సంతాన పాదపః= యదు మహారాజు యొక్క సంతానమనే కల్పవృక్షం; క్ష్మాతలే= భూతలమందు; విబుధ ప్రీత్యై= విబుధుల ప్రీతికోసం; బభూవ= ఉండెను.

**తా॥** కీర్తిపుష్పాలచేత పరిమళించునట్టి, అనేక వేదశాఖలు అనే కొమ్మలు కలిగిన యదుమహారాజు అనే సంతాన వృక్షం భూతలమందు దేవతల సంతోషం కోసం వెలసింది.

యదుమహారాజు యొక్క సంతానమనే సంతానవృక్షం యశః ప్రసూనాలచే పరిమళిస్తూ, బహుశాఖలు కలదై భూలోకమందు విబుధులకు సంతోషాన్ని కలిగిస్తుండెను.

**వ్యాఖ్య:-** యదుమహారాజు కీర్తి దేవలోకంలోనూ ప్రసరించిందని సుశ్లోకితం.

యదుమహారాజే సంతానమనే దేవ తరువు. దేవలోకమందు నందనోద్యాన వనంలో ఐదు వృక్షాలు ఉన్నాయి.

*"పంచైతే దేవతరవో మందారః పారిజాతకః।*
*సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనమ్॥"* (అమరం)

(తను- విస్తారే) సమ్యక్ తనోతి వాంఛితం ఇతి= సంతానః, కోరిన ఫలాలను బాగా ఇచ్చేది. కోరికల నీడేర్చే ఐదు (5) పేర్లతో వెలసిన తరువులు- మందారం, పారిజాతం, సంతానం, కల్పవృక్షం, హరిచందనం. యదుమహారాజు గొప్ప దానశీలుడు. మహావదాన్యుడు కాబట్టి ఆయన సంతానమనే దేవతరువుగా నిరూపించబడినాడు. "విటపీ పాదపస్తరుః"- (అమరం).

*యశః ప్రసూన సురభిః:*- యశస్సులే- కీర్తులే ప్రసూనాలు. ఇది రూపక సమాసం. పూలవాసన దూరంగా వ్యాపించినట్లే కీర్తి కూడా సుదూరంగా నలుదెసల వ్యాపిస్తుంది. "పుష్పం ప్రసూనం కుసుమం సుమమ్"- (అమరం).

*బహుశాఖః:*- చాలా శాఖలు కలవాడు యదుమహారాజు. అంటే వేదాలలో అనేక శాఖలున్నాయి. అనేక వేదశాఖలను అధ్యయనం చేసినవాడని అర్థం. పాదపపరంగా చాలా కొమ్మలు కలది చెట్టు (శాఖృ-వ్యాప్తౌ). శాఖతి దిశో వ్యాప్నోతి ఇతి= శాఖా, దిక్కులను వ్యాపించేది అని అర్థం.

*"శాఖాతుపాదే పక్షాంతరే భుజే।*
*వికటేచ పదాంగే చ ప్రభేదే ఛందసాంముఖే॥"* (అమరం)

క్షమాతలే= భూ ప్రదేశమందని అర్థం. క్షమతే భారం ఇతి= క్షమా. భారాన్ని ఓర్చేది. "ఇలా కుంభినీ క్షమా" (అమరం) తలతి ఇతితలం. (తల- ప్రతిష్ఠాయాం) నిల్చి- స్థిరంగా ఉండేది. "అధఃస్వరూపయోరస్త్రీ తలమ్"- (అమరం) ఇక్కడ 'తల' శబ్దం స్వరూపవాచి. "తలం స్వరూపా ధరయోః"- (విశ్వ నిఘంటువు).

*విబుధ ప్రీత్యై బభూవ:*- విబుధులంటే దేవతలు. సంతాన తరువు స్వర్గలోకంలో దేవతల ప్రీతికోసమున్నదని ప్రసిద్ధం. యదుమహారాజు మాత్రం భూలోకమందు విబుధుల సంతోషం కోసం వెలసియున్నాడని సారార్థం. సత్కర్మలు, దానధర్మాలు చేస్తే దేవతలు సంతోషిస్తారు. యదువు భూలోకంలో నెలకొన్న సంతానతరువే యనడం విశేషం.

ఈ శ్లోకం యదువంశ పరంగానూ యోజింపదగినది:- యదుసంతానమే సంతాన పాదపం. ఇక్కడ సంతాన శబ్దమందే శ్లేష. "వంశోఽన్వవాయః సంతాన". విస్తరింపబడేది కాబట్టి సంతానం, సంతతి అనే పదాలు వంశమనే అర్థం కలవి. యదుమహారాజు యొక్క సంతానం బహుశాఖలు కలది. అంటే వృష్ణి, అంధక, భోజవంశాలు అనే ప్రభేదాలు ఈ సంతతిలో ఉన్నాయి. ఈ అవాంతర సంతతులు కీర్తి ప్రసూనాలచే పరిమళించాయి. భూలోక పాలనాభారాన్ని వహించి కూడా ఊర్ధ్వలోక వాసులకూ మేలు చేశాయి. విబుధాది శబ్దాలచేత శ్లిష్టాశ్లిష్ట రూపక ద్వయంచేత సంకరాలంకారం.

27. వంశే సమభవత్తస్య వసుదేవః క్షితీశ్వరః।
జనకః ప్రాగ్భవే యోఽభూత్ దేవదానవ యూథయోః॥ 27

**అర్థం:** తస్య= ఆ యదుమహారాజు యొక్క; వంశే= వంశమందు; వసుదేవః = వసుదేవుడు అనే; క్షితి+ఈశ్వరః= భూపతి; సమభవత్= సంభవించెను; యః= ఎవడు; ప్రాక్+భవే= పూర్వజన్మమందు; దేవదానవ యూథయోః= సురాసురుల సమూహాలకు; జనకః= తండ్రిగా; అభూత్= ఉండెనో.

**తా॥** ఆ యదువంశమందు వసుదేవుడనే పేరుగల రాజు సంభవించాడు. ఆయన ఇంతకు ముందు జన్మలో దేవతల సమూహానికి, రాక్షసుల సమూహానికి తండ్రిగా ఉండెను.

**వ్యాఖ్య:**- వసుదేవుడనే రాజు మహిమ వర్ణితం.

యదువంశంలో, గత జన్మమందు దేవదానవ సంఘాలకు జనకుడుగా ఉండిన వాడే వసుదేవుడనే పేరుగల రాజుగా ఉద్భవించాడు.

పూర్వం కశ్యప ప్రజాపతి సురభి, అదితి అనే తన పత్నుల మాటచేత వరుణుని యజ్ఞపశువులను అపహరించాడట. బ్రహ్మశాపంవల్ల ఆ కశ్యపుడు వసుదేవుడుగానూ, ఆయన పత్నులిద్దఱు రోహిణి, దేవకి రూపాలతో మనుష్య

లోకమందు జన్మించారని 'హరివంశ'మనే గ్రంథంలోని కథ. 'యూథ' శబ్దం "యూథం తిర్యక్ సమూహేఽపి బృందమాత్రేఽపి భాషితమ్"- (విశ్వ నిఘంటువు).

*28. అనకానాంచ దివ్యానాం దుందుభీనాంచ నిస్స్వనైః।*
*సహజాతం యమాచఖ్యు రాఖ్యయాఽఽనక దుందుభిః॥28*

**అర్థం:** దివ్యానాం= దేవతలయొక్క; అనకానాం= తప్పెటలయొక్క; చ= మరియు; దుందుభీనాం, చ= భేరీవాద్యాల యొక్కయు; నిస్వనైః, సహ= ధ్వనులతో కూడా; జాతం= ఉదయించినట్టి; యం= ఆ వసుదేవుడనే రాజును; ఆనక దుందుభిః = ఆనక దుందుభి అనే; ఆఖ్యయా= పేరుతో; ఆచఖ్యుః= వ్యవహరించారు; (వృద్ధాః= పెద్దలు. ఈ పదం అధ్యాహారం).

**తా॥** దేవతలు పటహభేరీ వాద్యాలను వాయించగా, ఆ ధ్వనులతో కూడా పుట్టిన వసుదేవ మహారాజుకు పెద్దలు 'ఆనక దుందుభి' అనే పేరు పెట్టారు.

**వ్యాఖ్య:-** వసుదేవునికి 'ఆనక దుందుభి' అనే పేరు కలుగడానికి కారణం సుశ్లోకితం.

'దివ్యులు' అంటే స్వర్గమందున్నవారు. స్వర్గమందు ఉన్నట్టి పదార్థాలు అని కూడా అర్థం. 'దివిభవాః= దివ్యాః' అని వ్యుత్పత్త్యర్థం. ఈ పదం 'ఆనకానాం, దుందుభీనాం' అనే పదాలకు విశేషణం.

"ఆనకః పటహోఽస్త్రీ స్యాత్ భేరీ స్త్రీ దుందుభిః పుమాన్"- (అమరం) ఆనకాలు, దుందుభులు అనేవి వాద్య విశేషాలు. 'నిస్వనం' అంటే మ్రోత, ధ్వని. "నాద నిస్వాన నిస్వనాః"- (అమరం).

*ఆనక దుందుభిః:-* ఇది వసుదేవుని నామాంతరం- మరొకపేరు. వసుదేవుడు జన్మిస్తున్నప్పుడు దేవలోకమందున్న ఆనకాలు, దుందుభులు

మ్రోగినాయి. ఆ వాద్య నాదాలతో కూడి పుట్టినట్టి వసుదేవుణ్ణి పెద్దలందఱు 'ఆనక దుందుభి' అని పిలిచేవారు.

రజస్తమోగుణాలు లేని రోహిణి, దేవకి అనే ఇద్దఱు దేవేరులయందు వసుదేవుని వల్ల బలరామకృష్ణులు అనబడే పుత్రులిర్వురు ఆవిర్భవించ నున్నారని 'ఆనకాలు, దుందుభులు' అనే రెండు వాద్యాల ధ్వని 'వసుదేవుడు' పుట్టుతున్నప్పుడే సూచించింది. దేవతలు సంతోషించారని ప్రకటింపబడింది.

*29. తేన నిర్మల సత్త్వేన వినివృత్త రజస్తమాః।*
*జగతీ శాంత మోహేవ ధర్మోచ్ఛ్వాసవతీ బభౌ॥* 29

**అర్థం:** నిర్మల సత్త్వేన= పరిశుద్ధమైన సత్త్వగుణం కలిగినట్టి; తేన= ఆ వసుదేవుని (కారణం) చేత; వినివృత్త రజస్తమాః= తొలగిపోయిన రజస్తమోగుణాలు కలిగినట్టిది కావుననే; ధర్మ+ఉచ్ఛ్వాసవతీ= ధర్మం యొక్క అభివృద్ధి కలిగిన; జగతీ= భూమి; శాంతమోహా, ఇవ= శమించిన మూర్ఛ కలిగియున్నట్లు; బభౌ= ప్రకాశించెను.

**తా॥** అకళంకమైన సత్త్వగుణంగల వసుదేవుని చేత రజస్తమోగుణాలు తొలగిపోయినందువల్లనే ధర్మమే ఉచ్ఛ్వాస కలదైన భూమి మూర్ఛనుంచి తేరుకున్నట్లు ప్రకాశించింది.

**వ్యాఖ్య:**- భూమి కూడా ధర్మాభివృద్ధి కలదిగా ప్రకాశించిందని వర్ణితం. వాద్యఘోషవల్ల ఏర్పడిన వసుదేవుని ప్రభావం పలుశ్లోకాలతో చెప్పబడుతున్నది. రజస్తమోగుణాలను అణచివేసే పరిశుద్ధమైన సత్త్వం (మనస్సు) కలవాడు వసుదేవుడు.

*"సత్త్వంగుణే పిశాచాదౌ బలే ద్రవ్య స్వభావ యోః।*
*సద్భావే వ్యవసాయే చ చిత్తే ప్రాణిషు శబ్ద్యతే॥"*

(విశ్వ ప్రకాశ నిఘంటువు)

కళంకమేలేని సత్త్వగుణం కలిగిన వసుదేవుని కారణంగానే భూమియందు రజస్తమోగుణాలు తొలగిపోయాయి. "జగతీ విష్టపే మహ్యామ్" (విశ్వః) 'జగతీ' అంటే లోకమనీ, భూమి అనీ అర్థం.

*జగతీ శాంతమోహేవ ధర్మోచ్ఛ్వాసవతీ బభౌ:-* ఇంతకుముందు భూమి మూర్ఛను పొందినట్లుండింది, అంటే శ్వాసస్తబ్ధమైనట్లు ఉండింది. వసుదేవుడు జన్మించిన తర్వాత మూర్ఛ తొలగింది కాబట్టి భూమి ధర్మమే ఊపిరి కలదిగా తేజరిల్లింది. భూమి యందు అధర్మం అణగింది. ధర్మం వృద్ధి పొందిందని భావం.

*30. సవిష్ణురివ లోకానాం తపనస్తేజసామివ।*
*సముద్ర ఇవ రత్నానాం సతామేకాశ్రయోఽభవత్॥* 30

**అర్థం:** సః= ఆ వసుదేవుడు; లోకానాం= లోకాలకు; విష్ణుః, ఇవ= విష్ణుమూర్తి వలెను; తేజసాం= కాంతులకు; తపనః, ఇవ= సూర్యుని వలెను; రత్నానాం= రత్నాలకు; సముద్రః, ఇవ= కడలివలెను; సతాం= సజ్జనులకు; ఏక+ఆశ్రయః= ఒకే ఆశ్రయుడై; అభవత్= ఉండెను.

**తా॥** ఆ వసుదేవుడు లోకాలకు విష్ణుమూర్తిని పోలియుండెను. తేజస్సులకు సూర్యుని పోలియుండెను. రత్నాలకు సముద్రంవలె ఉండెను. సజ్జనులకు ఒక పోషకుడుగా ఉండెను. తాత్పర్యం స్పష్టం:-

ఈ శ్లోకం మాలోపమాలంకార సజ్జితం.

*31. ప్రఖ్యాత విభవే పత్న్యౌ తస్య పూర్వం ప్రజాపతేః।*
*రోహిణీ దేవకీ రూపే మనుష్యత్వే బభూవతుః॥* 31

**అర్థం:** పూర్వం= వెనుకటి; ప్రజాపతేః= కశ్యప ప్రజాపతి రూపంలో ఉండిన; తస్య= ఆయన యొక్క; ప్రఖ్యాత విభవే= ప్రసిద్ధ మాహాత్మ్యం కలిగిన; పత్న్యౌ=

సురభి, అదితి అనే ఇద్దఱు భార్యలు; మనుష్యత్వే= మనుష్య జన్మయందు; రోహిణీ, దేవకీ రూపే= రోహిణి, దేవకి యనే రూపం కలవారుగా; బభూవతుః= అయినారు.

**తా॥** పూర్వం కశ్యప ప్రజాపతియొక్క ఇద్దఱు భార్యలు గొప్ప మహిమ కలవారు. సురభి, దేవకి అనే పేర్లు కలిగిన వారిద్దఱు మానవ జన్మలో రోహిణి, దేవకి అనే ఆకృతులతో వెలసినారు. తాత్పర్యం సుస్పష్టం.

*బభూవతుః* – 'భూసత్తాయాం' ధాతువు– భూతకాలమందు (లిట్) ప్రథమ పురుష ద్వివచనం. "పత్న్యౌ" అనేది ద్వివచనం– కర్త. దానికిది క్రియాపదం. అకర్మక ప్రయోగం.

*32. అక్షుద్ర గతిశాలిన్యో స్తయో రన్యోన్య సక్తయోః।*
*ఐక రస్య మభూత్ పత్యా గంగా యమున యోఃవ॥* 32

**అర్థం:** అక్షుద్ర గతి శాలిన్యోః= క్రౌర్యంలేని బుద్ధిశాలినులైన; అన్యోన్య సక్తయోః = పరస్పరం అనురక్తలైన; తయోః దేవకీ రోహిణులకు; అక్షుద్ర గతిశాలిన్యోః= గొప్ప ప్రవాహగతిని పొందియున్న; అన్యోన్య సక్తయోః= ఒండొకటితో కలిసియున్న; గంగాయమునయోః, ఇవ= గంగాయమునలకు వలె; పత్యా (సహ) భర్తయైన వసుదేవునితో కూడ/ సముద్రునితో కూడా; ఐకరస్యం= ఒకే ఆనందంగా/ ఒకే ఉప్పునీటిగా; అభూత్= ఉండెను.

**తా॥** అనల్ప ప్రవాహం కలిగి అన్యోన్యంగా కలిసియున్న గంగాయమునలకు తమ పతియైన సముద్రునితో ఐకరస్యమున్నట్లు, అక్రూరబుద్ధిచే ఒప్పియున్న అన్యోన్యానురాగం కలిగియున్న దేవకీ రోహిణులకు తమ భర్తయైన వసుదేవునితో కూడ ఐకరస్యంగా ఉండెను.

**వ్యాఖ్య:–** దేవకీ రోహిణులను గంగాయమునలతో పోల్చి వర్ణించే శ్లోకం.

దేవకీ రోహిణులిద్దఱు అక్షుద్ర గతిశాలినులు- గొప్పబుద్ధి గలవారు. గతి శబ్దం జ్ఞానార్థకం. 'శాలిగతౌ' అనే ధాతువునుబట్టి తచ్ఛీలం దాని స్వభావం తెల్పబడింది. గంగా యమునాదులు గొప్ప ప్రవాహగమన శీలం కలవి.

"క్షుద్రః స్యా దధమ క్రూర కృపణాల్పేషు వాచ్యవత్"- (విశ్వ నిఘంటువు). *"గతిస్తు గమనే మార్గే దశాయాం బుద్ధ్యుపాయయోః"*- (రత్నమాల).

*అన్యోన్యసక్తయోః:*- దేవకీ రోహిణులు ఇర్వురు ఒకరొకరితో చాలా అనురాగంతో ఉండేవారు. గంగాయమునలు ప్రయాగవద్ద (ఒకదానితో మరొక ప్రవాహం) కలిసి ప్రవహిస్తూ ఒకే ప్రవాహంగా పారుతున్నాయి.

*తయోః పత్యా ఐకరస్యమభూత్:*- దేవకీ రోహిణులకు తమ పతియైన వసుదేవునితో సమాన అనురాగం ఉండింది. గంగాయమునానదులకు తమ పతితో జలరుచి ఒకే విధంగా సమానరుచి- ఉప్పునీరుగా ఉండింది. 'ఇవ' అనేది (వలె) ఉపమావాచకం. గంగాయమునలకు కడలితో ఐకరస్యమున్నట్లు, దేవకీ రోహిణులకు వసుదేవునితో సమానమైన సుఖం, ఆనందం ఉండింది. 'రస' శబ్దం నానార్థకం.

*"రసో గంధే రసాస్వాదే తిక్తాదౌ విషరాగయోః।*
*శృంగారాదౌ ద్రవే వీర్యే దేహధాత్వంబు పారదే॥"* (విశ్వః)

ఉపమాలంకృత శ్లోకమిది.

*33. సతాభ్యా మనురూపాభ్యాం సమతుష్యత్ సమేయివాన్।*
*వ్యక్తి హేతు రభూత్ యేన సపర్యంకస్య శార్ఙ్గిణః॥* 33

**అర్థం:** సః= ఆ వసుదేవుడు; అనురూపాభ్యాం= శీలవృత్తాదులచే సమానలై యున్న; తాభ్యాం= రోహిణి, దేవకి అనే ఇద్దఱు పత్నులతో; సమేయివాన్= కూడియున్న వాడై; సమతుష్యత్= సంతోషంగా ఉండెను. యేన= పత్నులతో కూడియుండడం

చేత; సపర్యంకస్య= పడకతో (శేషునితో) కూడియున్న; శార్ఙ్గిణః= శార్ఙ్గం అనే చాపం కలిగియున్న పరమ పురుషుని యొక్క వ్యక్తి హేతుః= ఆవిర్భవించే కారణం; అభూత్= అయెను.

**తా॥** ఆ వసుదేవుడు అన్ని విధాలా తగియున్న ఆ ఇద్దఱు పత్నులతో కూడి సంతుష్టుడై యుండెను. ఆయన అలా ఉండడం చేత పర్యంకమైన శేషునితో పాటు పురుషోత్తముని ఆవిర్భావానికి కారణమేర్పడెను.

**వ్యాఖ్య:–** శేషశాయి శేషునితోపాటు ఆవిర్భవించే హేతువు సుశ్లోకితం.

వసుదేవునికి రోహిణి, దేవకి ఇద్దఱు భార్యలు శీల వృత్తాదులచే సమానంగా తగియున్నందువల్ల ఆయన నిండు సంతోషంతో నుండెను. అందువల్ల, ఆ ఇద్దఱు భార్యల యందు బలరాముడు, శ్రీకృష్ణుడు ఇద్దఱు జన్మించడానికి కారణమేర్పడింది.

*సపర్యంకస్య శార్ఙ్గిణః వ్యక్తి హేతుః:–* శార్ఙ్గి– శార్ఙ్గ మనే విల్లు కలవాడు విష్ణుమూర్తి. విష్ణుమూర్తికి సెజ్జగా ఉన్నవాడు ఆదిశేషుడు. శేషునితో కూడి విష్ణువు యొక్క ప్రాదుర్భావం సూచితం. రోహిణియందు శేషుడు బలరామునిగానూ, దేవకియందు శార్ఙ్గి శ్రీకృష్ణుడుగానూ వ్యక్తమయ్యే- స్వయంగా అవతరించే అవకాశమేర్పడింది.

*34. అలిప్సత నసామ్రాజ్యం సోఽర్థకామ పరాఙ్ముఖః।*
*యదృచ్ఛాఽఽగత మైశ్వర్య మా నృణ్య రుచిరన్వభూత్॥* 34

**అర్థం:** అర్థకామ పరాఙ్ముఖః= అర్థం, కామం అనే పురుషార్థాల యందు విముఖుడైన; నః= ఆ వాసుదేవుడు; సామ్రాజ్యం= రాజ్యాధిపత్యాన్ని; న, అలిప్సత= పొందగోరలేదు; ఆనృణ్యరుచిః= ఋణపడక ఉండడమందు ఆసక్తి కలవాడై; యదృచ్ఛా+ఆగతం= అప్రయత్నంచేత పొందబడిన; ఐశ్వర్యం= సంపత్తును; అన్వభూత్= అనుభవించెను.

**తా॥** అర్థకామాలనే పురుషార్థాలయందు విముఖుడైన వాసుదేవుడు సామ్రాజ్యాన్ని పొందగోరలేదు. ఋణగ్రస్తం కానట్టి జీవనమందు ఆసక్తి కలవాడై దైవంవల్ల లబ్ధమైన ఐశ్వర్యాన్ని అనుభవించాడు.

**వ్యాఖ్య:-** వసుదేవుని జీవనవిధానం సుశ్లోకితం.

వసుదేవుడు ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలలో మధ్యన ఉన్న అర్థ కామాలను ఇష్టపడలేదు. ఆయన కేవలం ధర్మం, మోక్షం అనే ఆద్యంత పురుషార్థాలయందు ఆసక్తి కలవాడు. కాబట్టి, వసుదేవుడు సామ్రాజ్యాన్ని పొందగోరలేదు.

*"యేనేష్టం రాజసూయేన మండలస్యేశ్వరశ్చయః।*
*శాస్తి యశ్చాజ్ఞయా రాజ్ఞః ససమ్రాట్॥"*- (అమరం)

రాజసూయయాగం చేసినవాడు; సహస్రయోజన పరిమితమైన భూ మండలానికి ఈశ్వరుడైనవాడు; రాజులను తన యాజ్ఞచేత వశపరచుకొనేవాడు 'సమ్రాట్' అనబడతాడు.

సమ్రాజః భావం= సామ్రాజ్యం. సమ్రాట్టు యొక్క భావం (సమ్రాట్టుకు ఉండేది) సామ్రాజ్యం. మండలేశ్వరత్వం లేదా రాజ్యాధిపత్యమని భావం. లబ్ధుం ఇచ్ఛా= లిప్సా. పొందే కోరిక అని అర్థం. 'అలిప్సత' అనేది ఆత్మనే పది భూతకాల క్రియాపదం (భూతేలఙ్).

ఆనృణ్యరుచిః:- ఋణం నాస్తి యస్య సః= అనృణః. ఋణం లేనివాడు. అనృణస్య భావః= ఆనృణ్యం. ఋణంలేక ఉండడం (అనృణుని భావం). ఆనృణ్యే రుచిః యస్య= ఆనృణ్య రుచిః. అధమర్ణుడు- ఋణగ్రస్తుడు కాకుండా జీవించడమందు రుచికలవాడు. ప్రతి మనుజుడు జన్మసిద్ధమైన మూడు ఋణాలచే బంధింపబడుతాడని వేదం బోధిస్తుంది.

*"జాయమానోవై బ్రాహ్మణస్త్రి భీ ఋణవాన్ జాయతే, బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవే భ్యః, ప్రజయా పితృభ్యః, ఏషవా అనృణః"*– (శ్రుతి).

1) *ఋషిఋణం:* – ప్రపంచంలో ఋషులవలన జ్ఞానవ్యాప్తి సంభవించింది. కాబట్టి, జ్ఞాన విషయంలో వారికి ఋణపడియున్నాడు మానవుడు. బ్రహ్మచర్య మందు వేదశాస్త్రాలను అధ్యయనం చేసి, ఆర్షవిజ్ఞానాన్ని ఆర్జించి, ఆచరించి, ప్రచారం చేస్తే, ఋషులకు ప్రీతి జనకమైనందువల్ల, మానవుడు ఋష్యృణం నుంచి విముక్తుడవుతాడు.

2) *దేవర్ణం:* – యజ్ఞహవిస్సును అగ్నియందుంచగా అగ్ని ముఖులైన దేవతలు అగ్నిద్వారా గ్రహించి తృప్తిని పొందుతారు. ఇంద్రునిచే ప్రేరితమైన మేఘాల వల్ల వర్షం సంభవించడమూ, సోమాది దేవతల వల్ల సస్య సమృద్ధి, ధాన్యం ఫలించి అన్నం సిద్ధమవుతుంది. *"అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః"*– ఇత్యాది విషయం భగవద్గీతలో తెల్పబడింది. మనుజులు ఆహార విషయంలో దేవతలకు ఋణపడి యున్నారు. "యజ్ఞాద్భవంతి పర్జన్యః" అన్నట్లు, యజ్ఞాది కర్మల వల్ల మానవులు దేవతల ఋణం నుంచి విముక్తులవుతారు.

3) *పితౄణం:* – పితృదేవతలు పూర్వకర్మ ననుసరించి జీవులకు దేహాలను ఇస్తూ సృష్టిని వృద్ధి చేస్తారు కాబట్టి, దేహవిషయమై మనుజులు వారికి ఋణపడి యున్నారు. మానవులు వివాహమాడి సత్సంతానాన్ని పొందితే, ఆ సంతానం తమకు శ్రద్ధతో పిండోదక దానం చేస్తే పితృదేవతలు తృప్తినొందుతారు. తత్ఫలితంగా పితౄణం విముక్తి కలుగుతుంది. ఇలాగా శ్రుతి విహితమైన ఋణంలేనివాడు అనృణుడు. అనృణుని భావమే ఆనృణ్యం. ఆనృణ్యమందు రుచి కలవాడు వసుదేవుడు.

*యదృచ్ఛాఽఽ గతమైశ్వర్య మన్వభూత్:* – ఏ నియమంగానీ, ప్రయత్నం గానీ లేకుండా లభించిన సంపదను అనుభవించినవాడు వసుదేవుడు. 'అన్వభూత్' అనేది భూతకాలమందున్న- భూతేలఙ్ క్రియాపదం. "యదృచ్ఛాఽ నియమో

భవేత్"- (వైజయంతీ నిఘంటువు). 'అన్నృణ్యరుచి' అనే చోట దేశికులు 'శ్రీమద్రహస్యత్రయ సారం'లో 'స్వనిష్ఠాభిజ్ఞానాధికార' మందు చెప్పిన విషయం గ్రహించదగినది.

*"నసన్నిపతితం ధర్మ్యముపభోగం యదృచ్ఛయా।*
*ప్రత్యాచక్షే; నచాప్యేనమను రుంధే సుదుర్లభమ్॥"* (అజగరోపాఖ్యానం)

ధర్మానుగుణమైన భోగం యాదృచ్ఛికంగా సంప్రాప్తమయితే దాన్ని నిషేధింపను. దుర్లభమైన దాన్ని పొందడానికి ప్రయత్నించడమూ లేదు- అన్నట్లు. శాస్త్రవిరుద్ధం కానట్టి పనులను చేయక ఉంటుంటే, భగవత్సంకల్పం వల్ల అవి తమంతతామే సంభవించినప్పుడు ప్రారబ్ధకర్మ ఫలమైన ఋణం తీరిపోతున్న దనుకొని వెనుకంజ వేయకుండా అనుభవించడమే సముచితం.

*"తయో రేకతరో రాశిర్యద్యేనముపసన్నమేత్।*
*నసుఖం ప్రాప్య సంహృష్యేత్ దుఃఖం ప్రాప్యన సంజ్వరేత్॥"*

కర్మ విశేషానుగుణంగా సంప్రాప్తమైన లాభనష్టాలలో ఏదైన నొకటి సంప్రాప్తమైనప్పుడు లాభాన్ని పొంది సంతోషింపగూడదు. నష్టాన్ని పొంది దుఃఖింపగూడదు.

*35. కయాచి దశరీరిణ్యా వాచా వ్యవసితాయతిః।*
*దేవకీం వసుదేవంచ కంసః కారామయోజయత్॥* 35

**అర్థం:** అశరీరిణ్యా= శరీరంలేనట్టి; కయాచిత్= ఒకానొక; వాచా= మాటచేత; వ్యవసిత+ఆ యతిః= నిశ్చితమైన భవిష్యత్కాలవార్త కలిగిన; కంసః= కంసుడు; దేవకీం= దేవకిని; వసుదేవం, చ= వసుదేవున్ని కూడా; కారాం= కారాగారాన్ని; అయోజయత్= పొందింపజేసెను.

తా॥ కంసుడు అశరీర వాక్కుచేత రాబోయే కాలమందు అవశ్యంగా జరిగే వృత్తాంతాన్ని విన్నవాడై, దేవకీ వసుదేవుల నిద్దఱిని కారాగృహమందు బంధించి యుంచెను.

వ్యాఖ్య:- కంసుడు దేవకీ వసుదేవులను బంధనాగారమందుంచిన కారణాన్ని వివరించే శ్లోకమిది.

దేవకీ వసుదేవుల వివాహం తరువాత చెల్లెలిని పతిగృహానికి రథంమీద తీసుకొని పోతున్నప్పుడు, కంసునికి ఒక అశరీరవాక్కు వినవచ్చింది.

*"యా మేనాం వహసే మూఢ! సహభర్త్రా రథే స్థితామ్।*
*అస్యాస్తవాష్టమోగర్భః ప్రాణానపహరిష్యతి॥"*

ఓ మూర్ఖుడా! రథమందున్న ఏ, ఈమెను ఆమె మగనితో పాటు వహిస్తున్నావో, ఆ ఈమె యొక్క ఎనిమిదవ గర్భం- కుక్షిస్థ శిశువు (సంతానం) నీ ప్రాణాలను దీయగలదు- అని అశరీరవాణి పల్కిన మాట ఇది.

వ్యవసితాయతిః:- తర్వాత నారదుడు కూడా ఈ వృత్తాంతాన్ని దేవకియొక్క ఎనిమిదవ సంతానం నిన్ను సంహరించగలదని కంసునితో చెప్పినాడు. రాబోయే కాలాన ఈ వృత్తాంతం నిశ్చయంగా జరుగ గలదని విన్న తర్వాత కంసుడు దేవకిని, వసుదేవుణ్ణి భార్యాభర్తల నిద్దఱిని కారాగృహమందు బంధించి యుంచాడు.

'ఆయతిః' అంటే రాబోయే కాలం- ఆగామికాలమని అర్థం. *"ఆయతిః స్యాత్ దీర్ఘతాయాం ప్రభావాగామి కాలయోః"* (రత్నమాల). కంసుడు కర్త, దేవకీ వసుదేవులను- ఒక కర్మ; కారాం- మరొక కర్మ. అయోజయత్ క్రియాపదం. కాబట్టి ఈ శ్లోకమందు ద్వికర్మవాక్య ప్రయోగమున్నది.

*36. స కాలాతిబలః కంసః కాలనేమి రనేహసా।*
*సర్వ దైతేయ సత్త్వానాం సమాహార ఇవోదితః॥* 36

**అర్థం:** సః= ఆ; కంసః= కంసుడు; కాల+అతిబలః= యముని కంటె చాలా బలం కలవాడు; అనేహసా= కాలంచేత; సర్వదైతేయ సత్త్వానాం= సకల రాక్షసుల పరాక్రమాలయొక్క; సమాహారః, ఇవ= సముచ్చయం-సముదాయం లాగా; ఉదితః = జన్మించినట్టి; కాలనేమిః= కాలనేమి అనే రాక్షసుడు కదా!

**తా॥** కంసుడు కాలునికంటే మిక్కిలి బలవంతుడు. పూర్వకాలమందు భగవంతునిచే చంపబడిన కాలనేమియనే మహాసురుడే కంసుని రూపంతో రాక్షసులందఱి బలాల సమాహారంలాగా ఆవిర్భవించాడు.

"*కృతాంతానే హసోః కాలః*"- కాలశబ్దానికి యముడు, కాలం అని రెండు అర్థాలున్నాయి (అమరం).

"*కాలో దండధరః శ్రాద్ధ దేవో వైవస్వతోఽ ంతకః*"- (అమరం)- కల-శబ్ద సంఖ్యానయోః (కలయతీతి కాలః) ధర్మాధర్మాలను, ఆయుష్యాన్ని లెక్కించేవాడు. కలయతి ప్రాణినః ఇతికాలః (కలకిలక్షేపే) ప్రాణులను పోద్రొబ్బువాడు యముడు.

"కాలోదిష్టోఽ ప్య నేహాపి సమయోఽ పి"-(అమరం) (హన హింసాగత్యోః) నాహంతి, నాగచ్ఛతి, నాహన్యతే ఇతివా= అనేహా. నశించనిది (కాలం) (ఈహ చేష్టాయాం) న ఈహతే ఇతి= అనే హా. చేష్టలేనిది (కాలం).

"*తృటితకాలనేమిద్రుమః*"- (27) చెట్టును గొడ్డలితో నఱికినట్లు, భగవానుడు కాలనేమి అనే రాక్షసుణ్ణి నఱికివేశాడు. చెట్టును కొట్టివేస్తే మళ్ళీ బలంగా పెరుగుతుంది కదా! అన్నారు 'అభీతిస్తవంలో దేశికులు.

కాలనేమి అనబడిన గొప్ప రాక్షసుడే మరుజన్మలో కంసుడై జన్మించినందువల్ల తోబుట్టువైన దేవకిని హింసించే స్వభావం కలవాడని భావం.

తాత్పర్యం సుస్పష్టం.

37. *ఏతస్మిన్నంతరే దేవీ మేరుమధ్యముపేయుషః।*
*ప్రజాపతిముఖాన్ దేవాన్ ప్రాహ సాగరమేఖలా॥* 37

**అర్థం:** ఏతస్మిన్, అంతరే= ఈ మధ్యలో; సాగరమేఖలా= సముద్రమే మొలనూలుగాకలిగిన; దేవీ= భూదేవి; మేరు మధ్యం= మేరు నగ మధ్య భాగాన్ని; ఉపేయుషః= పొందియున్న; ప్రజాపతి ముఖాన్= చతుర్ముఖ బ్రహ్మ మొదలైన; దేవాన్= దేవతలను గూర్చి; ప్రాహ= (చెప్పబోయే విధంగా) పలికెను.

**తా॥** ఈ మధ్యకాలాన సముద్ర రశనయైన భూదేవి మేరుపర్వత మధ్య ప్రదేశాన్ని పొందియున్న బ్రహ్మాది దేవతలతో ఇట్లు పలికెను. తాత్పర్యం స్పష్టం.

ప్ర+ఆహ:-'ఆహ' అనేది ఉవాచ (పలికెను) అనే అర్థమందు విభక్తి ప్రతిరూపకమైన 'అవ్యయం' అన్నాడు శాకటాయనుడు. ఇక్కడ 'కుగతిప్రాదయః' అని 'ప్ర'-సమాసం. అందువల్ల ఇది 'బ్రూఞ్' ధాతువు యొక్క 'లట్' రూపం కాదు. కాబట్టి 'స్మ' అనే శబ్దం ఉండదు.

*38. విదితం భవతాం దేవాః! విశ్వరూపేణ విష్ణునా।*
*మహీయాన్ ధర్మశీలేషు భారో యత్తన్ని వేశితః॥* 38

**అర్థం:** హే దేవాః= ఓ దేవతలారా!; విశ్వరూపేణ= విశ్వాకారుడైన; విష్ణునా= విష్ణుమూర్తి చేత; మహీయాన్= మిక్కిలి గొప్పనైన; భారః= బరువు; ధర్మశీలేషు= ధర్మమే స్వభావంగా కలవారియందు; నివేశితః, (ఇతి) యత్= ఉంచబడింది అనేది యేదో; తత్= అది; భవతాం= మీకు; విదితం= తెలిసిందే.

**తా॥** ఓ దేవతలారా! విశ్వమే రూపంగా గల విష్ణు భగవానునిచే గొప్ప బరువు ధార్మికుల యందు ఉంచబడిందనే విషయమేదో అది మీకు తెలిసిందే కదా!

**వ్యాఖ్య:-** భూదేవి బ్రహ్మాది దేవతలతో పలికిన మాటను తెల్పే శ్లోకమిది.

విష్ణుభగవానుడు విశ్వమే విగ్రహంగా కలవాడు. ఆ విశ్వరూపుడు లోక రక్షణమనే గొప్ప భారాన్ని ధర్మశీలురయందు ఉంచాడు.

*"గోభిర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిః సత్యవాదిభిః।*
*దాతృభి ర్ధర్మశీలైశ్చ సప్త భిర్ధార్యతే మహీ॥"*

ఆవులు, బ్రాహ్మణులు, వేదాలు, పతివ్రతలు, సత్యవచస్కులు, దానశీలురు, ధర్మశీలురు ఈ ఏడు (7) గురిచేత భూమి భరింపబడుతున్నది. ఓ దేవతలారా! ఈ ప్రసిద్ధ విషయం మీకు తెలియనిది కాదు కదా! అని భూదేవి దేవతలతో పలికింది.

*39. అధర్మనిఘ్నై రధునా ధర్మసేతు విభేదకైః।*
*అసంఖ్యై ర ద్భుతై స్తుంగైః క్రమ్యే రాక్షస పర్వతైః॥* 39

**అర్థం:** అధునా= ఇప్పుడు; అధర్మనిఘ్నైః= అధర్మానికి అధీనులైనట్టి; ధర్మసేతు విభేదకైః= ధర్మమనే వంతెనను కూలద్రోయునట్టి; అసంఖ్యైః= లెక్కలేనట్టి/ యుద్ధం లేనట్టి; తుంగైః= ఉన్నతమైన; అద్భుతైః= ఆశ్చర్యభూతులైన; రాక్షస పర్వతైః= రాక్షసులనే పర్వతాలచేత; క్రమ్యే= ఆక్రమింపబడి ఉన్నాను.

**తా॥** ఓ దేవతలారా! ఇప్పుడు అధర్మంచేత ప్రేరేపింపబడినందువల్లనే ధర్మసేతువును భేదించునట్టి, లెక్కపెట్టలేని/ యుద్ధరహితులైన, ఉన్నతములైన అద్భుతాలైన రాక్షస పర్వతాలచే ఆక్రమింపబడియున్నాను.

**వ్యాఖ్య:-** భూదేవి తన బాధను దేవతలతో వెల్లడించుకొనే శ్లోకం.

రాక్షసులు అనే పర్వతాలచే ఇప్పుడాక్రమింపబడియున్నాను.

*అధర్మనిఘ్నైః:-* ఆ రాక్షసులకు ధర్మమెట్టిదో తెల్యదు. అధర్మం వారిని వశపరచుకొన్నది. అధర్మంచే ప్రేరితులైనారు కాబట్టి -

*ధర్మసేతువిభేదకైః:-* ధర్మమనే సేతువును తెగగొడుతున్నారు. ధర్మంయొక్క మర్యాదను భంగంచేస్తున్నారు అని భావం.

అసంఖ్యైః:- ఆ రాక్షస పర్వతాలు ఒకటి కాదు, రెండు కాదు, లెక్కపెట్ట రానన్ని ఉన్నాయి. 'సంఖ్యా' అనే స్త్రీ లింగశబ్దానికి లెక్క అనీ, విచారమని అర్థం. 'సంఖ్య' అనే నపుంసక శబ్దానికి యుద్ధమని అర్థం.

*"ఏకత్వాదౌ విచారేచ సంఖ్యా, సంఖ్యంతు సంయుగే"*- (రత్నమాల). 'అసంఖ్యైః' అంటే రాక్షస పర్వతాలకు ఎదురేలేదు. వాటిని ఢీకొనే వారే లేరు- కాబట్టి, యుద్ధరహితమైనవి. శ్లిష్టపదమిది. తుంగైః= ఆ రాక్షసులు పరాక్రమం చేత గొప్పవారు. శౌర్యంచేత ఉన్నతులు. 'రాక్షస పర్వత' శబ్దం రూపక సమాసం. కాబట్టి, పర్వత పరంగా చాలా ఎత్తైనవని అర్థం.

అద్భుతైః:- ఆ రాక్షస పర్వతాలు ఎప్పుడు, ఎక్కడ, ఎలా ప్రవర్తిస్తాయో తెలియదు కాబట్టి అబ్బురంగా ఉండేవి.

క్రమ్యే:- ఇది కర్మణిలట్- ఆత్మనే పది ఉత్తమ పురుషైక వచనం (వర్తమాన కాలమందలి క్రియాపదం) (క్రమ్యతే-ప్రథమ పురుషైక వచనం). ఆ రాక్షస పర్వతాలు నన్ను ఆక్రమించాయి. కాబట్టి ఓ దేవతలారా! ఇక నేను ఆ పర్వతాల భారాన్ని, ఆ రాక్షసుల వల్ల కలుగుతున్న బాధను భరించలేకున్నాను అని భూదేవి దేవతలతో మొరపెట్టుకొన్నది.

*40. అత ఆలోచిత జగద్ధితైః సురగణైః స్వయమ్।*
*(అతః స్వయం సురగణైరాలోచిత జగద్ధితైః?)*
*న పతామి న భిద్యేచ యథాఽహం క్రియతాంతథా॥* 40

**అర్థం:** అతః= ఇందువల్ల; ఆలోచిత జగత్+హితైః= ఆలోచింపబడిన లోకహితం కలవారైన; సురగణైః= దేవబృందాలచేత; అహంః= నేను; యథా= ఎట్లు; న, పతామి= పడిపోకుండా ఉందునో; న, చ, భిద్యే= భిన్నం కాకుండా ఉందునో; తథా= అట్లు; క్రియతాం= చేయబడుగాక.

తా॥ ఓ దేవతలారా! నా మూలకంగా- కారణంగా లోకం యొక్క హితాన్ని (మేలును) విచారించే దేవ సమూహాలైన మీచేత నేను పాతాళానికి పడిపోకుండా, చాలా బరువువల్ల మేడ నేలకు కూలిపోయినట్లు, కూలిపోకుండా చేయబడుగాక. జగద్ధితైషులైన ఓ బృందారకులారా! భారాధిక్యం వల్ల క్రుంగిపోకుండా నన్ను మీరు రక్షించాలి. నా భారాన్ని తొలగించి మీరు నన్ను కాపాడండి- అని భూదేవి దేవతలను ప్రార్థించింది. 'క్రియతాం' అనేది ఆత్మనే పది ప్రార్థనాయాం 'లోట్' ప్రథమ పురుషైక వచనం.

41\. *ఇతితే భూత ధారిణ్యా నిసృష్టార్థా దివౌకసః।*
*అవిదుస్త త్ప్రియస్యైవ తద్భార హరణం క్షమమ్॥* 41

**అర్థం:** భూతధారిణ్యా= భూదేవిచేత; ఇతి= ఇట్లు; నిసృష్ట+అర్థాః= ఉంచబడిన ప్రయోజనం గల; తే= ఆ; దివౌకసః= దేవతలు; తత్+ప్రియస్య, ఏవ= భూవల్లభుడైన నారాయణునికే; తత్+భారహరణం= ఆ భూభారాన్ని తొలగించడం; క్షమం= శక్యం (అని); అవిదుః= తలంచిరి.

**తా॥** భూదేవి పైన చెప్పిన విధంగా తనకు కావలసిన ప్రయోజనాన్ని దేవతలకు నివేదించింది. ఆ దేవతలు భూమియొక్క భారాన్ని హరించడం భూదేవికి ప్రియుడైన నారాయణునికే శక్యమనుకొన్నారు. తాత్పర్యం స్పష్టం.

*అవిదుః*:- 'విద జ్ఞానే' అనే ధాతువు యొక్క 'లజ్' రూపం. ప్ర.పురుష బహువచనం.

42\. *పురస్కృత్య జగద్ధాత్రీం మనసోఽపి పురస్సరాః।*
*దుగ్ధోదధిశయం దేవం దూరమేత్యాభితుష్టువుః॥* 42

**అర్థం:** దేవాః= దేవతలు; జగత్+ధాత్రీం= జగత్తును ధరించే భూదేవిని; పురస్కృత్య= ముందు ఉంచుకొని; మనసః, అపి= మనస్సు కంటె కూడా; పురః

సరాః (సంతః)= వేగం కలవారై; దూరం= దూరంగా; ఏత్య= పోయి; దుగ్ధ+ఉదధి శయం= పాలకడలియందు పవళించియున్న; దేవం= పురుషోత్తముణ్ణి; అభితుష్టువుః = నానా విధాలుగా స్తోత్రం చేశారు.

**తా॥** బ్రహ్మాది దేవతలు భూదేవిని పురస్కరించుకొని మనస్సు కంటే కూడా తొందరగా వెళ్ళి, పాలకడలి గట్టుకు చేరి క్షీరాబ్ధిశాయియైన నారాయణున్ని అనేక రీతులుగా స్తుతించారు. సుస్పష్టం.

*43. త్రివేదీ మధ్యదీప్తాయ త్రిధామ్నే పంచహేతయే।*
*వరదాయ నమస్తుభ్యం బాహ్యాంతర హవిర్భుజే॥* 43

**అర్థం:** త్రివేదీ మధ్య దీప్తాయ= మూడు వేదాలలో ప్రతిపాదింపబడి ప్రకాశమానుడైనట్టి; పంచహేతయే= ఐదు ఆయుధాలు కలిగినట్టి; వరదాయ= కోరిన ఫలాన్ని ఇచ్చునట్టి; బాహ్య+అంతర హవిః+భుజే= బయటి, లోపలి హవిస్సులను భుజించునట్టి; త్రిధామ్నే= మూడు స్థానాలు కలిగినట్టి పురుషోత్తముడవైన; తుభ్యం= నీ (కొర)కు; నమః= నమస్కారం.

**తా॥** వేదాలలో ప్రకాశిస్తున్నట్టి పంచాయుధాలు కలిగినట్టి, స్థానత్రయ మందు నివసించునట్టి వరదుడవైన బాహ్యాంతర హవిర్భోక్తవైన నీకు నమస్కారం.

**వ్యాఖ్య:-** బ్రహ్మాది దేవతలు వేద వేద్యుడైన నారాయణున్ని స్తుతిస్తున్న శ్లోకం.

1) *త్రివేదీ మధ్య దీప్తాయ:-* (త్రయాణాం వేదానాం సమాహారః= త్రివేదీ). ఋగ్యజుస్సామలు అనే మూడు వేదాల కలయిక 'త్రివేది' అనబడుతుంది. త్రివేదీ మధ్యన ప్రకాశించేవాడు. మూడు వేదాలచే ప్రతిపాదితుడై, అందులో దీపించేవాడు నారాయణుడు. తిస్రశ్చతాః వేద్యశ్చ త్రివేద్యః, త్రివేదీనాం మధ్యం= త్రివేదీ మధ్యం; తస్మిన్ దీప్తః= త్రివేదీ మధ్య దీప్తః; తస్మై. మూడు అగ్నుల స్థానాలైన వేదులు. మూడు వేదికల నడుమ మూడు అగ్నులుగా దీపించే వాడు వరదుడు అని మరొక అర్థం.

2) పంచహేతయే:- శంఖం, చక్రం, గద, ఖడ్గం, శార్ఙ్గం అనే ధనుస్సు- ఈ అయిదు రూపాలుగా ఉన్న ఆయుధాలు కలవాడు.

3) బాహ్యాంతర హవిర్భుజే:- 'బాహ్య హవిస్సులు' అంటే చరువు (వండిన బియ్యం, అన్నం), పురోడాశం (గోధుమపిండి, నెయ్యి, చక్కెర లేదా బెల్లం కలిపిన పదార్థం), ఆజ్యం (నెయ్యి), సాన్నాయ్యం (పెరుగు, పాలు) మొదలైన ద్రవ్యాలు. మంత్రం చదువుతూ అగ్నిలో వ్రేల్చబడే పదార్థం 'హవిస్సు' అనబడుతుంది. 'ఆంతర హవిస్సు' అంటే ప్రపన్నులు చేసే ఆత్మ యజ్ఞమందు హోమద్రవ్యంగా సమర్పించబడే జీవరూపమైన హవిస్సు. ఈ రెండు రకాలైన హవిస్సులను స్వీకరించే వాడు నారాయణుడు.

4) వరదాయ:- కోరినవన్నీ ఇచ్చేవాడు. ఆంతర హవిస్సును స్వీకరించి తననే ఇచ్చుకొనేవాడు. బాహ్య హవిస్సులను స్వీకరించి ఇతర వరాలను ఇచ్చేవాడు. దేవతలు 'హవిర్భుక్కులు' అనబడుతారు. నారాయణుడు మాత్రమే ఆంతర హవిర్భోక్త.

"తన్నై తన్ద కఱ్పగమ్" అంటారు నమ్మాళ్వార్లు. కల్పవృక్షం కోరిన వస్తువులను ఇస్తుంది. నారాయణుడు తనను కూడా ఇచ్చుకొనే కల్పతరువు అని అర్థం.

5) త్రిధామ్నే:- మూడుచోట్ల నివసించేవాడు (త్రీణి ధామాని అస్యసంతి ఇతి= త్రిధామా, తస్మై త్రిధామ్నే). క్షీరసముద్రమందు, సూర్యమండలమందు, వైకుంఠమందు నివసించేవాడు నారాయణుడని శాస్త్ర ప్రసిద్ధం.

"గృహదేహత్విట్ ప్రభావా ధామాని"- (అమరం). 'ధామన్' శబ్దానికి ఇల్లు, దేహం, కాంతి, ప్రభావం- అనే అర్థాలున్నాయి.

"త్రిధామా కేశవేஉ నిలే"- (వైజయంతి) 'త్రిధాము'దన్న పేరు విష్ణుమూర్తికీ, అగ్నిహోత్రునికీ వర్తిస్తుంది. ఇక్కడ ఉన్న విశేషణ పదాలు విలక్షణమైనవి. అగ్ని పరమైన అర్థం కలవి.

"వేదిః పరిష్కృతా భూమిః"- (అమరం). యాగంకోసం చతురస్రంగా భూషింపబడిన భూమి 'వేది' అనబడుతుంది (హోమకుండం). ఆ వేది మధ్యన దీపించేవాడు అగ్నిదేవుడు.

"రవేరర్చిశ్చ శస్త్రంచ వహ్నిజ్వాలాచ హేతయః"- (అమరం). 'హేతి' శబ్దం ఆయుధానికే కాక అగ్నిజ్వాలకూ వర్తిస్తుంది కదా! పంచాయుధుడు భగవానుడైతే, అగ్ని 'సప్తార్చి' అనబడినాడు.

*కాళీకరాళీ చ మనోజవాచ సులోహితా యాచ సుధూమ్రవర్ణా।*
*స్ఫులింగినీ విశ్వరూపీచ దేవీ లేలాయమానా ఇతి సప్త జిహ్వాః॥*

ఇక దక్షస్మృతిలో:-

*హిరణ్యా కనకారక్తా కృష్ణాచైవాథ సుప్రభా।*
*అతిరిక్తా బహురూపా సప్తజిహ్వాః ప్రకీర్తితాః॥*

కాళీ, కరాళీ, మనోజవా, సులోహితా, ధూమ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వపదా అనే ఏడు (7) జిహ్వా రూపాలైన జ్వాలలు కలవాడు అగ్నిదేవుడు.

'శ్రియ మిచ్ఛేద్ధుతాశనాత్' అనే స్మృతివల్ల ధనమిచ్చేవాడు. నారాయణుడైతే సర్వ సంపదల నిచ్చేవాడు. బాహ్యాహవిర్భోక్త అగ్నిహోత్రుడు. నారాయణుడు మాత్రం ముక్తాత్మలకు అభీష్టప్రదుడు. ఈ విధంగా, నారాయణ పరమైన విశేషణాల బలంవల్ల, అగ్నియందు కూడా వైలక్షణ్యం వ్యక్తమవుతున్నది. కాబట్టి, శబ్దశక్తి మూలమైన వ్యతిరేకాలంకార ధ్వనిగా సుశ్లోకితం.

*44. అనన్యాధీన మహిమా స్వాధీన పర వైభవః।*
*దయాధీన విహారస్త్వం ప్రణతాన్ పరిపాహినః॥* 44

**అర్థం:** అనన్య+అధీన మహిమా= స్వతంత్ర మహిమ కలిగినట్టి; స్వ+అధీన పర వైభవః= తన అధీనమైన పరుల వైభవం కలిగినట్టి; దయా+అధీన విహారః=

దయకు అధీనమైన లీల కలిగినట్టి; త్వం= నీవు; ప్రణతాన్= నమ్రులమైన; నః= మమ్ములను; పరిపాహి= సమగ్రంగా రక్షింపుము.

**తా॥** పరాధీనం కానట్టి మహిమ కలవాడవు, ఇతరుల వైభవమూ నీ యందే అధీనమై యున్నవాడవు. కృపకు అధీనమైన వ్యాపారం కలవాడవైన నీవే ప్రణతులమైన మమ్ము కాపాడుము.

**వ్యాఖ్య:-** ప్రణతులను కాపాడడం పరమాత్మునికే తగునని దేవతలు ప్రార్థించే శ్లోకం.

1) అనన్యాధీన మహిమా:- అన్యస్మిన్ అధీనః= అన్యాధీనః (పరాధీనుడు) ఇతరుని యందు అధీనుడు. "అధీనోనిఘ్న ఆయత్తః"- (అమరం). అధిగతః ఇనః అనేన ఇతి= అధీనః. పొందబడిన (స్వామి) ఏలిక గలవాడు. (లేదా) అన్యస్మిన్ అధి (స్వామియందు) అనే విగ్రహ వాక్యమందు 'సప్తమీ శౌండైః' అని సమాసం. 'అధి' శబ్దం శౌండాదుల యందు ఉత్తరపదమైనందు వల్ల (అషడక్షాశితం గ్వలంకర్మాలం పురుషాధ్యుత్తర పదాత్ ఖః) స్వార్థమందు 'ఖ' పత్యయం చేరి 'అన్యాధీనః' అనే రూపమేర్పడుతుంది. ఇలా రెండు విధాలుగా ఉన్నా 'పరతంత్రు' డనియే అర్థం.

అన్యాధీనుని జీవనం భిక్షకుడు మరొక భిక్షకుణ్ణి యాచించే విధంగా ఉంటుంది. అన్యాధీనః నభవతి ఇతి= అనన్యాధీనః. అన్యాధీనం కానిది కాబట్టి అనన్యాధీనమని సమాసం. అనన్యాధీనః మహిమా యస్య సః= అనన్యాధీన మహిమా, అని బహువ్రీహి సమాసం. స్వతంత్రమైన మహిమ కలవాడు. "నతస్యేశే కశ్చన" (శ్రుతి). తనను నియమించువాడే లేడు. "నతత్సమశ్చాభ్యధి కశ్చ దృశ్యతే"- (శ్రుతి) నారాయణునితో సమానుడే లేడంటే ఇక అధికుడెక్కడ కనబడతాడు? తనకు తానే సాటి. అంత గొప్ప మహిమ కలవాడని ఈ విశేషణం చెబుతుంది.

2) స్వాధీన పరవైభవః:- స్వస్మిన్ అధీనం= స్వాధీనం. పరేషాం వైభవం= పరవైభవం. (పరుల అంటే) బ్రహ్మాది దేవతల ఐశ్వర్యమని అర్థం. స్వాధీనం పరవైభవం యస్యసః= స్వాధీన పరవైభవః. బ్రహ్మరుద్రేంద్రాదుల వైభవమూ తన అధీనమందు కలవాడు నారాయణుడు.

3) దయాధీన విహారః:-దయాధీనః విహారః యస్యసః= దయాధీన విహారః, నారాయణుడు చేసే విహారం సృష్టి స్థితి లయ రూపమైన వ్యాపారం. ఆయన కృపవల్లనే జరుగుతుంది.

1) కంసుడు మొదలైన లోక కంటకులను అణచివేసి లోకాన్ని రక్షించే అనన్యాధీన మహిమ కలవాడవు కాబట్టి నీవే ప్రార్థింపదగిన వాడవని హేతు గర్భవిశేషణం.

2) అన్యులెవరైనా కంసాదులను నిగ్రహించే శక్తి కలవారు ఉంటే, అప్పుడు కూడా ఆ శక్తిని వారు నీ వల్లనే పొంది నిగ్రహించవలె కదా! అని 'స్వాధీన పరవైభవః' అనే విశేషణం ప్రకటిస్తున్నది.

3) ప్రణతులమైన మమ్ము రక్షించే వ్యాపారం నీ దయకు అధీనమైనదే. నిర్దయుడు ప్రణతులను కూడా రక్షించలేడు కదా! అని 'దయాధీన విహారి' అనే విశేషణం తెల్పుతున్నది. ఇలాగా, ప్రార్థనీయుడు నారాయణుడే అని దృఢాధ్యవసాయంతో బ్రహ్మాది దేవతలు 'రక్షింపు'మని మోకరిల్లారు. విహార శబ్దంచేత చెప్పగోరిన అవతార భేదం తర్వాత శ్లోకమందు చెప్పబడనున్నది.

45. *స భవాన్ గుణరత్నౌఘై ర్దీప్య మానోదయాంబుధిః।*
*తనోతి వ్యూహనివహై స్తరంగైరివ తాండవమ్॥* 45

**అర్థం:** గుణరత్నౌఘైః= గుణాలు అనే రత్నాల సమూహాలచేత; దీప్యమానః= ప్రకాశమానుడవైన; దయాంబుధిః= దయాసముద్రుడవైన; సః= ఆ; భవాన్= నీవు;

వ్యూహ నివహైః వ్యూహ సమూహాలచేత; తరంగైః, ఇవ= అలల చేత వలె; తాండవం= తాండవమనే నాట్యాన్ని; తనోతి= చేస్తున్నావు.

**తా॥** కల్యాణ గుణాలు అనే రత్న సమూహాలచేత ప్రకాశించే దయాపయోనిధివైన నీవు వ్యూహ సమూహాలచేత, తరంగాలచేత వలె తాండవ నాట్యం చేస్తున్నావు.

వ్యాఖ్య:- దయాళువైన భగవానుడు భక్తులను రక్షించడానికి అవతరించాలని దేవతలు ప్రార్థించే శ్లోకం.

*దయాంబుధిః:-* కృపాశ్రయుడు భగవానుడు. సముద్రంవంటి రూపం కలవాడని అర్థం. దయ సముద్రమంత కలవాడని భావం. భగవానుడు శక్తి, జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే షడ్గుణాలు కలవాడు. షడ్గుణాలు అనుచరవర్గంగా ఉన్న దయ గుణసార్వభౌమి. సముద్రుడు చాలా రత్నాలు కలవాడు. విశాలమైన రూపం కలవాడు. జలాశ్రయుడు.

భగవానుడు అనంత కల్యాణ గుణాలచే దీప్యమానుడు. సముద్రుడు అసంఖ్యేయ రత్నాలచేత ప్రకాశమానుడు. భగవానుడు వ్యూహ్యాలు కలవాడు. సముద్రుడు తరంగాలు కలవాడు.

విస్తారమైన విభవాలను- నారసింహ వామన రామావతారాలను- ధరించడానికి హేతువు 'వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ' అనే వ్యూహ నివహం. వ్యూహనివహంచేత అనేకావతారాలను ధరించి అద్భుతమైన లీలను ప్రదర్శించేవాడు నారాయణుడు. 'తాండవం' అనే నృత్యం, పాదాలచే భూమిని తాకుతూ, అట్టహాసంతో చేతులను ఊపుతూ, తలను బిరుసుగా త్రిప్పుతూ, అభినయింపబడుతుంది.

సముద్రుడు భయంకరమైన గుట్టలవలె ఎత్తుగా లేచిన తరంగాలు అనే చేతులచే కల్లోలంగా ఒక కెరటం మరొక కెరటంతో తాకుతూ, లేచి పడుతూ, తీరభూమి మీదికి విజృంభిస్తాడు.

సముద్రునికి ఉల్లోల కల్లోలమవడం నైసర్గికమైనట్లు, దయాళువైన నారాయణునికి వ్యూహవైభవం- అవతరించడం స్వాభావికం. కాబట్టి, ఓ దేవదేవా! నీవు భూభారాన్ని హరించి, జగద్రక్షణార్థం అవశ్యంగా అవతరించవలెనని బృందారకులు ప్రార్థించారు.

*తనోతి:*- 'తను-విస్తారే' అనే ధాతువుయొక్క 'లట్' (వర్తమానం) ప్రథమ పురుషైక వచన రూపం. 'యుష్మత్, భవత్' రెండు శబ్దాలు నీవు (త్వం) అనే అర్థాన్ని బోధిస్తాయి. యుష్మచ్ఛబ్దాన్ని ప్రయోగించినప్పుడు క్రియాపదం మధ్యమ పురుష వచనమందే ఉండాలి. భవచ్ఛబ్దాన్ని ప్రయోగిస్తే 'శేషే ప్రథమః' అనే శాస్త్ర పద్ధతిగా 'తను' ధాతువుయొక్క 'లట్' ప్రథమ పురుషమే నిర్దేశింపబడింది.

*46. త్వ దేక వ్యంజితై రాదౌ త్వదన్యేష్వ నిదం పరైః।*
*నిగమైరనిగమ్యం త్వాం కః పరిచ్ఛేత్తు మర్హతి॥* 46

అర్థం: ఆదౌ= సృష్ట్యాదియందు; త్వత్+ఏక వ్యంజితైః= నీ ఒక్కనిచేతనే వ్యక్తం చేయబడినట్టి; త్వత్+అన్యేషు= నీకంటె వేరెవరియందు; అనిదం పరైః= ప్రతిపాదించే ప్రాధాన్యంలేనివైన; నిగమైః= వేదాలచేత; అనిగమ్యం= నిశ్చయింపరానట్టి; త్వాం= నిన్ను; కః= ఎవడు; పరిచ్ఛేత్తుం= పరిచ్ఛేదించడానికి; అర్హతి= యోగ్యుడు?

**తా॥** సృష్టి కాగానే మొదట భగవానునిచేత వేదాలు ఆవిష్కరింపబడినాయి. భగవంతుణ్ణి వదలివేసి ఇతరులను ప్రతిపాదించే ప్రాధాన్యం లేని వేదాలచేతనూ నిశ్చయింపరాని భగవంతుణ్ణి 'ఇటువంటివాడు' అని స్పష్టంగా చెప్పడానికి అర్హుడెవడున్నాడు?

**వ్యాఖ్య:-** సర్వేశ్వరుడు అపరిచ్ఛిన్నుడని వ్యక్తపరచే శ్లోకం.

పూర్వశ్లోకంలోని 'అంబుధి' శబ్దంచేత వివక్షితమైన 'అపరిచ్ఛిన్నత్వం' ఈ శ్లోకమందు వ్యుత్పాదింపబడుతున్నది.

ప్రళయం తర్వాత భగవానుడు తన సంకల్పంచేత విశ్వాన్ని సృజించాడు. "యథా పూర్వమకల్ప యత్". పూర్వం కల్పించినట్లే జగత్తును కల్పించాడని శ్రుతి బోధిస్తుంది. విశ్వసృష్టి చేసిన భగవానుడే మొట్టమొదట వేదాలను ప్రవచించాడు.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవైవేదాంశ్చ ప్రహిణోతితస్మై". నారాయణుని నాభికమలం నుంచి ఉద్భవించిన బ్రహ్మకు మొదట వేదాలను బోధించాడు- అని శ్రుత్యర్థం. "తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే" (భాగవతం). సృష్ట్యాదిలో యః= ఎవడు (నారాయణుడు), ఆదికవయే= బ్రహ్మ (కొర)కు; హృదా= శ్రద్ధతో; బ్రహ్మ= వేదరాశిని; తేనె= విస్తరించి చెప్పినాడు; అని శాస్త్ర ప్రమాణం. వేదాలకు ఇంకెవడో వక్త అయితే, అప్పుడు వక్తృదోషం సంభవించి, వేదాలకు దానిచేతనే నిర్ణయించే- ప్రమాణీకరించే- శక్తిలేక వేరే విధంగా సిద్ధించేది. (ప్రమాణం వేదమయితే, ప్రమేయుడు భగవానుడు). కాబట్టి, ప్రమేయ గౌరవం కూడా ఉండకపోయేది కదా! అనే శంకను తొలగిస్తున్నది "త్వదేక వ్యంజితైః" అనే పదం.

త్వదన్యేష్వనిదం పరైః:- ఇదం పరం యేషాంతే= ఇదం పరాః. ఇది- ప్రతిపాదించడం- ప్రాధాన్యం కలవి. వేదాలు భగవంతుణ్ణి ప్రధానంగా ప్రతిపాదిస్తాయి. 'పరం' అంటే ముఖ్యం; ప్రాధాన్యం. "పరం దూరాన్య ముఖ్యేషు" (రత్నమాల). భగవంతుణ్ణి విడిచి వేరే ఎవరియందు కూడా ప్రాధాన్యం కలవి కావు కాబట్టి, వేదాలు 'త్వదన్యేషు అనిదం పరాః' (తైః)- అనబడినాయి.

నియతం గమ్యతే ఇతి నిగమః. నిశ్చయంగా తెల్యబడేది (పొందబడేది) అని నిగమ శబ్దం యొక్క వ్యుత్పత్త్యర్థం. ఇక్కడ 'వేదం' అని అర్థం. "నిగమో నిశ్చయే పుర్యాం పథి వేదే వణిక్పథే"- (రత్నమాల).

నిగమై రనిగమ్యం త్వాం కః పరిచ్ఛేత్తు మర్హతి?

"సోఽన్వేష్టవ్యః, విజిజ్ఞాసితవ్యః"- (శ్రుతి). భగవానుడు అన్వేషించ దగినవాడు, ఇంక తెలుసుకోదగినవాడు అని శ్రుత్యర్థం.

అనిగమ్యుడు:- దేశకాల వస్తువులచే పరిచ్ఛేద్యుడని నిశ్చయించరానివాడు అని అర్థం.

దేశపరిచ్ఛిన్నుడు:- 'ఇక్కడ ఉంటాడు, అక్కడ ఉండడు' అని తెలియడం.

కాలపరిచ్ఛిన్నుడు:- 'ఇప్పుడు ఉంటాడు, అప్పుడు ఉండడు' అనడం.

వస్తు పరిచ్ఛిన్నుడు:- 'ఇట్టి రూపం కలవాడు; అలా ఉండడు' అని నిశ్చయించడం.

దేశకాల వస్తువులచేత పరిచ్ఛిన్నుడు కానివాడు నారాయణుడు. ఎవడు, తాను వ్యక్తపరచిన వేదాలచేత, వాటి ముఖ్య తాత్పర్యాలచేతనూ ప్రతిపాదింపబడుతున్నప్పటికీ, బాగా పరిచ్ఛేదింపబడుతు లేడో, అట్టి భగవంతుణ్ణి పరిచ్ఛేదించే మొనగాడెవడున్నాడు? ఎవ్వడు లేడు, ఉండడు.

*47. అమితస్య మహిమ్నస్తే ప్రయాతుం పారమిచ్ఛతామ్।*
*వితథా వేదపాంథానాం యత్ర సాయం గృహో గతిః॥* 47

**అర్థం:** అమితస్య= మితిలేని; తే= నీ యొక్క; మహిమ్నః= వైభవం యొక్క పారం= గట్టును; ప్రయాతుం= చేరడానికి; ఇచ్ఛతాం= కోరుతున్న; వేదపాంథానాం= వేదాలు అనే బాటసారుల యొక్క; యత్ర= ఎక్కడ; సాయంగృహో= సాయం కాలమైతే అదే గృహంగా కలిగిన; గతిః= నడక; వితథా= వ్యర్థమే.

**తా॥** అపరిచ్ఛిన్నమైన నీ మహిమ యొక్క ఆవలి తీరాన్ని చేరగోరే వేదాలు అనే పాంథుల యొక్క నిత్యం సాయంకాలం దాకా నడవడమూ వ్యర్థమే.

**వ్యాఖ్య:-** వేదాలచేత అపరిచ్ఛిన్నత్వం ప్రపంచింపబడే శ్లోకం.

వేదాలు నిత్యమైనవి. భగవానుడు అపరిచ్ఛిన్నుడు. అమితమైన ఆయన మహిమ యొక్క పారం చేరాలంటే వేదాలే అనే పథికులు ఎల్లప్పుడు పయనిస్తూ ఉండాలి. ప్రతిదినం పయనించే పథికుడు ఎక్కడ సాయంకాలమైతే అక్కడ విశ్రాంతి తీసుకొంటాడు.

రాత్రిపూట వేదభాగాలలో కొన్నింటిని అధ్యయనం చేయరాదనే నియమాన్ని మనసులో భావించిన కవి 'యత్ర సాయంగృహాగతిః' అనే మాటను ప్రయోగించాడు.

"యతోవాచోనివర్తంతే, అప్రాప్య మనసా సహ"- వేదాలనే పథికులు తమ మనస్సుకు గానీ, మాటలకుగానీ పరబ్రహ్మయొక్క మహిమయైనా ఆనందమైనా అంతుపట్టనందువల్ల వెనుదిరుగుతూ, మళ్ళీమళ్ళీ ఆయన మహిమ యొక్క ఉత్తర తీరాన్ని చేరడానికి కోరుతునే ఉన్నాయి.

భగవన్మహిమ యొక్క అపారత్వాన్ని నిశ్చయించడం కోసమే వేదాలు పారాన్ని అన్వేషించే ఉద్యమం చేబట్టాయి.

పురుషులు ఆయుష్యమున్నంతవరకు యావజ్జీవం పొందరాని ప్రదేశాన్ని పొందడానికి ప్రతిదినం సాయం సమయమయ్యేవరకు నడచిపోతున్నప్పటికీ ఆ ప్రదేశానికి ఎలా చేరుతులేరో, అలాగా, అవాఙ్మానస గోచరమైన భగవన్మహిమను ప్రతిపాదించడానికి ప్రవర్తించిన వేదాలు శబ్దగోచరమైన అన్ని విధాలచేత ప్రతిపాదిస్తున్నప్పటికీ సంపూర్ణంగా ప్రతిపాదించలేకున్నాయి. రూపకాలంకారం.

48. నమ్యస్య నమతః క్షుద్రాన్ వరదస్య వరార్థినః।
పుత్రైః పితృమతః క్రీడా కథంతే కేన వర్ణ్యతే॥ 48

**అర్థం:** నమ్యస్య= నమస్కరింపబడువాడే; క్షుద్రాన్= అల్పులను; నమతః= నమస్కరిస్తున్నట్టి; వరదస్య= వరాలను ఇచ్చువాడే; వర+అర్థినః= వరం కోరుతున్నట్టి; పుత్రైః= పుత్రులే; పితృమతః= తండ్రులుగా కలిగినట్టి; తే= నీ యొక్క; క్రీడా= ఆట; కేన= ఎవనిచే; కథం= ఎట్లు; వర్ణ్యతే= వర్ణించబడును?

**తా॥** అందఱిచేత నమస్కరింపబడే నీవు అల్పులకు నమస్కరించావు. ఎవరైనా వరమడిగితే ఇచ్చే నీవు వరాలను అడుక్కొన్నావు. కుమారులనే తండ్రులుగా చేసుకొన్న నీ ఆట ఎవనికి వర్ణింప తరమవుతుంది?

వ్యాఖ్య:- భగవానుని అవతార చేష్టలు వర్ణనాతీతమైనవని సుశ్లోకితం.

అవతారాలలో భగవానుడు చేసిన కృత్యాలన్నీ ఆయన వైభవానికి తగినవి కావు. తన మహిమను దిగజార్చుకొన్నాడు. భగవానుడు నిరతిశయ వైభవం కలవాడు. జగత్కారణుడు.

*నమ్యస్య నమతః క్షుద్రాన్:*- సకలలోకాలచే నతులు, నుతులు చేయబడే వాడు కదా భగవానుడు. అయినా, వామనావతారమందు తనకంటే చాలా అల్పశక్తి కలిగిన ఇంద్రుడు మొదలైన వారికి ఉపేంద్రుడుగా తానే వంగివంగి దండ ప్రణామాలు చేశాడు. కృష్ణావతారంలో దూతగా, సారథిగానూ ఉన్నాడు.

*వరదస్య వరార్థినః:*- భక్తి శ్రద్ధలతో కోరిన వారికి అర్థికల్పకమై ఎన్నో వరాలను ప్రధానం చేసి కీర్తింపబడిన భగవానుడు నేలపైన అవతరించినప్పుడు బ్రహ్మాది దేవతలను బిచ్చమడిగినట్లు, వరాలను కోరినాడు. వసిష్ఠ విశ్వామిత్రాదులకు కింకరుడయ్యాడు. 'సుగ్రీవం నాథమిచ్ఛతి'. ఒక కోతిని తనకు ఏలికగా భావించాడు.

*పుత్రైః పితృమతః:*- జగన్నాథుడు, లోకపితయైన భగవానుడే "పితాపితృమాన్ యోని యోనౌ"- (శ్రుతి). తనకు పుత్రులైన కశ్యపాదులనే తండ్రిగా చేసుకొన్నాడు.

ఓ భగవానుడా! హేయ ప్రత్యనీక కల్యాణ గుణ గరిష్ఠుడవైన నీ ఉత్కర్ష ఎక్కడ? లోకుల నికర్ష ఎక్కడ? అనేక అవతారాలలో నీవు ఆడిన ఆటలన్నీ నాట్యాభినయాలే కదా! నీ క్రీడా విధానం అచింత్యమైనది. కాబట్టి, ప్రభూ! నిన్ను వర్ణించడం ఎవనికీ శక్యం కాదు- అని దేవతలు కీర్తించారు.

*49. నటవత్ భూమికాభేదై ర్నాథ! దీవ్యన్ పృథగ్విధైః*
*పుంసా మనన్య భావానాం పుష్ణాసి రస మద్భుతమ్॥* 49

**అర్థం:** హే నాథ!= ఓ ప్రభూ!; నటవత్= నటునివలె; పృథక్+విధైః= వేర్వేరు విధాలైన; భూమికా భేదైః= వేషభేదాలచేత; దీవ్యన్= ఆడుతూ; అనన్య భావానాం= వేరే భావనలేని; పుంసాం= జనులకు/ ఏకాంతులకు; అద్భుతం= ఆశ్చర్యమైన; రసం= ఆనందాన్ని/ మోక్షానందాన్ని; పుష్ణాసి= కల్పిస్తున్నావు.

**తా॥** ఓ ప్రభూ! నటునిలాగా వేర్వేరు వేషాలను ధరిస్తూ ఆడుతున్న నీవు వేరే చింతనలేని ప్రేక్షకులకు అద్భుత రసాన్ని కల్పిస్తున్నావు; ఏకాంత భక్తులకు మోక్షానందాన్ని కలిగిస్తున్నావు.

**వ్యాఖ్య:-** భగవానుడు అనేకావతారాలనెత్తి నటునిలాగా ఆడుతూ సరసానుభవాన్ని కలిగిస్తుంటాడని వర్ణితం.

భగవానుడు అవతారాలెత్తినాడంటే నటునిలాగా అనేక వేషాలను ధరించినట్లే ఉంటుంది. మత్స్య కూర్మాద్యవతారాలు భగవానుని మూర్తిభేదాలే కదా! *"భూమికా రచనాయాం స్యా న్మూర్త్యంతర పరిగ్రహే"*- (విశ్వః). *"తత్తద్వేషో భూమికా స్యాత్"* (వైజయంతి).

*అనన్య భావానాం:*- అన్యః (విషయః) యస్యనాస్తిసః= అనన్యః- ఇతర విషయం లేనిది. అనన్యః భావః యేషాంతే= అనన్య భావాః. ఒకే చింతన కలవారు.

*"భావః స్వభావేఽభిప్రాయ చేష్టా సత్తాత్మ జన్మసు।*
*క్రియా లీలా పదార్థేషు బుధ జంతు విభూతిషు॥"* (విశ్వ నిఘంటువు)

'భావ' శబ్దానికి అనేకార్థాలున్నాయి. 'దివ్' ధాతువుకు గల అర్థాలలో 'క్రీడ' అని ఒక అర్థం (దివ్-క్రీడా విజిగీషా వ్యవహార మోదమదస్వప్న కాంతి గతిషు). నటుడు రామాదులవలె వేషం వేసి అభినయిస్తుంటే, ఆ రాముని చేష్టలనే చింతించే సామాజికులకు అద్భుత రసం అనుభవింపబడుతుంది. అలాగే, భగవానుని అవతార రహస్యాలను మాత్రమే చింతిస్తున్న ఏకాంత భక్తులకు సంసారమందు అనుభవించలేని మోక్షానందమే కల్పింప బడుతుంది.

అవతారంయొక్క ముఖ్య ప్రయోజనం సాధు పరిత్రాణమే కదా! వేరే విషయాలయందు మనస్సు పెట్టక, అవతార రహస్యాలనే భావించు భక్తులచేత కోరబడిన నానా విధ సంశ్లేష విధానంచేత, వారి హృదయాలలో ఆ విధానమే స్థిరంగా నిలిచియుండడం వల్ల అలౌకికమైన ఆనందం అవశ్యంగా కలుగుతుంది. సరస నటనవల్ల, రసజ్ఞులైన సహృదయులయందు పోషింపబడే రసనిష్ఠ ఈ శ్లోకమందు ప్రదర్శింపబడింది. ఉపమాలంకారం.

*50. బ్రహ్మాది స్తంబపర్యంత విచిత్రాంకుర శాలినామ్।*
*సలిలం కర్మ కందానాం క్రీడైవ తవ కేవలమ్॥* 50

**అర్థం:** బ్రహ్మాది-శాలినాం/ బ్రహ్మా= చతుర్ముఖ బ్రహ్మ; ఆది= మొదల్కొని; స్తంబ పర్యంతం= గడ్డి పరక వరకున్న ప్రాణులే; విచిత్ర= మిక్కిలి చిత్రమైన; అంకుర= మొలకలుగా; శాలినాం= ఒప్పియున్నట్టి; కర్మకందానాం= కర్మలు అనే సస్యమూలాలకు (గడ్డలకు, వేర్లకు); కేవలం= ముఖ్యంగా; తవ= నీ యొక్క; క్రీడా, ఏవ= లీలయే; సలిలం= నీరు.

**తా॥** బ్రహ్మ మొదల్కొని తృణం వరకున్న ప్రాణులు అనే విచిత్రమైన మొక్కలను పొందియున్న కర్మలు అనే కందమూలాలకు ముఖ్యంగా నీ క్రీడయే సలిలంగా ఉన్నది.

**వ్యాఖ్య:-** విచిత్ర సృష్టికి భగవద్వైషమ్యం కాక, ఆయా జీవుల కర్మలే ముఖ్య కారణమని సుశ్లోకితం.

ప్రపంచం విచిత్రమైనది. "*ఆ బ్రహ్మభువనం సర్వం కర్మ ప్రాధానికం హియత్*". సత్యలోకం వరకు కర్మ ప్రాధాన్యంగలవి లోకాలే కదా! "*నాకస్య పృష్ఠేతే సుకృతేఽ ను భూత్వా, ఇమం లోకం హీనతరం చావి శంతి*" (ము.ఉ. 2-9) ఊర్ధ్వలోక భోగాలను పొందేవారు తాము చేసిన యజ్ఞాది సత్కర్మలచేత కలిగిన ఫలాన్ని స్వర్గలోక, సత్యలోకాల్లో అనుభవించి మళ్ళీ ఈ మనుష్య లోకాన్ని

గానీ, ఇంతకన్న హీనమైన అథోలోకాలనుగానీ పొందుతారని వేదాంత శాస్త్రం చెబుతుంది.

బ్రహ్మ మొదల్కొని గడ్డి పరక వరకుండే భూతాల ఉనికికి కారణం, అవి ఇంతకుముందు చేసుకొన్న కర్మల యొక్క ఫలం అనుభవించడమే అని గ్రహింప తగినది. *"అప్రకాండే స్తంబగుల్మౌ"* (అమరం). *"ఏకోఽపిచ ప్రరోహైస్తు బహుభిః స్తంబ ఉచ్యతే"*- ప్రకాండంలేని ఒక మొక్కయే అయినా అది చాలా కణుపులతో వేర్లని నేలమీద పరచుకొని పోయే గరుకకు 'స్తంబ' మని పేరు.

ఒకడు ధనికుడు, మరొకడు దరిద్రుడు. ఒకటి చెట్టు మరొకటి గట్టు. ఒకడు సుఖాన్ని అనుభవిస్తుంటే వేరొకడు నరకమనుభవిస్తుంటాడు. ఈ విషమ సృష్టికి కారణం ఆయా జీవులు చేసుకొన్న వెనుకటి కర్మలే కారణం. కర్మలు కందమూలాల వంటివి. గడ్డలు-వేర్లు నీరు సోకితే తడిసి మొలకలెత్తుతాయి. తరుగుల్మలతాదులచే ప్రకృతి రమణీయంగా ఉంటుంది. విత్తొకటైతే చెట్టు మరొకటి కాదు కదా!

"కరుమముమ్ కరుమపలనుమాగి య కారణం తన్నై"- కర్మ ఉన్నది. కర్మకు తగిన ఫలమూ ఉంటుంది. కర్మ అచేతనం తానే ఫలమీయదు. ఆ కర్మకు తగియున్న ఫలాన్ని పొందే హక్కు యోగ్యత మనకు ఉన్నా స్వయంగా పొందలేము. ఫలమిచ్చేవాడు ఉంటాడు. వాడే ప్రభువు.

**"ఫలమత ఉపపత్తేః"**- (బ్రహ్మసూత్రం) సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడైన **భగవానుడే కర్మ**ఫల ప్రదాన సమర్థుడు- అని వ్యాస మహర్షి సూక్తి.

**భగవానునికి** వైషమ్యం- పక్షపాతంగానీ, నైర్ఘృణ్యం- నిర్దయగానీ లేవు. **దేవుడు,అందఱు ఆ**నందంగా ఉండవలెనని కోరుతాడు. "మద్యాజీ మాంనమస్కురు" నన్ను **పూజించు**, నమస్కరించు, సుఖపడతావు అని బోధించినా వినే వాడెవడు?

"అవజానంతి మాం మూఢాః"- నన్ను మూర్ఖులు అవమానించి నరక బాధలను అనుభవించనున్నారు అని ఆవేదనను ప్రకటించాడు. కర్మఫలం అనుభవించడం తప్పదు.

విత్తు నీరులేకపోతే మొలవదు కదా! కందమూలాలు నీటితో తడిసి అంకురాలుగా ప్రకటితమవుతాయి. అంకురాలకు కందమూలాలకు జలం కారణమైనట్లు, బ్రహ్మాది స్తంబపర్యంతమున్న విచిత్ర ప్రపంచానికి కర్మలే కారణం. కర్మ కందలు అంకురించడానికి నీరు అత్యవసరం కదా! "ఆపోవైనా రాః" (శ్రుతి) ఈ నీరే నారం. నారమే ఆయనంగా కలవాడు నారాయణుడు. నీటికి పారడమే స్వభావం. నారాయణునికి జగద్వ్యాపారమే క్రీడ.

*"లోకవత్తు లీలాకైవల్యమ్"* (బ్ర.సూ.)

*"లీలా జగత్పతేస్తస్య ఛందతః సంప్రవర్తతే।*
*మోదతే భగవాన్ భూతైర్బాలః క్రీడన కైరివ॥"*

ఈ జగన్నిర్మాణ లీల జగత్పతియైన భగవానుని సంకల్పం వల్ల నిర్వహింప బడుతున్నది. బాలుడు ఆట వస్తువులచే ఆనందపడే రీతిగా, భగవానుడు చరాచర పదార్థాలచేత ఆనందపడుతాడు. "ఇన్నుఱు మిన్నిళై యాట్టుడైయాన్" అని ఆళ్వార్ శ్రీసూక్తి. ఉభయ వేదాంతాలు సృష్ట్యాది వ్యాపారం 'క్రీడ'గానే స్ఫురింపజేశాయి. "విసమగుణం కుర పఅరే జలంవ"- (అచ్యుత శతకం-13 శ్లో.) ఇట్లే "సాధారణ్యే నహేతుః సలిల మివ విభుః సర్వకార్యాంకురాణామ్"- సామాన్యంగా భగవానుడు సర్వకార్యాలు అనే అంకురాల (మొక్కల) కు నీరు లాంటివాడని దేశికులచే అధికరణ సారావళి యందునూ చెప్పబడింది. ఇక్కడ, ఆ భగవంతుని క్రీడయే సలిలంగా చెప్పడం విశేషంగా గమనీయం. భగవత్క్రీడ యందు సలిలత్వాన్ని ఆరోపించడం, విచిత్ర ప్రపంచ రూపాలైన అంకురాల ఉత్పత్తియే లక్షణంగా గల ప్రకృత కార్యానికి ఉపయోగపడడం వల్ల పరిణామాలంకారం.

*51. నిరాధార నిజస్థేమ్నో నిరుపాధిక శేషిణః।*
*నిరపేక్ష నియంతు స్తే నిస్సమాభ్యధికా గుణాః॥* 51

**అర్థం:** నిరాధార నిజస్థేమ్నః= ఆధారంలేని ఆత్మీయ స్థైర్యంగల; నిరుపాధిక శేషిణః= స్వాభావికమైన జగత్ప్రధానుడవైన; నిరపేక్ష నియంతుః= సహాయం కోరనట్టి జగన్నియామకుడవైన; తే= నీ యొక్క గుణాః= గుణాలు; నిస్సమ+అభ్యధికాః= సమానమూ, అధికమూ లేనివి.

**తా॥** ఆధారాన్ని అపేక్షించని స్వీయస్థైర్యం కలిగినవాడు భగవానుడు. వేరే కారణం లేనట్టి శేషిత్వం కలవాడు భగవానుడు. ఎవరి సహాయం కానీ, ప్రేరణంగానీ లేని నియామకుడు భగవానుడు. భగవానుని గుణాలు సాటిలేనివి. ఆయన గుణాల కంటే గొప్పవైన, ఎక్కువగా ఉన్న గుణాలు లోకమందు ఎవరికీ లేనివాడే భగవానుడు.

**వ్యాఖ్య:-** భగవానుడు సర్వాధారుడు, సర్వశేషి, సర్వనియంతగా వర్ణించే శ్లోకం.

సమానత్వం లేని సృష్టికి జీవుల కర్మలే కారణమని భగవానుని నిర్దోషత్వం గత శ్లోకమందు చెప్పబడింది. ఈ శ్లోకంలో భగవానుని సకల కల్యాణ గుణాకరత్వం వర్ణితం.

1) *నిరాధార నిజస్థేమ్నః-* లోకంలో ఎవరి స్థితి- ఉనికి కైనా ఆధారం ఉంటుంది. పర్వతాలు స్థిరంగా ఉండడానికి భూమి ఆధారమైనందువల్ల భూధరాలకున్న స్థైర్యం, స్థిరత్వం సాపేక్షమే కదా! భగవానుని స్థితి మాత్రం నిరాధారమైనది. ఆధారాన్ని అపేక్షించనిది. 'ఇక్కడ ఉంటాడు, అక్కడ ఉండడు' అని చెప్పరానివాడు. "బహుస్యాం ప్రజాయేయ" 'అనేకంగా అవుతాను' అని సంకల్పించుకొన్నవాడు భగవానుడు. 'విభువు' (వివిధం భవతి ఇతి= విభుః) అని పేరుగాంచిన వాడతడే. చరాచర రూపమైన జగత్తు శరీరంగా కలవాడు.

జగత్తులో తానే 'ఆత్మగా' అంతట వ్యాపించి యున్నవాడు. కాబట్టి అన్నింటికి ఆధారమైనవాడు భగవానుడే.

"చింతయ సర్వం చిద చిద్రూపం తనురితి తస్య హరే రనురూపమ్"- అన్నట్లు, సర్వాత్ముడైనందువల్ల భగవానుడే సర్వాధారుడు. అందువల్ల భగవానుని 'స్థేమ' అంటే స్థిరమైన స్థితి ఆధార నిరపేక్షమైనది.

'స్థేమన్' శబ్దానికి స్థైర్యమని అర్థం. 'స్థిర' శబ్దానికి' వర్ణదృఢాదిభ్యః ష్యఞ్ చ' అని చకారం వల్ల 'ఇమనిచ్' ప్రత్యయం ఏర్పడింది. 'ప్రియ స్థిర' ఇత్యాది సూత్రంచేత 'స్థిర' శబ్దానికి 'స్థా' ఆదేశం కాగా, 'ప్రకృత్యైకాచ్' అని ప్రకృతి భావం కలిగినందువల్ల 'స్థేమా' రూపమేర్పడింది. 'స్థేమన్' శబ్దం యొక్క షష్ఠీ విభక్త్యే కవచనమే 'స్థేమ్నః' (నిరాధారః నిజఃస్థేమా యస్యసః= నిరాధార నిజస్థేమా తస్య-స్థేమ్నః).

2) నిరుపాధిక శేషిణః:- శేషిత్వమంటే స్వామిత్వం. స్వామికి తన భృత్యులకు జీతం, పారితోషికం ఇచ్చే 'ఉపాధి' అంటే ధర్మచింతన ఉంటుంది. భగవానునికి ఉపాధి- పోషించే ధర్మచింతన గల శేషిత్వం ఎవరి ప్రేరణ వల్లనో కలిగినది కాదు. ఆయనకు స్వభావసిద్ధమైనదే. కాబట్టి జగమంతా భగవానునికి శేషభూతమైనది. అంటే జగత్తుకు ప్రధాన భూతుడు భగవానుడే.

'శేషిన్' శబ్దానికి షష్ఠీ విభక్త్యే కవచన రూపమే 'శేషిణః'.

3) *నిరపేక్ష నియంతుః:*- జగత్తును శాసించడానికి, నియమించడానికి ఎవరి సహాయాన్ని అపేక్షించే వాడు కాదు భగవానుడు. 'రాజా ప్రకృతి రంజనాత్' అన్నట్లు ప్రజలను రంజింపజేసేవాడు 'రాజు' అనబడుతాడు. రాజ్యపాలన కోసం మంత్రుల సహాయం రాజుచే అపేక్షితం. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (శ్రుతి) అనే వాక్యం భగవానుని స్వరూపాన్ని చెబుతుంది. 'స' కారం జీవవర్గాన్ని తెల్పుతుంది. తకారం అచేతనమైన ప్రకృతిని బోధిస్తుంది. ఈ జీవ ప్రకృతులకు- రెండింటికీ 'యమ్' నియామకుడు అనే అర్థాన్ని తెల్పడంవల్ల 'సత్యం' శబ్దానికి

భగవానుడే 'జగన్నియంత' అన్న అర్థం సుస్పష్టం. 'విష్ణుసహస్ర నామావళి'లో ప్రధాన పురుషేశ్వరః' అనే నామం కూడా ఈ అర్థాన్నే విశదం చేస్తుంది. 'ప్రధానం' అంటే ప్రకృతి, 'పురుష' శబ్దం జీవవాచకం. ప్రకృతి పురుషులకు 'ఈశ్వరుడు' అంటే నియామకుడని అర్థం కదా!

జగన్నియంతృత్వానికి ఇతరుల సహాయంగానీ, ప్రేరణగానీ కోరబడదు కాబట్టి భగవానుడు నిరపేక్షనియంత. 'నియంతృ' శబ్దానికి షష్ఠీవిభక్త్యే కవచన రూపం 'నియంతుః'. 'తే' అనే విశేష్యానికి ఈ మూడు పదాలు 'విశేషణాలు'.

భూధరాదులకున్న స్థైర్యాదులవలె భగవానునికి అవి సాపేక్షాలు కావు. కాబట్టి- నిస్సమాభ్యధికా గుణాః:- భగవద్గుణాలతో సమానమైన గుణాలు లోకమందెక్కడ లేవు. ఆయన గుణాలకంటే అధిక గుణాలు విశ్వంలోనే కనబడవు. ఇలాగా దేవతలు ప్రార్థించిన భగవద్గుణాల ఉత్కర్షవల్ల, వ్యతిరేకాలంకారం వ్యక్తమవుతున్నది. దీనివల్ల 'నిస్సమాభ్యదిక' మనే మాటకు 'వాచ్య సిద్ధ్యంగం' అనే పేరు గల 'గుణీభూత' వ్యంగ్యమేర్పడుతున్నది.

*52. అనావిలధియా మంత శ్చింతామణి రివ స్ఫురన్*
*దిశ స్యభిమతం సర్వ మతిరస్కార్య దీధితిః॥* 52

**అర్థం:** అతిరస్కార్య దీధితిః= తిరస్కరింపరాని కాంతి కలిగినట్టి నీవు; చింతామణిః, ఇవ= చింతామణివలె; అనావిలధియాం= కలుషరహితమైన బుద్ధికలవారి యొక్క; అంతః= హృదయంలో; స్ఫురన్= ప్రకాశిస్తూ; అభిమతం= కోరబడిన; సర్వం= సమస్తాన్ని (అన్నిటినీ); దిశసి= ఇస్తున్నావు.

**తా॥** ఇతర తేజస్సులచేత అడ్డుకొనరాని ప్రకాశం కలిగిన నీవు కలుషితం కాని చింతన కలవారి హృదయమందు చింతామణిలాగా ప్రకాశిస్తూ వారికి ఇష్టమైన వాటినన్నిటినీ ఇస్తుంటావు.

**వ్యాఖ్య:-** భగవానుడు సకల ఫలప్రదుడని సుశ్లోకితం.

'చింతామణి' దివ్యమైనది. ఆ మణిని కలవారికి (వారి) కోరికలన్నీ నెరవేరుతాయి. చింతామణి యొక్క కాంతి కిరణాలు అనభిభవనీయాలు. ఇతర కాంతులచేత తిరస్కరింపబడజాలనివన్నమాట. చింతామణిలాగా భగవానుడు కోరిన ఫలాలనిస్తాడు. భగవానుని స్వరూపం యొక్క ప్రకాశాన్ని ఇతర వస్తువుల తేజస్సులేవీ కూడా అడ్డుకొని తగ్గింపజాలవు. 'దీధితి' అంటే ప్రకాశం, కాంతి (లేదా) తేజస్సు అని అర్థం.

*అనావిలధియామంతః స్ఫురన్:-* భగవత్స్వరూప రూపగుణాలను మాత్రమే చింతించు ధిషణగలవారి హృదయంలో గొప్ప తేజస్సుతో ప్రకాశించేవాడు భగవానుడు. యోగిహృద్ధ్యానగమ్యుడై వారి కోరికలన్నిటినీ ఫలింపజేస్తాడు. నిరంతరం ధ్యానపరులైన వారిని భగవానుడు సంసారం నుంచి విముక్తులను చేస్తాడు. చింతామణి ఎవరి వద్ద ఉంటే, ఆవిలమనస్కులైనవారి దగ్గర ఉన్నా, అది కొన్ని కోరికలనే ఫలింపజేస్తుంది అనే అర్థమూ ఉంది. భగవానుడు అనావిలధీమంతుల హృదయంలో వెలసినవాడై వారికి ముక్తినిస్తాడు. ముక్తి ప్రదాత భగవానుడే కదా! *"స యది పితృలోక కామోభవతి, సంకల్పాదేవ అస్య పితరః సముత్తిష్ఠంతి"*- అనే శ్రుతి ప్రకారంగా, ముక్తాత్మ పితృదేవతలను దర్శించాలనే కోరికను కలవాడైతే, సంకల్ప మాత్రం చేతనే అతనికి పితృదేవతలు కనబడుతారు. కాబట్టి నిన్ను నిరంతరం స్మరించే వారు కోరిన ఫలాలను సర్వం ప్రదానం చేస్తావు స్వామీ! అని ప్రార్థించారు.

*53. సంసార మరుకాంతారే పరిశ్రాంతస్య దేహినః*
*త్వద్భక్త్యమృత వాహిన్యా మాదిష్ట మవగాహనమ్॥* 53

**అర్థం:** సంసార మరుకాంతారే= సంసారమనే నిర్జల ప్రదేశం యొక్క దుర్గమమైన మార్గమందు; పరిశ్రాంతస్య= అలసిపోయినట్టి; దేహినః= ప్రాణికి; త్వత్+భక్తి+అమృత వాహిన్యాం= నీ యందలి భక్తి అనే సుధానది యందు; అవగాహనం= మునిగి స్నానం చేయడం; ఆదిష్టం= ఉపదేశింపబడింది.

**తా॥** సంసార మనేది ఒక ఎడారి. ఆ నీరస ప్రదేశం దుర్గమం. ఆ మార్గమందు సంచరించడంవల్ల దుఃఖితుడయ్యే దేహధారికి భగవంతుని యందలి భక్తి యనే అమృత రూపనదిలో తలమునక స్నానం చేయడమే శాస్త్ర విహితమైనది.

**వ్యాఖ్య:-** సంసారులకు భక్తియే ముక్తికి ఉపాయమని వర్ణన.

సంసారమనే దుర్గమమైన ఎడారి దారిలో నడవడం చాలా కష్టం. ఎడారిలో జలముండదు. ఎండ వేడిమికి తాపమెక్కువ అవుతుంది. నడక వల్ల శ్రమ అధికమై దుఃఖం కలుగుతుంది. సంసారమందు పరిభ్రమించడం మరుకాంతారమందు సంచరించే రీతిగా ఉంటుంది. సుఖం తక్కువ, దుఃఖమెక్కువ. శ్రమ చేత ఖిన్నుడవుతాడు మనిషి. "మహారణ్యే దుర్గపథే కాంతారం పుం నపుంసకమ్"- (అమరం) కాంతారమనే పదానికి గొప్ప అడవి, నడవశక్యం కాని త్రోవ అని రెండు అర్థాలున్నాయి.

"మరూధన్వధరాధరౌ"- (అమరం) 'మరు' శబ్దానికి నిర్జలభూమి, పర్వతం అని అర్థద్వయం. మ్రియంతే అస్మిన్ ఇతి= మరుః. మృఙ్-ప్రాణత్యాగే. నీరు లేని ప్రదేశం. కాబట్టి, ఎడారిలో తిరిగేవారు తాపం కలిగి చస్తారు అని 'మరుః' పదానికి అర్థం. 'ఎడారి' అనే అర్థంగల పదాన్ని ప్రయోగించి, గొప్ప అడవి అనే అర్థమున్న 'కాంతార' పదప్రయోగం సముచితమా? నీరస స్థలంలో గొప్ప చెట్లుగల అడవి ఉండడం ఎలా సంభవం? అనే ప్రశ్న జనిస్తుందని "కాంతారం వర్త్మ దుర్గమమ్"- (అమరం). దుర్గమమైన మార్గమని మరొక అర్థం చెప్పబడింది. (తౄ- ప్లవనతరవణయోః) కాంశ్చిత్ నతారయతి ఇతి= కాంతారం. ఎవ్వరిని కూడా చొచ్చిదాటనీయనిది. 'కం' అంటే సుఖం, నీరు అనే అర్థాలున్నాయి. కస్య అంతం ఋచ్ఛతి ఇతి= కాంతారం. జలనాశాన్నిగానీ, సుఖనాశాన్నిగానీ పొందియున్న ప్రదేశమని వ్యుత్పత్త్యర్థం. 'కాంతారం' అంటే, ఇష్టాపూర్తాది కార్యాలను చేసినవారికి ఇహలోక పరలోకాలతో గతాగత సాధనమైన ధూమమార్గ రూపమనీ, పాపిష్ఠులకు తృతీయ స్థానరూపమైన దుర్గతి- అని కూడా అర్థం.

సంసార మరుకాంతారంలో తిరిగి తిరిగి పొందిన శ్రమను తొలగించుకోవడానికి చల్లని, గంభీర జలమున్న నదిలో నిండుగా మునిగి స్నానం చేయడమే మంచి ఉపాయం. సాంసారిక శ్రమను భగవంతుని యందు భక్తి కలిగియున్న వ్యక్తి తొలగించుకొంటాడు. భగవంతుని విషయమైన భక్తి ఒక అమృతవాహిని జీవనది. అమృత శబ్దానికి నీరు, మోక్షం, దేవతల ఆహారం అని నానార్థాలు ఉన్నాయి.

*"భక్త్యా త్వనన్య యాశక్యః అహమేవం విధోఽర్జున!*
*జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥"*

భక్తి అంటే ఉపాసన, ధ్యానం అని అర్థం. ఓ అర్జునా! నన్ను తెలుసుకోవడానికి, మనస్సుతో చూడడానికి, తత్త్వం చేత ప్రవేశించడానికి ఇతర విషయాలపైన మనస్సును దూకనీయని భక్తిచేతనే శక్యమవుతుంది. భక్తియే ముక్తికి ఉపాయమని గీతాచార్యుడు ఉపదేశించాడు. భక్తి అనే అమృత నదిలో స్నానం చేస్తే శ్రమహరణ మవుతుంది. ముక్తిని పొందే ఉపాయమూ సిద్ధిస్తుంది.

భక్తియందు అమృత వాహినీత్వాన్ని ఆరోపించి, సంసార మార్గ శ్రమహరణ కార్యానికి ఉపయోగించడం వల్ల పరిణామాలంకారం.

*54. దురితోదన్వదావర్తే ఘూర్ణమానస్య దుఃఖ్యతః।*
*సమగ్ర గుణసంపన్నః తారకస్త్వం ప్లవో మహాన్॥* 54

**అర్థం:** దురిత+ఉదన్వత్+ఆవర్తే= పాపమనే సముద్రం యొక్క సుడియందు; ఘూర్ణమానస్య= పడి తిరుగుతున్న; దుఃఖ్యతః= దుఃఖపడుతున్న వ్యక్తికి; సమగ్ర గుణసంపన్నః= అపరిచ్ఛిన్నమైన గుణాలతో సమృద్ధమైన/ దృఢమైన త్రాళ్ళతో కూడియున్న; త్వం= నీవు; మహాన్= గొప్పదైన; ప్లవః= ఓడవై; తారకః= తరింపజేసేవాడవు.

**తా॥** పాపమనే సముద్రం యొక్క సుడిలో పడి తిరుగుతూ దుఃఖపడే దేహికి సమస్త కల్యాణ గుణాలచే సమృద్ధుడవైన నీవు, దృఢంగా త్రాళ్ళచే కట్టబడిన గొప్ప పడవగా తరింపజేస్తావు.

**వ్యాఖ్య:-** భగవానుడు సంసార సముద్రం నుంచి తరింపజేసే నౌకగా వర్ణితం.

భక్తిని ముక్తికి ఉపాయమని చెప్పింది పూర్వశ్లోకం. ప్రపత్తికి ఉపాయాన్ని ఈ శ్లోకం చెబుతున్నది. దురితమనేది సముద్రం. దురిత పరిపాకమే ఆవర్తం.

*"అంహో దురిత దుష్కృతమ్"*- (అమరం) *"ఉదన్వాను దధిః సింధుః".* *"స్యాదావర్తోఽ oభసాంభ్రమః"*- (అమరం). 'ఆవర్త' శబ్దానికి 'నీటి సుడి' అని అర్థం. పాపం అనే సముద్రపు సుడిలో పడినవాడు గిరగిరా తిరుగుతూ, తేలుతూ దుఃఖపడుతాడు. అట్టి వ్యక్తికి తనను స్మరించే బుద్ధియోగాన్ని ప్రదానం చేసేవాడు భగవానుడే. 'దుఃఖ' శబ్దానికి 'కండూవాదుల' యందు పఠించడంవల్ల, 'యక్' ప్రత్యయం చేరి 'దుఃఖ్యత్' రూపమేర్పడింది. 'దుఃఖ్యత్' శబ్దం యొక్క షష్ఠీవిభక్త్యే కవచనమే *"దుఃఖ్యతః".*

సుడిలో పడి దుఃఖపడుతున్నవాడు, 'తనను రక్షించే భారం భగవానునిదే' అని దృఢమైన మహా విశ్వాసంతో ప్రార్థిస్తూ 'భరన్యాసం- శరణాగతి- ప్రపత్తి' చేస్తాడు.

భగవానుడు హేయగుణాలు లేని సకల కల్యాణ గుణాలు- జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజో వాత్సల్య స్వామిత్వసౌశీల్యాది గుణాలు- కల్గియున్న పూర్ణ పురుషుడు. 'గుణ' శబ్దంయొక్క అనేక అర్థాలలో 'త్రాడు' అనే ఒక అర్థమూ ఉంది. *"రజ్జు స్త్రిషు వటీ గుణః"*- (అమరం). (గుణ్యతే ఇతిగుణః). అభ్యసింపబడేది, పేనబడేది, కాబట్టి రజ్జువు త్రాడు అని అర్థం. 'ప్లవః' అంటే ఓడ- తెప్ప అని అర్థం. *"ఉడుపంతు ప్లవః కోలః"*- (అమరం).

గట్టి త్రాళ్ళతో కూడింది ఓడ. తారయతి ఇతి= తారకః, దాటించేవాడు. 'త్వం మహాన్ ప్లవః' అన్నచోట వ్యస్త రూపకం. గుణసమృద్ధుడైన భగవానుడే శరణాగతుడైన వ్యక్తిని గుణసంపన్నమైన ఓడయై సంసార సముద్రం యొక్క ఆవలి తీరానికి చేర్చుతాడు. పరిణామాలంకారం.

*55. అపరిచ్ఛిద్య మానస్య దేశకాలాది భిస్తవ।*
*నిదర్శనం త్వమేవైక స్త్వదన్య ద్వ్యతిరేకతః॥* 55

**అర్థం:** దేశకాల+ఆదిభిః= దేశం, కాలం మొదలైన వాటిచేత; అపరిచ్ఛిద్యమానస్య= అంతు తెలియబడరాని; తవ= నీకు; త్వం= నీవు; ఏకః= ఒక్కడవే; నిదర్శనం= దృష్టాంతం; త్వత్+అన్యత్= నీ కంటే మరొకటి; వ్యతిరేకతః= వైధర్మ్యంగా; నిదర్శనం= దృష్టాంతమే.

**తా॥** దేశకాలాదులచే అవధి తెలియబడరాని నీకు నీ వొక్కడవే సాటి. నీవు తప్ప వేరొక వస్తువేదైనను వ్యతిరేక దృష్టాంతమే అవుతుంది.

**వ్యాఖ్య:-** భగవానుడొక్కడు తనకు తానే సాధర్మ్యం కలవాడని సుశ్లోకితం.

పూర్వశ్లోకమందు 'మహాన్' అని చెప్పబడిన మహత్త్వం అనంతమని ఈ శ్లోకం వివరిస్తుంది. త్రివిధ తత్త్వాలకు కూడా భగవానుడు అపరిచ్ఛిద్యమానుడు.

1) విభుడు కావడంవల్ల దేశంచేత- ఇక్కడ ఉంటాడు, అక్కడ ఉంటాడు అని తెలియబడరానివాడు.

2) నిత్యుడవడం వల్ల కాలమూ- ఇప్పుడు ఉంటాడు, అప్పుడు ఉంటాడు అని నిర్దేశింపజాలదు.

3) సర్వాత్మకుడైనందువల్ల వస్తుతః- ఇట్టి రూపం కలవాడు అని చెప్పరానివాడు. కాబట్టి, ఉపమేయం భగవానుడే, ఉపమానమూ భగవానుడే. ఆయనతో మరొకటి అన్వయించదు. ఇది అనన్వయాలంకారం.

భగవంతునికంటే ఇతరమైన చేతనాచేతనాలు వ్యాపించే స్వభావంగల ఆకాశాదులు వైధర్మ్య దృష్టాంతం కలవియే కదా!

ఇతరమైన గగనాదులకంటె భగవానునికే ఉత్కర్షను వర్ణించడం వల్ల వ్యతిరేకాలంకారం. అనన్వయమూ, వ్యతిరేకమూ రెండు, అన్యోన్యంగా అనుప్రాణితాలు కాబట్టి సంకరాలంకారం.

*56. అకర్తు మఖిలంకర్తు మన్యథాకర్తు మప్యలం।*
*సంకల్ప సచివః కాలే (కాలః?) శక్తి లేశః సతావకః॥* 56

**అర్థం:** అఖిలం= సమస్త ప్రపంచాన్ని; కాలే= ఆయా సమయమందు; అకర్తుం= చేయక ఉండడానికి; కర్తుం= చేయడానికి; అన్యథాకర్తుం, అపి= మరొక విధంగా చేయడానికి కూడా; సంకల్పసచివః= సంకల్పానికి సహాయపడుతున్న; తావకః= నీకు సంబంధించిన; శక్తిలేశః= శక్తియందలి కొద్ది భాగమైన; సః= ఆ కాలమే; అలం= పర్యాప్తం కదా!

**తా॥** సమస్త ప్రపంచాన్ని ఆయా కాలమందు చేయకుండా ఉండడానికీ, చేయడానికీ, వేరొకరీతిగా చేయడానికీ, సంకల్పానికి సహాయపడే నీ సంబంధమైన శక్తిలో అల్పాంశమైన ఆ కాలమే సమర్థమైనది.

**వ్యాఖ్య:-** కాలం కూడా భగవంతునికి వశమైయున్నదని వర్ణితం.

భగవానుడు సంపూర్ణశక్తిమంతుడు. కాలం మానసిద్ధి కలది. అంటే భూతకాలం, వర్తమానకాలం, భవిష్యత్కాలమని కొలత కలది. నిన్న, నేడు, రేపు అనడం కాలమానమే కదా!

*అకర్తుం:-* ఒకప్పుడు భగవానుడు ప్రళయాన్ని చేసి, అంటే ప్రపంచాన్ని తన కుక్షిలోన ఇముడ్చుకొని, ఏమీ చేయక యోగనిద్రలో ఉంటాడు. ఏమీ చేయక ఉండడం భగవత్సంకల్పమే.

*కర్తుం:*- ఒకప్పుడు ప్రపంచాన్ని సృజిస్తాడు. భగత్సంకల్ప శక్తిచే సృష్టి చేయబడుతుంది.

*అన్యథాకర్తుం:*- మన్వంతరకాలాలలో ప్రపంచాన్ని మరొక రీతిగా మార్పు చేస్తాడు. ఇంతవరకున్న అధికారంలో ఉండిన ఇంద్రాదులను ఆయా పదవులనుంచి తొలగించి, వేరే ఇంద్రాదులను ఆయా పదవులందు స్థాపిస్తాడు. భగవత్సంకల్ప శక్తిచేతనే కాలక్రమాన జరిగే కార్య విధానమిది.

*సః సంకల్ప సచివః తావకః శక్తి లేశః:*- "సహాయ సచివౌ" (వైజయంతి) 'సచివ' మంటే 'సహాయ' మని అర్థం. భగవంతుని సంకల్పానికి- ఇచ్ఛాశక్తికి సహాయపడేది కాలం.

కాలం విభువే, అయినా అది జడ ద్రవ్యం. దీనిలో సత్త్వాది గుణాలు లేవు. వ్యవహారాలన్నిటికి కాలమే కారణం. ఋతు, మాస, వారాలు, గంటలు, నిమిషాలు, యుగాంతాది విభాగాలన్నీ కాలానికి సంబంధించినవే కదా!

నిత్య విభూతి- వైకుంఠంలో కాలప్రభావంలేదు. భగవత్సంకల్పాధీనంగా ఈ కాలంచేతనే ఈ కర్మలోకమందు ఉండే పరిణామాలు ఏర్పడుతాయి.

*"తతః కాలాత్మకో యోఽసౌ తవాంశః కథ్యతే హరే!"* (హే భగవన్! ఈ కాలమనేది నీ అంశమే- భాగమే అని చెప్పబడుతున్నది అని ఈ స్మృతి వాక్యార్థం). భగవచ్ఛక్తి లేశ రూపమే కాలమని సారార్థం. కాబట్టి, భగవానుని శక్తి యందలి స్వల్పమైన- భాగ రూపమైన ఈ కాలమే జగద్వ్యాపారానికి సమర్థమైనది. ఇక భగవానుని పరిపూర్ణశక్తిని ఎవడు తెలుసుకో గలుగుతాడు?

గుర్తించడం- పరిచ్ఛేదించడం- తెలుగుసుకోవడం ఎవరికీ శక్యం కాదు. *"అలం భూషణ పర్యాప్తిశక్తి వారణ వాచకమ్"*- (అమరం) ('కాలే' అన్న పాఠాని కంటే ప్రథమాంతమైన 'కాలః' అనే పాఠమే యుక్తమని శ్రీమదుత్తమూరి వీరరాఘవాచార్య వ్యాఖ్యానం.)

57. యన్మూల మఖిలంకార్యం యదమూల మధీమహే (యతే)।
లక్ష్యం తదసి యోగానాం లక్ష్మీకౌస్తుభ లక్షణమ్॥ 57

**అర్థం:** అఖిలం= సమస్తమైన; కార్యం= పని; యత్+మూలం= ఏది కారణకమో; యత్+అమూలం= ఏది కారణకం కాదో; అధీమహే= తెలుసు కొంటున్నాము (అధీయతే= తెలుసుకోబడుతున్నది); తత్+అది; లక్ష్మీకౌస్తుభ లక్షణం= లక్ష్మీదేవి, కౌస్తుభమనే మణి చిహ్నంగాగల; యోగినాం= యోగుల యొక్క; లక్ష్యం= ఉద్దేశ్యమై; అసి= ఉన్నావు.

**తా॥** సమస్త జగద్వ్యాపారానికి ఏది కారణమో, కారణం కానిదేదో అది లక్ష్మీదేవిని, కౌస్తుభమణిని కూడా ధరించిన, యోగుల లక్ష్యమైన పరబ్రహ్మమై ఉన్నావని తెలుస్తున్నది.

**వ్యాఖ్య:-** యోగులకు ధ్యేయమైన దివ్యమంగళ విగ్రహుడని సుశ్లోకితం.

ప్రపంచం యొక్క సృష్టి స్థితిలయాది కార్యాలకు ఏది కారణమో, ఏది అకారణమో అది వేదాంత శాస్త్రంవల్ల మాకు తెలుస్తుంది.

"నచాస్య కశ్చిజ్జనితా నచాధిపః"- ఇతనికి పుట్టుక లేదు, పెంచి పోషించిన వాడు కూడా ఎవడు లేదు. భగవానుడు స్వయంభువు, కాబట్టి ఆయనను నియమించే నాయకుడే లేడని ఉపనిషత్తు బోధిస్తున్నది కదా! సర్వకారణభూతమైనట్టి, లక్ష్మీనీ, కౌస్తుభమణినీ హృదయమందు చిహ్నంగా కలిగినట్టి రూపమే ఆ వస్తువు. సకలమంగళ ద్రవ్యాలను పవిత్రం చేసే లక్ష్మీదేవిని వక్షఃస్థలమందు ధరించినట్టి మంగళవిగ్రహమే అది. అంతే కాదు; లక్ష్మీదేవితో సమానమైన ప్రీతివల్ల జీవాభిమానియైన కౌస్తుభమణిని కూడా వక్షఃస్థలాన అలంకరించుకొన్న దివ్యమంగళ విగ్రహమే యోగులచేత ఉపాసింపబడునట్టిది. దహరోపాసనాది పరవిద్యలకు ఉద్దేశ్యమైనట్టి ఆ పరబ్రహ్మమే నీవు అని దేవతలు స్తుతించారు. "*తత్రాపి దహరంగగనం విశోకం తస్మిన్యదం తస్తదుపాసితవ్యమ్*" అని

ఉపనిషద్వాక్యం. యోగులు తమ హృదయ పుండరీకమందలి దహరాకాశంలో పలవెలసి యున్న అంతర్జ్యోతిని- అంతర్యామియైన పరబ్రహ్మను ధ్యానిస్తారని వేదాంత శాస్త్ర ప్రసిద్ధం.

*58. త్రివర్గ మపవర్గం వా ప్రతిలబ్ధుం ప్రయస్యతామ్।*
*ప్రళయేష్వపి దీర్ఘాయుః ప్రతిభూస్త్వ దనుగ్రహమ్॥ 58*

**అర్థం:** త్రివర్గం= ధర్మార్థ కామాల వర్గాన్ని గానీ; అపవర్గం, వా= మోక్షాన్నిగానీ; ప్రతిలబ్ధుం= పొందడానికి; ప్రయస్యతాం= ప్రయత్నం చేసే వారికి; త్వత్+అనుగ్రహః = నీ యొక్క ప్రసాదం; ప్రళయేషు, అపి= కల్పాంతరాల యందు కూడా; దీర్ఘ+ఆయుః = దీర్ఘాయువే; ప్రతిభూః= పూటకాపు; పూచీపడడం వలె, ఫలప్రదమే.

**తా॥** త్రివర్గాన్నిగానీ మోక్షాన్నిగానీ పొందడానికి కర్మలను చేసేవారికి నీ అనుగ్రహం దీర్ఘకాలానికైనా వేరే కల్పాలలోనైనా నమ్మకంగా ఫలాన్ని ప్రదానం చేస్తుంది.

**వ్యాఖ్య:-** కర్మానుష్ఠాన పరులకు భగవదనుగ్రహం అవశ్యంగా ఫలప్రదమని వర్ణితం.

ధర్మార్థకామ మోక్షాలు చతుర్విధ పురుషార్థాలు అనబడుతాయి. ఈ పురుషార్థాలను పొందడానికి సజ్జనులు ప్రయాసపడుతారు. ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలకు త్రివర్గమని పేరు. కోరిన ఫలాలను పొందడానికి చేసే కర్మలు త్రివర్గానికి సంబంధించినవి. ఇష్టాపూర్తి కర్మల నాచరించి, దైవానుగ్రహాన్ని పొందుతారు. 'ఇష్ట'మంటే క్రతుకర్మ. కొందఱు అగ్ని దేవుణ్ణి ఆరాధించి కోరిన ద్రవ్యాన్ని పొందుతారు. స్వర్గాదిభోగాలను ఆశించేవారు ఇంద్రయాగాన్ని చేస్తారు. వానలు పడి పంటలు పండి దేశం సుభిక్షంగా ఉండాలని కోరేవారు వరుణ యాగం చేస్తారు. హోమదానాది కర్మను 'ఇష్టం' అంటారు.

కొందఱు సమాజం యొక్క సంక్షేమం కోసం 'పూర్త'మనే కర్మలను ఆచరిస్తారు. నేలను తవ్వి చెరువులను, పుష్కరిణులను, నదులకు ఆనకట్టలను, పెద్ద కాల్వలను నిర్మిస్తారు. కొందఱు దేవాలయాలను, పండ్లతోటలను నెలకొల్పుతారు.

ఏ ఫలాన్ని కోరకుండా భగవానుని ప్రీతికోసమే శ్రియఃపతిని ఆరాధించడం జీవుని విధి. "శ్రవణం, కీర్తనం, విష్ణోఃస్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం" అనే ప్రక్రియలు మోక్షఫల ప్రాప్తికి హేతువు.

"త్రివర్గో ధర్మకామార్థైః"- (అమరం). కామ్య కర్మల ఫలసిద్ధికోసం ఇతర దేవతలను ఆరాధించినా, ఫలాన్ని ప్రదానం చేసేవాడు శ్రీ మహావిష్ణువే. స్వయంగా ఫలదాతయైన భగవానుడు, వేరే దేవతలను ఆరాధించిన వ్యక్తి కోరిన ఫలాలను ఆ దేవతల ద్వారానే ఆ వ్యక్తికి అందజేస్తాడు.

*"లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్"*- (భ.గీత) ఇతర దేవతల నారాధించినవారు ఆయా కోరికలను నా చేతనే పొందగలుగుతారు అని శ్రీకృష్ణ భగవానుడే నొక్కి బోధించాడు కదా! పూర్వ శ్లోకమందు కౌస్తుభమణిని భగవానుడు ధరించాడన్న దానికి ఆ మణి అభిమానించే సర్వజీవులను ఉద్ధరించడమన్న భావమే ఈ శ్లోకమందు వివరింపబడుతున్నది. అపవర్గమంటే మోక్షం. ఆ మోక్షఫలాన్ని నారాయణుడే తప్ప ఇతర దేవతలెవ్వరూ ఇవ్వలేరు.

*ప్రతిభూస్త్వదనుగ్రహం:*- *"స్యుర్లగ్నకాః ప్రతిభువః"*- (అమరం). ప్రతిభువుడంటే నమ్మబలికేవాడు. పూచీపడేవాడు, జామీను. భగవానుని అనుగ్రహమే సర్వకర్మ సమారాధనకు యోగ్యమైన ఫలాన్ని ఇహలోకంలోగానీ, పరలోకంలో గానీ కల్పాంతరాల యందైనా దీర్ఘకాలమందైనా అనుభవింప జేయడానికి పర్యాప్తమని అర్థం.

వడ్డిచే జీవించేవారు ప్రతిభువును విశ్వసించి, వడ్డివస్తుందని ధనం పెరుగుతుందనే భావంతో ధనాన్ని ఉపయోగిస్తారు. అలాగే సత్పురుషులు

భగవానుని అనుగ్రహమే కల్పాంతరాలలోనూ ఫలప్రదమని విశ్వసించి త్రివర్గాప వర్గార్థమైన కర్మలను అనుష్ఠిస్తారు.

స్వయంగా, ఫలప్రదాన విషయమై భగవానుడు చాలా జాగ్రత్తను వహించాడు. కర్మలకు ఫలం ఎప్పుడో కొంతకాలానికి లభిస్తుంది. జీవులు నిత్యులు కదా! అగ్నీంద్రాది దేవతలను పూజించినందువల్ల వారే ఫలమిస్తారనుకోరాదు. కల్పాలు మారినప్పుడు ఇదివరకు ఆరాధింపబడిన ఆ దేవతలు ఆ పదవులందు అధికారులుగా ఉండలేరు. కొత్త అధికారులు భగవానునిచే నియమింపబడి యుంటారు. అందువల్ల భగవానుని అనుగ్రహమే ప్రతిభువుగా నిల్చి, అవశ్యంగా పురుషార్థాలకు ఫలప్రదమవుతుందని ఫలితార్థం.

భగవదనుగ్రహమందు ప్రతిభూత్వారోపణ, ప్రయాస రూపమైన ప్రస్తుత కార్యానికి ఉపయోగపడడంవల్ల పరిణామాలంకారం.

*59. యదేక మక్షరంబ్రహ్మ సర్వామ్నాయ సమన్వితమ్।*
*తారకం సర్వ జంతూనాం తత్ త్వం తవచ వాచకమ్॥ 59*

**అర్థం:** సర్వ+ఆమ్నాయ సమన్వితం= వేదాలన్నిటితో కూడియున్నట్టి; సర్వజంతూనాం= సమస్త ప్రాణులకు; తారకం= ఉద్ధారకమైనట్టి; ఏకం= ఒక; అక్షరం= అక్షరమైన; బ్రహ్మ= బ్రహ్మ; యత్= ఏదో; తత్= ఆ శబ్ద బ్రహ్మ; త్వం= నీవే; తవ= నీ యొక్క; వాచకం, చ= నీ పేరు కూడా.

**తా॥** సర్వవేదాలతో కూడియున్నట్టి, సకల ప్రాణులను తరింపజేసే, ఒక అక్షరమైన బ్రహ్మయేదైతే కలదో ఆ శబ్ద బ్రహ్మవు నీవే. అదే నీ పేరుగా వ్యవహరింపబడుతున్నది.

**వ్యాఖ్య:-** పరబ్రహ్మయొక్క స్వరూపమూ, వాచకమూ ప్రణవమే అని వర్ణితం.

సర్వామ్నాయ సమన్వితం:- సకల వేదాలను అధ్యయనం చేయడానికి ముందు, అధ్యయనం చేసిన తరువాతనూ ఓంకారం ఉచ్చరింపబడుతుంది.

"యద్వేదాదౌస్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః"- (శ్రుతి). "బ్రహ్మణః ప్రణవం కుర్యా దాదా వన్తేచ సర్వదా"- బ్రహ్మ శబ్దమిక్కడ వేదవాచకం. వేదానికి ముందు, చివర కూడా ప్రణవాన్ని ఓంకారాన్ని ఉచ్చరించాలి అని స్మృతి.

*సర్వ జంతూనాం తారకం:*- సమస్త ప్రాణులను సంసార సముద్రం నుంచి తరింపజేసే ఉపాయమే ప్రణవం- ఓంకారం.

*యదేకమక్షరం బ్రహ్మ:*- "ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ"- (శ్రుతి) ఓంకారం అనే ఒకే ఒక శబ్ద రూపమైన పరబ్రహ్మ భగవానుడే. "ఓ మితి బ్రహ్మ". ప్రణవమే భగవద్రూపం.

*తత్ తవ వాచకం చ:*- "తస్య వాచకః ప్రణవః" పేరు కూడా ప్రణవమే కదా!

*"ఓమ్ తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రి విధః స్మృతః"*- (భ.గీత). 'ఓమ్, తత్, సత్' అనే మూడు విధాలుగా పరబ్రహ్మ పేరు ప్రసిద్ధమే. ప్రణవరూపంగానూ, ప్రణవవాచకంగానూ వర్ణింపబడే పరబ్రహ్మవు నీవే అని దేవతలు స్తుతిస్తున్నారు అతి లఘువుగా సర్వఫల హేతువుగా, సర్వమంత్రోప జీవ్యంగానూ చెప్పబడుతున్న ఓంకారమే భగవన్మంత్రం.

*60. త్వదాలంబిత హస్తానాం భవాదు న్మజ్జతాం సతామ్।*
*మజ్జతః పాపజాతస్య నాస్తి హస్తావలంబనమ్॥* 60

**అర్థం:** త్వత్+ఆలంబిత హస్తానాం= నీ చేత పట్టుకోబడిన చేయి గలిగినట్టి; భవాత్= సంసార (కూప)ం నుంచి; ఉత్+మజ్జతాం= పైకి తేలునట్టి; సతాం= సత్పురుషుల యొక్క; మజ్జతః= మునుగుతున్న; పాపజాతస్య= పాప సమూహానికి; హస్త+అవలంబనం= చేతిని పట్టుకొనే సహాయం; నాస్తి= లేదు.

**తా॥** సంసారమనే కూపంలో మునుగుతున్న సత్పురుషులకు నీ చేతిని ఆధారంగా ఇవ్వడంవల్ల, ఆ చేతిని పట్టుకొని పైకి తేలుతారు. కాని వారి పాపరాశికి నీ చేయి ఆధారంగా లేనందువల్ల, అది వారితోపాటు పైకి తేలడమే లేదు.

**వ్యాఖ్య:-** ప్రణవరూపియైన భగవానుడు సత్పురుషులను ఉద్ధరించే విధానం సుశ్లోకితం.

*"అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదుః".* భగవానుడు బృహత్ స్వరూపం కలవాడని తెలుసుకొన్న వ్యక్తిని వేదమూర్తులు సత్పురుషుడంటారని ఉపనిషద్వాక్యం బోధిస్తున్నది.

*"అసన్నేవ సభవతి".* భగవానుడు ఇంద్రియాలకు గోచరించనివాడైనందు వల్ల, ఆయనను 'లేనివా'డన్నవాడే లేనివాడవుతాడు. దేవుడు లేడన్నవాడు నాస్తికుడు. దేవుడున్నాడని విశ్వసించేవారు ఆస్తికులు, సత్పురుషులు. భగవానుడు సత్పురుషుల యొక్క అరిష్టాలనన్నిటిని తొలగిస్తాడు.

*భవాదున్మజ్జతాం సతాం మజ్జతః పాపజాతస్య నాస్తిహస్తావలంబనమ్:-* సత్పురుషులు సామాన్యులలాగా సంసారులే. అయినా, సంసార కూపంలోపడి మునిగిపోతున్న బ్రహ్మవిదులైన సత్పురుషులకు భగవానుడు తన హస్తాన్ని ఆలంబనగా అందిస్తాడు. వారు ఆ చేతిని పట్టుకొని పైన దరికి చేరుకొంటారు. కాని, సత్పురుషులకున్న పుణ్యపాపకర్మల సముదాయానికి హస్తావలంబనం లేనందువల్ల అవి అందులోనే మునిగిపోతుంటాయి.

*"జాతం జన్మ సమూహయోః"*- (విశ్వః) 'పాపజాతస్య' అన్న చోట ఉన్న 'జాత' శబ్దానికి 'పుట్టుక, సమూహం' అనే రెండు అర్థాలలో ఇక్కడ సమూహమనే అర్థం వర్తిస్తుంది.

*రస్య రహస్యార్థమిది:-* సత్పురుషులు బ్రహ్మజ్ఞానం కలవారు. కాబట్టి, *"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా"*- జ్ఞానమనే అగ్ని సుకృత దుష్కృత

కర్మల నన్నిటినీ బూడిద చేస్తుంది- అని గీతాచార్యుడు బోధించాడు. ఆ విధంగా జ్ఞానం చేత పాపరాశి నాశనమవుతుంది.

"సుకృత దుష్కృతే విధూనుతే"- పుణ్యపాపాలు తొలగింపబడుతాయి. ఎలా? బ్రహ్మజ్ఞానియొక్క పుణ్యకర్మను ప్రియులైన జ్ఞాతులు గ్రహించి ఉపయోగించుకొంటారు. అప్రియులైన దాయాదులు పాపకర్మను పంచుకొని అనుభవిస్తారు, అనే అర్థమున్న ఉపనిషద్వాక్యమే "తస్యప్రియాజ్ఞాతయః సుకృత ముపయుంజంతి, అప్రియా దుష్కృతమ్"- ప్రమాణం. ఈ అభిప్రాయంతోనే పాపరాశి వేరొకచోట ప్రవేశిస్తుంది- అన్న వేదాంత శాస్త్ర వాక్యాన్ని బట్టి శ్లోకమందు 'పాపజాతం మునిగిపోతుంది' అని చెప్పబడింది.

తత్ఫలితంగా, సంసార బీజకర్మ లేనందువల్ల, అది మళ్ళీ అంకురించదు. అంటే భగవంతుని సన్నిధికి చేరిన సత్పురుషులకు 'పునరావృత్తి'- పునర్జన్మ లేదని పిండితార్థం.

*61. అనన్య రక్షా వ్రతినం*
*చాతక వ్రత చారిణః।*
*భవంత మవలంబంతే*
*నిరాలంబన భావనమ్॥* 61

**అర్థం:** అనన్య రక్షా వ్రతినం= ఏకాంతులయొక్క రక్షణయే దీక్షగా కల్గినట్టి; భవంతం= నిన్ను; చాతక వ్రత చారిణః= చాతక పక్షియొక్క నియమాన్ని ఆచరించే శీలం కలిగినవారు; నిరాలంబన భావనం= వేరే ఆధారం లేని భావనగా; అవలంబంతే= ఆశ్రయిస్తుంటారు.

**తా॥** ఏకాంతులైన వారిని రక్షించడమే వ్రతంగా గల నిన్ను చాతక పక్షియొక్క నియమాన్ని పాటించే ప్రపన్నులు ఇతరోపాయాల యందు ఆశలేకుండా ఆశ్రయిస్తారు.

వ్యాఖ్య:- భగవంతుణ్ణి ప్రపన్నులు ఆకించన్యాన్ని ఆవిష్కరిస్తూ ఆశ్రయించడం వర్ణితం.

భగవానుడు అనన్య రక్షావ్రతం కలవాడు. అనన్యులంటే భగవంతుణ్ణి తప్ప ఇతరులను వేడుకోనట్టి ఏకాంతభక్తులు. అనన్యులను రక్షించడమే వ్రతంగా కలవాడు (అనన్య రక్షైవ వ్రతం అస్యఅస్తి ఇతి= అనన్య రక్షావ్రతీ; తం). భగవానుడు ఒక్కడే రక్షకుడు అని (అంతం) నిశ్చయం కలవాడు ఏకాంతి. అందరినీ రక్షించే వాడయినా, ఏకాంతులను మాత్రం అవశ్యంగా రక్షించే దీక్షాపరుడు భగవానుడు.

*చాతక వ్రత చారిణః:-* గొంతులో ఛిద్రం ఉండడం వల్ల నోరు వంచి త్రాగితే జారిపోయే చాతక పక్షి, భూమిపైన ఉన్న నీటిని త్రాగదు. అది మేఘ జలానికై ఎదిరిచూస్తూ, ఆకాశాన నిల్చి, అఋచాచి, వాన నీటిని మాత్రమే త్రాగి జీవించే నియమం కలది. చాతక పక్షిలాగా ఏకాంతిత్వాన్ని ఆచరించే స్వభావం కలవారు ప్రపన్నులు. "*ప్రపన్నశ్చాతకో యద్వత్*" అన్న మాట ప్రసిద్ధమే కదా! (చాతకానాం వ్రతం చరితుం శీలం ఏషాం అస్తి ఇతి= చాతక వ్రతచారిణః).

*నిరాలంబన భావనం:-* ఆలంబనమంటే ఆధారం, ఉపాయం, శరణమని అర్థం. వేరే ఆలంబన లేనిది నిరాలంబనం. నిరాలంబనమైన భావన (మనోవ్యాపారమే) యే ఆకించన్య మనబడుతుంది. అకించనులు, అనన్య గతికులే ప్రపన్నులు (నిరాలంబనా భావనా యస్మిన్ కర్మణి తద్యథా తథా= నిరాలంబన భావనం).

భక్తి యోగాది ఉపాయాలేవీ లేని మనస్సు కలిగియుండి భగవంతుడొక్కడే ఉపాయం- శరణమనే భావనతో ప్రపన్నులు భగవంతుణ్ణి ప్రపత్తి చేస్తారు.

*62.* *అనిదం పూర్వ నిద్రాణా*
*మనస్తమయ భానుమాన్।*
*ఆపాదయసి పుంసాం*
*త్వ మపునస్స్వాప జాగరమ్॥* 62

**అర్థం:** అనిదం పూర్వ నిద్రాణాం= అనాదికాలం నుంచి నిద్రపోతున్న సంసారులైన; పుంసాం= జీవులకు; అనస్తమయ భానుమాన్= అస్తమయమే లేని సూర్యుడవైన; త్వం= నీవు; అపునః స్వాపజాగరం= మళ్ళీ నిద్రించడం, మేల్కోవడం లేని స్థితిని; ఆపాదయసి= కల్పిస్తుంటావు.

**తా॥** జీవులు సంసారంలో అనాదికాలంనుంచి సుప్తావస్థలో ఉన్నారు. భగవానుడు ఎన్నడుకూడా అస్తమించని సూర్యుడు. కాబట్టి, సంసారులకు భగవానుడు మళ్ళీ నిద్రించడమూ, మేల్కోవడమూ లేనట్టి మోక్షాన్ని ఆపాదిస్తుంటాడని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** భక్తి ప్రపత్తులను కలిగిన జీవులకు ఇష్టప్రాపకుడు భగవానుడని సుశ్లోకితం.

అనాదికాలం నుంచి నిద్రిస్తున్నవారు సంసారులు. జీవులు జ్ఞానం, ఆనందం, అమలత్వం కలవారు. సంసారంలో ప్రకృతి బద్ధులైన జీవులు తమ స్వరూపమెరుగక ఉన్నారు. జీవుల స్వరూప తిరోభావమే సంసారమనీ, నిద్ర అనీ సారార్థం.

భగవానుడు నిత్యం ఉదయాస్తమానాలు లేనట్టి సూర్యునిలాగా ప్రకాశమానుడు. భగవానుని ఆశ్రయించిన, భక్తి ప్రపత్తులు కలిగిన జీవులను మళ్ళీ నిద్రపోకుండా, మేల్కొనకుండా చేస్తాడు. శాశ్వతమైన మోక్షానందం కలిగిస్తాడని భావం.

ఉదయించిన సూర్యుడు నిద్రించిన వారిని మేల్కొల్పుతాడు. సంసారంలో ఉన్న జీవులు సుషుప్తి, మరణదశలలో పరమాత్మను కలిసిననూ జ్ఞాన సంకోచం వల్ల వారికి తెల్యదు. బ్రహ్మ విదుల హృదయాల్లో ప్రకాశిస్తున్న భగవానుడు వారికి సంసారం నుంచి విముక్తిని కల్పిస్తాడు. వ్యాసమహర్షి 'తదోకోऽధికరణ' మందు చెప్పిన ప్రకారం, భగవానుడు ముందు వెలుగుతూ, జీవాత్మను శరీరంలో నున్న నూటయొక్కటి నాడులలో సుషుమ్నా నాడిద్వారా శరీరం నుంచి వెలుపలికి తెస్తాడు. సుషుమ్నా నాడితో సూర్యకిరణాలకు సంబంధం ఉండడం వల్ల జీవుడు

సూర్యకిరణ మార్గంగా వెళ్ళుతాడు. ఆదిత్య పురుషుడు, వైద్యుతుడని చెప్పబడిన అమానవుడు అర్చిరాది మార్గంగా తీసుకొనిపోయి పరబ్రహ్మను పొందిస్తాడు.

ప్రకృత్యావరణం తొలగింది కాబట్టి ముక్తాత్మ, మైలకడుగబడిన మణి నిజకాంతితో ప్రకాశించినట్లే, అపహత పాప్మత్వాది గుణాష్టకంతో కూడిన నిజస్వరూపం ఆవిర్భవించి ప్రకాశిస్తుందని ఉపనిషత్తు. "పరంజ్యోతిరుప సంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే"– అని బోధిస్తుంది.

జీవుని స్వరూపంయొక్క తిరోభావ, ఆవిర్భావాలచేత సంసార, అపవర్గాలు, నిద్రాజాగర భావంగా అధ్యవసింపబడినందువల్ల అతిశయోక్త్యలంకారం. పరిణామాలంకార లక్షణం. అనస్తమయమనే విశేషణం, సూర్యుడు అస్తమించిన తరువాతనూ మళ్ళీ నిద్రించడం లేదనడానికి హేతువు కాబట్టి, పదార్థ హేతుక కావ్యలింగాలంకారం. ఇలా సంకరాలంకారంచేత ప్రసిద్ధ సూర్యుని కంటే వ్యతిరేకం ద్యోతకమవడంవల్ల, అలంకారంచేత అలంకార ధ్వని.

*63. త్వదేక శరణానాం*
*త్వం శరణాగత జీవనః।*
*విపదం నః క్షిప క్షిప్రం*
*తమిస్రామివ భాస్కరః॥* 63

**అర్థం:** శరణాగత జీవనః= శరణాగతులను జనింపజేసే; త్వం= నీవు; త్వత్+ఏక శరణానాం= నీవు ఒక్కడవే రక్షకుడవుగా కలిగిన; నః= మా యొక్క; విపదం; ఆపత్తును; తమిస్రాం= చీకటిని; భాస్కరః, ఇవ= సూర్యుడువలె; క్షిప్రం= శీఘ్రంగా; క్షిప= తొలగించుము.

**తా॥** ప్రపన్నులను ఉజ్జీవింపజేసే నీవు, నీవే ఉపాయంగా కలిగిన మా యొక్క ఆపత్తును సూర్యుడు చీకటిని తొలగించునట్లు, త్వరగా తొలగించవయ్యా! స్వామీ! అని దేవతలు భగవంతునితో మొర పెట్టుకొన్నారు.

**వ్యాఖ్య:**– భగవంతుని ప్రకృత కర్తవ్యం దేవతలచే ప్రార్థింపబడిన శ్లోకమిది.

స్వామీ! నీవే మాకు రక్షకుడవు అని మహా విశ్వాసంతో ప్రార్థిస్తూ ఆశ్రయించేవారు శరణాగతులు. భగవానుడు శరణాగతులను 'నత్యజేయం కదాచన'. ఎప్పుడు కూడా విడిచివేయను– అని కాపాడుతాడు. కాబట్టి భగవానుడు దయాళుడు, శరణాగత జీవనుడు.

*త్వదేక శరణానాం:*– మాకు నీ వొక్కడవే శరణం. 'త్వమేవ శరణం మమ, అన్యథా శరణం నాస్తి'. వేరే శరణం లేదు– అని ప్రార్థించేవారు 'త్వదేక శరణులు'.

*"ఉపాయే గృహ రక్షిత్రోః శబ్దః శరణ మిత్యయం।*
*వర్తతే సాంప్రతం త్వేష ఉపాయార్థైక వాచకః॥"*

'శరణ' శబ్దానికి ఉపాయం, ఇల్లు, రక్షకం– అని అర్థత్రయం. సంప్రదాయ మందు 'శరణ' శబ్దం ఉపాయ వాచకంగా ఉపయోగింపబడుతుంది. శరణం– 'ఉపాయం' అంటే 'సాధనం' అని చెప్పడం సాధారణం. శరణాగతి, 'ప్రపత్తి' అనడం సంప్రదాయం. భగవానుడే రక్షకుడనే విశ్వాసం.

*"అహమస్మ్య పరాధానా మాలయోఽ కించనోఽ గతిః।*
*త్వమే వోపాయ భూతో మేభవేతి ప్రార్థనా మతిః।*
*శరణాగతి రిత్యుక్తా సాదేవేఽస్మిన్ ప్రయుజ్యతా॥"*

ఒక ఫలాన్ని పొందడానికి శరీరకష్టం, ధనవ్యయం, చిరకాల ప్రయత్నం అత్యంతావశ్యకమే. ఇవేవీ కూడా అక్కరలేకుండా, నేను అనేక అపరాధాలను చేసిన మహాపాపిష్ఠుడను. నాకు వేరే దిక్కూ– చక్కీ లేదు. అకించనుడను (వేరే రక్షకం లేనివాడను), అనన్య గతుడను (వేరే దారి లేనివాడను), నీవే నన్ను కడతేర్చడంలో ఉపాయం (సాధనం) కాగలవని భగవత్సన్నిధిలో ఎప్పుడో ఒక్క తడవ మాత్రమే విన్నవించుకొనే బుద్ధియే 'శరణాగతి' అనబడుతుంది. తన

భారమంతటినీ భగవంతుడే వహిస్తాడనే దృఢాధ్యవసాయం గల ప్రార్థనా రూపమైన బుద్ధి 'ఉపాయ'మని సంప్రదాయజ్ఞులు వాడుకొనే పదం.

*శరణాగత జీవనః:–* ఇంటికి వచ్చినవారు శరణాగతులు. చీకటి పడగానే ఇంటికి వచ్చినవారు తెల్లవారగనే బ్రతుకు తెరువుకోసం సంచరించడానికి హేతువు భాస్కరుడు. ఇది భాస్కర పరమైన అర్థం. "ఆదిత్య జ్యోతి రాత్మా"– (ఉపనిషత్తు).

*"అంధకారోఽ స్త్రియాంధ్వాంతం తమిస్రం తిమిరం తమః"*– (అమరం) 'తమిస్రం' అంటే 'చీకటి'. "తమిస్రాతామసీరాత్రిః" (అమరం) 'తమిస్రా' అంటే కటిక చీకటిగలరాత్రి. *"అథ ధ్వాంతే తమిస్రం స్యాత్ తమిస్రా చాంధమధ్వయోః"* (అమరశేషం) అంధకారాన్ని భాస్కరుడు పోగొట్టే విధంగా, నీవే శరణమన్న మా ఆపదను శీఘ్రంగా పోగొట్టుమని దేవతల ప్రార్థన.

*64. సతి సూర్యే సముద్యంతః*
*ప్రతిసూర్యా ఇవాసురాః।*
*జగద్బాధాయ జాయంతే*
*జహి తాన్ స్వేన తేజసా॥* 64

**అర్థం:** సూర్యే, సతి= సూర్యుడు ఉండగా; సముద్యంతః= ఉదయిస్తున్న; ప్రతిసూర్యాః, ఇవ= ప్రతిసూర్యులలాగా; అసురాః= రాక్షసులు; జగత్+బాధాయ= లోకం యొక్క ఉపద్రవం కోసం; జాయంతే= ఉదయిస్తారు; స్వేన= స్వీయమైన; తేజసా= ప్రభావంచేత/ జ్యోతిస్సుచేత; తాన్= ఆ రాక్షసులను; జహి= సంహరింపుము ("హన్తేర్జః"– అని 'జ' ఆదేశం).

**తా॥** సూర్యుడు ఒకడు ఉండగా ప్రతిసూర్యులవలె ఉదయించే అసురులు లోకానికి ఉపద్రవకారకులు. కాబట్టి, భాస్కరుడు తన ప్రచండ జ్యోతిస్సుచే ప్రతిసూర్యుల ప్రతాపాన్ని అణచివేయునట్లు, నీ ప్రభావం మహిమచేత ఆ కంసాది అసురులను సంహరింపుము– అని భగవంతునితో దేవతలు విన్నవించుకొన్నారు.

దేవతలు తమ ఆపద యెట్టిదో తెల్పి, చేయదగిన కార్యాన్ని సూచించారని స్పష్టం కదా!

*65. సదైత్య హత్యా మిచ్ఛద్భిః*
*సురైరేవ మభిష్టుతః।*
*అనన్య దృశ్యః సహసా*
*దయయా దర్శనం దదౌ॥* 65

**అర్థం:** దైత్య హత్యాం= రాక్షసుల సంహారాన్ని; ఇచ్ఛద్భిః= కోరుతున్న; సురైః = దేవతలచేత; ఏవం= ఇట్లు; అభి+స్తుతః= స్తోత్రం చేయబడినవాడై; అనన్య, దృశ్యః = ఏకాంతులైన భక్తులకు; దృశ్యః= చూడయోగ్యుడైన; సః= ఆ పురుషోత్తముడు; సహసా= హఠాత్తుగా; దయయా= కృపతో; దర్శనం= దర్శనాన్ని; దదౌ= ఇచ్చెను.

**తా॥** అసురుల హత్యను కాంక్షించే దేవతలు ఇలాగా స్తోత్రం చేయగనే, పరమైకాంత భక్తులకు మాత్రమే కనబడే ఆ భగవానుడు వారి యెదుట దయతో ఆవిర్భవించాడు.

"అతర్కితే తు సహసా" (అమరం) త్వరగా దర్శనమిచ్చాడని సుస్పష్టం.

*66. తత స్తం దదృశుర్దేవాః*
*శేషపర్యంక మాస్థితమ్।*
*అధి రూఢ శరన్మేఘ*
*మన్యాదృశ మివాంబుదమ్॥* 66

**అర్థం:** తతః= భగవానుడు ఆవిర్భవించిన తర్వాత; దేవాః= బ్రహ్మాది బృందారకులు; శేషపర్యంకం= శేషమంచాన్ని; ఆస్థితం= అధిష్ఠించియున్నవాడు; (అత ఏవ= కావుననే) అధిరూఢ శరత్+మేఘం= అధిష్ఠింపబడిన శరదృతువునందలి మేఘం

కలిగిన; అన్యాదృశం= విలక్షణమైన; అంబుదం, ఇవ= వర్షర్తువునందలి జలధరాన్ని వలె; దదృశుః= చూచినారు.

**తా॥** ఆవిర్భవించిన తర్వాత దేవతలు శేషపర్యంకంమీద అధిష్ఠించి యున్న భగవంతుణ్ణి శరత్కాల మేఘం మీద ఎక్కియున్న లోకోత్తరమైన వర్షాకాల మేఘాన్ని చూచినట్లు చూచారు.

**వ్యాఖ్య:-** దేవతలు భగవంతుణ్ణి దర్శించిన రీతి ఏడు శ్లోకాలలో వివరింప బడుతున్నది.

దేవతలకు భగవానుడు ఉన్నతమైన శేష పర్యంకంపై అధిష్ఠితుడై దర్శన మిచ్చాడు. శేషతల్పం "పంచశయనత్తిన్ మేలేరి" అన్నట్లు ఎత్తైనది, మెత్తనిది, చల్లనిది, తెల్లనిది, సువాసన గలది. తెల్లని శేషపీఠం మీద ఉన్న భగవానుడు జలద శ్యామసుందరుడు. కాబట్టి, తెల్లని శరత్కాల మేఘం మీద ఎక్కియున్న వర్షాకాలమందలి నీలిమేఘంలాగా, దేవతలకు విచిత్రమైన, భగవానుని దర్శనమయింది. సంభావనా రూపమైన ఉత్ప్రేక్షాలంకారం.

67. వత్న్యా సహ నిషేదుష్యా
పద్మలక్షణ లక్ష్మ్యయా।
స్వేచ్ఛయైవ శరీరిణ్యా
సూచితైశ్వర్య సంపదమ్॥ 67

**అర్థం:** సహ= తనతో కూడి; నిషేదుష్యా= ఆసీనయైనట్టి; పద్మలక్షణ లక్ష్మ్యయా= తామరపూవు చిహ్నంతో కనబడుతున్నట్టి; స్వేచ్ఛయా, ఏవ= తన కోరికచేతనే; శరీరిణ్యా= శరీరం కలిగియున్న; పత్న్యా= భార్యయైన లక్ష్మీదేవిచేత; సూచిత+ఐశ్వర్య సంపదం= పరబ్రహ్మ రూపమైన రాజ వైభవంగల శ్రీమహావిష్ణువును దేవతలు దర్శించారు.

**తా॥** శేషపర్యంకంమీద తనతోపాటు నిషణ్ణయైన పద్మహస్తయైన, స్వేచ్ఛా మాత్రం చేత ఆకృతిని పొందిన పత్నియైన లక్ష్మీదేవిచే సూచింపబడిన సుజన సార్వభౌమ రాజభావంగల పురుషోత్తముణ్ణి బ్రహ్మేంద్రాది దేవతలు దర్శించారు.

**వ్యాఖ్య:-** శేష పర్యంకమందు శ్రీదేవితో విరాజమానుడైన భగవానుణ్ణి సేవించిన వర్ణన.

లక్ష్మీదేవి పద్మహస్త- తన చేతులతో తామర కమలాలను లీలగా ధరించినది. కర్మవల్ల జనించినది కాక, తన సంకల్ప మాత్రంచేత అతిలోక సౌందర్యంగల ఆకృతిని దాల్చినది. "హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" అని పురుష సూక్త ప్రకారంగా విష్ణుమూర్తికి పత్నియైనది. పరహిత ప్రావణ్య రూపయైన భగవానుని దయయే- 'కరుణామివ రూపిణీ'- లక్ష్మీదేవి కదా! ప్రతి కార్యమందు శ్రీ, శ్రియఃపతులకు ఐకరస్యాన్ని ఆవిష్కరించడం కోసం భగవదిచ్ఛచేత లక్ష్మీరూపంగా ప్రకాశిస్తుందని "స్వేచ్ఛయైవ శరీరిణ్యా" అనే మాటకు అర్థమన్నారు విజ్ఞులు.

సూచితైశ్వర్య సంపదం:- శ్రీదేవిచేతనే శ్రియఃపతికి పరత్వం నిరూపింప బడినది. పరబ్రహ్మ యొక్క ప్రాభవ వైభవాలకు ముఖ్యకారణం లక్ష్మీదేవియే అన్నమాట ప్రామాణికమే. ఇట్టి పత్నియైన లక్ష్మీదేవితోపాటు శేషపర్యంకం మీద ఆసీనుడై యున్న భగవంతుణ్ణి దేవతలు దర్శించారు (అని పూర్వ శ్లోకంతో అన్వయం).

"తయాసహాసీన మనంత భోగిని"- (స్తోత్రరత్నం) అనే ఆళవందార్ సూక్తి స్మారితం.

*68.* *సుకుమార సుఖస్పర్శ*
*సుగంధిభిరలంకృతమ్।*
*స్వవిగ్రహ గుణారామ*
*ప్రసూనైరివ భూషణైః॥* 68

**అర్థం:** సుకుమార సుఖస్పర్శ సుగంధిభిః= కోమలమైన సుఖకరమైన, స్పర్శ కలిగినట్టి, పరిమళమూ కలిగినట్టి; స్వవిగ్రహ గుణారామ ప్రసూనైః, ఇవ= తన మేని యందే తన గుణాల (ఆరామ) ఉద్యానవనం యొక్క పూలవలె ఉన్నట్టి; భూషణైః = ఆభరణాలచేత; అలంకృతం= అలంకరింపబడిన భగవంతుణ్ణి దర్శించారు.

**తా॥** శేషపీఠమందు లక్ష్మీనాథుడు దివ్యమైన ఆభరణాలచే అలంకరింపబడి యున్నాడు. భూషణాలు మృదువైనవి, స్పర్శ కలిగినప్పుడు సుఖకరమైనవి, మంచి సువాసన కూడా కలిగియున్నాయి. సౌందర్యాది గుణాలకు ఉద్యానవనంగా ఉన్న తన దివ్య విగ్రహమందే పూచిన పూల లాగా శోభించే దివ్యాభరణాలు కలవాడు.

సుఖః స్పర్శః యేషాంతాని= సుఖస్పర్శాని. సుకుమారాణి చతాని సుఖస్పర్శానిచ= సుకుమార సుఖస్పర్శాని. శోభనః గంధః యేషాంతాని= సుగంధీని, సుకుమార సుఖస్పర్శానిచ తాని సుగంధీని చ, సుకుమార సుఖ స్పర్శ సుంగంధీని, తైః- సుంగంధిభిః 'భూషణైః' అనే పదానికి విశేషణం. గుణానాం ఆరామః= గుణారామః స్వవిగ్రహ ఏవ గుణారామః= తస్య ప్రసూనాని= స్వవిగ్రహ-ప్రసూనాని, తైః-ప్రసూనైః, శంఖ రథాంగ కల్పక ధ్వజారవిందాంకుశ వజ్రాదులచేత అలంకరింపబడిన భగవానుణ్ణి దేవతలు సేవించారు. తాత్పర్యం స్పష్టం.

*69. ఆరంజిత జగన్నేత్రై*
*రన్యోన్య పరికర్మితైః।*
*అంగైరమిత సౌందర్యై*
*రను కల్పిత భూషణమ్॥* 69

**అర్థం:** ఆరంజిత జగత్+నేత్రైః= అనురాగం కలుగజేయబడిన లోకలోచనాలు కలిగినట్టి; అన్యోన్య పరికర్మితైః= పరస్పరం ఆభరణంగా ఉన్నట్టి; అమిత సౌందర్యైః = ఎనలేని అందంగల; అంగైః= అవయవాలచేత; అనుకల్పిత భూషణం= రెండవ స్థానమందు ఉంచబడిన ఆభరణాలు గల భగవానుణ్ణి దర్శించారు.

**తా॥** తనను సేవించిన లోకానికి అనురక్తిని కలిగించే కన్నులు కలిగినట్టి ఒకటి మరొకదానికి అలంకారంగా ఉన్నట్టి, అవధిలేని ఆభిరూప్యంగల, అవయవాలచేత తక్కువగా ఎంచబడిన భూషణాలుగల వానిని దర్శించారు.

**వ్యాఖ్య:-** ఆభరణాలకు భూషణంగా ఉన్న దివ్యావయవ సౌందర్యం కలవాడని సుశ్లోకితం.

భగవానుని అవయవాల ఆభిరూప్యం అమితమైనది. గత శ్లోకమందు దివ్యాభరణాలంకృతుడని వర్ణింపబడినాడు. ఈ శ్లోకమందు శరీరానికి సౌందర్యాన్ని పెంచే ఆభరణాలకు- భూషణాలకు- అధమస్థానం కల్పించబడింది. ఆభరణాలకే అందాన్ని కలిగించే దివ్యావయవాలకు ప్రథమ- ముఖ్యస్థానం విధింపబడింది.

ముఖ్యః స్యాత్ ప్రథమః కల్పః, అనుకల్పస్తు తతోఽధమః- (అమరం) ముఖ్యమైన దానిని 'ప్రథమ కల్ప'మంటారు. ముఖ్యమైన దానికంటె తర్వాత ('అముఖ్య'మని) ఎంచబడేదానిని 'అనుకల్ప' మంటారు. ఇక్కడ భూషణాలు అనుకల్పితాలు అనడానికి హేతువు చెప్పబడింది.

*అన్యోన్య పరికర్మితైః- "పరికర్మాంగ సంస్కారః"*- (అమరం). అంగాలను అవయవాలను శోభింపజేసేది 'పరికర్మ' అనబడుతుంది. ఒక అవయవం మరొక అవయవానికి అలంకారంగా ఉంటుంది. భగవానుని అవయవాలను భూషణాలు శోభింపజేయవు. ఆయన అవయవాలు పరస్పరం ఆభరణాలుగా శోభిస్తుంటాయి. కాబట్టి, నిరవధిక సౌందర్యం కలిగిన దివ్యావయవాలముందు భూషణాలు వెలవెల బోతున్నాయి. ఆభరణాలకే ఆభరణాలుగా శోభించే దివ్యావయవ సౌందర్య విశిష్టుడైన భగవానుణ్ణి నిర్జరులు దర్శించారు.

భూషణాలు అనుకల్పితాలు అనడానికి హేతువు 'అంగ' శబ్దం కాబట్టి, ఇది 'పదార్థ హేతుక కావ్యలింగం' అనే అలంకారం.

70. ఉత్తేజిత జయోత్సాహ
మాయుధై రనఘోద్యమైః।
శౌర్య విక్రమ శక్త్యా ద్యైః
సహజైః స్వగుణై రివ॥ 70

**అర్థం:** అనఘ+ఉద్యమైః= వ్యర్థం కానట్టి; ఉద్యోగం- ప్రయత్నం- కలిగిన; శౌర్య, విక్రమ, శక్తి+ఆద్యైః= బలం, పరాక్రమం, సామర్థ్యం మొదలైనవి కల్గిన; సహజైః= స్వభావ సిద్ధమైన; స్వగుణైః, ఇవ= తన గుణాలచేత వలె ఉన్నట్టి; ఆయుధైః = ఆయుధాలచేత; ఉత్తేజిత జయ+ఉత్సాహం= ప్రకాశింపజేయబడిన జయం యొక్క ఉత్సాహం కలిగిన భగవంతుణ్ణి దర్శించారు.

**తా॥** అమోఘమైన ఉద్యమం కల్గినట్టి, శౌర్య విక్రమ, శక్త్యాదులు కల్గిన, స్వాభావికమైన ఆత్మీయ గుణాలచేత ఎట్లో, అట్లే ఉన్న ఆయుధాల చేతనూ ఉత్తేజింపబడిన జయోత్సాహం కలిగిన భగవానుణ్ణి దర్శించారు దేవతలు.

**వ్యాఖ్య:**- సహజగుణాలవలె ఆయుధాలు కూడా భగవంతుణ్ణి ఉత్తేజపరుస్తా యని వర్ణితం.

భగవానుని శౌర్య విక్రమ శక్త్యాది గుణాలు ఆయనను ఉద్యమింపజేసి సఫలునిగా చేస్తాయి. 'అంహో దుఃఖ వ్యసన వాచియైన 'అఘ' శబ్దానికి 'వితథ' మనే అర్థం సముచితమే' అన్నారు వ్యాఖ్యాతలు. న+అఘం= అనఘం అంటే అవితథం-దోషంలేనట్టిది. వ్యర్థంగానట్టిది అని అర్థం. "గురణముద్యమే"-(అమరం). ఉద్యమం, ఉద్యోగం సమానార్థకాలు. గుణాలచేత సఫలీకృతుడని అర్థం.

శౌర్య విక్రమ శక్త్యాద్యైః:- భగవద్గుణాలు స్వభావ సిద్ధమైనవి. శౌర్యమంటే బలమని అర్థం. 'విక్రమ' శబ్దానికి బలాన్ని ప్రయోగించడమని అర్థం. 'శక్తి' అంటే సామర్థ్యం, ప్రభుశక్తి, మంత్రశక్తి ఉత్సాహశక్తి అని మూడు విధాలు.

అందులో 'ఉత్సాహ' మంటే అత్యధికంగా విక్రమించే చేష్ట. 'ఆది' శబ్దంచేత ఐశ్వర్యం, తేజస్సు మొదలైన అనంత కల్యాణ గుణాలున్నాయి.

గుణాలే కదా పూజనీయాలు, రూపంకాదు, వయస్సు కాదు. కాబట్టి *"గుణలుబ్ధాః స్వయమేవ సంపదః"*- అన్నాడు భారవి.

*"విక్రమః శౌర్యకరణం"*- (వైజయంతి) *"సహజం నిజమాజానం"*- (వైజయంతి) స్వగుణైరివ ఆయుధైః ఉత్తేజిత జయోత్సాహం:-

(తిజ-నిశాతనే) (తేజిత మంటే వాడిగా చేయబడినట్టిది, పదును పెట్టబడినది అని అర్థం) ఉత్+తేజితం= ఉత్తేజితం= ప్రజ్వలింపజేయబడినది అని అర్థం. స్వీయగుణాలు ఉత్తేజపరచునట్లే, శంఖచక్రాద్యాయుధాలు కూడా భగవంతుని జయోత్సాహాన్ని ఉట్కంతగా ప్రకాశింపజేస్తాయి. దివ్యమంగళ విగ్రహానికి భూషణాలై ఉండే శంఖచక్రాదులు, లోక కంటకులైన అసురుల వృత్తాంతం ప్రస్తావింపబడిన వెంటనే, భగవంతుణ్ణి కన్నెత్తి చూడరానంత తేజస్విగా ప్రకాశింపజేస్తూ, జయశీలమైన ఉత్సాహాన్ని కలుగజేస్తాయి. అట్టి జయోత్సాహం కలిగియున్న భగవంతుణ్ని దేవతలు దర్శించారు.

*71. స్వకాంతి జలధే రన్తః*
*సిద్ధ సంహననం స్వతః।*
*మహిమ్నా జాతవైచిత్ర్యం*
*మహానీల మివోదితమ్॥* 71

**అర్థం:** స్వకాంతి జలధేః= తన కాంతి అనే సముద్రం యొక్క; అంతః= మధ్యన; స్వతః= స్వయంగా; సిద్ధసంహననం= సంపన్నమైన శరీరం కలిగినట్టి; మహిమ్నా= ప్రభావం చేత; జాతవైచిత్ర్యం= సంభవించిన ఆకార వైచిత్రి కలిగినట్టి; ఉదితం= ఉద్భవించిన; మహానీలం, ఇవ= ఇంద్రనీలమణిలాగా ఉన్న మూర్తిని దర్శించారు.

**తా॥** స్వీయ తేజస్సు అనే సముద్రం నడుమ స్వతః సిద్ధమైన విగ్రహం కలిగిన, తన మహిమచేతనే సంపన్నమైన వైచిత్రి కలిగి ఉద్భవించిన మహానీలమణి వలె ప్రకాశించే భగవంతుణ్ణి దేవతలు సేవించారు.

**వ్యాఖ్య:-** ఇంద్రనీలమణివలె ప్రకాశించే దివ్యవిగ్రహాన్ని దర్శించారని సుశ్లోకితం.

సముద్రం లోపల విచిత్రాకృతితో ఉద్భవించేది మహానీలమణి. "సింహళ స్యాకరే జాతా మహానీలా ఇతిస్మృతాః" అని రత్న శాస్త్రం. విగ్రహ కాంతి సముద్రం లాగా ఉంది. సముద్రంలోపల విచిత్రమైన ఆకృతిగల నీలమణిలాగా విగ్రహమున్నది. తన మహిమచేతనే తన దివ్యావయవ సౌష్ఠవం గల విగ్రహం నిర్మింపబడింది. మరొకరిచేత నిర్మింపబడినట్లైతే అంత అద్భుతమైన ఆభిరూప్యం సౌందర్యం సంభవించదు కదా! *"గాత్రం వపుః సంహననం"*- (అమరం).

తన మహిమవలననే సంపన్నమైన కరచరణాదులు కలవాడు కాబట్టి స్వకాంతి అనే సముద్రంలో స్వతః సిద్ధమైన అద్భుత సర్వావయవ దివ్యరూపంతో, ఆ సముద్రంలోనే ఆవిర్భవించిన ఇంద్రనీలమణివలె ప్రకాశిస్తున్న భగవంతుడు దేవతలకు కనబడినాడు.

*72.* *శ్రుతి రూపేణ వాహేన*
*శేషకంకణ శోభినా।*
*స్వాంఘ్రి సౌరభదిగ్ధేన*
*దత్త సంగ్రామ దోహలమ్॥* 72

**అర్థం:** శేషకంకణ శోభినా= శేషుడే కంకణంగా శోభించి యున్న; స్వ+అంఘ్రి సౌరభదిగ్ధేన= తన పాదాల సువాసనచే పూతచేయబడిన; శ్రుతిరూపేణ= వేదాత్మకుడైన; వాహేన= వాహనం (గరుడుని) చేత; దత్తసంగ్రామ దోహలం= ఇవ్వబడిన యుద్ధాభిలాష కలిగిన భగవంతుణ్ణి సేవించారు.

**తా॥** శేష సర్పం కడియంగా శోభిస్తున్న, భగవచ్చరణ పద్మాల సుగంధంచే లిప్తమైన, వేదాత్ముడైన వాహనం- గరుత్మంతునిచేత దత్తమైన యుద్ధాభిలాషగల గరుడ వాహనుని దర్శనం దేవతలకు కలిగింది.

**వ్యాఖ్య:-** పక్షిరాజ ప్రేరితమైన యుద్ధ వాంఛ గల దివ్యవిగ్రహాన్ని దర్శించారని వర్ణితం.

భగవానుడు గరుడవాహనుడు. గరుత్మంతుని ఎడమ పాదమందు ఆదిశేషుడనే సర్పరాజు కంకణంలాగా చుట్టుకొని యుంటాడు. "వామే వైకుంఠశయ్యా ఫణిపతికటకః" (గరుడ పంచాశత్) కాబట్టి సర్పకంకణం చేత శోభించేవాడు గరుత్మంతుడు.

*స్వాంఘ్రి సౌరభదిగ్ధేన:*- గరుడారూఢుడైనప్పుడు భగవంతుని పాదకమలాల సువాసనచే పులుమబడిన దేహంకలవాడు ఖగరాజు. "నాగాంత కో విష్ణురథః" (అమరం).

*శ్రుతిరూపేణ వాహేన:*- వేదవేద్యుడైన విష్ణుభగవానుని వాహనం వేదమే శరీరంగా కలిగిన సుపర్ణుడు. "సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్ తే శిరః" అనే మంత్రంచే స్తుతింపబడే గరుడుడు వేదమయుడు. "వేదాత్మా విహగేశ్వరః" (చతుః శ్లోకి.)

*దత్త సంగ్రామ దోహలం:*- భగవత్సన్నిధిలోనే ఉన్నందువల్ల, గరుడుణ్ణి చూచినదే తడవుగా "అసురులపై యుద్ధానికి పోదాం, సిద్ధమవండి" అని భగవంతునికి యుద్ధం చేయాలనే కోరికను ప్రేరేపించేవాడు వైనతేయుడు. కాబట్టి తన వాహనాన్ని చూడగానే యుద్ధాభిలాష కలిగిన విష్ణుమూర్తిని అమృతాంధసులు ఆర్తితో సేవించారు. "దోహలం దోహదం చందః" (అమరశేషః).

73. స్వవేత్ర స్పంద నిఃస్పంద
నేతవ్యేన నివేదితమ్।
భక్తి నమ్రేణ సేనాన్యా
ప్రతిశృణ్వంత మింగితైః॥ 73

**అర్థం:** స్వవేత్ర స్పంద నిఃస్పంద నేతవ్యేన= తన చేతి బెత్తెము (కఱ్ఱ) యొక్క చలనంచేత నిశ్చలులు తీసుకొని పోదగినవారుగా కలిగినట్టి; భక్తి నమ్రేణ= భక్తిచేత నమ్రుడైనట్టి; సేనాన్యా= విష్వక్ సేనునిచేత; నివేదితం= విన్నవించబడిన దాన్ని; ఇంగితైః= సంజ్ఞలచేత; ప్రతిశృణ్వంతం= వినిపించే మూర్తిని చూచారు.

**తా॥** విష్వక్సేనుడు శ్రీవైకుంఠమందు సేనా నాయకుడు. తన చేతి కఱ్ఱను పైకి ఎత్తి ఆడించడం వల్ల నిశ్చలులైన వారిని భగవత్సన్నిధికి తీసుకొని పోదగిన వాడు. భక్తిచేత నమ్రుడైన చమూపతి తెల్పిన విషయాన్ని విని, సైగలచేతనే వినిపించే విష్ణుభగవానుని దర్శించారు.

**వ్యాఖ్య:-** విష్వక్సేనుని అధికార నిర్వహణను వర్ణించే శ్లోకమిది.

భగవత్సన్నిధిలో తమ కార్యాలను నివేదించడానికి వచ్చిన వారిని ప్రవేశపెట్టేవాడు సేనాని. గుంపులు గుంపులుగానూ, 'నేనే ముందు పోతాను' అంటూ ఒకరినొకరు త్రోసివేస్తూ, మీది మీదవచ్చి పడుతున్నవారిని వారించడానికి శాసనాధికారానికి ప్రతీకగా ఉన్న చేతికఱ్ఱను మీదికెత్తి కదిలిస్తూ, "మీరు అందఱు క్రమంగా బారుదీఱి నిలబడండి" అని ఆజ్ఞాపించగా కట్టుబడి యుండేవారు 'నేతవ్యలు'- (నీఞ్-ప్రాపణే) ప్రాపణీయులు, పొందింపయోగ్యులు (ఎవరు?). తన వేత్ర స్పందన చేత నిఃస్పందులైన- నిశ్చలులైనవారు- నిఃస్పందులు. నేతవ్యులుగా కలవాడు విష్వక్సేనుడు (బహువ్రీహి సమాసమిది).

"నిష్పంద ఇతి షత్వం చింత్యమ్" అనే వామనునిచే చెప్పబడినందువల్ల షత్వ లక్షణం లేనిరూపం 'నిఃస్పందః'. భక్తిచే నమ్రుడైన సేనాని నివేదించిన

ప్రయోజనాన్ని విని 'అట్లే అగుగాక' అని తలనూపియో, కనుబొమల కదలికయో మొదలైన ఇంగితాల- సైగలచేత తన ఆమోదాన్ని తెల్పే భగవానుణ్ణి దేవతలు దర్శించారు.

'ప్రతిశృణ్వంతం' అనే చోట 'ప్రతిజానంతం' అని దీక్షితుల వ్యాఖ్య. 'ప్రతిజానానం' యుక్తమని ఉత్తమూరి వారి వ్యాఖ్య.

సూక్ష్మమైన, ప్రభు సమీపమందు వేత్ర ధర క్రియా స్వభావం యొక్క మరియు ప్రభువు యొక్క నివేదితార్థ ప్రతిశ్రవ క్రియా స్వభావం యొక్క వర్ణనవల్ల 'స్వభావోక్తి' అనే అలంకారమిది.

74. అనపాయం తమాదిత్య
మక్షయం తారకాధిపమ్।
అపార మమృతాంభోధి
మమన్యంత దివౌకసః॥ 74

**అర్థం:** దివౌకసః= దేవతలు; తంః= భగవంతుణ్ని; అనపాయం= అస్తమించని; ఆదిత్యం= సూర్యునిగానూ; అక్షయం= తరుగని; తారక+అధిపం= చంద్రునిగానూ; అపారం= తీరంలేనట్టి; అమృత+అంభోధిం= సుధా సముద్రంగానూ; అమన్యంత= తలచిరి.

**తా॥** దేవతలు భగవంతుణ్ణి అస్తమించని భాస్వంతునిగానూ, క్షీణించని చంద్రునిగానూ, పారమే లేని అమృత సముద్రంగానూ భావించారు.

**వ్యాఖ్య:-** నిత్య నిరతిశయ స్వరూప ప్రాభవ వైభవాలు గలవాడని దేవతలు భగవంతుణ్ణి దర్శించి హర్షించారని వర్ణితం.

దివ్, ఓకః యేషాంతే= దివౌకసః, స్వర్గం స్థానంగా కలవారు. (సకారాంతః పుంలింగ బహువచనం). "త్రిదివేశా దివౌకసః" (అమరం) దేవతలని అర్థం.

అనపాయం తమాదిత్యం:- కాలమాన ప్రకారం సూర్యుడు ఉదయం, అస్తమయం కలవాడు. ప్రతిదినం ప్రొద్దు పొడుస్తుంది, ప్రొద్దు క్రుంకుతుంది కదా! నిత్యం సూర్యుడు ఉదయించి, నిద్రావస్థలో ఉన్న జనులకు తన తేజస్సుతో చైతన్యాన్ని కలిగిస్తాడు, అస్తమించి లోకాన్ని తిమిరమయం చేస్తాడు. "ఉద్యంతమస్తయ్యంతమాదిత్యం" అని శ్రుతి పల్కుతుంది.

భగవానుడు మాత్రం ఎల్లప్పుడూ నిరవధిక తేజస్సుతో భ్రాజమానుడై అస్తమయమే లేనట్టి అలౌకిక ఆదిత్యుడని అమరులు హర్షించారు.

అక్షయం తారకాధిపమ్:- కళానిధియైన చంద్రుడు పెరుగుతాడు, తరుగుతాడు. చంద్రుని కళలు లోకాన్ని ఆహ్లాదింపజేసే మహాస్తత్త్వం కలవి. అయినా అవి ఒకే విధంగా ఉండవు. వాటికి క్షయమున్నది. చంద్ర బింబంలో కళంకమున్నది. భగవానుడు నిత్యం నిర్మలమైన దివ్యస్వరూపంతో ఒకేవిధంగా ఉండి సౌమ్యభావంతో ప్రసన్నుడై లోకాలకు ఆహ్లాదాన్ని కలిగిస్తాడు.

అపార మమృతాంభోధిమ్:- విశాలమైన, గంభీరమైన సముద్రానికి పారం, తీరం ఉంది. సముద్రజలం లవణమయం, త్రాగరానిది కదా! భగవానుని దివ్యావయవ సౌందర్యం అపారమైనది. అమృతమయ సముద్రం లాగా సేవ్యం ఆ దివ్యమంగళ విగ్రహం. "మధురం మధురం అఖిలం మధురం" అన్నట్లు ఆ యాభిరూప్యం ఆస్వాదనీయం కదా!

ఆదిత్య చంద్ర జలధులకంటె అపరిచ్ఛిన్నమైన వైలక్షణ్యం కలవాడు భగవానుడు. నానా ధర్మాలబలంవల్ల ఒక్క వస్తువునే నానా రూపాలు కలిగి యున్నదని వర్ణించడం, ఉల్లేఖాలంకారం.

75. అభయోదార హస్తాగ్ర
మనఘ స్వాగతస్మితమ్।
అవేక్ష్య విబుధా దేవ
మలభంత దృశోః ఫలమ్॥ 75

**అర్థం:** విబుధాః= దేవతలు; అభయ+ఉదార, హస్త+అగ్రం= అభయముద్ర చేత ప్రసిద్ధమైన హస్తాగ్రం కలిగినట్టి; అనఘ, స్వాగత, స్మితం= దుఃఖాన్ని తొలగించే కుశల ప్రశ్న రూపమైన చిరునగవు కలిగినట్టి; దేవం= భగవంతుణ్ణి; అవేక్ష్య= చూచి; దృశోః= కన్నుల యొక్క; ఫలం= లాభాన్ని; అలభంత= పొందినారు.

**తా॥** అభయముద్ర ఉన్న ఉదార హస్తాగ్రం కలిగిన, వ్యసన హరమైన స్వాగతాన్ని సూచించే మందహాసం కలిగిన దేవుని• జూచిన దేవతలకు నయనానందం కలిగింది.

**వ్యాఖ్య:-** భగవానుడు దేవతలకు నేత్రోత్సాహాన్ని కలిగించాడని సుశ్లోకితం.

*"దేవం లోకయ లోచనద్వయ!"* అన్నట్లు భగవద్దివ్య మంగళ విగ్రహాన్ని దర్శించడమే కన్నులున్నందుకు ఫలం కదా! దేవతలు తమకు జగానికి అసురుల వల్ల కలుగుతున్న బాధలను, భయాన్ని తొలగించుమని ప్రార్థించారు. భగవానుడు అభయ ముద్రతోనూ, మందస్మిత వదనంతోనూ (ఉన్న) నిజరూపాన్ని దేవతలు దర్శించడానికి అనుగ్రహించాడు.

*అభయోదార హస్తాగ్రమ్:-* భగవానుడు ఉదారహస్తుడు. ఉదారగుణం ఉంటేనే కాని కోరిన ఫలాన్ని చేతితో ప్రసాదించలేడు కదా! ప్రధానమైన దేవతల కోరికను నెరవేర్చడానికి సూచనగా *"భయం త్యజత!"* భయపడకండి! అనే అభయ ముద్రచే ప్రసిద్ధ హస్తాగ్రం దేవతలకు కనబడింది. శరణాగతులకు *"అభయం సర్వ భూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ"*- అభయమిస్తున్నాను, అనే దీక్షను ప్రకటించిన ప్రఖ్యాత హస్తాగ్రమది.

*"ఉదారో మహతి ఖ్యాతే"*- (వైజయంతి).

*అనఘ స్వాగతస్మితమ్:-* తర్వాత చిరునగవు కనబడింది. *"స్మిత పూర్వభాషి"*- అనుగ్రహభాషణం కంటే ముందు చిన్నగా నగవు నొలికించడం

స్వామి యొక్క స్వభావం. వెన్నెలవాకవంటి ఆ చిరు నగవును దర్శించిన వెంటనే అది, వారి సకల దుఃఖ వ్యసనాలను తొలగిస్తుంది. అంతేకాదు, అది వారికి స్వాగతాన్నీ కుశలాన్నీ తెల్పుతుంది.

"కర్తవ్యేఽతి ప్రియాలాపే స్వాగతం కుశలం మతమ్"- (శబ్దార్ణవం) "భద్రం వః"- మీకు క్షేమమే అని మనస్సుకు స్థైర్యాన్నీ కల్పిస్తుంది. ఇట్లు దేవతలకు కన్నుల పండుగగా భగవద్దర్శనం లభించడం మహాభాగ్యం కదా!

దేవతలెందఱున్నా, వారి కన్నులకు బహువచనం పలుకకుండా, 'దృశోః' అని షష్ఠీ విభక్తి ద్వివచనాన్ని "స్తనాదీనాం ద్విత్వ విశిష్టా జాతిః ప్రాయేణ"- అని వామన సూక్తి రీతిగా- చన్నులు, కన్నులు రెండేసి ఉండడం వల్ల, ఆ జాతి లక్షణాన్నిబట్టి, కవి ప్రయోగించాడు.

*76.* *తస్మై విజ్ఞాపయామాసు*
*ర్విదితార్థాయ నాకినః।*
*నిహతా శేష దైత్యాయ*
*నిదానం స్వాగతేః పునః॥* 76

**అర్థం:** నాకినః= దేవతలు; నిహత+అశేష దైత్యాయ= చంపబడిన సమస్త రాక్షసులు కలిగిన; విదిత+అర్థాయ= తెలుపబడిన ప్రయోజనంగల; తస్మై= ఆ పురుషోత్తముని కొరకు; స్వ+ఆగతేః= తమ రాకకు; నిదానం= కారణాన్ని; పునః= మళ్ళీ; విజ్ఞాపయా మాసుః= విన్నపించారు.

**తా॥** కాలనేమి ప్రముఖ సమస్త దైత్యులను చంపినట్టి, చచ్చిన రాక్షసులు మళ్ళీ భూమియందు పుట్టి బాధిస్తున్నారనే విషయం తెల్పబడిన ఆ పరమ పురుషునికి దేవతలు తమ రాకకు ముఖ్యకారణాన్ని మళ్ళీ నివేదించారు. స్పష్టం.

77. త ఇమే క్షత్రి యా భూత్వా
క్షోభయన్తి క్షమామిమామ్।
తవ తేజసి య్యైర్నాథ!
దనుజైః శల భాయితమ్॥ 77

**అర్థం:** హే నాథ!= ఓ ప్రభూ!; తవ= నీ యొక్క; తేజసి= ప్రతాపమనే అగ్నియందు; య్యైః= ఏ; దనుజైః= రాక్షసులచేత; శలభ+ఆయితమ్= మిడుతలుగా ఆచరింపబడినారో; తే= అట్టి; ఇమే= ఈ దనుజులు; క్షత్రియాః= క్షత్రియ రాజులుగా; భూత్వా= జనించి; ఇమాం= ఈ; క్షమాం= భూదేవిని; క్షోభయ్యంతి= బాధపెడుతున్నారు.

**తా॥** ఓ ప్రభూ! నీవు నీ ప్రతాపమనే అగ్నియందు రాక్షసులను మిడుతలవలె బుగ్గిజేశావు. ఆ రాక్షసులే క్షత్రియరాజులుగా పుట్టి, ఇదో మీ ముందు మొరపెట్టుకొనడానికి వచ్చిన ఈ భూదేవిని చాలా క్షోభపెడుతున్నారు. తాత్పర్యం స్పష్టం.

"తేజోబలే ప్రతాపే చరోచి ష్య ర్చిషి రేతసి నవనీతేఽ నలేఘర్మే"- (యాదవ నిఘంటువు). 'శలభాయితం' అన్నచోట ఉపమాలంకారం. 'తేజసి' అని శ్లేషమూలకంగా అభేదాధ్యవసాయ రూపమైన అతిశయోక్త్యలంకారం. సంకరాలంకృత శ్లోకమని సుస్పష్టం.

78. చతుర్ణాం పురుషార్థానాం
ప్రసవో యత్సమాశ్రయాత్।
హవ్య కవ్య ప్రసూరేషా
దీర్యతే దైత్య భారతః॥ 78

**అర్థం:** చతుర్ణాం= నాలుగు; పురుషార్థానాం= పురుషార్థాలకు; యత్, సమాశ్రయాత్= దేని ఆశ్రయంవల్ల; ప్రసవః= ఉత్పత్తియో; ఏషా= ఇట్టి; హవ్యకవ్య

ప్రసూః= హవ్య కవ్యాలను ఉత్పత్తి చేసే భూమి; దైత్య భారతః= రాక్షసుల భారంచేత; దీర్యతే= చీల్చబడుతున్నది.

**తా॥** మానవులు భూమిని ఆశ్రయించి యజ్ఞదానాది ధర్మాలను సంపాదిస్తుంటారు. దానికి కారణంగా అర్థకామాలను ఈ లోకంలో పొందుతారు. బ్రహ్మ విద్యోపాసన ద్వారా పరలోకంలో మోక్షాన్నీ అనుభవించే యోగ్యతను సంపాదించుకొంటారు కాబట్టి "వివిదిషంతి యజ్ఞేన దానేన" అనే శ్రుతిరీత్యా, చతుర్విధ పురుషార్థాల ఉత్పత్తి భూమిని ఆశ్రయించడంవల్ల జరుగుతుందని పూర్వార్థం వివరిస్తున్నది.

హవ్య కవ్య ప్రసూః - "హవ్యకవ్యేదైవ పిత్ర్యే అన్నే" (అమరం). అగ్నిముఖం ద్వారా దేవతలకు అర్పించబడిన హవిస్సు- ద్రవ్యం- వారికి ఆహారంగా మారుతుంది. దేవతల కొరకైన అన్నం 'హవిస్సు' అనబడుతుంది. పితృదేతలకోసం వ్రేల్చబడిన ద్రవ్యం- అన్నం 'కవ్యం' అనబడుతుంది. హవ్యకవ్యాలనూ, సకల ఓషధులనూ ఉత్పత్తి చేసేది భూమి.

ఏషా దీర్యతే దైత్య భారతః:- రాక్షసుల బరువుచేత ఈ భూమి వ్రయ్యలవుతున్నది.

దౄ- విదారణే అనే ధాతువునకు (కర్మకర్తరి) యక్ ప్రత్యయం చేరినందువల్ల, 'దీర్యతే' ఆత్మనే పది లట్' వర్తమాన ప్రథమ పురుషైక వచన రూపమిది. దేవతలు, సర్వపురుషార్థాలకు ఉపయోగపడే భూమిని రక్షించాలని వేడుకొన్నారు.

*79.* జాతా నిఖిల వేదానా
ముత్తమాంగో పధానతః।
త్వత్పాద కమలాదేషా
త్వదేకాధీన ధారణా॥ 79

**అర్థం:** నిఖిల వేదానాం= సకల వేదాలకు; ఉత్తమాంగ+ఉపధానతః= శిరస్సుగా ఉన్న ఉపనిషత్తులకు తలగడగా ఉన్నట్టి; త్వత్, పాదకమలాత్= నీ చరణారవిందం నుంచి; జాతా= ఉదయించిన; ఏషా= ఈ భూదేవి; త్వత్+ఏక+అధీన ధారణా= నీ ఒక్కనికే అధీనమైన (ప్రాణ) ధారణ కలది.

**తా॥** సకల వేదాలకూ వేదాంతాలకూ తలదిండుగా నున్నది భగవత్పాద కమలం. అంటే, వేదాలన్నీ ప్రతిపాదించడం వల్ల ఆశ్రయింప దగినదవడంచేత ఉపధానంగా చెప్పబడింది భగవచ్చరణరాజీవం.

త్వత్పాదకమలా జ్జాతా:- భగవానుని పాదపద్మం నుంచి ఉద్భవించింది భూదేవి. *"పద్భ్యాం భూమిః"* (పురుషసూక్తం). *"భూః పాదౌయస్య"* (వి.స.ధ్యాన శ్లోకం) అని శ్రుతి స్మృతులు బలపరచిన మాట ఇది.

త్వదేకాధీన *ధారణా:*- భూదేవి యొక్క పోషణ భారం ఒక్క భగవంతుని అధీనమందున్నది. భగవత్పాదకమలం నుంచి ఉత్పన్నమైన భూదేవి భగవానుని చేతనే రక్షింపదగినదని తాత్పర్యం.

భగవత్పాదకమలం వేదవేదాంతాలకు ఉపధానంగా ఆరోపించబడినందు వల్ల ఏకదేశ వివర్తి రూపకాలంకారం.

"త్వత్పాదకమలాత్" అన్నచోట ఉపమాలంకారం. ఈ రెంటి యొక్క సంసృష్టి ఇది.

*80. యది న త్వరతే నాథ!*
*భార వ్యపనయే భవాన్।*
*ప్లావయిష్యంత్యుదన్వంతః*
*పృథివీం పృథు వీచయః॥* 80

**అర్థం:** హే నాథ!= ఓ ప్రభూ!; భవాన్= నీవు; భార వ్యపనయే= బరువును తొలగించడమందు; యది= ఒకవేళ; న, త్వరతే= తొందరపడకపోతే; పృథు వీచయః = గొప్ప తరంగాలుగల; ఉదన్వంతః= సముద్రాలు; పృథివీం= భూమిని; ప్లావయిష్యంతి= తడిపి ప్రవహించగలవు.

**తా॥** ఓ ప్రభూ! నీవు భూమియొక్క బరువును దించివేయడంలో ఏ మాత్రం ఆలస్యం చేసితివేని, గొప్ప గొప్ప కెరటాలుగల సముద్రాలు భారం చేత వంగిపోతున్న భూమిని ముంచి, మించి ప్రవహిస్తాయి- అన్నారు.

*81.* *కరుణాధీన చిత్తేన*
*కర్ణధారవతీత్వయా।*
*మాఽ వసీదతు పృథ్వీయం*
*మహతీ నౌ రివాంభసి॥* 81

**అర్థం:** కరుణా+అధీన చిత్తేన= దయాపరతంత్ర హృదయుడవైన; త్వయా= నీ చేత; కర్ణధారవతీ= నావికుడు కలిగిన; ఇయం= ఈ; పృథ్వీ= భూమి; మహతీ= గొప్పదైన; నౌః, ఇవ= నావ వలె; అంభసి= జలమందు; మా, అవసీదతు= మునుగక ఉండు గాక.

**తా॥** నావికుడున్న నౌక సముద్ర జలమందు మునుగక ఉండే విధంగా, దయాపరతంత్రుడవైన నీవు ఉండగా- ఈ భూమి బరువుచే క్రుంగిపోక భద్రంగా ఉండు గాక.

"కర్ణధారస్తు నావికః"- (అమరం). భగవంతునియందు కర్ణధారత్వమనే ఆరోపణ భూమికి అవసాద పరిహరణ రూపమైన ప్రస్తుత కార్యోపయోగం వల్ల పరిణామాలంకారం. దానితో సంకీర్ణమైన ఉపమాలంకారమూ ఉన్నది.

82. *రశనా రత్నరూపేణ*
*పయోధి రశనా త్వయా।*
*ప్రశాంత దనుజక్లేశా*
*పరిష్కరణ మర్హతి॥* 82

**అర్థం:** పయోధిరశనా= సముద్రమేఖలయైన భూదేవి; రశనా రత్న రూపేణ= మేఖలకు రత్నతుల్యంగా ఉన్న; త్వయా= నీ చేత; ప్రశాంత దనుజ క్లేశా= శమించిన రాక్షస బాధకలదవుతుండగా; పరిష్కరణం= అలంకారం; అర్హతి= తగును.

**తా॥** సముద్ర రశనయైన భూదేవి, రశనకు రత్నతుల్యుడవైన నీవు రాక్షస బాధను శమింపజేసినప్పుడు పరిష్కరణం యుక్తంగా ఉంటుంది.

**వ్యాఖ్య:-** భూభారాన్ని తొలగిస్తే పరిష్కారం అర్హమగును అనే శ్లోకం.

*పయోధిరశనా:-* సముద్రం మొలనూలుగా కలది భూదేవి. "*స్త్రీ కట్యాం మేఖలా కాంచీ సప్తకీ రశనా తథా! క్లీబే సారసనంచ*" (అమరం). అశ్నోతి కటీం ఇతి= రశనా (అశూ-వ్యాప్తౌ). స్త్రీల యొక్క కటి- మొలయందు వ్యాపించే భూషణం (ఒడ్యాణం). "*రశనా షోడశ సరా*"- స్త్రీల యొక్క ఐదు (5) విధాలైన కట్యాభరణాలలో 'కాంచి' అనేది ఒంటి సరం కలది. 'రశన' పదహారు (16) సరాలు కల ఒడ్యాణం.

*రశనా రత్నరూపేణ:-* భూదేవికి సముద్రం రశన అయితే, ఆ సముద్రమందు పవళించే భగవానుడు రశనకు రత్నం వంటివాడు; రత్నసదృశుడు. (రత్నానికి) రూప శబ్దం ఉత్తర పదంగా ఉన్నప్పుడు మాత్రం అది సదృశ వాచకమవుతుంది.

"*స్యురుత్తర పదేత్వమీ, నిభసంకాశ నీకాశ ప్రతీకాశోపమాదయః*"- ఇక్కడ ఆది శబ్దంచేత భూత, రూప, కల్పాదులు చెప్పబడినవి- అని అమరకోశ వ్యాఖ్యాతలు వివరించారు.

*ప్రశాంత దనుజక్లేశా పరిష్కరణ మర్హతి:-* కష్టాలను, బాధలను అనుభవిస్తున్న భూదేవికి పరిష్కరణం అలంకరణంతోనేమి ప్రయోజనం?

*"అంకారస్త్వాభరణం పరిష్కారో విభూషణమ్, మండనంచ"* (అమరం). కాబట్టి రాక్షసులను సంహరించి, బాధలను తొలగించినప్పుడు భూదేవి, పరిష్కారానికి అర్హమైనది, పరిష్కరించ తగినదని భావం. దనుజుల వలన కలుగుతున్న క్లేశాన్ని తొలగించిన తర్వాత భగవానుడు పరిష్కార రత్న రూపంగా సముద్రమందు శయనించడం సముచితమని సారార్థం. 'రశనా రత్నరూపేణ' అనడంవల్ల ఉపమోపక్రమోత్ప్రేక్షాలంకారం. భగత్స్వరూపమందు రశనా రత్నత్వారోపణ పరిష్కరణ కార్యోపయోగం కలది. కాబట్టి పరిణామాలంకారం.

*83. కంస ప్రభృతి భిః సేయం*
*శల్యైరివ సముద్ధృతైః।*
*చిరం భవతు తే పృథ్వీ*
*శేష మూర్తేః శిఖండకః॥* 83

**అర్థం:** సా= ఆ; ఇయం= ఈ; పృథ్వీ= భూమి; శల్యైః, ఇవ= లోపలికి చొచ్చుకపోయిన బాణాలచేతవలె; సముద్ధృతైః= పైకి తీయబడిన; కంస ప్రభృతిభిః= కంసుడు మొదలైన వారిచేత; చిరం= చాలాకాలం; తే= నీ యొక్క; శేషమూర్తేః= శేషుని ఆకృతికి; శిఖండకః= కాకపక్షం; భవతు= అగుగాక.

**తా॥** బాధలను అనుభవిస్తూ, సన్నిహితమై యున్న ఈ భూదేవికి కంసాది రాక్షసులు హృదయంలోకి చొచ్చుకొనిపోయిన బాణాల లాగా ఉన్నారు. ముల్లును ముల్లుతోనే తీసివేయాలి కదా! కాబట్టి, శల్యాలచేతనే శల్యాలను పైకి తీసినట్లు కంసాది రాక్షసులను ఉద్ధరించవలెను, సంహరించవలెను. తత్ఫలితంగా, చిరకాలం నీ యొక్క శేషునికి ఈ భూదేవి శిఖండకంగా ఉండగలదు.

"కాక పక్షః శిఖండకః"- (అమరం). నల్లగా ఉండి కదిలే జుట్టు అని అర్థం. తలమీద ఉండే పిలక జుట్టు తలకు, భారంగా ఉండక, సుఖంగా వహించేటట్లు ఉంటుంది.

జగదాధారుడు శేషుడు- కంసాది రాక్షసుల సంహారం చేత భూదేవికి భారం తగ్గుతుంది. భూభారాన్ని వహించే ఆదిశేషునికి కూడా భూదేవి, బరువుగా ఉండక, శిరస్సున పిలకవలె, చాలా తేలికగా ఉండగలదు అని దేవతల వేడుక.

"దధ్నాజుహోతి"- అనే న్యాయంగా విశేషణ విధి పర్యవసన్నమైనది. పూర్వమీమాంసాకాండమందు వినియోగ విధియందు 1) క్రత్వర్థ, 2) పురుషార్థ, 3) ఉభయార్థాలనబడే విధి వాక్య ప్రమేయాలున్నాయి. యాగాదులు కామ్యకర్మగా చేస్తే, అలాంటి ఫలాన్నిస్తాయి. నిష్కామనగా చేస్తే చిత్తశుద్ధి ద్వారా మోక్షఫలాన్నిస్తాయి. 'దధ్నాజుహోతి' అన్నప్పుడు క్రత్వర్థమవుతుంది. 'దధ్నేంద్రియ కామస్య జుహ్యాత్!' అన్నప్పుడు పురుషార్థమవుతుంది. ఈ న్యాయం ఉభయార్థకం. కంసాదుల సంహారంచేత తేలికయైన భూమి, శేషునికీ సుఖంగా వహింపవీలైనదని రెండర్థాలు.

ఇక్కడ కంసాది సముద్ధరణకే సుఖంగా వహించడానికి నిమిత్తత్వం చెప్పబడింది. 'శల్యైరివ' అనడం ఉపమ, 'శిఖండకః' అనడం రూపకం. ఈ రెండింటి యొక్క సంసృష్టి కలదు.

84. ప్రబోధ సుభగైః స్మేరైః
ప్రసన్నైః శీతలైశ్చ నః।
కటాక్షైః ప్లావయ క్షిప్రం
కృపైక కోదన్వదూర్మిభిః॥ 84

**అర్థం:** ప్రబోధ సుభగైః= మేల్కొనడంచేత కన్నుల అందం గల; ప్రసన్నైః= స్వచ్ఛమైన; స్మేరైః= హర్షవికాసాలు కలిగిన; శీతలైః= చల్లని; కృపా+ఏక, ఉదన్వత్+ఊర్మిభిః= కృప అనే ముఖ్యమైన సముద్ర తరంగాల వంటి; కటాక్షైః= కడగంటి చూపులచేత; నః= మమ్ములను; క్షిప్రం= శీఘ్రంగా; ప్లావయ= తడుపుము.

**తా॥** యోగనిద్రనుంచి మేల్కొనడంచేత నయన సౌందర్యం గలిగినట్టి; భ్రూ విలాసమంద స్మితాలను అనుసరించడం చేత స్వచ్ఛమైయున్న హర్షవికాసాలు కలిగి భక్తజనుల తాపాన్ని హరించే చల్లని దయ అనే సముద్రం యొక్క తరంగాల వంటి కడగంటి చూపులచేత మమ్ములను సేచనచేయుము స్వామీ! నీ చల్లని కృపాకటాక్షాన్ని మాపైన ప్రసరించుమయ్యా! దేవా! అని నిర్జరులు నివేదించారు.

కృపయందు సముద్రత్వారోపణకు, కటాక్షాలయందు ఊర్మిత్వారోపణకు పరంపర కలుగడంవల్ల పరంపరిత రూపకాలంకారం.

*85.* *త్వయి న్యస్తభరాణాం*
*నస్త్వమేతాం క్షంతు మర్హసి।*
*విదితా శేష వేద్యస్య*
*విజ్ఞాపన విడంబనామ్॥* 85

**అర్థం:** త్వయి= నీ యందు; న్యస్తభరాణాం= ఉంచిన భారంగల; నః= మా యొక్క; విదిత+అశేష వేద్యస్య= తెలుపబడిన దానిచేత సమస్తం తెలిసిన నీకు; ఏతాం= ఈ; విజ్ఞాపన. విడంబనాం= విన్నపమనే అనుచిత కృత్యాన్ని; త్వం= నీవు; క్షంతుం= క్షమించడానికి; అర్హసి= తగియున్నావు.

**తా॥** భరన్యాసాన్ని, శరణాగతిని చేసిన మేము తెల్పిన వృత్తాంతం చేత సర్వవేద్యుడవైన నీకు విన్నవించుకొన్నది అనుచిత కృత్యమే. మా యొక్క దోషాన్ని క్షమించు దేవా!

*86.* *ఇత్థం వదతి దేవానాం*
*సమాజే వేధసా సహ।*
*వవందే పృథివీ దేవం*
*వినత త్రాణ దీక్షితమ్॥* 86

**అర్థం:** దేవానాం= దేవతలయొక్క; సమాజే= సమూహం; వేధసా, సహ= బ్రహ్మతో కూడి; ఇత్థం= ఇట్లు; వదతి (సతి)= చెబుతుండగా; పృథివీ= భూదేవి; వినత త్రాణ దీక్షితం= ప్రణతులను రక్షించే వ్రతంగల; దేవం= వైకుంఠునికి; వవందే= నమస్కరించెను.

**తా॥** చతుర్వదనుడైన బ్రహ్మతో కూడిన దేవతాబృందం 'దేవా! మా విన్నపమనే విడంబనాన్ని క్షమించు' మని మనవిచేస్తుండగా, శరణాగత రక్షాదీక్షగల వైకుంఠునికి భూదేవి వందనమాచరించింది.

(తరువాతి మూడు శ్లోకాలకు ఈ శ్లోకంతో సంబంధం ఉంది).

87. తను మధ్యా విశాలాక్షీ
తన్వీ పీన పయోధరా!
మా యేవ మహతీ
తస్య వనితా రత్న రూపిణీ॥ 87

**అర్థం:** తన్వీ= సన్నని శరీరం కలిగినట్టి; తనుమధ్యా= సూక్ష్మమైన నడుము కలిగినట్టి; విశాల+అక్షీ= విశాలమైన కన్నులు కలిగినట్టి; పీన పయోధరా= బలిసిన స్తనాలు కలిగినట్టి; వనితా రత్న రూపిణీ= ఉత్తమ స్త్రీ యొక్క రూపం కలిగినట్టి; తస్య= భగవానుని యొక్క; మహతీ= గొప్పదైన; మాయా, ఇవ= మాయయో అన్నట్లు ఉన్నట్టి; పృథివి వైకుంఠునికి నమస్కరించింది.

**తా॥** శరీరం సన్నగా ఉండి అంతకంటే నడుము సన్నగానున్నట్టి, పొడవుగా, వెడల్పుగానూ కన్నులున్న, బిగువై బలిసిన స్తనాలున్న, ఉత్తమజాతికి చెందిన స్త్రీ రూపంతో ఉన్న, భగవానుని యొక్క అతిమోహనయైన మహామాయయో అన్నట్లు భూదేవి దేవదేవునికి వందన మాచరించిందని పూర్వశ్లోకంతో అన్వయం.

"రత్న స్వజాతి శ్రేష్ఠేஉపి"- అమరం. ఉత్ప్రేక్షాలంకారం.

*88. ఆ బద్ధ మండలై ర్భృంగై*
*రలకామోద మోహితైః।*
*అయత్నలబ్ధాం బిభ్రాణా*
*మాయూరచ్ఛత్ర సంపదమ్॥* 88

**అర్థం:** అలక+ఆమోద మోహితైః= ముంగురుల సువాసనచేత పరవశించినట్టి; ఆబద్ధ, మండలైః= వృత్తాకారంగా తిరుగుతున్న; భృంగైః= తుమ్మెదలచేత; అయత్న లబ్ధాం= యత్నించకయే లభించినట్టి; మాయూరచ్ఛత్ర సంపదమ్= నెమలి ఈకలచే చేయబడిన గొడుగు యొక్క శోభను; బిభ్రాణా= ధరించినట్టి (పృథివీ వవందే).

**తా॥** అలకల సౌరభంచేత మోహపడితలమీద గుండ్రంగా భ్రమిస్తున్న భ్రమరాలచేత ప్రయత్నం లేకుండా లభించిన నెమలి ఈకల ఛత్రశోభను వహించిన భూదేవి (దేవం వవందే).

*"అలకా యక్షనగరే, అలకోఽ స్త్రీ చూర్ణకుంతలే"* (రత్నమాలిక). *"ఆమోదః సోఽ తి నిర్హారీ"*- (అమరం). చాలాదూరం వ్యాపించే పరిమళాన్ని 'ఆమోదం' అంటారు.

*"శోభార్థేఽ పి ప్రయుజ్యంతే లక్ష్మీ శ్రీకాంతి సంపదః"*- (హలాయుధ నిఘంటువు). పట్టపు రాణులకు తగిన మాయూరచ్ఛత్రధారణం భృంగాలచేత సంపాదింపబడింది. భిన్న విభక్తిచే నిర్దిష్టమైన భృంగాలు మాయూరచ్ఛత్ర రూపంగా పరిణమించడం వల్ల వ్యధికరణ పరిణామాలంకారం.

*89. ప్రియ సందర్శనానంద*
*జనితై రశ్రు బిందుభిః।*
*న్యస్తమౌక్తిక నైపథ్యైః*
*పరిష్కృత పయోధరా॥* 89

**అర్థం:** ప్రియ సందర్శన+ఆనంద జనితైః= ప్రియుని దర్శనంవల్ల కలిగిన ఆనందంచేత జనించినట్టి; న్యస్త మౌక్తిక నైపథ్యైః= ఉంచబడిన ముత్యాల ఆభరణాల వంటి; అశ్రుబిందుభిః= కన్నీటి బొట్లచేత; పరిష్కృత పయోధరా= అలంకరింపబడిన పాలిండ్లుగల; భూదేవి నమస్కరించెను.

**తా॥** ప్రియుడైన భగవంతుణ్ణి దర్శించడం వల్ల కలిగిన ఆనంద బాష్పబిందువులు పాలిండ్లపైన జాలువారగా అవి ముత్యాల పంక్తిగా శోభించిన భూదేవి నమస్కరించింది.

ఆనందబాష్పబిందువుల పంక్తియే పయోధరాల మీద ముత్యాల నైపథ్యంగా అధ్యవసింపబడింది. కాబట్టి, అభేద రూపాతిశయోక్త్యలంకారం.

నేత్రయోః పథ్యం= నైపథ్యం. నేత్రాలకు హితమైనది. అలంకారమని అర్థం. "ఆకల్ప వేషో నైపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్" (అమరం).

*90. ప్రస్ఫురంతం ప్రియస్యేవ*
*పరిరంభాభిలాషిణమ్।*
*దక్షిణాదితరం బాహుం*
*దక్షిణా బహ్వమన్యత॥* 90

**అర్థం:** దక్షిణా= ప్రవీణయైన భూదేవి; ప్రస్ఫురంతం= బాగా చలిస్తున్నట్టిది; **(అత ఏవ= కావుననే)**; ప్రియస్య= ప్రియుని యొక్క; పరిరంభ+అభిలాషిణం, ఇవ= కౌగిలింతను కోరుతున్నట్లు ఉన్న; దక్షిణాత్+ఇతరం= (కుడికంటే వేరైన) ఎడమదైన; బాహుం= బాహువును- చేతిని; బహు= చాలా; అమన్యత= తలచెను, బహు మానించెను.

**తా॥** శుభాశుభ నిమిత్తాలను తెలిసిన ప్రవీణురాలు భూదేవి. తన వామ హస్తం తన ప్రియుణ్ణి మాటికి మాటికి ఆలింగనం చేసుకోవడానికి కోరుతున్నట్లు బాగా అదురు- కదలు-తున్నది, స్థిరంగా ఉండక చలిస్తున్నది. స్త్రీలకు వామ

భాగమందలి కన్నుగానీ, బాహువుగానీ అదిరితే అది శుభశకునమనే జ్ఞానం కలది. కాబట్టి భూదేవి వామబాహువును సాదరంగా చూచి సంతోషపడిందని తాత్పర్యం.

స్పందన, భావి శుభసూచకమనడానికి స్మృతి ఇలా చెబుతున్నది.

*"వామ భాగశ్చ నారీణాం శ్రేష్ఠః పుంసాంతు దక్షిణః*
*దానే దేవాది పూజాయాం స్పందేஉ లంకరణేஉ పిచ॥"*

బాహువునందు పరిరంభాభిలాషిత్వాన్ని సంభావించడం వల్ల, ఉత్ప్రేక్షాలంకారం.

*91. విపదంచ జగాదైషా*
*విపంచీ మధుర స్వనా।*
*విలక్షస్మిత సంభిన్న*
*మౌక్తికాధర విద్రుమా॥* 91

**అర్థం:** విపంచీ మధుర స్వనా= వీణెవంటి ఇంపైన ధ్వనిగల; ఏషా= ఈ భూదేవి; విలక్ష-విద్రుమా/ విలక్ష= విస్మయంతో కూడిన/ లజ్జతో గూడిన; స్మిత= చిరునగవుచేత; సంభిన్నమౌక్తిక= వేర్వేరుగా ఉన్న ముత్యాలు గలిగి; అధరమే పవడంగా కలిగినదై; విపదం, చ= ఆపదను కూడ; జగాద= చెప్పుకొనెను.

**తా॥** స్వాభావికమైన లజ్జతో కూడిన చిరునగవుచేత కనబడిన (పలువరుస) ముత్యాలు కలిగి, పవడం వంటి అధరం కలిగినట్టి, విపంచి వంటి మధుర నాదంగల భూదేవి తన ఆపత్తును నివేదించుకొన్నది.

**వ్యాఖ్య:-** భూదేవి స్వయంగా భగవానునికి నమస్కరించి తన బాధను విన్నవించెనని వర్ణితం.

సజ్జనులకు దుర్జనుల వల్ల కలిగిన క్లేశం సత్తముడవైన నీకు దగ్గరగా ఉండే పురుషుల ద్వారా నివేదింపదగినదని దేవతలను ప్రేరేపించాను. సాక్షాత్తుగ

నేను కూడా విన్నవించుకొంటున్నాననే భావాన్ని భూదేవి తన చిరునవ్వుతో ఆవిష్కరిస్తూ పలికింది.

భూదేవి కంఠస్వరం వీణానాదంవలె మధురంగా ఉన్నది. చిరునవ్వు విలక్ష విస్మయంతో కూడింది. "విలక్షో విస్మయాన్వితే" (అమరం). అనుచిత కృత్యాన్ని చేసిన తర్వాత ఆ కృత్యం నా చేతనే ప్రకటింపబడుతున్నదనే వెఱపుతోనూ, ఇతరులకు అకృత్యం తెలిసి పోయెను కదా! అనే లజ్జతోనూ కూడినది ఆ చిరునగవు. కాబట్టి, విలక్షణ శబ్దానికి విస్మయం- వెఱగుపాటుతోనూ, సిగ్గుతోనూ (రెండింటితోనూ) కూడినది అని అర్థం. విగతం లక్షం అస్య ఇతి= విలక్షః. ప్రకృతార్థజ్ఞానం లేనిది.

*"ఆత్మనశ్చరితే సమ్యక్ జ్ఞాతేஉ న్యైర్యస్య జాయతే।*
*అపత్ర పాతిమహతీ స విలక్ష ఇతి స్మృతః॥"* (అమరకోశ టీక)

అట్టి చిరునగవుచేత బయటపడిన ముత్యాల (వంటి దంతాల) వరుస కలది, 'విలక్షస్మిత సంభిన్నమౌక్తికః' అనబడింది. మౌక్తికం వంటి చిరునగవని అర్థం. "అధర ఏవ విద్రుమః" వాతెఱయే పవడం- అంటే రూపకమవుతుంది. లేదా; అధరః విద్రుమ ఇవ= అధరం పవడం వంటిది- అంటే ఉపమానోత్తర పదకర్మ ధారయ సమాసమవుతుంది.

విలక్షస్మిత సంభిన్న మౌక్తికః, అధర విద్రుమః యస్యాః సా= 'విలక్షస్మిత-విద్రుమా' అని బహువ్రీహి సమాసం. ఎఱ్ఱని పవడంవంటి అధరమూ, తెల్లని ముత్యాలవంటి పలువరుస విలక్షస్మితం చేత సంభిన్నమైన రూపం కలది భూదేవి (అర్థం ఎట్లైనా చెప్పవచ్చును).

పలుకదగిన ఉపకరణం అధరమైనందువల్ల 'విపదం' అని పలికిన మాటలోనే వర్ణిత భావం ఉండడం గమనీయం. కవితా శైలి కమనీయం కదా! 'విపంచీ మధుర స్వనా' అన్నచోట ఉపమా. స్మితమౌక్తికం, 'అధరవిద్రుమ' మనే చోట రూపకం. ఈ రెండింటి సంసృష్టి ఈ శ్లోకమందున్నది.

*92. అథతాన్ భవ్య యావాచా*
*భగవాన్ ప్రత్య భాషత।*
*ప్రతిశ్రుత్ప్రాప్త నిర్హ్రాద*
*పాంచజన్యాభినంద్యయా॥* 92

**అర్థం:** అథ= తర్వాత; భగవాన్= భగవానుడు; భవ్యయా= శుభమైన; ప్రతిశ్రుత్-అభినంద్యయా/ ప్రతిశ్రుత్= ప్రతిధ్వనిచేత; ప్రాప్త= పొందబడిన; నిర్హ్రాద= ధ్వనిగల; పాంచజన్యస్య= శంఖం యొక్క; అభినంద్యయా= అభినందనవలెనున్నట్టి; వాచా= మాటచేత; తాన్= ఆ దేవతలను గూర్చి; ప్రత్య భాషత= మారుమాటాడెను (పలికెను).

**తా॥** అందఱు చెప్పిన దాన్ని విన్న తరువాత, భగవానుడు ప్రతిధ్వనిగల తన శంఖంచేత అభినందింపబడినట్లున్న శుభకరమైన మాటను దేవతలతో పలికెను. భగవానుని భాషణం యొక్క ప్రతిధ్వని పాంచజన్య మందలి నిర్హ్రాదం వలె అభినందన కలిగినదై గంభీరంగా ఉన్నది.

నితరాం హ్రాదతే ఇతి= నిర్హ్రాదః (హ్రాద-అవ్యక్తే శబ్దే)

"*స్వాన నిర్ఘోష నిర్హ్రాద నాద నిస్వాన నిస్వనాః*"- (అమరం). భగవానుని వాక్కు శంఖంలో ప్రతిధ్వనించడమంటే, శత్రువుల గుండెలు వ్రయ్యలవుతాయని వ్యక్తమవుతున్నది కదా! కాబట్టి అభినంద్యమానం ఆ భవ్యవాక్కు గమ్యోత్ప్రేక్షాలంకారం.

*93. మాభైష రసురానీకాత్*
*భవంతో మదుపాశ్రయాః।*
*మదాజ్ఞా మన వజ్ఞాతుః*
*పరిభూత్యా న భూయతే॥* 93

**అర్థం:** మత్+ఉపాశ్రయాః= నన్ను ఆశ్రయించినట్టి; భవంతః= మీరు; అసుర+అనీకాత్= రాక్షసుల సైన్యంవల్ల; మాభైషుః= భయపడకండి; మత్+ఆజ్ఞాం= నా ఆజ్ఞను; అనవజ్ఞాతుః= మీరనివారికి; పరిభూత్యా= అవహేళనం చేత; న, భూయతే= ఉండబడదు.

**తా॥** నా రక్షణలో ఉన్న మీరు దైత్యుల సైన్యంవల్ల భయపడకండి. నా యాజ్ఞను శిరసావహించే వ్యక్తికి పరిభవం ఉండదు.

"పరిభూత్యా న భూయతే"- అనే వాక్యం 'భావే లట్' భావే ప్రయోగం.

*మాభైషుః:*- 'మా' అనేది ప్రతిషేధార్థక పదం. 'అభైషుః'- 'ఞిభీ-భయ' అనే ధాతువుయొక్క 'లుఙ్' ప్రథమ పురుష బహువచనం. "మాఙ్యోగాత్ అడాగమా భావః". 'మా' అనే పద సంబంధంవల్ల ధాతువుకు ఉండే 'అ' కారం లోపిస్తుంది.

*భవంతః మా భైషుః:*- యుష్మచ్ఛబ్దానికి మధ్యమ పురుషను వాడుకోవాలి. యుష్మచ్ఛబ్దార్థకమైన భవచ్ఛబ్దయోగ మున్నప్పుడు మాత్రం 'శేషేప్రథమః' అనే నియమం చేత ప్రథమ పురుషనే ప్రయోగించాలి.

*మదుపాశ్రయాః:*- అహం ఉపాశ్రయః (శరణం) యేషాంతే (బ-వ్రీహి-స). 'పరిభూతి' శబ్దానికి 'పరిభవం' అని అర్థం. "అనాదరః పరిభవః పరీభావస్తిరస్క్రియా" (అమరం). "మా భైషుః"- అనడానికి ఉత్తర వాక్యార్థమే హేతువు. కాబట్టి, 'వాక్యార్థ హేతుకమైన కావ్యలింగం' అనే అలంకారం.

94. అవతార్య భువో భార
మవతారో మమామరాః।
అనాది నిధనం
ధర్మమక్షతం స్థాప యిష్యతి॥ 94

**అర్థం:** హే అమరాః= ఓ దేవతలారా!; మమ= నా యొక్క; అవతారః= ఆవిర్భావం (దిగిరావడం); భువః= భూమియొక్క; భారం= బరువును; అవతార్య=

దించివేసి (తొలగించి); అనాది నిధనం= మొదలు, కొనలేనట్టి; ధర్మం= ధర్మాన్ని; అక్షతం= కొఱత లేకుండా; స్థాపయిష్యతి= నెలకొల్పగలదు.

**తా॥** దేవతలారా! నా అవతరణం భూదేవికి అసురుల భారాన్ని తొలగించి, ఆది, అంతంలేని సనాతన ధర్మాన్ని సంపూర్ణంగా స్థాపించగలదు.

"నిధనం కుల నాశయోః" (అమరం). 'నిధన' శబ్దానికి కులమనీ, నాశం (అంతం) అనీ అర్థం.

*95. యావదిష్ట భుజో*
*యావదధికార మవస్థితాః।*
*పరిపాలయత స్వాని*
*పదాని విగతా పదః॥* 95

**అర్థం:** విగత+ఆపదః= తొలగింపబడిన ఆపదలు కలవారై; యావత్, ఇష్టభుజః= యాగాల నెల్ల భుజించువారై; యావత్, అధికారం, అవస్థితాః= అధికారమందే ఉన్నవారై; స్వాని= తమవైన; పదాని= స్థానాలను; పరిపాలయత= పాలనచేస్తూ ఉండండి.

**తా॥** నేను అవతరించి రాక్షసులను సంహరించగానే, మీరు ఆపదలు లేనివారై అన్ని క్రతువులందలి హవిస్సులను భుజిస్తూ, అధికారమందే ఉండి, మీ, మీ పదవులను కాపాడుకొనండి (భుజ పాలనాభ్యవహారయోః). "యావద వధారణే" అని యావదిష్ట, యావదధికార శబ్దాలయందు అవ్యయీభావం కలదు.

*96. దమనాద్దనుజేంద్రాణాం*
*ద్రక్ష్యథ త్రిదశాధిపాః।*
*భూయోఽపిలఘుతాం ప్రాప్తాం*
*భువముల్లాఘితామివ॥* 96

**అర్థం:** హే త్రిదశ+అధిపాః= ఓ సురశ్రేష్ఠులారా!; దనుజ+ఇంద్రాణాం= రాక్షసులలో ప్రముఖులైన వారిని; దమనాత్= అణచివేయడంవల్ల; భూయః+అపి= మళ్ళీ కూడా; లఘుతాం= లాఘవాన్ని; ప్రాప్తాం= పొందినట్టి; భువం= భూదేవిని; ఉల్లాఘితాం, ఇవ= రోగం తీరిన దానిని వలె; ద్రక్ష్యథ= చూడగలరు.

**తా॥** ఓ త్రిదిశాధిపులారా! రాక్షసాధిపులను అణచివేయడంవల్ల పూర్వం వలె భారం నశించిన భూదేవిని వ్యాధి నుంచి విముక్తిని జెంది చురకగా నున్న దానివలె మీరు చూడగలరు.

*త్రిదశాధిపాః:* – త్రిదశ పరిమాణం వయః యేషాం తే= త్రిదశాః ముప్పది (30) యేండ్లకు లోబడిన వయస్సు కలవారు త్రిదశులు, దేవతలు. త్రిదశానాం అధిపాః= త్రిదశాధిపాః. దేవతలలో శ్రేష్ఠులని అర్థం.

"*ఉల్లాఘో నిర్గతో గదాత్*" (అమరం). ('గదం' అంటె రోగం, వ్యాధి). లాఘృ–సామర్థ్యే. వ్యాధిలేనిది అని అర్థం.

*ద్రక్ష్యథ:* – (దృశిర్–ప్రేక్షణే). దృశ్ ధాతువుయొక్క (భవిష్యత్కాలం) 'లృట్' మధ్యమ పురుష బహువచనం.

*97.* *దైతేయ మృగ సంఘాతే*
*మృగయా రస భాగిభిః।*
*భవద్భిరపి మేదిన్యాం*
*భవితవ్యం నరాధిపైః॥* 97

**అర్థం:** మేదిన్యాం= భూమి యందు; భవద్భిః, అపి= మీచేత కూడా; దైతేయ మృగ సంఘాతే= రాక్షసులు అనే మృగాల సమూహమందు; మృగయా రసభాగిభిః= వేటాడే రుచి యందు పాల్గొనునట్టి; నర+అధిపైః= రాజులచేత; భవితవ్యం= కాదగినది.

**తా॥** మీరు కూడా చేయవలసిన పని ఒకటి ఉంది. నేను అవతరించినప్పుడు; రాక్షస మృగాలను వేటాడే వినోదంలో పాల్గొనే క్షత్రియ కులమందు జన్మించి, మీరు కొందఱు దుష్టులను సంహరించండి.

*98. ఇతి తాననఘా దేశః*
*సమాదిశ్య జనార్దనః।*
*అవధీరిత దుగ్ధాబ్ధి*
*ర్మధురాయాం మనోదధే॥ 98*

**అర్థం:** అనఘ+ఆదేశః= అప్రతిహతమైన ఆజ్ఞగల; జనార్దనః= భగవానుడు; ఇతి= ఇట్లు; తాన్= ఆ దేవతలను; సమాదిశ్య= ఆజ్ఞాపించి; అవధీరిత దుగ్ధాబ్ధిః= తిరస్కరింపబడిన క్షీరాబ్ధి కలవాడై; మధురాయాం= మధురా నగరమందు; మనః= మనస్సును; దధే= ధరించెను.

**తా॥** అప్రతిహతమైన ఉపదేశంగల భగవానుడు పైన చెప్పిన ప్రకారంగా ఆదేశించి పాలకడలిని వదలిపెట్టి, మధురా నగరమందు అవతరింపగోరెను.

*"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః।*
*నాగపర్యంకముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్॥"* (భాగవతం)

పాలకడలియే నివాసంగల లక్ష్మీదేవి గల ఈ నారాయణుడు, శయ్యగానున్న శేష సర్పాన్ని భూమియందు బలభద్రునిగా అవతరించడానికి పంపించి, మధుర అనే మహానగరానికి వచ్చినాడు కదా! అన్న శ్లోకం స్మరింపదగినది.

ఈ శ్లోకమందలి 'క్షీరార్ణవ నికేతనః, నాగపర్యంక ముత్సృజ్య' అనే మాటల భావమే 'అవధీరిత దుగ్ధాబ్ధిః' అనే పదమందు నిక్షిప్తం. నాగమనే పర్యంకం ఎక్కడ ఉండెనో, ఆ క్షీరార్ణవాన్ని విడిచిపెట్టి, మధురాపురియందు అవతరింప సంకల్పించాడు (ప్రజలచే ప్రార్థింపబడిన భగవానుడు) జనార్దనుడు.

99. ఆశ్వాస్య వాగమృత వృష్టిభిరాదితే యాన్
దైతేయ భార నమితాం పృథివీంచ దేవీమ్।
ప్రాదుర్బుభూషురనఘో వసుదేవ పత్న్యాం
పద్మాపతిః ప్రణిదధే సమయం దయాయాః॥ 99

**అర్థం:** అనఘః= పవిత్రుడైన; పద్మాపతిః= శ్రీపతి; వాక్+అమృత వృష్టిభిః= మాట అనే అమృతం యొక్క వర్షాలచేత; ఆదితేయాన్= దేవతలను; దైతేయ భార నమితాం= రాక్షసుల భారంచేత క్రుంగిన; దేవీం= (తన) మహిషియైన; పృథివీం, చ= భూమిని కూడా; ఆశ్వాస్య= సమాధాన పరచి; వసుదేవ పత్న్యాం= వసుదేవుని పత్నియైన దేవకి యందు; ప్రాదుర్బుభూషః= ప్రాదుర్భవింపగోరిన వాడవుతూ; దయాయాః= దయ యొక్క; సమయం= కాలాన్ని; ప్రణిదధే= మనస్సున నుంచుకొనెను.

**తా॥** పద్మాపతి అనఘుడు. ఆయా వ్యక్తుల కష్టసుఖాలు వారి వారి కర్మలను బట్టి అనుభవింపబడుతాయి. కావున, ఆ విషయంలో వైషమ్యంగానీ, నైర్ఘృణ్యం (నిర్దయ)గానీ, ఏ దోషం లేనివాడు శ్రియఃపతి. దేవతలను, తన దేవేరియైన భూదేవిని కూడా రాక్షసుల భారంచేత అణగిపోకుండా శ్రీపతి అమృతపు జల్లులవంటి తన మాటలచేత ఓదార్చాడు. వెంటనే, దేవకీ వసుదేవ దంపతులకు పుత్రుడుగా ఆవిర్భవింప సంకల్పించాడు. రాక్షసులచే పీడితులైన ప్రాణులయొక్క దేవకీ వసుదేవుల యొక్క స్థితి కర్మానుగుణంగా దయనీయ మవడంచేత సమయాన్ని ప్రతీక్షిస్తున్నాడు.

సర్గాంతమందు వృత్తాన్ని మార్చడం సలక్షణం కాబట్టి, వసంత తిలకమనే వృత్తమిది.

100. సాధూనాం స్వపద సరోజ షట్పదానాం
ధర్మస్య స్థితి మనఘాం విధాతు కామః।
యద్గర్భే (ర్భో) జగదఖిలం స ఏవ
గర్భో దేవక్యాః సమజని దేవదేవ వంద్యః॥ 100

**అర్థం:** అఖిలం= సమస్తమైన; జగత్= ప్రపంచం; యత్+గర్భే= ఎవని యొక్క కుక్షిస్థమో; దేవ దేవ వంద్యః= దేవతలకు దేవులైన బ్రహ్మాదులచేత స్తుతింపదగిన; సః, ఏవ= ఆ వాసుదేవుడే; స్వపద సరోజ షట్ పదానాం= తన యొక్క పాదమనే కమలమందలి భ్రమరాలైన; సాధూనాం= సజ్జనులకు; ధర్మస్య= ధర్మం యొక్క; స్థితిం= ఉనికిని; అనఘాం= దోషంలేని దానిగా; విధాతు కామః సన్= చేయగోరిన వాడవుతూ; దేవక్యాః= దేవకీ దేవి యొక్క; గర్భః= గర్భస్థుడుగా- కడుపు పంటగా; సమజని= అయెను.

**తా॥** అఖిల జగత్తు తన ఉదరమందున్న వాడు దేవదేవ వంద్యుడు. దేవతలకే దైవంలాగా పూజింపదగిన బ్రహ్మరుద్రాదులచే స్తుతింప దగినవాడు ఆ పరవాసుదేవుడు. జగమంతా తన గర్భమందున్న ఆ వాసుదేవుడే, జగత్తులోనే ఒక మూలలో ఉన్న దేవకి గర్భమందు ప్రవేశించగానే బ్రహ్మాదులచే నతులు నుతులు చేయదగినవాడు. ఆ దేవదేవ వంద్యుడే పద్మమందు మూగిన భృంగాల లాగా తన చరణాల యందు ఆసక్తిగల సాధువుల కోసం ఎట్టి దోషం లేని ధర్మాన్ని సంస్థాపించడానికి సంకల్పించినవాడై దేవకీ దేవి యొక్క గర్భమందు ప్రవేశించాడు. (దేవకి గర్భిణియైనది).

*"కుక్షౌ కుక్షిస్థితే జంతౌ"*- (వైజయంతి)

*విధాతు కామః:-* విధాతుం కామః యస్య సః (బహువ్రీహి సమాసం). *"తుం కామ మనసో రపి"* అనే విధానాన్ని బట్టి 'మ' కార లోపం.

దేవకస్య అపత్యం స్త్రీ 'దైవకీ' అని వృద్ధి పాఠమే సాధువు అన్నాడు 'ఆత్రేయుడు'. కాని, 'అవృద్ధః' అంటే వృద్ధిలేని పదమే (దేవకీ) ప్రసిద్ధం.

*"అఖిలస్యయోఽ స్య జగతో యోని ర్మాతా చ దేవకీ యస్య।*
*శర్మణ ఇహావతారై ర్యో నిర్మాతా చ దేవకీ యస్య॥"*

అని 'యమక రత్నాకర' మందు ప్రయుక్తం. ప్రహర్షిణీ వృత్తమిది.

ప్రథమ సర్గ సమాప్తం.

# ద్వితీయ సర్గ

*101.* అథాగమానా మనఘేన భూమ్నా
ధర్మస్య పూర్ణేన ధనాగమేన।
దివౌకసాం దర్శయతా విభూతిం
దేవీ బభౌ దౌహృద లక్షణేన॥ 1

**అర్థం:** అథ= తర్వాత; దేవీ= రాజ్ఞియైన దేవకి; ఆగమానాం= వేదాలకు; అనఘేన= రమ్యమైనట్టి; భూమ్నా= అధికమైన; ధర్మస్య= ధర్మం యొక్క పూర్ణేన= సమృద్ధియైన; ధన+ఆగమేన= ధనలాభమైనట్టి; దివౌకసాం= దేవలయొక్క విభూతిం= ఐశ్వర్యాన్ని; దర్శయతా= చూపించునట్టి; దౌహృద లక్షణేన= గర్భచిహ్నంచేత; బభౌ= ప్రకాశించెను.

**తా॥** భగవానుడు గర్భంలో ప్రవేశించిన తర్వాత, దేవకి వేదాలకు రమ్యమైనటువంటి ప్రచయమైనట్టి, ధర్మ సమృద్ధియే ధనలాభమైనట్టి, దేవతల ఐశ్వర్యాన్ని ప్రదర్శించే గర్భచిహ్నంచేత ప్రకాశించింది.

**వ్యాఖ్య:**– దేవకీ గర్భలక్షణం బహువిధాలుగా వర్ణితం.

భగవానుడు గర్భమందు ప్రవేశించిన తర్వాత దేవకీ దౌహృదలక్షణం అనన్య సామాన్యమైనది. "చిహ్నం లక్ష్మచ లక్షణమ్" (అమరం).

*ఆగమానా మనఘేన:*– వేదాలకు రమ్యమైనది దౌహృదలక్షణం. వేదాలు భగవంతుణ్ణి ప్రతిపాదిస్తాయి. వేదాల ప్రచారాన్ని విరోధించేవారు రాక్షసులు. ఆ రాక్షసులను సంహరించే భగవానుని ఆవిర్భావానికి కారణమైన చిహ్నామైనందువల్ల వేదాలకు ఆనందకరమైనదని భావం.

"అనఘో నిర్మలాపాపరమ్యేషు చ నిరామయే" – (రత్నమాల).

భూమ్నా:- గొప్ప మహిమకలది. అనేక కారణాలను స్ఫురింపజేసే లక్షణమది. 'బహు' శబ్దానికి 'ఇమనిచ్' ప్రత్యయం చేరినప్పుడు "బహోర్లో పో భూ చ బహోః" అనే లక్షణాన్నిబట్టి, బహుశబ్దం లోపించి, ఆ చోట 'భూ' ఆదేశమైనందువల్ల 'భూమా' అనే రూపమేర్పడింది.

ధర్మస్య పూర్ణేన ధనాగమేన:- ధర్మసమృద్ధికి హేతువవడంచేత అది పరిపూర్ణ ధనలాభం వంటిది దౌహృదలక్షణం. అఖిల ధర్మాలకు వేదమే మూలం. "కృష్ణం ధర్మం సనాతనమ్"- నిధిలాంటి సనాతన ధర్మాన్ని సంస్థాపించే చిహ్నమది. "ధనమూలమిదం జగత్" అనే నానుడిలోని ధనం ధనం కాదు. శాశ్వతమైన ధనం ధర్మమే. కాబట్టి ధర్మ సమృద్ధి ధనలాభంతో సమానమని చెప్పబడింది. "ధిని-ప్రీణనే"- ధినోతి ఇతి ధనం. సంతోషింపజేసేది 'ధనం'. ధ్రియతే ఇతి ధర్మః. ధరింపబడేది ధర్మం. ధర్మమంటే పుణ్యం. "పుణ్యానా మపి పుణ్యోఽసౌ" అన్నట్లు పుణ్యం భగవానుడే. కాబట్టి ధనంవంటి ధర్మానికి చిహ్నమది.

దౌహృదస్య లక్షణం= దౌహృదలక్షణం:-

"మాతృజన్యస్య హృదయం మాతుశ్చ హృదయేన యత్।
సంబద్ధంతేన గర్భిణ్యానే ష్టంశ్రద్ధావమాననమ్॥"

(బాహుటః) శిశువుయొక్క హృదయం తల్లిహృదయంతో సంబంధించి ఉన్నందువల్ల 'దౌహృదం'- (గర్భం) "ద్విహృదయాం నారీం దౌహృదినీం ఆచక్షతే". దౌహృదినీ అంటే 'గర్భిణి' అని అర్థం.

దివౌకసాం దర్శయతా విభూతిం:- దేవతలకు ఐశ్వర్యాన్ని ప్రదర్శించేది దేవకీ గర్భలక్షణం. "విభూతిర్భూతిరైశ్వర్యం"- (అమరం). విభవావతారం, దేవతలకు సంపద ఇక్కడనే ఉంది అని స్మరింపజేస్తున్నట్టిది. కాబట్టి, ఒక్క దౌహృద లక్షణం భూమాదిరూపంగా రూపించబడింది. మాలారూపకాలంకారం.

ఈ సర్గయందు ఉపజాతి వృత్తం (ఇంద్రవజ్ర- ఉపేంద్ర వజ్ర కలిసి యున్న వృత్తం).

*102. శృంగార వీరాద్భుత చిత్రరూపం*
*గర్భేత్రిలోకైక నిధిం వహంత్యాః।*
*పరావరక్రీడిత కర్బురాణి*
*ద్వేధాఽభవన్ దౌహృద లక్షణాని॥* 2

**అర్థం:** త్రిలోక+ఏక నిధిం= మూడులోకాలకు ముఖ్యనిధియైన; శృంగార వీర+అద్భుత చిత్రరూపం= శృంగార రసమూ, వీరరసమూ, అద్భుత రసమూ అనే మూడు కలిసి యున్న దివ్యమంగళ విగ్రహాన్ని; గర్భే= ఉదరమందు; వహంత్యాః= వహిస్తున్న, దేవకి యొక్క; పర+అవర క్రీడిత కర్బురాణి= పరావర క్రీడలచేత చిత్రాలైన; దౌహృద లక్షణాని= గర్భచిహ్నాలు; ద్వేధా= రెండు విధాలుగా; అభవన్= ఉన్నవి.

**తా॥** మూడు లోకాల ముఖ్యనిధియైన భగవానుని పరత్వాన్ని సూచించే క్రీడలు శృంగార, వీర, అద్భుత రసాలనే మూడింటిని కలిగియున్న చిత్రరూపం, లోకంలోవలె భగవంతుని యొక్క తక్కువ స్థాయిని సూచించే అవర క్రీడలు రెండు ఉన్నాయి. స్వాభావికమైన భగవత్పరత్వమూ, అవతారాల అవరత్వమూ అనే పరావర క్రీడలచే విచిత్రమైన దౌహృదలక్షణాలు, దేవకీదేవి వహించే గర్భమందు రెండు విధాలుగా ఉన్నాయి. "*చిత్రకిమ్మీర కల్మాష శబలైతాశ్చ కర్బురే*" (అమరం). 'కర్బుర' శబ్దానికి నానా వర్ణాలుగల వన్నె అని అర్థం. పరావర క్రీడలనాడే భగవంతుణ్ణి గర్భమందు వహిస్తున్నది దేవకి- అని సారార్థం.

*103. అశేష వేదై రధిగమ్య భూమ్నా*
*సిద్ధేన సిద్ధైశ్చ నిషేవితేన।*
*అమానుషీ నూన మభూదయత్నాత్*
*కృష్ణేన కేనాపి రసాయనేన॥* 3

**అర్థం:** అశేష వేదైః= సర్వవేదాలచేత; అధిగమ్య భూమ్నా= ప్రతిపాద్యమైన మహిమ గలిగినట్టి; సిద్ధేన= నిత్యుడైన/ ప్రసిద్ధమైన; సిద్ధైః, చ= దేవయోనులైన సిద్ధులచేతనూ/ కాయసిద్ధితో కూడిన వాటిచేత కూడా; నిషేవితేన= పూజింపబడినట్టి/ స్వీకరింపబడినట్టి; కృష్ణేన= కృష్ణుడు అనే/ నల్లని; కేన, అపి= ఊహింపరాని ప్రభావం గలిగినట్టి; రసాయనేన= ఔషధం చేత; అయత్నాత్= ప్రయత్నం చేయకుండానే; నూనం= నిశ్చయంగా; అమానుషీ= దేవతగా; అభూత్= ఆయెను.

**తా॥** వేదాలన్నీ ప్రతిపాదించే మహిమ కలిగినట్టి, శాశ్వతమైనట్టి, సిద్ధుల చేతనూ పూజింపబడినట్టివాడు కృష్ణభగవానుడు. ఆయుర్వేదంచేత ప్రశంసింప బడినట్టి, ప్రసిద్ధమైనట్టి, కాయసిద్ధికోసం స్వీకరింపబడినట్టిది రసాయనం. కృష్ణుడనే ఊహింపరాని ప్రభావంగల రసాయనం చేత దేవకి నిజంగా, ఏ ప్రయత్నాన్ని చేయకుండా, దేవతా స్త్రీగా ప్రకాశించింది.

**వ్యాఖ్య:**– మనుష్య స్త్రీయైన దేవకి దేవతాస్త్రీలాగా ప్రకాశిస్తున్నదని వర్ణితం.

కృష్ణభగవానుడు సర్వవేదాలచే ప్రతిపాదింపబడే మహిమగలవాడు. కృష్ణ రసాయనం ఆయుర్వేదంచే ప్రశంసింపబడే ప్రభావం కలది.

కృష్ణుడు నిత్యుడు, శాశ్వతంగా ఉండేవాడు. ఆనందమయుడు. కృష్ణ రసాయనం లోకమందు ప్రసిద్ధమైన ఔషధం. కృష్ణుడు దేవయోనులైన సిద్ధులచే పూజింపబడేవాడు.

"*సిద్ధః స్యాత్ దేవయోనిషు, నిత్యే ప్రసిద్ధే నిష్పన్నే!*"– (విశ్వ నిఘంటువు). కృష్ణ రసాయనం ముదిమిని, వ్యాధిని కలుగకుండ జేసే మూలికలచే సిద్ధం చేయబడిన దివ్యౌషధమైనందువల్ల, కాయసిద్ధికోసం సేవింపబడుతుంది. కృష్ణుడు సర్వగంధః, సర్వరసః అని ఉపనిషత్తు బోధించే దివ్య విగ్రహం కలవాడు. కృష్ణ రసాయనం ఆనందమయమైన ఔషధం. ఊహింపరాని ప్రభావం కల ఔషధం.

"*రసాయనం విహంగేఽపి జరావ్యాధి హరౌషధే*"– (విశ్వ. ని.) కృష్ణ రసాయనాన్ని సేవించకపోతే ఇంత తేజస్సుతో శోభించేది కాదు కదా! దేవకీ

దేవి తన గర్భమందు భగవానుడు ప్రవేశించినందువల్ల దివ్యతేజస్సుతో దేవాంగనగా ప్రకాశిస్తున్నది. ఇది ఉత్ప్రేక్షాలంకారం.

కృష్ణుని యందు రసాయనత్వాన్ని ఆరోపించడం రూపకాలంకార లక్షణం. ఒక్క ఆయుర్వేదం మాత్రమే జరావ్యాధిని పోగొట్టే ఔషధమని ప్రతిపాదించిన రసాయనంకంటెనూ, సర్వవేద ప్రతిపాద్యమైన ఈ గర్భచిహ్నం మనుష్యత్వాన్ని తొలగించే సామర్థ్యం కలది కాబట్టి వ్యతిరేకాలంకారమిది. సంకరాలంకార శోభిత మీ శ్లోకం.

*104. శత హ్రదా బంధురయా స్వకాంత్యా*
*సంచారి జాంబూనద బింబకల్పా।*
*త్రయ్యంత సిద్ధేన రసాయనేన*
*కాలేన భేజే కలధౌత లక్ష్మీమ్॥ 4*

**అర్థం:** శతహ్రదా బంధురయా= మెరపువలె మనోహరమైన; స్వకాంత్యా= నిజ శోభచేత; సంచారి జాంబూనద బింబ కల్పా= నడయాడే బంగారు ప్రతిమతో సమానమైన; దేవకీ దేవి; త్రయ్యంత సిద్ధేన= ఉపనిషత్తు నందు ప్రసిద్ధమైన; కాలేన= కృష్ణవర్ణం కలిగిన; రసాయనేన= ఔషధంచేత; కాలేన= కాలక్రమంగా; కలధౌత లక్ష్మీం= వెండిలాగా ధవళ శోభను; భేజే= పొందెను.

**తా॥** విద్యుత్తులాగా అందమైన తన కాంతిచే, నడిచే బంగారు బొమ్మతో సమానమైన దేవకి, ఉపనిషత్ప్రసిద్ధమైన కృష్ణవర్ణం కలిగిన రసాయనం చేత కొంత కాలానికి రజితంవలె తెల్లని వన్నెను పొందింది.

**వ్యాఖ్య:-** కనకవర్ణంగల దేవకి కృష్ణవర్ణ రసాయనాన్ని సేవించడం వల్ల శ్వేతవర్ణయైనదని సుశ్లోకితం.

ఇదివరకు పర్వతాన్ని సూచించే దౌహృదలక్షణం చెప్పబడింది. లోకరీతిగా, ఇప్పుడు దేవకి యొక్క అవయవాలన్నీ తెల్లని వన్నెతో శోభిస్తున్నాయని ఆరు శ్లోకాలచే వర్ణింపబడుతున్నది.

మెరపు మెరసినట్టు మనోహరమైన స్వీయకాంతిచేత నడచి వచ్చే బంగారు బొమ్మ వంటిది దేవకీదేవి. *"శంపా శతహ్రదాహ్రాది న్యైరావత్యః క్షణప్రభా"*- (అమరం). *"సురూపం హారి బంధురం"*- (అమరశేషః).

*"మన్మథా ప్యాయనకరీ శోభా కాంతిర్ని గద్యతే"*- (యాదవః)

*"రుక్మం కార్తస్వరం జాంబూనద మష్టాపదోஉ స్త్రి యామ్"*- (అమరం)

స్వర్ణ వర్ణయైననూ, దేవకి కృష్ణుణ్ణి గర్భమందు ధరించడంవల్ల కృష్ణవర్ణంగల రసాయనాన్ని ఆస్వాదించడం వల్ల కాలక్రమేణ ధవళవర్ణయైనది. గర్భవతుల శరీరం తెల్లగా మారుతుందని భావం.

వేదాంతశాస్త్రమందు ప్రసిద్ధుడు కృష్ణుడు. దేవకి బంగారుబొమ్మ. నల్లనయ్య తన కడుపులో ఉన్నప్పటికీ, దేవకి ఒడలంతా కలధౌతం- వెండిలాగా తెల్లని వన్నెతో శోభిస్తున్నది. బంగారం వెండి అయింది. రసాయనం సేవిస్తే, అది వన్నెను మారుస్తుంది. కృష్ణుని యందు రసాయనత్వం యొక్క అధ్యవసాయం వల్ల 'అతిశయోక్తి' అనే అలంకారం.

*105.* *మయూర పింఛ ద్యుతి భిర్మయూఖై*
*స్తత్కాంతి రంతర్వసత స్త్రిధామ్నః।*
*శ్యామా బహిర్మ్యాలసితా బభాసే*
*మంగల్య రత్నాంకుర పాలికేవ॥* 5

**అర్థం:** అంతః= లోపల, గర్భమందు; వసతః= ఉన్నట్టి; త్రిధామ్నః= శ్రీకృష్ణుని యొక్క; మయూర పింఛద్యుతిభిః= నెమలి పింఛం యొక్క కాంతులుగల; మయూఖైః

= కిరణాలచేత; బహిః= పై భాగాన; శ్యామా= శ్యామ వర్ణం గలిగిన; మూల సితా= క్రింది భాగమందు తెలుపు గల్గిన; తత్ కాంతిః= ఆ దేవకి యొక్క కాంతి; మంగల్య రత్నాంకుర పాలికా, ఇవ= జగన్మంగళార్థమైన అంకురాలవంటి రత్నాల యొక్క పంక్తియో అన్నట్లు; బభాసే= ప్రకాశించెను.

**తా॥** గర్భమందున్న శ్రీకృష్ణుని మయూర పింఛకాంతులుగల కిరణాలచేత అగ్రభాగమందు శ్యామవర్ణమూ, అథోభాగమందు శ్వేతవర్ణమూ కలిగిన దేవకి యొక్క కాంతి, జగన్మంగళార్థం శుభకార్యమందు ఆచరించే రత్నాంకురాల వరుసలాగా ప్రకాశించింది. అంకురాలు కూడా పై భాగాన శ్యామ వర్ణంతోనూ, అడుగున శుభ్రవర్ణంతోనూ శోభించే పాళిక- పంక్తిలాగా దేవకీ దేవి యొక్క కాంతి భాసించింది. ఇది శుభాభ్యుదయ సూచకమే యని సారార్థం. ఈ కృష్ణుని ప్రభ నిర్గమించి పరత్వాన్ని లోక కల్యాణాన్ని సూచిస్తున్నది. ఉత్ప్రేక్షాలంకారం. తాత్పర్యం స్పష్టం.

*106.* *కాలే బభాసే వసుదేవ పత్న్యాః*
*కర్పూర లిప్తేవ కపోల శోభా।*
*శశిప్రభా సప్తమ గర్భ కాంతిః*
*చ్యుతా వశిష్టేవ శనైరుదీ ర్ణా॥* 6

**అర్థం:** వసుదేవ పత్న్యాః= దేవకి యొక్క; కాలే= గర్భం పెరుగుతున్నప్పుడు; కర్పూర లిప్తా, ఇవ= కర్పూరంచేత పూయబడినట్లున్న; కపోలశోభా= చెక్కిళ్ళ యొక్క తెల్లని కాంతి; శశిప్రభా= చంద్రుని వంటి కాంతిగల; సప్తమగర్భ కాంతిః= ఏడవ గర్భం యొక్క కాంతి; చ్యుత+అవశిష్టా= జారిపోగా మిగిలినదై; శనైః= మెల్లగా; ఉదీర్ణా, ఇవ= పైకి వచ్చినదో అన్నట్లు; బభాసే= ప్రకాశించెను.

**తా॥** వసుదేవుని పత్నియైన దేవకి యొక్క గర్భం పెరుగుతున్న సమయాన చెక్కిళ్ళ కాంతి కర్పూరపు పూతలాగా తెల్లగా ఉన్నది. ఆమె కపోలశోభ చంద్రుని

వంటి కాంతిగల ఏడవ గర్భకాంతి నిష్క్రమించగా మిగిలిన కాంతి కాలక్రమంగా వెలికివచ్చి చేరినదో యన్నట్లు భాసించింది.

"శోభాకాంతిర్ద్యుతిశ్ఛవిః"- (అమరం). శ్రీకృష్ణుని కంటే ముందు, దేవకి యొక్క ఏడవ గర్భమందు బలరాముడనబడే ఆది శేషుడు సంక్రమించాడు. భగవానుని మాయవల్ల ఆ బలరాముడు దేవకీ గర్భం నుంచి ఆకర్షింపబడి రోహిణీ గర్భమందు చేర్చబడినాడు. అలాగా, ఏడవ గర్భకాంతి చ్యుతం కాగా, దాని అవశేషం కాలక్రమంగా అష్టమ గర్భమందు శ్రీకృష్ణుడు ప్రవేశించి వృద్ధి చెందుతుండగా దేవకీదేవి కపోలాలపై చేరి కర్పూరపు పూత పూశినట్లు తెల్లగా శోభిస్తున్నది. ఇది స్వరూపోత్ప్రేక్ష.

*107. నవేందు నిష్యంద నిభశ్చకాశే*
*వర్ణః ప్రతీకేషు మధు ద్రవాంగ్యాః।*
*అంతః స్థితేన ప్రథమేన పుంసా*
*ప్రవర్తితం సత్త్వమివా వదాతమ్॥* 7

**అర్థం:** మధుద్రవ+అంగ్యాః= తేనెసొనలు జాలువారే అంగాలు కల దేవకి యొక్క; ప్రతీకేషు= అవయవాల యందు; నవ+ఇందు నిష్యంద నిభః= క్రొత్తదైన చంద్రుని అమృత స్రావంతో సమానమైన; వర్ణః= వన్నె; అంతః= గర్భం లోపల; స్థితేన= ఉన్నట్టి; ప్రథమేన= మొదటి; పుంసా= పురుషునిచేత; ప్రవర్తితం= కలిగిన; అవదాతం= శుద్ధమైన; సత్త్వం, ఇవ= సత్త్వగుణమన్నట్లు; చకాశే= ప్రకాశించెను.

**తా॥** మధుద్రవాంగియైన దేవకియొక్క అవయవాల యందు నూతనమైన చంద్రుని అమృత నిష్యందంతో సదృశమైన శుభ్రవర్ణం, దేవకి గర్భం లోపలనున్న ఆదిపురుషుని చేత ప్రవర్తించిన శుద్ధసత్త్వగుణమో అన్నట్లు శోభించింది.

**వ్యాఖ్య:-** దేవకి శరీరం ధవళ వర్ణశోభితమని సుశ్లోకితం.

మధుద్రవాంగి దేవకీదేవి. నయనాలకు ఆప్యాయనమైన లావణ్యం మధువుగా అధ్యవసింపబడింది. మధువును ద్రవించేవి మధుద్రవాలు. మధుద్రవాలైన అంగాలు కలది మధుద్రవాంగి. మధుద్రవాంగి యొక్క ప్రతీకాలు (అవయవాలు) కనువిందు గొల్పే తేనె సొనలను జాలువార్చేవి. *"అంగం ప్రతీకోఽవయవః"*– (అమరం).

*నవేందు నిష్యంద నిభః వర్ణః:*– ఆమె అవయవాలయందలి వన్నె నూత్నమైన చంద్రుని అమృత ధారతో సమానమైన ధావళ్యం గలది. నిభశబ్దం ఉత్తర పదంగా ఉండడంవల్ల అస్వపద విగ్రహమిది. *"స్యురుత్తర పదేత్వమీ; నిభ సంకాశనీ కాశ ప్రతీకాశోపమాదయః"*– (అమరం).

*ప్రథమేన పుంసా ప్రవర్తితం సత్త్వమివా వదాతమ్:*– దేవకి గర్భమందున్న వాడు ఆదిపురుషుడు– భగవానుడు. లోపల ఉన్న పురుషోత్తమునిచేత వెలుపలికి ప్రసరించిన శుద్ధసత్త్వగుణమో అన్నట్లున్నది ఆమె మేను వెలుగు. *"అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం"*– అనే ఉపనిషద్వాక్యం సత్త్వరజస్తమో గుణాలు కలిగిన ప్రకృతిని పేర్కొంటూనే రజస్తమస్సులచే తిరస్కరింపబడని సత్త్వగుణం యొక్క శుభ్రతను తెల్పుతున్నది. *"మహాన్ ప్రభు ర్వైపురుషః సత్త్వ స్యైష ప్రవర్తకః"* అనే శ్వేతాశ్వతరోపనిషద్వాక్యాల వల్ల పురుషోత్తముడనే ప్రభువు– భగవంతుని యొక్క సత్త్వగుణ ప్రవర్తకత్వం ప్రసిద్ధం కదా!

ఈ శ్లోకమందు ఉపమేయం 'వర్ణః' అనేది పుంలింగ పదం, ఉపమానం 'సత్త్వం' అనేది నపుంసక లింగపదం. కాబట్టి ఉపమయందు లింగభేద దోషమున్నది. 'నోత్ప్రేక్షాదిష్వితి' అని వామనాలంకారమందు చెప్పబడింది. కాబట్టి, ఉత్ప్రేక్షాలంకారమందు ఉపమానోపమేయ లింగభేద దోషం ప్రసక్తించబడదు. ఉత్ప్రేక్షాలంకార సజ్జిత మీ శ్లోకం.

108. కరంబితా కించిదివ ప్రసృప్తై
స్తే జోభిరంతర్వ సత స్త్రి ధామ్నః
మరీచిభిః స్వై రభవత్ ప్రజానాం
మంగల్య రత్నాంకుర పాలికే వ॥ 8

**అర్థం:** అంతః= లోపల గర్భమందు; వసతః= ఉన్నట్టి; త్రిధామ్నః= భగవంతుని యొక్క; కించిత్, ఇవ= కొంచెమే; ప్రసృప్తైః= ప్రసరించబడిన; తేజోభిః= కాంతులచేత; కరంబితా= మిశ్రమైన, దేవకి; స్వైః= తనవైన; మరీచిభిః= కాంతి కిరణాలచేత; ప్రజానాం= జనులకు; మంగల్య రత్న+అంకుర పాలికా, ఇవ= శుభకరమైన రత్నాలుగా ఉన్న మొలకలు కలిగిన పాత్రయో అన్నట్లు; అభవత్= అయెను.

**తా॥** త్రిధాముడు భగవానుడు. పరమపదం, పాలకడలి, భానుమండల మనే మూడు నివాసస్థానాలు కలవాడని అర్థం. 'ధామన్' శబ్దానికి "గృహ దేహ త్విట్ ప్రభావా ధామాని" (అమరం) నివసించే ఇల్లు, దేహం, కాంతి, ప్రభావమనే అర్థాలున్నాయి. తేజోమయుడైన భగవానుడు దేవకీ గర్భం లోపల ఉన్నాడు. దేవకీ దేహమందు ప్రకృతి సిద్ధమైన కాంతి కిరణాలున్నాయి. గర్భం లోపల ఉన్న త్రిధాముని కాంతికిరణాలు వెలుపలికి కొంచెం ప్రసరించాయి. అంటే, దేవకీదేవికి సహజమైన కాంతికిరణాల అగ్రభాగమందు విడదీయరాని విధంగా కలిసి యున్నాయి. ఈ మిశ్రిత కిరణాలు రత్నాల మొలకలుగా తెల్లగా ప్రకాశిస్తున్నాయి. ఈ రత్నాంకురాలను వహించే పాత్రయే దేవకీదేవి.

ప్రజలు తమకు శుభం కలుగడానికి– శుభాభ్యుదయార్థం– పాలికలలో మంత్రపూతమైన పుట్టమన్ను, మేక ఎరువు కలిపి వేసి, బీజావాపనం– నవధాన్యాల విత్తులను చల్లి, పాలికలను పూజించి మొలకలు బాగా పెరగడానికి నీరుపోసి శ్రద్ధతో పెంచే కర్మకలాపాన్ని 'అంకురార్పణ' మంటారు.

పాలిః, పాలికా శబ్దాలకు నానార్థాలున్నాయి. ఇక్కడ సమూహం, స్థాలి అనే అర్థాలు వర్తిస్తాయి. పాల్యతే ఇతి పాలికా. రక్షించేది, రక్షింపబడేది అని వ్యుత్పత్త్యర్థం.

"మయూర పింఛద్యుతిభిః"- (105) అనే శ్లోకమందు 'అంకురాల పంక్తి' అనే అర్థం కలదిగా 'పాలికా' శబ్దం ప్రయుక్తమైనది. ఈ శ్లోకమందు మాత్రం మిశ్రిత కాంతులను రత్నాంకురాలుగా చెప్పి, అట్టి సంపృక్త కాంతులు గల దేవకి రత్నాంకురాలకు ఆధారమైన పాత్రగా ఉత్ప్రేక్షింపబడింది.

ఈ శ్లోకమందు 'కించిదివ' అన్నచోట 'ఇవ' శబ్దం వాక్యాన్ని పూరించడానికి ప్రయోగింపబడింది. "ఇహైవాదయో వాక్య పూరణార్థాః" అని శబ్ద ప్రకాశికా వచనం.

పవర్గ తృతీయాక్షరమైన 'కరంబ' శబ్దం మిశ్రవాచి. "కరేటు కోక కురర కలహంస కరంబితే" ('విదగ్ధ ముఖమండన' గ్రంథమందున్నది). కీర్యతే ఇతి= కరంబ శబ్ద వ్యుత్పత్తి. చిల్కబడునది- అని అర్థం. "కరంభో దధిసక్తవః"- (అమరం) పెరుగు కల్పిన వేపుడు పిండి. పవర్గ చతుర్థం ఇది. "సాంభః కుంభం కరంభం" (బాణానుప్రాసం).

109. తస్యాః సుధోల్లాస జుషః కటాక్షాః
సంక్షుబ్ధ దుగ్ధోదధి సౌమ్య భాసః
జగత్త్రయీ సౌధ విలేపనార్హాం
వితేనిరే వర్ణసుధా మపూర్వామ్॥ 9

**అర్థం:** సంక్షుబ్ధ దుగ్ధ+ఉదధి సౌమ్య భాసః= మంథా చలం చేత పాలకడలివలె మనోజ్ఞమైన కాంతిగల; తస్యాః= ఆ దేవకి యొక్క; సుధా+ఉల్లాస జుషః= అమృత విభ్రమాన్ని పోలియున్న; కటాక్షాః= కడగంటి చూపులు; జగత్+త్రయీ సౌధ విలేపన+

అర్హ్వాం= మూడు లోకాలు అనే మేడకు పూయడానికి తగిన; అపూర్వాం= విలక్షణమైన; వర్ణసుధాం= తెల్లని సున్నాన్ని; వితేనిరే= విస్తరింపజేశాయి.

**తా॥** మందర పర్వతంచేత క్షీరాబ్ధివంటి అందమైన కాంతిగల దేవకి యొక్క అపాంగ దృక్కులు అమృతోల్లాసాన్ని పోలియున్నాయి. ఆమె కడగంటి చూపులు లోక త్రయమనే సౌధానికి విలేపనార్హమైన విలక్షణమైన తెల్లని సున్నంగా విస్తరించి శోభించాయి.

వ్యాఖ్య:- దేవకి యొక్క కటాక్ష ప్రభావం చేత జగత్త్రయానికి నూతన శోభ చేకూరిందని వర్ణితం.

దేవకి యొక్క కటాక్షం అమృతంతో పోల్చబడింది. అమృతం జనించింది పాలకడలిలోనే కదా! మందర పర్వతం సముద్రమందు క్షుభితమైనది. సంగతః క్షుబ్ధః మస్మిన్ సః= సంక్షుబ్ధః. మథాచలమని అర్థం. 'ప్రాదిభ్యో ధాతుజస్య' ఇత్యాది నియమంచేత బహువ్రీహి సమాసపదమిది.

పాలకడలిలో వేసి అస్తవ్యస్తంగా చిల్కిన పర్వతంచేత ఒకవైపు తిరుగుతున్న పాలు ఎదురు తిరుగుతుండగా- పరావర్తనం చెందినప్పుడు తెల్లని నురుగుతో సుడులు తిరిగే దృశ్యం కనువిందు గొల్పుతుంది. సౌమ్యంగా భాసించే దేవకీ కటాక్షానికి సంక్షుబ్ధ దుగ్ధోదధితో సామ్యం చెప్పబడింది. "*సౌమ్యో విప్రే సోమజేఽబ్జే సుందరే సోమదైవతే*"- (యాదవ నిఘంటువు).

*సుధోల్లాసజుషః*:- పాలకడలియందు జనించిన అమృతం కూడా విశేషంగా వాయువుచేత చలించడాన్ని బట్టి, కటాక్షం సుధాసామ్యంగానూ వర్ణితం.

*జగత్త్రయీ సౌధ విలేపనార్హాం వర్ణసుధాం వితేనిరే*:- మేడకు వెల్లవేయడానికి తెల్లని సుధ- సున్నం యోగ్యమైనది కదా! "*లేపభేదేఽ మృతే సుధా*" (యాదవ నిఘంటువు).

స్వర్గ మర్త్య పాతాళలోకాలు మూడు (3) ఒక సౌధంగా రూపింపబడింది. మిక్కిలి తెల్లని కాంతిగల దేవకీ కటాక్షాలు, జగత్త్రయ సౌధానికి విలక్షణమైన వన్నె అనే సుధను- సున్నాన్ని వేసినట్లు శోభిస్తున్నాయి.

సామాన్యంగా చూపులను తెల్లగా వర్ణించడం కవిసమయం. "తామేవధ వళేక్షణాం" అన్నట్లు, విశేషంగా గర్భిణి చూపులు తెల్లనివని 'సుధోల్లాసజుషః' అని వర్ణింపబడడం గమనీయం.

'సంక్షుబ్ధ దుగ్ధోదధి సౌమ్యభాసః' అన్నచోట ఉపమాలంకారం 'సుధోల్లాసజుషః' అన్నచోట సంబంధం లేకున్నా సంబంధమున్నట్లు వర్ణించడం వల్ల, అసంభవత్ వస్తుసంబంధ నిబంధన గల నిదర్శనాలంకారం.

లేపనాగుణ్యంవల్ల 'వర్ణసుధాం' అన్న పదమందు రూపకాలంకారం. కాబట్టి, సంకరాలంకృత శ్లోకమిది. ముఖ్యంగా, క్షీరాబ్ధియందు ఆవిర్భవించిన లక్ష్మీదేవి కటాక్షంతో సామ్యం వ్యంజితం.

*110.* రక్షావిధౌ రాక్షస దానవానాం
కారాగృహే కంస నియోగ భాజామ్।
సంపశ్యమానా సకృదీక్షితావా
సంక్షోభయా మాస మనాంసి సైషా॥ 10

**అర్థం:** సా= ఆ, ప్రసిద్ధమైన; ఏషా= ఈ దేవకి; కారాగృహే= బంధనాలయమందు; రక్షావిధౌ= సంరక్షణకృత్యమందు; కంసనియోగ భాజాం= కంసునిచే నియుక్తులైన; రాక్షస, దానావానాం= రాక్షసులయొక్క, దానవులయొక్క; మనాంసి= మనస్సులను; సంపశ్యమానా= చూస్తున్నదై; వా= లేక; సకృత్= ఒక్కసారి; ఈ క్షితా= చూడబడుతున్నదై; సంక్షోభయామాస= కలతపెట్టెను.

**తా॥** సంక్షుబ్ధ దుగ్ధోదధి వంటి సౌమ్య కాంతిగల ఆ దేవకి చెరసాలలో కంసుని బంటులైన రాక్షసులయొక్క అసురులయొక్క హృదయాలను, తాను

రాక్షసులకు విరోధియైన వైష్ణవ తేజస్సును భరించినందువల్ల, చూస్తూనో లేదా వారిచే చూడబడుతూనో భయసంభ్రమాలు కలుగునట్లు క్షోభింపజేస్తుండెను. చెరసాలలో కంసుని సేవకులైన అసురులు వైష్ణవ తేజః పూర్ణయైన దేవకిని జూచి దిగులు చెందుతుండిరని భావం.

111. భుక్తా పురాయేన వసుంధరాసా
స విశ్వభోక్తా మమగర్భ భూతః।
ఇతి ధ్రువం సూచన మాచరంతీ
తత్తాదృశం నాటితకం తతాన॥ 11

**అర్థం:** సా= ఆ దేవకీదేవి; పురా= పూర్వకాలమందు; యేన= ఏ భగవానుని చేత; వసుంధరా= భూదేవి; భుక్తా= అనుభవింపబడినదో; సః= ఆ ప్రసిద్ధుడైన; విశ్వభోక్తా= విశ్వాన్ని అనుభవించిన భగవానుడు; మమ= నా యొక్క గర్భమందు ఉన్నవాడు; ధ్రువం= నిశ్చయం; ఇతి= అని; సూచనం= సంకేతాన్ని; ఆచరంతీ= చేస్తూ; తత్తాదృశం= ఆ భగవంతుని చరిత్ర వంటి; నాటితకం= నటనాభినయాన్ని; తతాన= విస్తరింపజేసెను.

**తా॥** పూర్వకాలమందు ఎవడు భూమిని అనుభవించాడో ఆ విశ్వభోక్తయైన భగవానుడు నా గర్భమందున్నాడనేది నిశ్చయమని సూచిస్తూ దేవకి, ఆ భగవచ్చరిత్ర వంటి అభినయాన్ని ప్రదర్శిస్తున్నదో అన్నట్లు మట్టిని తినసాగింది.

**వ్యాఖ్య:-** గర్భవతి యైన దేవకి యొక్క మృద్భక్షణం ఉత్ప్రేక్షితం.

గర్భలాలసచేత గర్భిణులు సాధారణంగా మట్టి బెడ్డలను తింటారు. మహారాజ్ఞియైన దేవకి యొక్క గర్భమందున్న భగవానుడు పూర్వం వరాహావతార కాలాన భూమిని ఉద్ధరించాడు, అనుభవించాడు. రామావతారమందు భూమిని పాలించాడు. భూమియందుండే హవ్యకవ్యరూప ద్రవ్యాలను అనుభవించినవాడు విశ్వభోక్త. ప్రళయమందు కూడా భూమిని గర్భమందుంచుకొని

వటపత్రశాయియైవాడు విశ్వభోక్త. ఇది భూమిని అనుభవించిన భగవచ్చరిత్ర. దేవకి మట్టిని చేతిలో పట్టుకొని, తినడానికే అని ఇతరులకు తెలియకుండా, వటపత్రశాయి విశ్వాన్ని ఎవరికంట బడకుండా కుక్షిలో వేసి రక్షించుకొని అనుభవించిన విశ్వభోక్త యొక్క లీలలను నటించి ప్రదర్శిస్తున్నట్లు ఆమె ఏరుకొన్న మట్టి బెడ్డలను చేతపట్టుకొని నోటిలో వేసుకొని భక్షించిందట.

*తత్తాదృశం నాటితకం తతాన:*- ఈ శ్లోకమందు 'వసుంధరా' శబ్ద ప్రయోగం గమనీయం. *"ధరణీ లోకధారిణీ"* (శ్రుతి). చేతనాచేతన వస్తువులను ధరించేది భూమి. సృజింపబడిన జగత్తును- భూమిని- అవతారాలలోనూ అనుభవించాడు భగవానుడు. *"పయోధరీ భూత చతుస్సముద్రాం, జుగోప గోరూపధరాం ధరిత్రీమ్"*. నాలుగు సముద్రాలు నాలుగు స్తనాలుగా గోరూపాన్ని ధరించిన భూదేవిని (*"నా విష్ణుః పృథ్వీ పతిః"*- భూపతియైన నరుడు విష్ణువు అన్నట్లు) రఘునాథాదులు రక్షించి, *"భువనస్య గోప్తా"*- (శ్రుతి) అని లబ్ధ ప్రతిష్ఠులైనారు. ప్రళయంలోనూ ముజ్జగాలను బొజ్జలో నుంచుకొని కాపాడి, విశ్వభోక్తగా పేర్కొనబడినవాడూ భగవానుడే.

ఆ చారిత్రకుడైన భగవానుడు తన కడుపులో నున్నాడు. ఆయన ఇలాగా భూమిని అనుభవించాడని ఆయన చరిత్రతో సమానంగా దేవకి, తన మృద్భక్షణాన్ని నాటకీయతగా చేసింది.

*తత్తాదృశం:*- తత్ తత్ ఇవ దృశ్యతే ఇతి= తత్తాదృశం. తత్ తత్ అని రెండు సార్లు (వీప్సితమైన) వాడబడిన తచ్ఛబ్దమనే ఉపపదానికి పరమైన 'దృశ్' ధాతువునకు 'కఞ్' ప్రత్యయం చేరి 'తత్తాదృక్' రూపమేర్పడింది.

*"తమివైనం పశ్యంతి జనాః, సోఽయంస ఇవ దృశ్యమానః, తమివాత్మానం పశ్యంతీతి తాదృక్"*- (అతనివలెనే ఇతనిని జనులు చూస్తారు. ఇతడే అతడువలె చూడబడుతాడు. అతనిని చూచినట్లే తనను (జనం) చూస్తుంది అనే అర్థం కలది 'తాదృక్') అని భాష్యమందు వ్యుత్పత్తి ప్రదర్శింపబడింది.

అనేకావతారాలలో వసుంధరోపభోగరూపాలైన భగవానుని కృత్యాలు వీప్సితమైన 'తత్తత్' పదంచేత గ్రహింపబడుతున్నాయి. 'తత్తాదృశం' ద్వితీయ విభక్త్యేక వచనం. 'నాటితకం' అనే విశేష్య పదానికి ఇది విశేషణ పదం.

భోజరాజు మాత్రం 'తత్' అనే పదం యొక్క వీప్సను అంగీకరించలేదు. తుల్యశబ్ద సమానార్థం కలిగిన 'తత్తుల్య' శబ్దం వలె, తాదృశ శబ్ద సమానార్థకమైన 'తత్తాదృశ' శబ్దం కూడా అఖండమైనదని ప్రవచించాడు.

*112. సమాధి సుక్షేత్ర కృషీవలానాం*
*సంతోష సస్యోదయ మేఘ కాంత్యా।*
*చకాస తస్యాః స్తన చూచుకాభా*
*గర్భత్విషా గాఢమివానులిప్తా॥* 12

**అర్థం:** సమాధి సుక్షేత్ర కృషీవలానాం= సమాధి అనే మంచి పొలమందు కర్షకుల యొక్క; సంతోష సస్య+ఉదయ మేఘకాంత్యా= సంతోషమనే పైరు యొక్క వృద్ధియందు మేఘం యొక్క కాంతిచేత; తస్యాః= దేవకియొక్క; స్తన చూచుక+ఆభా= చనుమొనల కాంతి; గర్భత్విషా= కుక్షిస్థ శిశువు యొక్క కాంతిచేత; గాఢం= బాగా; అనులిప్తా, ఇవ= పూయబడినట్లు; చకాస= ప్రకాశించెను.

**తా॥** యోగులకు సమాధి యందు ఆనందం కలుగుతుంది. కర్షకులకు సారవంతమైన భూమియందు పైరు పెరుగుతుంటే సంతోషం కలుగుతుంది. పెరిగిన సస్యమందు నల్లని మేఘచ్ఛాయ ప్రసరించినప్పుడు సస్య శ్యామల వర్ణంతో శోభాయమానంగా ఉంటుంది. అట్లే యోగుల ఆనందానికి కారణభూతుడైన దేవకి గర్భమందున్న భగవానుని కాంతిచేత గర్భిణి దేవకి యొక్క చనుమొనల కాంతి ఆవరింపబడింది. దేవకి యొక్క చనుమొనలు నీలకాంతిచే శోభించాయని, మేఘశ్యాముడైన గర్భస్థ శిశువు యొక్క కాంతిచేత బాగా నలుపు ఎక్కియున్నాయనడం ఉత్ప్రేక్షాలంకార లక్షణం. పూర్వార్థంలో పరంపరితా రూపకాలంకారం.

ఈ రెండింటిచే సంసృష్టి శ్లోమందు సుస్పష్టం. 'చూచుక' శబ్దం స్తనాగ్రభాగాన్ని ప్రకటిస్తున్నది. అయినా, 'గజఘటం, కరికలభం' అన్నట్లు 'స్తన చూచుక'మని కవిచే ప్రయోగింపబడడం రూఢి.

*113. కస్తూరికా కామ్యరుచి స్తదీయా*
*రమ్యా బభౌ చూచుక రత్నకాంతిః।*
*తద్గర్భ సందర్శన లోలు పానా*
*మంతర్దృశామంజన కల్పనేవ॥* 13

**అర్థం:** కస్తూరికా కామ్య రుచిః= కస్తూరిచేత కోరదగిన కాంతిగల; రమ్యా= రమణీయమైన; తదీయా= ఆ దేవకికి సంబంధించిన; చూచుక రత్నకాంతిః= రత్నాల వంటి చనుమొనల శోభ; తత్+గర్భసందర్శన లోలుపానాం= ఆ దేవకి కడుపులో ఉన్న శిశువును చూడడానికి ఆసక్తి కలిగిన; అంతర్దృశాం= యోగుల యొక్క; దృశాం= కన్నుల యొక్క; అంతః= లోపల; అంజనా కల్పనా, ఇవ= కాటుకను కల్పించినట్లు; బభౌ= ప్రకాశించెను.

**తా॥** కస్తూరి అనే పరిమళమూ, నీలవర్ణమూగల ద్రవ్యం కంటెను ఎక్కువ కాంతికలిగి రమ్యమైన ఆ దేవకి యొక్క రత్నాలను పోలియున్న స్తనాగ్రశోభ, ఆమె గర్భంలో నున్న శిశువును చూచే ఆశగల యోగుల కన్నులలో పూయబడిన కాటుకయో అన్నట్లు భాసించెను.

**వ్యాఖ్య:-** దేవకీ చూచుక వర్ణ శోభ ఉత్ప్రేక్షితం.

గర్భిణియైన దేవకియొక్క చనుమొనలు రత్నాలలాగా గుండ్రంగా ఉండి నీలవర్ణం కలిగియున్నాయి. కస్తూరిక మృగంచే విసర్జితమై కమ్మని వాసన, నలుపురంగు గల కస్తూరి అనే వస్తువు, దేవకి యొక్క స్తనాగ్ర వర్ణశోభలాంటి వర్ణశోభ తనకు లేకపోయెనని చింతపడుతుందట. అంత రమ్యమైనది ఆ వర్ణ శోభ.

యోగులు తమ హృదయమందున్న ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనే అంతర్దృష్టి కలవారు. దేవకియొక్క గర్భం లోపల ఉన్న శిశువును చూడాలనే ఆశ పడేవారు. (స్తనాలను చూచే యోగ్యతగల స్త్రీలు కూడా) తమ కన్నులకు ఈమె చూచుకాలవన్నెను కాటుకగా పెట్టుకొంటెనే కాని వారి కోరిక తీరదు.

ఛాందోగ్యోపనిషత్తు చెప్పినట్లు హితమైన, రమ్యమైన హిరణ్యనిధిని, అది తాము నడిచే భూమిలోపలనే ఉన్నను, జనులకు చూడశక్యం కాదు. కంటికి అంజనం పెట్టుకొన్న మహానుభావులే అంజన సామర్థ్యంచేత చూపు లోపలికి పోవడం వల్ల, హిరణ్య నిధిని కనుగొనగలుగుతారు కదా! అలాగే, దేవకి గర్భంలోపల ఉన్న భగవానుణ్ణి చూడగోరే వారి కన్నులకు, ఆమె చనుమొనల నలుపు, చూపును- దృష్టిని- లోపలికి ప్రవేశింపజేసే ప్రభావం కలిగియున్న అంజనపు పూత యన్నట్లు రమణీయంగా శోభించింది.

*114.* *పరావరాణాం ప్రభవస్య పుంసః*
*ప్రకాశకత్వం ప్రతిపత్స్య మానాం।*
*అభావయన్ భావితచేతస స్తాం*
*విద్యామయీం విశ్వపితామహీంచ॥* 14

**అర్థం:** భావిత చేతసః= సంస్కరింపబడిన మనస్సు కల జ్ఞానులు; పర+అవరాణాం= ఉచ్చ నీచమైన వస్తువులన్నింటికి; ప్రభవస్య= కారణమైన; పుంసః = పురుషోత్తముని యొక్క; ప్రకాశకత్వం= ప్రకాశకత్వాన్ని; ప్రతిపత్స్యమానాం= పొందించగల; తాం= దేవకీదేవిని; విద్యామయీం= శ్రుతికాంతగానూ; విశ్వపితామహీం, చ= జగత్పితకు మాతగానూ; అభావయన్= భావించారు.

**తా॥** సంస్కారపరులైన జ్ఞానులు, ఉత్కృష్టులను అపకృష్టులను, ఉచ్చనీచ వస్తువులను కలిగియున్న సకల జగాలకు కారణమైన తండ్రియైన పరమ పురుషుని ఆవిర్భవాన్ని ప్రాప్తింపజేయగలదు కాబట్టి, దేవకీదేవిని లోకదృష్టిచే జగజ్జనకుణ్ణి

కనే తల్లిగా భావించారు. అంతే కాదు, సర్వజగత్కారణుడైన పరబ్రహ్మను ప్రతిపాదించే విద్యానిధి (వేదం) గానూ తలచారు.

*115. లిలేఖ విశ్వాని జగన్త్యభిజ్ఞా*
*లీలాహృతే చిత్రపటే యథార్థమ్।*
*ప్రాయః ప్రజానాం పతయః ప్రతీతాః*
*యన్మాతృకాః స్వేషు విధిష్వభూవన్॥* 15

**అర్థం:** అభిజ్ఞా= అన్నీ తెలిసిన దేవకి; లీలా+ఆహృతే= వినోదంగా వ్రాసిన; చిత్రపటే= చిత్రపటమందు; యథా+అర్థం= సముచితంగా; విశ్వాని= సకల; జగంతి= లోకాలను; లిలేఖ= వ్రాసెను; ప్రజానాం, పతయః= స్రష్టలు; ప్రాయః= తరచుగా; యత్+మాతృకాః= ఆ చిత్రపటం ఆధారం కలవారవుతూ; స్వేషు= తమవైన; విధిషు= కార్యాలయందు; ప్రతీతాః= ఖ్యాతిని పొందినవారు; అభూవన్= అయ్యారు.

**తా॥** దేవకికి, భగవన్మయాన్ని పొందినది కాబట్టి, సర్వలోకాలలో ఉన్న విషయాలు బాగా తెలిసియున్నాయి. ఆమె వినోదంగా చిత్రపటమందు వ్రాయవలసిన దాన్ని విడువకుండా లోకాలనన్నీ లిఖించింది. భగవానుడు మొదట సృష్టించినదాన్ని మాతృకగా చేసుకొని బ్రహ్మాదులు లోకాలను సృజిస్తుంటారు. దేవకి చిత్రించిన పటాన్ని బ్రహ్మాదులు మాతృకగా చేసుకొని బహుశః తమ విధులను నిర్వహిస్తూ ప్రఖ్యాతిని పొందినారని ఉత్ప్రేక్ష. ముఖ్యంగా ఈ శ్లోమందు దేవకి చిత్రపటమందు వ్రాసినదంతా, పరమ పురుషుని క్రీడతో సమానమైనదని విశదమే కదా!

యత్ మాతృకా యేషాంతే= యన్మాతృకాః అనేది 'ప్రజా పతయః' శబ్దానికి సన్నంత విశేషణం.

*116. నిరాశిషాం పద్ధతి మాదదానా*
*నైః శ్రేయసీం నీతి ముపఘ్నయంతీ।*
*పుణ్యాశయా పూర్వయుగ ప్రరోహ*
*మియేష దేవీ భువనే విధాతుమ్॥* 16

**అర్థం:** నిరాశిషాం= కోరికలు లేని వారి యొక్క; పద్ధతిం= మార్గాన్ని; ఆదదానా= స్వీకరించినట్టి; నైఃశ్రేయసీం= మోక్షానికి సంబంధించినట్టి; నీతిం= నీతిని; ఉపఘ్నయంతీ= ఆశ్రయాన్ని కల్పించునట్టి; పుణ్య+ఆశయా= పరిశుద్ధమైన అభిప్రాయం కలిగిన; దేవీ= దేవకి; భువనే= లోకమందు; పూర్వయుగ ప్రరోహం= కృతయుగమనే మొక్కను; విధాతుం= కల్పించడానికి; ఇయేష= కోరెను.

**తా॥** దేవకి కోరికలు లేనిదయింది. మోక్షసంబంధమైన నీతిని ఆధారం కలిగియుండునట్లు చేయగోరింది. పవిత్రమైన మనస్సు కలది కాబట్టి, కృతయుగం యొక్క అంకురాన్ని నేలయందు నాటి పెంచగోరింది.

**వ్యాఖ్య:-** గర్భిణియైన దేవకికి భోజనమందు కలిగిన అభిరుచి వర్ణితం.

గర్భవతులు సామాన్యంగా ఆహారాన్ని ఇష్టపడని దశ మూడు శ్లోకాలలో వర్ణింపబడుతున్నది.

*నిరాశిషాం పద్ధతి మాదదానా:-* ఆశ, అభిలాష లేనివారి పద్ధతిని అవలంబించిందని- దేవకికి భోజనం చేసే అభిలాష లేదని- చెప్పిన విధమిది. *"ఆశీరురగదంష్ట్రాయాం శుభ వాక్యాభిలాషయోః"-* (యాదవ నిఘంటువు). ఆశలేనివారు నిరాశిషులు. నైరాశ్యంవల్ల విరక్తిమార్గాన్ని పట్టింది. ప్రాపంచిక భోగాలపైన మనస్సు ప్రవర్తిస్తే 'ప్రవృత్తి ధర్మం' అంటారు. అట్టి ప్రవృత్తి నుంచి నివర్తిస్తే 'నివృత్తి ధర్మం' అంటారు.

*నైఃశ్రేయసీం నీతి ముపఘ్నయంతీ:-* "స్యాదుపఘ్నోఽంతి కాశ్రయే"- (అమరం). దగ్గరగా ఉండే ఆధారం 'ఉపఘ్న' మనబడుతుంది (తీగ ప్రాకదగిన పబ్బు, లేదా కఱ్ఱ).

*"ముక్తిః కైవల్య నిర్వాణశ్రే యోనిశ్శ్రేయస సామృతం, మోక్షోఽ పవర్గం"*-(అమరం). దేవకీదేవి నివృత్తి ధర్మాన్ని వృద్ధిచేయడానికి అంటే ముక్తికి ఉపయోగపడే నీతిని (తీగను పెంచడానికి వలె) వృద్ధి జేయడానికి ఆశ్రయాన్ని కల్పించ తలచింది.

*పుణ్యాశయా:* - పరిశుద్ధాంతఃకరణం కలది దేవకీదేవి. *"పుణ్యానామపి పుణ్యోఽ సౌ"* అన్నట్లు సత్త్వగుణ సమృద్ధినీ, ధర్మ సంస్థాపన మందు ఆసక్తినీ కలిగియున్న పరమాత్మ విషయంలో ఆశావిశేషం కలది. భగవంతుని యొక్క తాదాత్మ్యం చేత అటువంటి శైలినే ఆశ్రయించింది. నైఃశ్రేయస నీతిరూప లతకు కావలసిన ఆధార సంపత్తికి అర్హమైన (పూర్వ) కృతయుగమనే పేరుగల వృక్షం యొక్క మొలకను (అంకురాన్ని) భూమి యందు స్థాపించదలచింది. *"జగతీ లోకో విష్టపం భువనం జగత్"* (అమరం). పుణ్యమనే ఆలవాల కల్పనచేత, జగత్తులో కృతయుగంలాగా నాలుగు పాదాలుగల ధర్మాన్ని ప్రతిష్ఠాపించడానికి సంకల్పించిందని సారార్థం.

*117.* *అనాప్త పూర్వం కి మపేక్షితంతే*
*కింవోపదద్యామధవాఽ ధునేతి।*
*వయస్యయాఽ భావ విదాఽ ను యుక్తా*
*నకించి దిత్యేవ జగాద నాథా!॥* 17

**అర్థం:** అనాప్తపూర్వం= ఇంతవరకు పొందబడని; కిం= ఏ వస్తువు; తే= నీకు; అపేక్షితం= కోరబడినది? కావలెను; అథవా= లేక (ఇదివరకు తిన్నట్లే); అధునా= ఇప్పుడు; కిం, వా= ఏ వస్తువునైనను; ఉపదద్యాం= వడ్డింతును; (తినపెడుతాను); ఇతి= ఈ విధంగా; అభావ విదా= (ఆమె యొక్క) మనస్సు తెలియనట్టి; వయస్యయా= సఖిచేత; అనుయుక్తా= అడుగబడిన; నాథా!= స్వామినియైన దేవకి; న కించిత్ ఇతి ఏవ= ఏదీ లేదనియే; జగాద= పల్కెను.

**తా॥** "నీవు ఇంతకుముందు ఆహారంగా పొందని యే వస్తువు నీకు కావలెను? ఇంతకు ముందెప్పుడో తిన్న పదార్థాన్నైనా నీకు తినడానికి ఇస్తాను. నీకే పదార్థం కావాలనే అపేక్ష ఉంది?" అని దేవకీదేవిని ఆమె చెలికెత్త అడిగింది.

*భావవిత్:* – దేవకి యొక్క హృదయం, అభిప్రాయం– చెలికత్తెకు తెలుసు. కాని ఇప్పుడు, భగవద్రూపం ఆమె ఉదరమందున్నందున నిత్యతృప్త అనియు, లోకంలో ఇతర గర్భిణులకు ఉండే కోరికవలె ఆమెకు ఏ కోరిక లేదనియు (అభావ విదా) తెలియనిదవడం చేత, నెచ్చెలి 'నీ కెటువంటి ఆహార పదార్థం కావాలో చెప్పు'మని దేవకిని ప్రశ్నించింది.

*నాథా "నకించిదిత్యేవ" జగాద:* – అవాప్త సమస్త కాముదూ, నిత్యతృప్తుదూ అయిన భగవానుడు ఉపచరించేవారిని సంతోషపరచడానికి ఏ పదార్థాన్నైనా స్వీకరిస్తాడు. అయినా, ఇప్పుడు ఆ రీతి కూడా లేదు. కాబట్టి, దేవకీదేవి "నాకు కాలసిందేదీ లేదు. నేను ఏ పదార్థాన్నీ కోరడం లేదు. నాకేదీ వద్దు" అని స్పష్టంగా 'వయస్య'కు సమాధానం చెప్పింది. సమాన వయస్సు కలది 'వయస్య' చెలికత్తె– "ఆళిః సఖీ వయస్యాచ" (అమరం).

*118. అనాదరే దేవి సఖీజనానాం*
*కథం నదూయేత దయా తవేతి।*
*ఉపహ్వారే సంలపితా మనోజ్ఞై*
*రాలోకనై రుత్తరమాచ చక్షే॥* 18

**అర్థం:** హే దేవి= ఓ దేవకీదేవీ!; సఖీజనానాం= చెలికత్తెలను; అనాదరే= ఆదరించని విషయంలో; తవ= నీ యొక్క; దయా= కృప; కథం= ఎట్లు; న, దూయేత= పరితపించడం లేదు? ఇతి= అని; ఉపహ్వారే= రహసి= ఏకాంత స్థలమందు; సంలపితా (సతీ)= సంభాషింపబడుతున్నదై; మనోజ్ఞైః= స్నేహపూర్ణమైన; ఆలోకనైః= చూపులచేత; ఉత్తరం= సమాధానాన్ని; ఆచచక్షే= చెప్పెను.

**తా॥** "ఓ మహారాజ్ఞీ, దేవకీనదేవీ! నీవు సఖీజనులను ఆదరిస్తులేవు. అందువల్ల నీలోనున్న దయాగుణం లోపించిందా? ఉంటే, ఆ దయ ఎలా పరితపించకున్నది? దయా పరతంత్రమైన నీవు ఎప్పటివలె మాటలాడుతూ సఖులను సమ్మానించవలె గదా! అని సఖులు రహస్యంగా దేవకితో పలుకుతూ ఉంటే, ఆమె స్నిగ్ధమైన చూపులతోనే ప్రత్యుత్తరమిచ్చింది.

మాటాడితేనే దయ ఉన్నట్లు, మాటాడకుంటే దయలేనట్లు భావించరాదు. స్నేహభరితమైన చూపుల వల్ల కూడా దయ ప్రదర్శింపబడుతుందని దేవకి విశద పరచింది. మారు మాటాడే స్థానంలో స్నిగ్ధాలోకనాలను నిలిపింది.

ముఖ్యంగా దేవకి గర్భభారంతో అలసి యుంటున్నది. అంతేకాదు, అఖిల జగత్ప్రభువు దేవకీ గర్భమందు ఆవేశించాడు. ప్రభువు విశేషంగా మాటాడడు. కృపతో కటాక్షించడమే ప్రభువుయొక్క స్వభావం కదా! దేవకీదేవి తాను కూడా ప్రభుశక్తిని ఆశ్రయించి అటువంటి ప్రక్రియనే అనువర్తించిందని భావం..

*119. అశేత సా కామ మజాతనిద్రా*
*మాతుం ప్రవృత్తేవ పదాని చక్రే।*
*అధ్యాస్త లోకా నవధీరయంతీ*
*భద్రాసనం భావిత పారమేష్ఠ్యా॥* 19

**అర్థం:** సా= ఆ దేవకి; అజాత నిద్రా= నిద్రలేనిదైనను; కామం= బాగా; **అశేత**= పడుకొనెను; మాతుం= కొలువడానికి; ప్రవృత్తా, ఇవ= ప్రవర్తించిన దానివలె; పదాని= అడుగులను; చక్రే= పెట్టెను; లోకాన్= జనులను; అవధీరయంతీ= సంమానించకుండా ఉంటూ; భావిత పారమేష్ఠ్యా (సతీ)= పొందబడిన పరమేష్ఠి భావం కలదిగా అవుతూ; భద్ర+ఆసనం= సుఖాసనాన్ని; ఆధ్యాస్త= అధిష్ఠించెను.

**తా॥** దేవకీదేవి నిద్రలేనిదైనా ఎక్కువగా పడకపైన పవళించేది. భూమిని అడుగులతో కొలుస్తున్నదన్నట్లు నడిచేది. లోకులు తనచుట్టూ ఉన్ననూ, వారిని

సాదరంగా చూడకయే, పరమేష్ఠి భావాన్ని పొందినదవుతూ భద్రాసనం మీద కూర్చుండేది.

వ్యాఖ్య:- గర్భిణిగా ఉన్న దేవకీ కృత్యం భగవత్కార్యంతో సమమైనదని సుశ్లోకితం.

గర్భాలసయైన దేవకి చేష్టలు, ఆమె భగవంతుని చరిత్రను అనుకరిస్తున్నట్లు ఊహించదగియున్నవి.

*అశేత సాకామ మజాత నిద్రా:-* గర్భభారంచేత నిద్రపట్టదు. నిదుర పట్టకున్నా, దేవకి పడకపైన ఎక్కువ కాలం పడుకొని యుంటుంది. ఇది క్షీరాబ్ధిలో శేషశయ్యమీద పడుకొన్న భగవంతుని యోగనిద్రను తలపిస్తున్నది.

*మాతుం ప్రవృత్తేవ పదాని చక్రే:-* దేవకి నడిచే చోట నేల ఇన్ని అడుగులున్న దని తానే కొలిచి చూస్తున్నట్లు ఒక అడుగును ఆనుకొని మరొక అడుగు వేస్తూ మెల్లగా నడుస్తున్నది. ఆమె యొక్క ఈ మందగమనం వామనావతారంలో భగవానుడు బలిని యాచించి పొందిన మూడడుగుల భూమిని బుడి బుడి యడుగులతో కొల్చుకొన్న త్రివిక్రముని చరిత్రను స్ఫురింపజేస్తున్నది.

*అధ్యాస్త లోకా నవధారయంతీ భద్రా సనం:-* తన చుట్టూ, తన కంటే వయస్సులోనూ, జ్ఞానంలోనూ పెద్దవాళ్ళు ఉన్నప్పటికీ, ధిక్కారంతో మర్యాదను పాటించనిదై దేవకి భద్రాసనం మీద సుఖంగా ఆసీనయైనది. "*భద్రం కల్యాణ సౌఖ్య యోః*" (యాదవః).

*భావిత పారమేష్ఠ్యా:-* నిద్రలేని శయనం, అతిమందగమనం, పెద్దవాళ్ళ యెదుట ఉన్నతాసనం మీద కూర్చోవడం, భగవద్భావాన్ని పొందినదై దేవకి, భగవదావేశంచేత చేయబడిన భగవంతుని చరిత్రను అనుకరించింది. ప్రదర్శించింది (చింతించిన- పొందిన, పరమేష్ఠి భావం కలది- దేవకి- అని అర్థం).

భూధాతువు 'భవోఽవకల్కనే' అని 'చింతన' అనే అర్థమందును; (భావన). 'భూ-ప్రాప్తౌ' అని ప్రాప్త్యర్థమందును 'ణిచ్' అనుశాసనం వల్ల 'భావిత' శబ్దం ప్రయుక్తం. పరమే తిష్ఠతి ఇతి= పరమేష్ఠీ. ఉత్కృష్ట స్థానమందుండేవాడు.

"తత్పురుషే కృతి బహుళమ్" అనే నియమాన్నిబట్టి 'అలుక్ సమాస'మిది. పరిమేష్ఠినః భావః= పారమేష్ఠ్యం. భావితం, పారమేష్ఠ్యం యయా సా= భావితపారమేష్ఠ్యా = (బహువ్రీహి సమాసం).

పూర్వార్ధమందు శేషశయనం, త్రివిక్రముని చరితం అనుకరింపబడిందని స్ఫురిస్తున్నది. ఉత్తరార్ధమందు 'భావిత పారమేష్ఠ్యా' కాబట్టి, జనులను అనాదరిస్తూ భద్రాసనం– రాజాసనాన్ని అధిష్ఠించడం భద్రం– సుఖం, లోక కల్యాణం కోసమే అని పరమైశ్వర్యానుకరణం ప్రతీయమానమవుతున్నది.

*120.* *పరిక్రమ ప్రేక్షిత భాషితాద్యై*
*రన్యాదృశై రాప్త విభావనీయైః।*
*మదోప పన్నామదలాలసావా*
*జి (జా) తశ్రమావేతి జనైః శశంకే॥* 20

**అర్థం:** అన్యాదృశైః= వేరే విధాలైన; అప్త విభావనీయైః= అంతరంగికులచేత భావించదగిన; పరిక్రమ, ప్రేక్షిత, భాషిత+అద్యైః= నడక, చూపులు, సంభాషణ మొదలైన వాటిచేత; మద+ఉపపన్నా= మదంతో కూడుకొని యున్నదో; మదలాలసా, వా= మదం యొక్క ఔత్సుక్యం కలిగి మెల్లగా నడుస్తున్నదో; జితశ్రమావా= జయింపబడిన శ్రమకలదియో; ఇతి= అని; జనైః= జనులచేత; శశంకే= అనుమానింప బడింది.

**తా॥** ఇంతవరకు చెప్పబడిన దానికంటే వేరే విధంగా, జనులు దేవకీదేవి యొక్క మందగమనాన్ని, చూపులను, మాటలను, చేష్టలను అనుమానించారు. వాస్తవం మాత్రం ఆప్తులకు– అంతరంగికులకే తెలుస్తుంది కదా! మాదక ద్రవ్యాలను

సేవించడం వల్ల దేహంలో మాంద్య మేర్పడిందేమో అని కొందఱు; మదమనే భావ వికారం యొక్క ఉత్సాహంచే మంథర- మెల్లని నడక గలదిగా ఉన్నదేమో అని మఱికొందఱు శంకించారు. ముఖ్యంగా కొన్నినాళ్ళు సఖురాండ్రతో బాగా సంచరించడం, చురుకుగా సంభాషించడం మొదలైన కృత్యాలచే కలిగిన శ్రమను (గెలిచి) సహించి, ఇప్పుడు ఓర్పు, నేర్పుతో సుఖం పొందడానికి మందగమన, ఆలోకన, సంభాషణాది కృత్యాలను సమర్థతతో నిర్వహిస్తున్నదని వేరే కొందఱు అనుమానించారు.

జాతశ్రమావా:- శ్రమ కలగడం వాస్తవమే. ఆ శ్రమను ఓర్చుకొంటున్నందు వల్ల మందగమనాదులు ప్రకృతి సిద్ధమే కదా! మదం కానీ మద వస్తువులను సేవించడం కానీ ఏదీ కారణం కాదని కొన్ని సమయాల్లో జనులు శంకించారని విశదమవుతున్నది.

యథార్థంగా, ప్రభువు యొక్క శక్తిని భరించడమే మందగమనానికి హేతువని ప్రతీయమానమవుతున్నది.

*121. శేషే శయానాం గరుడేనయాంతీం*
*పద్మే నిషణ్ణా మధిరత్న పీఠమ్।*
*హయాననై రాశ్రిత వంది కృత్యాం*
*స్వామాకృతిం స్వప్నదృశా దదర్శ॥* 21

**అర్థం:** స్వాం= తనదైన ఆకృతిం= శరీరాన్ని; శేషే= ఆదిశేషుని యందు; శయానాం= పడుకొన్నట్లుగానూ; గరుడేన= పక్షిరాజుచేత; యాంతీం= పోతున్నట్లు గానూ; అధి రత్నపీఠం= రత్న సింహాసనమందలి; పద్మే= కమలమందు; నిషణ్ణాం= కూర్చున్నట్లుగానూ; హయ+ఆననైః= తురగముఖులైన కింపురుషుల చేత; వందికృత్యాం= స్తుతింపబడుతున్నట్లుగానూ; స్వప్నదృశా= స్వప్నరూపమైన దృష్టిచేత; దదర్శ= చూచెను.

**తా॥** దేవకీదేవి తాను శేషతల్పమందు పవళించినట్లు, గరుడపక్షిమీద ఎక్కి పయనిస్తున్నట్లు, రత్నసింహాసనంమీద పద్మమందు ఆసీనయైనట్లు, కింపురుషులు కీర్తిస్తున్నట్లు కలలో చూచింది. దేవకి తన గర్భమందున్న భగవంతుడు, ఆయన పరివారమైన ఆదిశేషాదులతోపాటు తన గర్భంలో ఉన్నట్లు కలలో చూచిందని తాత్పర్యం.

*122. అంతః స్థితం యస్య విభోరశేషం*
*జగన్నివాసం దధతీ తమంతః।*
*తదాత్మనో విశ్వ మపశ్యదంత*
*స్తర్కాతిగం తాదృశమద్భుతం నః॥* 22

**అర్థం:** అశేషం= సంపూర్ణంగా; విభోః= వ్యాపించియున్న; యస్య= ఎవనియొక్క అంతః= ఉదరమందు; స్థితం= ఉన్నదో; జగత్+నివాసం= జగన్నివాసుడైన; తం= భగవంతుణ్ణి; అంతః= గర్భమందు; దధతీ= ధరిస్తున్న దేవకి; తత్= ఆ; విశ్వం= విశ్వాన్ని; ఆత్మనః= తన యొక్క; అంతః= లోపల; అపశ్యత్= చూచెను; తాదృశం= అటువంటి; అద్భుతం= ఆశ్చర్యం; నః= మనకు; తర్క+అతిగం= ఊహకు మించినది.

**తా॥** అంతటా వ్యాపించియున్న ఎవని గర్భమందు జగత్తు నివసించి యున్నదో అట్టి జగన్నివాసుడైన భగవంతుణ్ణి తన గర్భమందు ధరించియున్న దేవకీదేవి, ఆ శ్రీకృష్ణుని జఠరమందున్న విశ్వాన్ని తన ఉదరం లోపల ఉన్నట్లు చూచింది. తాదృశం- భగవానుని ఉదరమందున్న విశ్వాన్ని దేవకి తన కడుపులోనే ఉన్నట్లు చూడడం భగవత్సంకల్పం చేత కలిగిన ఆశ్చర్యమే. మన ఊహకందని విషయమది. అతర్క్యమహిమగల భగవంతుని సంకల్పంచేత చేయబడినప్పుడు పొందరానిదేముంటుంది? అని భావం.

(ఎవనియందు జగత్తు నివసించినదో అతడు జగన్నివాసుడు అని ఒక అర్థం. జగత్తునందు నివసించినవాడు జగన్నివాసుడని మరొక అర్థం).

*123. సురాసురాధీశ్వర మౌళి ఘాతాత్*
*విశీర్ణ జాంబూనద వేత్ర శృంగమ్।*
*ఆ లక్ష్య సంతోష మలక్ష్యమన్యై*
*రనీక నేతారమ వైక్షతా౽౽ రాత్॥* 23

**అర్థం:** సుర+అసుర+అధి+ఈశ్వర మౌళిఘాతాత్= దేవదానవ ప్రముఖుల కిరీటాల యందు కొట్టడంవల్ల; విశీర్ణ జాంబూనద వేత్ర శృంగం= వ్రయ్యలైన బంగారు దండం( బెత్తం) యొక్క కొనను కలిగిన; ఆ లక్ష్య సంతోషం= ప్రకటితమైన ఆనందం కలిగిన; అన్యైః= ఇతరులచేత; అలక్ష్యం= చూడబడని; అనీక నేతారం= సేనా నాయకుడైన విష్వక్ సేనుణ్ణి; ఆరాత్= దగ్గరగా; అవైక్షత= చూచెను.

**తా॥** దేవకీదేవి గర్భమందున్న భగవంతుణ్ణి సేవించడానికి ద్వారమందు వచ్చి నిల్చియున్న సురాసుర ప్రముఖులు అహమహమికాపేక్షతో తొందర పడుతున్నారు. వారందరినీ బారులుదీరి ఒకరి తర్వాత మరొకరు వెళ్ళి భగవంతుణ్ణి దర్శించాలనే నియమాన్ని పాటించడానికి విష్వక్సేనుడు తన సువర్ణ దండాగ్రంతో దేవదానవ శ్రేష్ఠుల తలలపైన ఉన్న కాంచన రత్న కిరీటాలమీద పదే పదే కొట్టాడు. తత్ఫలితంగా ఆ సువర్ణ దండం యొక్క చివరి భాగం పగులు బారింది. భగవద్దర్శనంవల్ల కలిగిన ఆనందం వారందరిలోనూ, విష్వక్ సేనుని యందు కూడా అభివ్యక్తమైనది. ఈ స్థితి ఇతరులకు కనబడనిది కదా! ఒక్క దేవకీదేవి మాత్రం సురాసుర సంఘాలకు ఆనందాన్ని కలిగిస్తూ, ఆనందపడుతూ వినతుడైన విష్వక్సేనుణ్ణి తన సమీపమందున్నట్లు చూచింది.

ప్రకృతి వికారభావానికి షష్ఠీవిభక్తిని ఉపయోగించే నియమమున్నది. కాబట్టి 'జాంబూనదస్య వేత్రం= జాంబూనదవేత్రం' అని షష్ఠీ సమాసం. *"మౌళిః కిరీటే ధమ్మిల్లే"* (విశ్వః) *"ఆరాద్దూర సమీపయోః"* (అమరం).

124. త్రిలోక మాంగల్యనిధే స్త్రి వేద్యాః
సంజీవనీం వాచముదీరయంతీ।
నియోగయోగ్యాన్ అనఘ ప్రసాదా
నాకౌకసాం నామభి రాజుహావ॥ 24

**అర్థం:** త్రిలోక మాంగల్య నిధేః= మూడు లోకాలకు శ్రేయోనిధానమైన; త్రివేద్యాః= వేదత్రయాన్ని; సంజీవనీం= జీవింపజేసే; వాచం= వాక్కును; ఉదీరయంతీ= ఉచ్చరిస్తున్నట్టి; అనఘ ప్రసాదా= అమోఘమైన అనుగ్రహంగల దేవకి; నియోగ యోగ్యాన్= పరిజనులను; నాక+ఓకసాం= దేవతలయొక్క; నామభిః= పేర్లతో; ఆజుహావ= పిలిచెను.

**తా॥** మూడు లోకాలకు శ్రేయస్సును కలిగించే మూడు వేదాలను అభివృద్ధి పరచే వాక్కులను పలుకుతూ అనుగ్రహాన్ని ప్రసరింపజేస్తున్న దేవకీ దేవి, తన పరిజనులను దేవతల పేర్లతో పిలిచింది.

**వ్యాఖ్య:-** భగవంతుని తాదాత్మ్యాన్ని పొందిన దేవకి తన పరిజనులను భగవంతుని పరిజనులైన దేవతల పేర్లతో పిలువ గలిగిందని సుశ్లోకితం.

ఋగ్య జస్సామలనే మూడు వేదాల సమాహారమే 'త్రివేది'. మూడు వేదాలు మూడు లోకాలకు హితాన్ని సమకూర్చేవి. అట్టి వేదాల రహస్యార్థాలను గోచరింపజేసే మాటలను పలుకుతూ స్వచ్ఛమైన అనుగ్రహాన్ని కలిగి యున్నది దేవకీదేవి. కాబట్టి, తన పరిజనుల మీద భగవానుని పరిజనుల యందున్నట్లే, ఇంద్రుడు, చంద్రుడు అనే బుద్ధి దేవకికి కలిగింది. తన పరిచారకులను ఇంద్రా! చంద్రా! అని దేవతల పేర్లతో పిలువగలిగింది.

125. యదృచ్ఛయా యాదవ ధర్మపత్నీ
యామాహ ధర్మేషు పరావరేషు।
అదృష్ట పూర్వాపరయాపి వాచా
ప్రతిశ్రుతా నూన మభావి తస్యాః॥ 25

**అర్థం:** యాదవ ధర్మపత్నీ= వసుదేవుని భార్యయైన దేవకీదేవి; యదృచ్ఛయా= స్వేచ్ఛతో; పర+అవరేషు= ఉత్కృష్ట, అపకృష్టరూపాలైన; ధర్మేషు= ధర్మవిషయాలపైన; యాం= ఏ మాటను; ఆహ= పలికెనో; తస్యాః=ఆ మాటకు; అదృష్ట పూర్వాపరయా= చూడబడని పూర్వాపరాలుగల; వాచా, అపి= వేదవాక్కుతో కూడా; ప్రతిశ్రుతా= ఎదురుగా వినబడునట్లు; నూనం= నిశ్చయంగా; అభావి= (ఉండెను) అయింది.

**తా॥** వసుదేవుని ధర్మపత్నియైన దేవకీదేవి ప్రవృత్తి నివృత్తి ధర్మాల విషయమై ఏ విధమైన నిర్ణయ వాక్యాలను పలుకుతుండెనో, అవి పూర్వాపరాలు చూడబడని వేదవాక్కులతోనూ ప్రతిధ్వనులుగా ఉండినవనడం నిశ్చయం. దేవకీదేవి శాస్త్ర పరిశీలన చేయని, స్వేచ్ఛగా పల్కిన మాటలు ప్రవృత్తి నివృత్తి-ప్రాపంచిక, వైరాగ్య ధర్మ విషయాలను నిర్ణయించి పల్కినట్లుండెను. ఆమె మాటలు వేదవాక్కులతో ప్రతిధ్వనిస్తుండినట్లు ఉత్ప్రేక్షింపబడినవి.

"స్వేచ్ఛా యదృచ్ఛా స్వచ్ఛందః స్వైరితాచేతితాః సమాః"- (కేశవః) ప్రతి శ్రూయతే ఇతి= ప్రతిశ్రుత్, (శ్రు-శ్రవణే). ఎదురుగా వినబడేది.

"స్త్రీ ప్రతిశ్రుత్ ప్రతిధ్వానే"- (అమరం) ప్రతిధ్వని. దేవకి యొక్క మాట ధర్మ నిర్ణయశక్తిచేత వేదాలకూ ఉపజీవ్యమై యుండెనని భావం.

*126.* క్రియా ముపాదిత్సత విశ్వగుప్త్యా
కృతాపరాధేఽ పి కృపామకార్షీత్।
మునీంద్ర వృత్త్యా ముఖరీ భవంతీ
ముక్తిక్షమాం వక్తు మియేష విద్యామ్॥ 26

**అర్థం:** విశ్వగుప్త్యా= లోక రక్షణచేత; క్రియాం= నిత్యకర్మాచరణాన్ని; ఉపాదిత్సత= మరలింపగోరెను; కృత+అపరాధే, అపి= చేయబడిన నేరం కలవాని

యందు కూడా; కృపాం= దయను; అకార్షీత్= (ప్రసరింప) జేసెను; మునీంద్ర వృత్త్యా= తాపసుల వృత్తిచేత; ముఖరీ భవంతీ (సతీ)= మాటలను ధ్వనింపజేస్తూ; ముక్తిక్షమాం= మోక్షానికి తగిన; విద్యాం= పరవిద్యను; వక్తుం= చెప్పడానికి; ఇయేష= కోరెను.

**తా॥** దేవకీదేవి తన స్త్రీ స్వభావ చేష్టలను లోకరక్షణ రూపంగానే చేయగోరెను. అపరాధులయందు కూడా కృపను ప్రసరింపజేసెను. మునీంద్రుల వలె ఆధ్యాత్మిక చింతనతో సంభాషణ చేస్తూ మోక్షోచితమైన బ్రహ్మవిద్యను గూర్చి పలుకగోరెను.

**వ్యాఖ్య:**- దేవకి భగవద్రూపగర్భ రక్షణార్థమైన క్రియల నాచరించెనని వర్ణితం. దేవకి స్వాభావికంగా చేసే చేష్టలన్నీ విశ్వరక్షణకోసమే అన్నట్లుండెను. సామాన్యంగా లోకంలో గర్భిణులు తమ గర్భాన్ని భద్రంగా భరిస్తారు. దేవకి, తన యేడవ గర్భంవలె ఈ గర్భం చ్యుతం (జారిపోవునట్లు) కాకూడదని బాగా జాగ్రత్త పడుతున్నది.

*విశ్వగుప్త్యా క్రియా ముపాదిత్సత:*- 'విశ్వం' అనే శబ్దానికి విష్ణువు అనీ, లోకమనీ అర్థాలున్నాయి. విష్ణు సహస్రనామావళిలో అపరిచ్ఛిన్న వైభవం గల పరమాత్ముడు అసాధారణ సంజ్ఞావాచకమైన 'విశ్వం, విష్ణుః' అనే మొదటి నామం చేత స్తుతింపబడినాడు కదా!

విశతి ఇతి= విశ్వం. సర్వతో ముఖమైన పూర్ణత్వం కలవాడు, భగవానుడు. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"- (శ్రుతి). అగ్నిచే బాగా తప్తమైన ఇనుపగుండు లోపల, వెలుపల అగ్నియున్నట్లే, సర్వపదార్థాల లోపల, వెలుపల, అన్ని విధాలుగా అంటే తన స్వరూప, రూప, గుణ, విభూతులతో మనకు తెల్యని విధంగా సూక్ష్మరూపంచేత నిండుగా వ్యాపించియున్నవాడు విష్ణు భగవానుడని అర్థం.

విష్ణుభగవానునిచే వ్యాప్తమైన ప్రపంచం కూడా 'విశ్వమే' అవుతుంది. 'విశ్వగుప్తి' అంటే సర్వ పరిపూర్ణత్వం కలిగిన భగవానుడు దేవకి యొక్క గర్భమందున్నందువల్ల ఆమె యొక్క కర్మలన్నీ తన గర్భాన్ని రక్షించడానికే పర్యవసించాయి. దేవకి యొక్క మనోరథాన్నిబట్టి క్రియ ఆచరింపబడింది.

'విశ్వగుప్తి' లోకరక్షణ. గర్భవతి కాబట్టి తనకు శక్తిలేకున్ననూ, దేవకి లోక సంగ్రహార్థం తన సదాచారాలను విడువకుండా అనుష్ఠించే వాంఛ కలది. భగవానుడు కూడా లోక సంగ్రహార్థమే కర్మలను చేస్తున్నానని చెప్పినాడు.

*"నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన।*
*నాన వాప్త మవాప్తవ్యం, వర్త ఏవచ కర్మణి॥"* (భ.గీ. 3-22)

ఓ అర్జునా! నాకీ మూడు లోకాలందు పొందబడనిదిగానీ, పొందవలసినది గానీ లేదు. ముఖ్యంగా కర్తవ్య మనేదే లేదు. అయినా అందరివలె నేను కూడా ధర్మరక్షణాది కర్మలను నిర్వర్తిస్తున్నానన్నాడు గీతాచార్యుడు. మహాజనులు చేసే పనులనే సామాన్య జనులు ప్రమాణంగా భావించి వాటినాచరిస్తారు. కాబట్టి *"ఉత్సీదేయు రిమేలోకాః నకుర్యాం కర్మచే దహమ్"*- నేను కర్మను చేయకపోతే ఈ లోకాలు (జనులు) చెడిపోయే అవకాశముంది- అని పార్థునికి విశ్వపురుషుడే బోధించాడు. విశ్వరక్షణ రూపమైన క్రియకు వ్యతిరేకమైన క్రియను దేవకి చేయ గోరలేదు.

అపరాధులను కృపతో కటాక్షిస్తున్నది. దయాపూర్ణయైన దేవకి దోషులను కూడా నిర్దోషులుగా అనుగ్రహిస్తున్నదన్నమాట. అంతేకాదు, తపస్సంపన్నుల లాగా మోక్షమార్గాన్ని అవలంబించే పద్ధతిని-పరవిద్యను గూర్చి సంభాషింపగోరెను. బదరికాశ్రమంలో భగవానుడు నారాయణునిగా అవతరించి, మునీంద్రుడై నివృత్తి లక్షణమైన ధర్మాన్ని- అష్టాక్షర విద్యను నరులకోసం ప్రకాశింపజేసిన విధంగా, దేవకీదేవి కూడా అలాంటి కర్మాచరణ చేయగోరిందని వర్ణింపబడింది.

ఉపాదిత్సత:- ఉపాదాతుం ఐచ్ఛత్. స్త్రీ ప్రభృతి విషయాలనుంచి ఇంద్రియాలను మరలించడాన్ని 'ఉపాదానం' అంటారు. "ప్రత్యాహార ఉపాదానం" (అమరం).

*127. సతాం చతుర్వర్గ ఫల ప్రసూతౌ*
*నారాయణే గర్భగతే నతాంగీ।*
*అభంగురామున్నతి మాశ్రయంతీ*
*సర్వస్య సాఽ దిత్సత సర్వమేకా॥* 27

**అర్థం:** నత+అంగీ= (స్తన భారంచేత) వంగిన శరీరం కలిగిన దేవకి; సతాం= సత్పురుషులకు; చతుర్వర్గ ఫల ప్రసూతౌ= ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలకు ఉత్పాదకుడైన; నారాయణే= నారాయణుడు; గర్భగతే= గర్భమందు ఉన్నప్పుడు; అభంగురాం= స్థిరమైన; ఉన్నతిం= ఔన్నత్యాన్ని; ఆశ్రయంతీ= ఆశ్రయిస్తూ; సా. ఆ, దేవకి; ఏకా= ఒక్కతే; సర్వస్య= అందరికి; సర్వం= అన్నిటికీ; అదిత్సత= దానం చేయగోరెను.

**తా॥** స్తన భారంచేత వంగిన శరీరం కలదైన దేవకి, తన గర్భమందు ధర్మార్థ కామ మోక్ష ఫలపురుషార్థాలనే నాల్గింటినీ సృష్టించి మహాదాతయైన నారాయణుడు ఉన్నప్పుడు, తరుగని స్థిరమైన, దానోత్సాహరూపమైన చిత్తౌన్నత్యాన్ని ఆశ్రయిస్తూ "నేను ఒక్కదానినే అందరికీ, వారికి ఇష్టమైన వాటన్నిటినీ ఇచ్చి వారిని సంతోషపరచా"లని కాంక్షించెను.

*128. కృశోదరీ కార్శ్య మతీత్యకాలే*
*కేనాపి ధామ్నా కృత వృద్ధి యోగా।*
*పరా మభిఖ్యాం క్రమశః ప్రపేదే*
*తారాభినంద్యా తను రైందవీవ॥* 28

**అర్థం:** కృశోదరీ= సన్నని ఉదరం కలిగిన దేవకి; కాలే= గర్భవతిగా ఉన్నప్పుడు; కేన, అపి= ఒకానొక; ధామ్నా= తేజస్సు చేత; కృతవృద్ధియోగా= గర్భం వృద్ధి జెందుతుండగా; తారాభినంద్యా= కనీనికలచేత (కనుగ్రుడ్డులచేత) కొనియాడబడుతూ/ చుక్కలచే అభినందింపబడుతున్న; ఐందవీ= చంద్రునికి సంబంధించిన; తనుః, ఇవ= మూర్తి (బింబం) లాగా; క్రమశః= దినక్రమంగా; కార్శ్యం= సన్నని తనాన్ని (కృశత్వాన్ని); అతీత్య= దాటి; పరాం= ఉత్కృష్టమైన; అభిఖ్యాం= శోభను; ప్రపేదే= పొందెను.

**తా॥** దేవకీదేవి సన్నని కడుపుకలది. గర్భాన్ని దాల్చినప్పుడు ఊహింపరాని ఒకానొక తేజస్సుచేత గర్భం వృద్ధిని పొందుతుండింది. దేవకీ గర్భాన్ని లోకులు ప్రేమతో చూచేవారు. నక్షత్రాలచే అభినందింపబడుతున్న చంద్రుని కళలాగా కార్శ్యం పోయి, దినదినం పరమమైన శోభను పొందెను.

**వ్యాఖ్య:-** దేవకీ శరీరకాంతి శుక్లపక్ష చంద్రకళవలె క్రమంగా వృద్ధిజెందినదని సుశ్లోకితం.

సామాన్యంగా దేవకీదేవి తీగలాగా సన్నని శరీరం కలది కాబట్టి కృశోదరి అనబడింది. ఆమె గర్భవతి యైనప్పుడు ఊహింపరాని మహిమగల భగవానుని తేజస్సుచేత ఆమె గర్భం దినక్రమంగా పెరుగుతుండింది. దేవకీ గర్భం అభివృద్ధి జెందడానికి అప్రమేయమైన భగవానుని తేజస్సు కారణం. జనులు తారకలచేత అంటే కనుగ్రుడ్లతో తేరిపార జూస్తూ దేవకిని పొగడేవారు.

తారాభినంద్యా తను రైందవీవ:- శ్లుకపక్షంలో మొదట చంద్రరేఖ సన్నగా ఉంటుంది. దినదినం ఆ చంద్ర కళ సూర్యుని తేజస్సుతో పెరుగుతుంటుంది. చంద్రకళ వృద్ధిని పొందడానికి సూర్యకిరణ కాంతియే కారణం. పెరుగుతున్న చంద్రబింబ కళను జనులు చూచి ఆహ్లాద పడుతారు. చంద్రుని చుట్టూ ఉన్న చుక్కలన్నీ అభినందిస్తుంటే, చంద్రరేఖ తన సన్నతనాన్ని (కృశత్వాన్ని) మించి క్రమంగా పరమశోభతో చంద్రకళ ప్రకాశిస్తుంది. పూర్ణోపమాలంకార సజ్జిత మీ శ్లోకం. "అభిఖ్యానామ శోభ యోః"- (అమరం).

పరా మభిఖ్యాం క్రమశః ప్రపేదే:- సన్నని చంద్రకళ దిన క్రమంగా ఉత్కృష్టమైన శోభను పొందినట్లే, కృశోదరియైన దేవకీదేవి యొక్క తనువు-గర్భం వృద్ధి జెందుతుండగా కాలక్రమంగా కృశత్వాన్ని వదలి పరమ శోభను పొందింది. 'తనుః' శబ్దం స్త్రీలింగం. దేవకీ (తనువు) ఉపమేయం. చంద్రకళ ఉపమానం. ఇవ-(వలె) ఉపమావాచకం. క్రమంగా పరమశోభను పొందెను. సాధారణ ధర్మాన్ని తెలిపే క్రియా పదం.

ఈ శ్లోకం పాఠాంతరం ఇలా ఉంది.

*కృశోదరీతారకయాఽభినంద్యా కేనాపిధామ్నా కృతవృద్ధియోగా।*
*అతీత్య కార్శ్యం క్రమశః ప్రపేదే పరామభిఖ్యాం తనురైందవీవ॥*

129. *నిగూఢ మంతర్ద ధతా నివిష్టం*
*పద్మాపరిష్కార మణిం ప్రభూతమ్।*
*మధ్యేన తస్యాః ప్రచితేన కాలే*
*మంజూషయా రూప్యభువా బభూవే॥* 29

**అర్థం:** అంతః= లోపల; నిగూఢం= రహస్యంగా; నివిష్టం= ఉంచబడినట్టి; ప్రభూతం= గొప్పదైన; పద్మా పరిష్కారమణిం= లక్ష్మీదేవికి అలంకారమైన రత్నాన్ని; దధతా= ధరించియున్న; కాలే= గర్భం వృద్ధి జెందుతున్నప్పుడు; ప్రచితేన= వ్యాపించిన; తస్యాః= ఆ దేవకియొక్క; మధ్యేన= నడుము; రూప్య భువా= వెండితో చేయబడిన; మంజూషయా= పేటికగా; బభూవే= ప్రకాశించెను.

**తా॥** పద్మాదేవికి అలంకారంగా ఉండే మణి (యైన భగవాను) ని తన లోపల దాచి కాపాడడానికి దేవకియొక్క నడుము, గర్భం పెరుగుతున్న కాలక్రమంగా వ్యాపించి ఆ గొప్ప మణికి వెండిచేత నిర్మితమైన మంజూష (పెట్టె)గా ప్రకాశించెను.

"అలంకార స్త్వా భరణం పరిష్కారో విభూషణం, మండనంచ"- (అమరం).

"ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహులంబహు"- (అమరం).

"పిటకః పేటకః పేటా మంజూషా"- (అమరం). (మజ్జంతివస్తూని అత్ర ఇతి= మఞ్జూషా).

"దుర్వర్ణం రజతం రూప్యం ఖర్జూరం శ్వేత మిత్యపి" (అమరం (ప్రశస్తం రూపమస్యేతి= రూప్యం).

130. శనైశ్శనైస్తా ముప చీయమానాం
దర్శాంత దీప్తామివ చంద్రలేఖామ్।
అంతఃస్థ కృష్ణా మవలోకయంతః
చక్రు శ్చకోరాయిత మాత్మ నేత్రైః॥ 30

**అర్థం:** శనైః, శనైః= మెల్ల మెల్లగా; ఉపచీయమానాం= వృద్ధిజెందుతున్న; అంతఃస్థ కృష్ణాం= లోపల ఉన్న కృష్ణ తత్త్వంగలది/ లోపల ఉన్న కృష్ణ మృగం కలది, కనుక; దర్శ+అంత, దీప్తాం= శుక్లపక్షారంభమందు ప్రకాశించినట్టి; చంద్రలేఖాం, ఇవ= చంద్రలేఖవలెనున్నట్టి; తాం= ఆ దేవకిని; అవలోకయంతః= చూస్తున్న జనులు; ఆత్మ నేత్రైః= తమకన్నులచేత; చకోరాయితం= చకోర పక్షుల వంటి ఆచరణను; చక్రుః= చేసిరి.

**తా॥** క్రమక్రమంగా వృద్ధిని పొందుతున్న కృష్ణతత్త్వం లోపల కలిగియున్నది కాబట్టి దేవకిని కృష్ణపక్షం తర్వాత వచ్చే శుక్లపక్షం యొక్క ఆరంభమందు కృష్ణమృగం లోపల ఉండి క్రమంగా పెరుగుతూ ప్రకాశించినట్టి చంద్రలేఖను చకోర పక్షులు చూచినట్లు జనులు చూచారు.

'దర్శః' అంటే అమావాస్య- దాని అంతమంటే, శుక్లపక్షం యొక్క ఆరంభమన్నమాట "అమావాస్యాత్వమావస్యా దర్శః సూర్యేందు సంగమః"-

(అమరం). చకోరపక్షులు అమృత కిరణుని వెన్నెలను ఆస్వాదించడానికి ఎదిరి చూస్తుంటాయి. అట్లే, చంద్రలేఖవలెనున్న దేవకిని జనులు ఆమె లావణ్య సుధను పానం చేశారు. శ్రీకృష్ణ చంద్రుడు గర్భమందు పెరుగుతుండగా, దేవకి లావణ్యం చంద్ర చకోర న్యాయంగా, జనులకు కనువిందు చేసిందని తాత్పర్యం.

*131. మయిస్థితే విశ్వగురౌ మహీయాన్*
*మా భూత్ భువో భార ఇతీవ మత్వా।*
*సఖీజనానా మవలంబ్య హస్తాన్*
*సంచార లీలాం శనకైశ్చకార॥* 31

**అర్థం:** విశ్వగురౌ= జగత్తునకు తండ్రి, ఆచార్యుడైన/ విశ్వం కంటెను బరువైన; కృష్ణుడు; మయి= నాయందు; స్థితే (సతి)= ఉండగా; భువః= భూమికి; మహీయాన్= గొప్ప; భారః= బరువు; మాభూత్= ఉండకూడదు; ఇతి= అని; మత్వా, ఇవ= తలచియో అన్నట్లు; సఖీజనానాం= నెచ్చెలుల యొక్క హస్తాన్= చేతులను; అవలంబ్య= పట్టుకొని; శనకైః= మెల్లగా; సంచార లీలాం= నడయాడుటను; చకార= చేసెను.

**తా॥** విశ్వమంతటికీ తండ్రి, గురువైనవాడు, విశ్వానికంటే బరువైనవాడు శ్రీకృష్ణుడు. అతడు నా గర్భమందు ఉండగా, అంత గొప్ప భారాన్ని వహించే నా యొక్క అడుగులను దృఢంగా పెట్టి నడుస్తుంటే, భూమికి మహాభారమవుతుంది. అలాగా భూమికి బరువు కాకూడదన్నట్లు తలచియే దేవకి, తన సఖీజనుల చేతులను సహాయంగా పట్టుకొని మెల్లగా నడయాడ సాగెను.

శనకైః:- "అవ్యయ సర్వనామ్నాం అకచ్ ప్రాక్ టేః" అనే నియమాను సారంగా, 'శనైః' అనే అవ్యయానికి 'అకచ్' ప్రత్యయంచేరి 'శనకైః' అనే రూపం నిష్పన్నం. దౌర్బల్యంచేత నడక మెల్లగా సాగిందనే విషయంలో భూమికి భారం కలుగకూడదనే చింతనను హేతువుగా ఉత్ప్రేక్షించినందువల్ల, ఇది హేతూత్ప్రేక్షా లంకారం. "విశ్వగురౌచ కృష్ణే" అని పాఠమూ ఉంది.

132. ముకుంద గర్భా ముకురేషుదేవీ
నాపశ్య దాత్మాన మవాప్త భూషా।
నాథ త్విషా నందక దర్పణే-
నాది దృక్షతాఽఽత్మాన మదృశ్య మన్యైః॥ 22

**అర్థం:** ముకుంద గర్భా= ముకుందుడు గర్భమందు కలిగియున్న; దేవీ= దేవకి; అవాప్తభూషా (సతీ)= ధరించిన నగలు కలదవుతూ; ఆత్మానం= తనను; ముకురేషు= అద్దాలలో; న, అపశ్యత్= చూచుకొనలేదు; అన్యైః= ఇతరులచేత; అదృశ్యం= కానరాని; ఆత్మానం= తన (మేను) ను; నాథత్విషా= ప్రభువునందు ప్రకాశించే; నందక దర్పణేన= నందకమనే ఖడ్గంచేత; అదిదృక్షత= చూడగోరెను.

**తా॥** ముకుందుడు గర్భమందు కలిగియున్న దేవకి భూషణాలను ధరించినదైననూ తన శరీరాన్ని లౌకిక దర్పణాలలో చూచుకోలేదు. ఇతరులచే చూడబడని తనను భగవత్సన్నిధిలో ప్రకాశించే నందక మనే పెద్ద కత్తి యందు చూచుకొనగోరెను.

**వ్యాఖ్య:-** ముకుంద గర్భయైన దేవకి తన మేనును నందకమనే దివ్య ఖడ్గమందే చూచుకొన దలచెనని వర్ణితం.

దేవకి యొక్క గర్భమందు ముకుందుడున్నాడు. సామాన్యంగా ఆభరణాలను ధరించి తనను ముందు, వెనుక ప్రక్కలకున్న అద్దాలలో చూచుకొనే పరిపాటిని దేవకి ఆదరించడం లేదు. గర్భవతులకు నగలను ధరించడం శ్రమగా అనిపిస్తుంది. కాబట్టి, దేవకి భూషణాలను ధరించడమూ లేదని స్ఫురిస్తున్నది.

*ముకుంద గర్భా:*- 'ముకుంద' శబ్దానికి భుక్తినీ, ముక్తినీ ఇచ్చే భగవానుడని ఒక అర్థం. "*ముకుంద కుంద నీలాశ్చ*" (అమరం). నవనిధులలో 'ముకుంద' మనేది ఒక గొప్ప నిధి. ముకుంద నిధి భూషణంగా ఉన్నప్పుడు ఇతరాభరణాలతో నేమి ప్రయోజనం. ముకుంద భూషణం ముకురమందు చూడశక్యం కానిది. ఆ

గొప్ప నగను దర్శించక వేరే నగలను దర్శించడంలో విశేషమేమీ ఉండదు కదా! "తదాత్మనో విశ్వమపశ్యదంతః"- (22 శ్లో.) అని చెప్పబడినట్లు, తన గర్భమందు విశ్వానికి ఆధారభూతుడైన భగవానుడున్నట్టి, ఇతరులకు చూడశక్యం కాని తన శరీరాన్ని ఎన్ని నగలను ధరించి యున్ననూ అద్దాలలో చూడ నిష్టపడలేదు.

*నా థత్విషానందక దర్పణేన అదిదృక్షతాత్మానమ్:* - జగన్నాథుణ్ణి ప్రకాశింప జేసేది, నాథుని అధీనమైన ప్రకాశం కలది అనే (రెండు విధాలా అర్థమున్న) శ్లిష్టపదం నాథత్విట్-నందకం. నందకమనే ఖడ్గం భగవంతుని పంచాయుధాలలో నొకటి. విశ్వాధారుడైన స్వామికి ఒక ఆభరణంగానూ ప్రకాశించేది నందకం. దేవకి, విశ్వానికి ఆధారుణ్ణి తన ఉదరమందు కలిగియున్నందున తాను విశ్వాంతర్గతయే. కాబట్టి, గొప్ప కాంతిగల నందకమనే దర్పణం తన గర్భమందున్న ముకుందుణ్ణీ, తనను (దేవకిని) కూడా ప్రతిఫలింపజేసే సామర్థ్యం కలదని భావించి, తనను నందకమనే దివ్యదర్పణమందు చూచుకొనగోరింది దేవకి. స్వామిని ప్రదర్శించే నందక దర్పణమందు భూషణాలను శ్రద్ధతో ధరించిన తన రూపాన్ని కూడా చూచుకొనగోరిందనీ చెప్పవచ్చు. తర్వాతి శ్లోకంలో భూషణాలను ధరించడం లేదనే భావం చెప్పబడుతున్నందువల్ల దాన్ని బట్టి, ఇందు ఆ సముచితార్థాన్నీ గ్రహించడం యుక్తమనిపిస్తుంది.

అదిదృక్షత: - ద్రష్టుం ఐచ్ఛత్. "జ్ఞాశ్రు స్మృదృశాం సనః"- అనే నియమాన్ని బట్టి, 'అది దృక్షత' అని ఆత్మనే పదం (ధాతువు) ప్రయుక్తం.

*"అదృశ్యమన్యై రదిదృక్షతాఽఽర్యా*
*నాథ త్విషా నందక దర్పణేన"*- అని పాఠాంతరం కలదు.

133. *స్రజః ప్రభుతా నశశాక వోఢుం*
*దూరే కథా రత్న విభూషణానామ్।*
*భవిష్యతి క్షోణి భరాపనోదే*
*ప్రత్యాయనం ప్రాథమికం తదాసీత్॥* 33

**అర్థం:** ప్రభుతాః= చాలా; స్రజః= మాలికలను; వోఢుం= వహించుటకు; న, శశాక= సమర్థురాలు కాలేదు; రత్నవిభూషణానాం= రత్నాభరణాలను; కథాదూరే= ఎలా ధరిస్తుంది?; భవిష్యతి= రాబోయే కాలమందలి; క్షోణిభర+అపనోదే= భూభారాన్ని తొలగించే విషయమై; తత్= ఆ మాల్యాభరణాప నోదనమే; ప్రాథమికం= మొదటిదైన; ప్రత్యాయనం= గుర్తుగా (నమ్మకంగా); ఆసీత్= ఉండెను.

**తా॥** దేవికికి దౌర్బల్యం వల్ల పూల మాలికలను భరించడమే చేతకానప్పుడు మణిమయాభరాలను ఎలా భరిస్తుంది? పూల మాలికలకంటే రత్నాభరణాల భారం అధికంగా ఉండడం వల్ల భూషణాలను ధరించడం లేదు. ఇకముందు కాలాన, శ్రీకృష్ణుడు అవతరించిన తర్వాత భూమియొక్క భారం తొలగింపబడే ఆవశ్యకతకు దేవకి మాల్యాభరణాల భారాన్ని తొలగించడమే మొదటి ఉదాహరణంగా ఉండిందని తాత్పర్యం. శ్రీకృష్ణుడు అవతరించి భూభారాన్ని తగ్గిస్తాడని దేవకి, తన చేష్ట చేత భవిష్యత్తులో జరుగబోయే కార్యాన్ని మొదటనే గుర్తు చేస్తుందని భావం.

*134.* దివౌకసోదేవక వంశలక్ష్మీం
విలోక్య తాం లోకనిధాన గర్భామ్।
విభూతి మగ్రేసర వేద వాదాః
వ్యాచఖ్యురస్యా వివిధ ప్రకారామ్॥ 34

**అర్థం:** దివౌకసః= దేవతలు; లోకనిధాన గర్భాం= జగత్తుకు నిధియైన కృష్ణుడు గర్భమందు కలిగియున్నట్టి; దేవక వంశలక్ష్మీం= దేవకరాజ కుల లక్ష్మియైన; తాం= ఆ దేవకిని; విలోక్య= చూచి; అగ్రేసర వేదవాదాః= పురస్కృత వేదవాక్కులు కలవారై; అస్యాః= ఈ దేవకియొక్క; వివిధ ప్రకారాం= బహువిధాలుగా నున్న; విభూతిం= ఐశ్వర్యాన్ని; వ్యాచఖ్యుః= వ్యాఖ్యానించారు.

**తా॥** దేవకుడనే రాజు కంసుని తండ్రియైన ఉగ్రసేనుని యొక్క భ్రాత. దేవకరాజ వంశ లక్ష్మిగా ఉన్న దేవకి గర్భమందు భగవానుడున్నాడని భావించి

బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు కారాగృహానికి వచ్చి ఆమెనూ, ఆమె గర్భాన్నీ వేదమంత్ర పూర్వకంగానూ, బహు ప్రకారాలైన (దేవకియొక్క) ఐశ్వర్యాన్ని స్తుతించారు.

*"మత్స్యాశ్వ కచ్ఛప వరాహ నృసింహ*
*హంస రాజన్య విప్ర విబుధేషు కృతావతారః।*
*త్వం పాహి నస్త్రిభువనంచ తథా-*
*ధునేశ భారం భువో హరయదూత్తమ వందనంతే॥"*(భాగ. 10-2-42)

"ఓ దేవదేవా! నీవు మత్స్య, హయగ్రీవ, కూర్మ, వరాహ, నృసింహ, హంస, రామ, పరశురామ, వామనాద్యవతారాలను ధరించి మమ్ములనూ, మూడులోకాలనూ రక్షించావు. కాబట్టి అట్లే ఇప్పుడు భూభారాన్ని తొలగించి, మమ్ములను కాపాడుము. ఓ యదూత్తమా! నీకు పాదాభివందనమాచరిస్తున్నాము" అని దేవతలు దేవకి యొక్క గర్భాన్ని స్తుతించారు.

*"దిష్ట్యాంబ! తే కుక్షిగతః పరః*
*పుమానంశేన సాక్షాద్భగవాన్ భవాయనః।*
*మా భూద్భయం భోజపతేర్ముమూర్షో*
*ర్గోప్తా యదూనాం భవితా తవాత్మజః॥"* (భాగ. 10-2-43)

"అమ్మా! ఇదొక సౌభాగ్యం. నీ గర్భమందు పరమపురుషుడు లోక కల్యాణం కోసం తన జ్ఞాన, బలాలనే అంశలతో ప్రవేశించాడు. కొంతకాలమే మీకు బంధువుగా ఉండే కంసుని వలన ఇప్పుడు భయమే మాత్రం లేదు. మీ పుత్రుడు యాదవ వంశాన్ని అవశ్యంగా రక్షింపగలడు" అని దేవతలు దేవకిని కొనియాడారు.

*135. పతిః ససత్త్వామపి తత్ప్రభావా*
*దదుఃఖశీలాం సమయేభవిత్రీమ్।*
*సుఖైకతానా మవలోక్యదేవీం*
*స్వసంపదం సూచయతీతి మేనే॥* 35

**అర్థం:** పతిః= దేవకి యొక్క భర్తయైన వసుదేవుడు; ససత్త్వాం, అపి= గర్భిణియైనను; తత్ ప్రభావాత్= ఆ గర్భం యొక్క మాహాత్మ్యంవల్ల; అదుఃఖశీలాం= దుఃఖపడనట్టి; సమయే= ప్రసవకాలం సమీపించినప్పుడు; సుఖైకతానాం= సుఖరూపంగా; భవిత్రీం= ఉన్నట్టి; దేవీం= దేవకీదేవిని; అవలోక్య= చూచి; స్వసంపదం= తన అభివృద్ధిని; సూచయతి= తెలియజేస్తున్నది; ఇతి= అని; మేనే తలంచెను.

**తా॥** దేవకి గర్భవతియైనందున, లోకంలో గర్భవతులు గర్భభారం చేత దుఃఖపడే విధంగా, ఏ మాత్రమూ దుఃఖంగానీ, ఆయాసంగానీ అనుభవించడం లేదు. ప్రసవ సమయం ఆసన్నమైననూ, గర్భస్థ శిశువు కదలుతున్నప్పుడు కలిగే బాధ కూడా ఏమీ లేకుండా సుఖంగా కూర్చోవడం, ఉల్లాసంగా ఉండే ప్రవర్తనను వసుదేవుడు గమనించాడు. ఇది, అశరీరవాణి చెప్పిన విధంగా అన్యాదృశమైన అష్టమ గర్భం యొక్క ప్రభావం వల్లనే దేవకి సుఖరూపంగా ఉంటున్నదనీ, తనకు ఆభ్యుదయిక సంపత్తుగా వసుదేవుడు భావించాడు.

*"అదుఃఖశీలా మవలోక్య దేవీం, సుఖైక తానాం సమయే భవిత్రీమ్॥"* అని పాఠాంతరమున్నది.

*136.* *పితృత్వ మాసాద్య సురాసురాణాం*
*పితామహత్వం ప్రతిపత్స్యమానః।*
*అనంత గర్భామవలోక్య దేవీ*
*మతుష్య దన్యేషు గతాభిలాషః॥* 36

**అర్థం:** సుర+అసురాణాం= దేవతలకు, దానవులకు; పితృత్వం= పితృ (తండ్రి) భారాన్ని; ఆసాద్య= పొంది; పితామహత్వం= తండ్రికి తండ్రి (తాత) భావాన్ని; ప్రతి పత్స్యమానః= పొందగలిగే వసుదేవుడు; అనంత గర్భాం= విష్ణువును గర్భమందు కలిగియున్న; దేవీం= దేవకీదేవిని; అవలోక్య= చూచి; అన్యేషు= ఇతర విషయాల

యందు; గత+అభిలాషః (సన్)= తొలగిన వాంఛ కలవాడవుతూ; అతుష్యత్= సంతోషించెను.

**తా॥** వసుదేవుడు పూర్వం కశ్యప ప్రజాపతి రూపంలో ఉన్నప్పుడు దేవతలకూ, రాక్షసులకు తండ్రి అయ్యాడు. ఇప్పుడు వసుదేవ రూపంతో సమస్త లోకాలకు తండ్రియైన విష్ణుభగవానునికి కూడా జనకుడుగాను, తాతగా, తండ్రికి తండ్రి కాబోతున్నాడు. అనంత- అనేక సంతానాన్ని పొంది, అనంతుణ్ణి- విష్ణువును గర్భమందు కలిగియున్న దేవకిని జూచాడు. 'తాతను కాబోతున్నప్పుడు ఇంక, ఇతర విషయాలయందు సంతానాన్ని పొందే ప్రయత్నమందు అపేక్ష ఎందుకు? కోరికల నన్నిటిని కోరకుండా, విరమించుకోవడమే శ్రేయస్కరమనుకొని తృప్తిపడినాడు. భగవంతుని కంటెను ఉత్తమ సంతానం ఉంటుందా? అని వసుదేవుడు చాలా సంతోషించాడు.

"అనంతో నాగరా డ్విష్ణుః" (యాదవ నిఘంటువు)

*137. తాపోపశాంతిం జగతాం దిశన్తీ*
*సంధ్యాఽపరా సాధు జన ప్రతీక్ష్యా।*
*తామీదృశీం విశ్వపితుః ప్రసూతిం*
*సంవేదయంతీవ సమాజగామ॥* 37

**అర్థం:** జగతాం= లోకాలకు; తాప+ఉపశాంతిం= సూర్యుని ఎండవల్ల కలిగిన తాపం యొక్క తగ్గుటను; దిశంతీ= సూచిస్తున్నట్టి; సాధుజన ప్రతీక్ష్యా= సజ్జనులచే ఎదిరిచూడదగినట్టి; అపరా= పడమటి; సంధ్యా= సంజ; తాం= ఆ సంధ్యను; ఈ దృశీం= ఇటువంటిదిగా; విశ్వపితుః= జగత్తునకు తండ్రియైన భగవంతుని యొక్క; ప్రసూతిం= ఆవిర్భావాన్ని; సంవేదయంతీ, ఇవ= తెల్పుతున్నదన్నట్లు; సమాజగామ= సమీపించింది.

**తా॥** శ్రీకృష్ణ జయంతినాటి మలిసంజ వర్ణన ఇది. విశేషణ పదాలచేత సాయం సంధ్య యెట్టిదో దెల్పబడుతున్నది.

*జగతాం తాపోపశాంతిం దిశం తీ:*– సూర్యోదయం నుంచి సూర్యుడు అస్తమించే దాకా సూర్యకిరణాల వేడిమి లోకాలను తపింపజేస్తుంది కదా! లోకాలలో ఎండవల్ల కలిగిన తాపం శమించడాన్ని సూచిస్తున్నది. అంతే కాదు, దుర్జనుల వల్ల కలిగే బాధలను భరించలేక లోకులకు మనస్తాపం కలిగింది కదా! ఈ సాయం సంధ్య, 'భగవదావిర్భావం ఈ రాత్రి జరుగనున్నందువల్ల' లోకులకు కలిగిన మనస్తాపం శాంతించిందని కూడా సూచిస్తున్నదని భావం.

*సాధుజన ప్రతీక్ష్యా:*– సదాచారపరులు, కర్మయోగులు సాయం సంధ్యా వందనం చేయడానికీ, ఉపాసకులు ప్రదోష కాలమందు సంధ్యోపాసనయే కాక, భగవానునికి షోడశోపచార పూజకూడా చేయడానికీ, సమయం పాలించదగినదని ప్రతీక్షిస్తారు. జయంతినాటి సాయం సంధ్య పూజింపదగినదని ఎదిరిచూచే (మలిసంజ) వేళ ఆసన్నమైనదని అర్థం.

*తాం, ఈదృశీం:*– జయంతినాటి అపర సంధ్య ఇట్టిదని పై రెండు విశేషణ పదాలచే తెల్పబడినది.

*విశ్వపితుః ప్రసూతిం సంవేదయంతీవ సమాజగామ:*– ఆ విధంగా వర్ణింపబడిన పదాలలోనే, లోకాలను పాలించే తండ్రియైన శ్రీకృష్ణ భగవానుని ఆవిర్భావాన్ని కూడా నివేదిస్తున్నదో అన్నట్లు అపర సంధ్య (సమయం) రానే వచ్చింది.

ఈ శ్లోకంలో సంధ్యాదేవి ఉత్ప్రేక్షింపబడింది. మనస్తాపానికీ, సూర్యతాపానికీ, అలాగే పూజింపదగినది, పాలింపదగినది– అనే భావాలకు అభేదాధ్యవసాయ రూపమైన అతిశయోక్తి చెప్పబడింది. కాబట్టి, అతిశయోక్తిచేత ఉత్ప్రేక్షాలంకారం ఉత్థాపితం. సంకీర్ణ శ్లోకమని అర్థం.

138. సువర్ణ పీతాంబర వాసినీ సా
స్వధామ సంఛాదిత సూర్య దీప్తిః।
ఉపాసనీయా జగతాంబ భాసే
మురద్విషో మూర్తిరివ ద్వితీయా॥ 38

**అర్థం:** సువర్ణపీత+అంబర వాసినీ= శోభనమైన రంగుచేత గ్రస్తమైన ఆకాశమందు నివసించే శీలం కలిగినట్టి/ బంగారు వర్ణంచేత పులుమబడిన పసుపు పచ్చని పట్టు వస్త్రాన్ని దాల్చినట్టి; స్వధామ సంఛాదిత సూర్యదీప్తిః= తన కాంతిచేత ఆచ్ఛాదింపబడిన సూర్యుని కాంతి కలిగినట్టి/ తన తేజస్సు చేత తిరస్కరింపబడిన సూర్యుని ప్రకాశం కలిగినట్టి; జగతాం= లోకాలకు; ఉపాసనీయా= ధ్యానించదగిన/ పూజించదగిన; సా= ఆ సంధ్యాదేవి (సవిత్రి); మురద్విషః= నారాయణుని యొక్క; ద్వితీయా= రెండవ; మూర్తిః, ఇవ= మూర్తి యన్నట్లు; బభాసే= ప్రకాశించెను.

**తా॥** సవిత్రి యనబడే సంధ్యాదేవి పరమశోభచే వ్యాప్తమైన ఆకాశమందు నివసిస్తుంది. అంబర వాసమంటే ఆకాశమందు నివసించడమని అర్థం. నారాయణమూర్తి కనక పీతాంబరాన్ని దాల్చి యుంటుంది. ఇక్కడ, అంబరవాసమంటే వస్త్రంచేత ఆచ్ఛాదింపబడడమని అర్థం. పడమటి సంధ్యారాగం చేత సూర్యుని కాంతి రంజింపబడుతుంది (శ్లేష). నారాయణమూర్తి యొక్క తేజస్సు చేత సవితృ మండలదీప్తి తిరస్కరింపబడుతుంది. 'సంఛాదిత' శబ్దానికి ఆవరింపబడడం/ తిరస్కరింపబడడమని అర్థం.

సంధ్య లోకులకు ఉపాసింపదగిన దేవత. నారాయణమూర్తి ప్రజలకు పూజింపదగినది.

మురాసురుణ్ణి సంహరించినవాడు నారాయణుడు కాబట్టి 'మురద్విట్' అపరసంధ్య నారాయణునియొక్క అపరమూర్తిగా భాసించిందని స్వరూపోత్ప్రేక్ష. సువర్ణ పీతాంబర వాసినీత్యాది (విశేషణ పదాల) శ్లేష మూలకమైన అభేదాధ్యవ

సాయ రూపాతిశయోక్తి చేత స్వరూపోత్ప్రేక్ష ఉత్థాపితం, కాబట్టి సంకరాలంకృత శ్లోకమిది.

*139. ప్రసక్త పాతశ్చరమాఽంబురాశౌ*
*రక్తోరు బింబో రవిరస్త శైలాత్।*
*దినాంత నాగేన దృఢ ప్రణున్నం*
*మనః శిలా శృంగ మివా బభాసే॥* 39

**అర్థం:** చరమ+అంబురాశౌ= పశ్చిమ సముద్రమందు; అస్త శైలాత్= అస్త్రాద్రినుంచి; ప్రసక్తపాతః= ప్రారబ్ధమైన పతనంగల; రక్త+ఉరుబింబః= అరుణ విపుల బింబంగా ఉన్న; రవిః= సూర్యుడు; దినాంత నాగేన= సాయంకాలమనే ఏనుగుచేత; దృఢ ప్రణున్నం= గట్టిగా నెట్టబడిన; మనశ్శిలాశృంగం, ఇవ= మనశ్శిలా పర్వతం యొక్క శిఖరం వలె; ఆబభాసే= ప్రకాశించెను.

**తా॥** సాయంకాలమనే గజంచేత గట్టిగా త్రోసివేయబడిన మనఃశిల యనే పర్వతం యొక్క శిఖరంలాగా, పడమటి సముద్రమందు అస్తమిస్తున్న అరుణవర్ణ శోభితమైన గొప్ప రవిబింబం ప్రకాశించెను. గోరోజన వర్ణం గలది మనశ్శిల అనే గైరికధాతువు. ఆ పేరుగల గైరిక శిఖరంతో సూర్యుని యందు తాదాత్మ్య సంభావనారూపమైన స్వరూపోత్ప్రేక్షాలంకారమిది. ఆ పర్వత శిఖరం త్రోసి వేయబడింది దినాన్తమనే నాగంచేత అని రూపకాలంకారంచేత స్వరూపోత్ప్రేక్ష ఉత్థాపితం. అందువల్ల ఈ శ్లోకం సంకరాలంకృతం. "అస్తస్తు చరమక్ష్మాభృత్" (అమరం).

*140. నిమజ్జతా వారినిధౌ సవిత్రా*
*కోనామ జాయేత కరగ్రహీతా।*
*తదేతి సంభావన యైవ నూనం*
*దూరా దుదక్షేపి కరాగ్రముచ్చైః॥* 140

**అర్థం:** వారినిధౌ= సముద్రమందు; నిమజ్జతా= మునుగుతున్న; సవిత్రా= సూర్యునిచేత; కోనామ= ఎవడైనను; కరగ్రహీతా= చేతిని పట్టుకొనేవాడు; జాయేత= ఉంటాడు; ఇతి= అని; సంభావనయా, ఏవ= ఊహతోనే; తదా= అప్పుడు; కర+అగ్రం= కిరణాలనే చేతుల కొనలు; ఉచ్చైః= ఉన్నతంగా ఎత్తి; దూరాత్= దూరంగా; ఉదక్షేపి= మీదికి చాపబడెను; నూనం= నిశ్చయం.

**తా॥** సూర్యుడు సముద్రంలో మునుగుతున్నాడు. మునుగుతున్న సమయాన ఎవడైన నొకడు మునుగకుండ తన చేతిని పట్టుకొంటాడనే భావనతోనే సూర్యుడు తన కిరణాలు అనే చేతులను ఆకాశంవైపు దూరంగా మీదికి చాచాడు.

**వ్యాఖ్య:-** సూర్యుడు అస్తమించే వర్ణన.

సూర్యుడు పశ్చిమ సముద్రంలో మునిగిపోతున్నాడని కవి వాగ్విన్యాసం. నీటిలో మునుగుతున్నవాడు తనను మునుగకుండా రక్షించడానికి తన చేతిని పట్టుకొని పైకిలాగేవాడు ఎవడో ఒకడు ఉండకపోతాడా? ఉంటాడు, అవశ్యంగా కాపాడుతాడు అనే ఊహచేతనే పైకి చేతులెత్తుతాడు. కాలుసేతులు ఆడిస్తుండేవాడు నీళ్ళల్లో కాసేపు తేలుతూ, మునుగుతూ ఉంటాడు కానీ, చేతులను నీటిపైన నేరుగా మీదికి చాచినవాడు చక్కగా నీటి అడుగుకే చేరుతాడు. నిశ్చయం.

సూర్యుని విషయమై నీటిలో మునుగుతున్న వ్యక్తి వృత్తాంతం తోచడం వల్ల సమాసోక్తి అలంకారం. చేతులను మీదికెత్తడంలో కరగ్రహీత ఎవడో ఉంటాడని ఊహించినందువల్ల సంభావనారూపమైన హేతూత్ప్రేక్షాలంకారం.

"దూరాంతికార్థేభ్యో ద్వితీయా చ" అనే శబ్దశాస్త్ర నియమాన్ని బట్టి 'దూరం' అనే ప్రాతిపదికార్థమందే 'దూరాత్' అని పంచమీ విభక్తి ప్రత్యయం చేర్చబడింది. "నామ ప్రకాశ్య సంభావ్య క్రోధోపగమ కుత్సనే"- (అమరం).

'కర' శబ్దానికి కిరణమనీ, హస్తమనీ రెండర్థాలున్నాయి. కాబట్టి, కరశబ్ద శ్లేషమూలకమైన అతిశయోక్త్యలంకారం కూడా ఉంది. సంకరం.

సూర్యుడు తనను రక్షించడానికి ఎవడైనా సిద్ధపడతాడనే భావనతో తన కరాగ్రాన్ని తాను మునుగుతూ, మీదికి చాచాడు. సూర్యబింబం కనబడడం లేదు. సూర్యకిరణాలు మాత్రం ఆకాశంవైపు మీదికి విస్తరించాయి. సంజ వెలుగులో ఆకాశం విచిత్రంగా శోభిస్తున్నది. వర్ణన మనోహరంగా ఉంది. కానీ, కరాగ్రాన్ని ఉత్ప్రేక్షించడంవల్ల సవిత అస్తమిస్తున్నాడని సుస్పష్టం.

*141. స్ఫురత్ ప్రభాకేసర మర్క బింబం*
*మమజ్జ సింధౌ మకరంద తామ్రమ్।*
*సంధ్యా కుమార్యా గగనాంబురాశేః*
*క్రీడా హృతం క్షిప్తమివార విందమ్॥* 41

**అర్థం:** స్ఫురత్, ప్రభాకేసరం= ప్రకాశిస్తున్న కేసరాలవంటి కాంతులు కలిగియున్న; మకరంద తామ్రం= పూదేనెవలె ఎఱ్ఱగా ఉన్న; అర్కబింబం= సూర్యమండలం; సంధ్యా కుమార్యా= సంధ్య అనే కన్యచేత; గగన+అంబురాశేః= ఆకాశ సరస్సు నుంచి; క్రీడా+అహృతం= విలాసంగా తేబడిన; స్ఫురత్ప్రభా, కేసరం= ప్రకాశించే కిరణకాంతులవలె నున్న కేసరాలు కలిగియున్న; మకరంద తామ్రం= పుష్ప రసంచేత ఎఱ్ఱగా ఉన్న; సింధౌ= సముద్రమందు; క్షిప్తం= విసరివేయబడిన; అరవిందం, ఇవ= తామర పూవులాగా; సింధౌ= సముద్రమందు మమజ్జ= మునిగెను.

**తా॥** సంధ్య అనే కన్య ఆకాశ సరోవరం నుంచి వినోదం కోసం తెచ్చి, సముద్రంలో విసరివేసినట్టి, ప్రకాశించే కిరణకాంతి సదృశమైన కింజల్కాలు గలిగిన, పుష్పరసంచేత ఎఱ్ఱగా శోభిస్తున్న అరవింద పుష్పంలాగా, ప్రకాశిస్తున్న కింజల్కాలవంటి కిరణకాంతులు కలిగియున్న, మకరందం లాగా, తామ్రవర్ణ శోభితమైన రవిబింబం పశ్చిమ సముద్రంలో మునిగింది. అర్కబింబం అరవింద తాదాత్మ్యంగా సంభావింపబడినందువల్ల స్వరూపోత్ప్రేక్షాలంకారం. స్ఫురత్ప్రభా కేసరం, మకరంద తామ్రం అనే ఉపమలచేతనూ, సంధ్యాకుమార్యా, గగనాంబురాశేః అనే రూపకాలచేతనూ ఆ స్వరూపోత్ప్రేక్ష స్థాపింపబడింది.

142. ఫణా మణి ప్రేక్ష్య ఖరాంశు బింబః
సంధ్యాసుపర్ణీ మవలోక్య భీతః।
తాపాధి కోవాసర పన్నగేంద్రః
ప్రాయేణ పాతాళబిలం వివేశ॥ 42

**అర్థం:** ఫణామణి-బింబః/ ఫణామణి= పడగమీద ఉన్న మణివలె; ప్రేక్ష్య= చూడదగిన; ఖర+అంశు= తీక్షణ కిరణాలు కలిగియున్న; బింబః= సూర్యమండలం కలిగిన; తాప+అధికః= ఉష్ణంచేత అధికమైన/ విషయం యొక్క తాపంచేత అధికమైన; వాసర పన్నగేంద్రః= దినం అనే ఫణిరాజు; ప్రాయేణ= బహుశః, సంధ్యా సుపర్ణీం= సంధ్య అనబడే ఆడ గరుడ పక్షిని; అవలోక్య= చూచి; భీతః= భయపడినదై; పాతాళబిలం= నాగలోక రంధ్రమందు; వివేశ= చొచ్చెను.

**తా॥** పడగమీది మణిలాగా కనబడే ఉష్ణకిరణ బింబం కలిగినట్టి, వేడి ఎక్కువగా ఉన్న దినమే విషాగ్ని తాపం అధికమైన ఫణిరాజు (నాగసర్పం) గా నిరూపింపబడింది. ఈ దివసం అనే ఫణిరాజు, సంధ్య అనే ఆడగరుడ పక్షిని చూచి భయపడి పాతాళ బిలంలో ప్రవేశించింది. పాతాళబిలంలో ప్రవేశించడం వల్ల పడగమీది మణిచే వెలిగే ఫణిరాజు కనబడనట్లు వేడి మయూఖునిచే వెలిగే దివసం కనబడనిదయిందని కమనీయమైన వర్ణన.

'ఫణామణిప్రేక్ష్య' అనే చోట ఉపమాలంకారం. 'తాపాధికం' అనే పదం (సూర్యతాపం, విషతాపం) రెండు రకాల తాపాలకు అభేదం చెప్పబడినందువల్ల అభేదాధ్యవసాయ రూపమైన అతిశయోక్త్యలంకారం.

'వాసర పన్నగేంద్రః' మరియు 'సంధ్యాసుపర్ణీం' అనే పదాలు రూపకాలంకార శోభితాలు. 'భీతః' అనే పదం పాతాళబిలమందు చొచ్చుటకు కారణాన్ని తెలిపే విశేషణం. కాబట్టి పదార్థ హేతుకమైన కావ్యలింగాలంకారమూ ఉంది. 'ప్రాయేణ' అనే పదం బిలప్రవేశ హేతువును ఉత్ప్రేక్షించడాన్ని ప్రతిపాదించడం వల్ల

హేతుత్ప్రేక్షాలంకారం. ఈ అలంకారాలచేత ఉత్థాపితమైన స్వరూపోత్ప్రేక్షాలంకారం 'వివేశ' అనే క్రియా పదం వల్ల శోభితం. ఇన్ని అలంకారాలచే సంకరమైనది ఈ శ్లోకం.

*143. ప్రదోషరాగారుణ సూర్యలక్షాత్*
*దిశాగజో దృప్త ఇవాతి ఘోరః।*
*కాలోపనీతం మధునాసమేతం*
*న్యభుంక్త మన్యే కబళం పయోధిః॥* 43

**అర్థం:** దృప్తః= గర్వించిన; దిశాగజః, ఇవ= దిగ్గజంవలె; అతిఘోరః= చాలా భయంకరమైన; పయోధిః= సముద్రం; ప్రదోషరాగ+అరుణ సూర్య లక్షాత్= సాయంకాలమందలి సంజ వెలుగుచేత ఎఱ్ఱని సూర్యుని యొక్క నెపంవల్ల; కాల+ఉపనీతం= సమయంచే అందించబడిన; మధునా= తేనెతో; సమేతం= కూడియున్న; కబళం= (బుక్కను) ఆహారపు ముద్దను; న్యభుంక్త= భుజించెను; (ఇతి= అని); మన్యే= భావిస్తున్నాను.

**తా॥** మదించిన ఒక దిగ్గజంలాగా కడు భయంకరమైన సముద్రం సాయంకాల సంధ్యారాగంచేత అరుణ వర్ణంగల సూర్యుని యొక్క వ్యాజంవల్ల, కాలంచేత తీసుకురాబడిన తేనెతో మిశ్రితమైన కబళాన్ని భుజించెనని తలుస్తున్నాను.

**వ్యాఖ్య:**– సూర్యాస్తమయ వర్ణన.

అతి భయంకరమైన సముద్రం మదించిన దిగ్గజం వంటిది. ప్రదోషరాగంచేత ఎఱ్ఱబారిన సూర్యబింబం తేనెతో కలిసియున్న ఒక కబళం. కాలమనే మావటిచేత నోటికి అందించబడిన ఆ కబళాన్ని దిగ్గజం మ్రింగింది. సముద్రమందు సూర్యుడు మునిగినాడని సారాంశం.

'మన్యే' అనే పదం ఉత్ప్రేక్షను సూచిస్తుంది.

"మన్యేశంకే ధ్రువం ప్రాయః నూన మిత్యేవ మాది భిః।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః॥"

మన్యే, శంకే, ధ్రువం, ప్రాయః, నూనం అనే పదాల చేత ఉత్ప్రేక్ష సూచింపబడుతుంది. 'ఇవ-వలె' అనే పదం కూడా అట్టిదే అని 'దండి' అనే కవి చెప్పినాడు.

భోజరాజు మాత్రం 'ఇవ' అనే పదం 'నిపాత ప్రతిరూపమైన అవ్యయం' అని చెప్పినాడు.

"ఆపంచైవ హలంతానామ్"- ఇతి టాపి దిశా శబ్దః సాధుః. "దిక్, కకుభ్, కాష్ఠా, ఆశా, హరిత్" అనే దిగ్వాచకాలు. స్త్రీలింగాలు, హలంత పదాలు. 'దిక్' శబ్దం 'టాప్' ప్రత్యయమందు ఉండడంవల్ల 'దిశా' శబ్దం సాధువు.

'కాలయతి-నయతి' (తీసుకొని పోయే వ్యక్తి అనే వ్యుత్పత్తి చేత 'కాలః' అంటే సాయంకాలమనే 'కాల' శబ్దానికి ఇక్కడ 'మావటి' అని అర్థం.

పయోధికి దిశాగజంతో సాదృశ్యం చెప్పినందువల్లనూ, సాయంకాలానికి కబళాన్ని తినిపించే కోరికగల మావటివానితో సాదృశ్యం తోచుచున్నందువల్లనూ, ఏక దేశవర్తియైన ఉపమాలంకారం.

'ఇవ' అని ఉన్నందువల్ల, ఇది ఏకదేశవర్తియైన రూపకమే అని ప్రాచీనులచేత చెప్పబడింది. అయిననూ-

"నేత్రై రివోత్పలైః పద్మైర్ముఖైరివ సరశ్శ్రియః।
పదే పదే విభాంతి స్మ చక్ర వాకైః స్త నైరివ॥"

(ముఖాల వంటి పద్మాలచేతనూ, కన్నుల వంటి కలువల చేతనూ, స్తనాల వంటి చక్రవాక పక్షులచేతనూ, సరస్సు యొక్క కాంతులు పదే పదే ప్రకాశిస్తుంటాయి) అని ఉదాహరించి, న్యాయ సామ్యం వల్ల ఏకదేశ వర్తియైన ఉపమాలంకారమని 'అలంకార సర్వస్వ' కారునిచేత అంగీకరింపబడింది.

"లక్షం నపుం శరణ్యే నస్త్రీ వ్యాజే నియుతే ననా"- (యాదవ నిఘంటువు). 'సూర్యలక్షాత్' అని అసత్యత్వాన్ని ఆరోపించే 'లక్ష' శబ్దంచేత 'ఇది ప్రదోషరూప సూర్యుడు కాదు; 'మధుసంభిన్న కబళ' మని తోచడం వల్ల 'అపహ్నుత్యలంకారం'. వీటిచేత ఉత్థాపితమై, సముద్రమందు సూర్యుడు మునుగుతున్నాడనేది గమ్యమాన మవడంవల్ల 'కబళభోక్తృత్వం' ఉత్ప్రేక్షాలంకారం. సంకరమే.

*144.* తదా తమః ప్రోషిత చంద్రసూర్యే
దోషాముఖే దూషిత సర్వ నేత్రమ్।
వియోగినాం శోకమయస్య వహ్నే
రాశాగతో ధూమ ఇవాన్వభావి॥ 44

**అర్థం:** తదా= ఆ సమయమందు; ప్రోషిత చంద్రసూర్యే= చంద్రుడూ సూర్యుడూ లేనట్టి; దోషాముఖే= రాత్రి యొక్క ఆరంభమందు; దూషిత సర్వనేత్రం= దూషింపబడిన అందఱి కన్నులు గల; తమః= చీకటి; వియోగినాం= విరహుల యొక్క; శోకమయస్య= శోకరూపమైన; వహ్నేః అగ్నియొక్క; ఆశాగతః= దిక్కులకు వ్యాపించిన (ఆశతీరని); ధూమః, ఇవ= పొగయో అన్నట్లు; అన్వభావి= అనుభవింపబడింది.

**తా॥** అది సంధ్యాకాలం. చంద్రసూర్యుల వెలుగూ లేదు, రాత్రి మొదలయింది. అందరి చూపులు మసకబారినాయి. అప్పుడు చీకటి, విరహుల యొక్క శోకాగ్నియొక్క దిక్కులకు వ్యాపించిన (ఆశ పూర్తికాని) పొగయో అన్నట్లు భావింపబడింది.

**వ్యాఖ్య:-** రాత్రి ఆరంభ సమయాన వ్యాపించిన చీకటిని వర్ణిస్తున్న శ్లోకం.

ప్రదోషకాలం దాటగానే రాత్రి ఆరంభమయింది. చంద్రుడు లేడు, సూర్యుడూ లేడు. అందరి దృష్టిని మరుగుపరుస్తున్న చీకటి, ఎడబాసిన వ్యక్తుల శోకరూపమైన అగ్నియొక్క దిక్కులకు వ్యాపించిన ధూమమన్నట్లు ఉన్నది. విరహులకు దృష్టి మాంద్యం కలిగినది. స్త్రీలు పురుషులు- చీకటిలో తమ తమ

ప్రియులను కలుసుకొనే ఆశ తీరక, వెదుకుతూ, ఇండ్లకు చేరలేక అలసిపోయినందు వల్ల కలిగిన శోకాగ్ని యొక్క పొగ దిగంతం వరకు వ్యాపించినట్లున్నది.

"*అథ ధోషాచ నక్తంచ రజనావితి*" అని అమర సింహుడు, 'దోషా' అనే పదాన్ని 'అవ్యయం' అన్నాడు. కాని 'భట్టి' అవ్యయం కాదన్నాడు. ఉదా: "*తతః కథాభిః సమతీత్య దోషాం, ఆరుహ్యా సైన్యైః సహ పుష్పకం సః*"- అని ('దోషాం'- ఆకారాంత స్త్రీలింగ ద్వితీయా విభక్త్యేకవచనం) ప్రయోగించాడు. కాబట్టి 'దోషాయాః ముఖే= దోషాముఖే' అనబడింది. 'శోకమయస్య' అన్నచోట స్వరూపార్థమందు 'మయట్' ప్రత్యయమున్నది. 'శోకమయస్య వహ్నేః' అని నేత్ర దూషకత్వ సామ్య నిమిత్తమైన 'అపహ్నుతి' సంకీర్ణమైన ధూమత్వోత్ప్రేక్షాలంకారం.

*145. సతార పుష్పా ధృత్త పల్లవశ్రీః*
*ప్రచ్ఛాయ నీరంధ్ర తమః ప్రతానా।*
*విశ్వాభినంద్యా వవృధే తదానీం*
*వైహాయసీ కాపి వసంత వన్యా॥* 45

**అర్థం:** తదానీం= అప్పుడు; సతారపుష్పా= చుక్కలనే పూవులతో కూడినట్టి; ధృత పల్లవ శ్రీః= ధరింపబడిన చిగుళ్ళ, (పత్+లవ) కిరణాల యొక్క కొంచెం, శోభకలిగియున్న; ప్రచ్ఛాయ నీరంధ్ర తమః ప్రతానా= నీడ సమృద్ధిగా కలిగిన, దట్టమైన; చీకటి సమూహం (ఆకుల గుంపు) కలిగియున్న; విశ్వ+అభినంద్యా= సమస్త జనులచే పొగడదగిన; వైహాయసీ= ఆకాశమందున్నట్టి; కా+అపి= ఆశ్చర్యమైన; వసంతవన్యా= వసంతకాలమందలి వనసముదాయం; వవృధే= వృద్ధిని పొందెను.

**తా॥** నక్షత్రాలనే పుష్పాలతో కూడి, చిగుళ్ళ కాంతిలాంటి కాంతిని ధరించినట్టి, సమృద్ధిగా ఉన్న నీడయే సాంద్రమైన చీకటి సముదాయం కలిగినట్టి, అందరిచే కొనియాడదగినట్టి, ఆకాశమందలి వసంతకాలం వనసమూహం అప్పుడు ఆశ్చర్యంగా వృద్ధి జెందినది.

వ్యాఖ్య:- సంధ్యాకాలం దాటిన సమయం వర్ణితం.

(తదానీం కాపి) చీకటి అధికంగా వ్యాపించియున్ననూ, కొద్దిగా ఆకాశమందు (పత్+లవ) ఎఱ్ఱని కిరణాల శోభలాంటి శోభ కొంచెం ప్రసరించియున్న కాలమది. ఈ సంధ్యావసానకాలం ఆకాశమందున్న వసంత వనరాజిగా వర్ణింపబడింది.

ఆ వనమందు చుక్కలే పూలు, 'ప్రతానం' అంటే 'కొమ్మలయందలి ఆకుల గుంపు' అని అర్థం. 'ప్రచ్ఛాయం' అనే పదం అవ్యయీభావం. నీడల సమృద్ధి అని అర్థం. సంధ్యాకాలాకాశశోభ పగడాలకాంతి సదృశమైన చిగుళ్ళ శోభ కలిగిన చీకటి వ్యాపించియున్నది. ఆకులచే నీడ చాలా కలిగిన వనరాజి అది. జగత్తుచే అభినందనీయమైన, ఒకానొక వనసమూహం ఆకాశమందు వృద్ధిచెంది యున్నదని వర్ణితం. వన్యా:- వనశబ్దానికి సమూహార్థమందు య ప్రత్యయం చేర్చబడింది.

సతార పుష్పా:- ఇది రూపకాలంకారం.

ధృత పల్లవ శ్రీః:- ఒకచోట నున్న కాంతి మరొకచోట సంభవించదు కాబట్టి, అసంభవ ద్వస్తు సంబంధంచేత పల్లవశ్రీ సదృశశ్రీని పొంది యున్నందువల్ల నిదర్శనాలంకారం. ప్రచ్ఛాయ-ప్రతానా:- ఇక్కడ ఆకులగుంపుచేత సాంద్రమైన నీడ ఉన్నట్లు తమస్సు అధికంగా ఉన్నదనడం వల్ల, ఉపమాలంకారం. ఈ అలంకారాల వల్ల ఉత్థాపితమైన సంధ్యాకాలమందు వసంతవనరాజి అభేదంగా అధ్యవసింపబడింది. కాబట్టి అభేదాధ్యవసాయ రూపమైన అతిశయోక్త్యలంకారం. సంకరం.

146. అలక్ష్యత శ్యామల మంతరిక్షం
తారాభిరాదర్శిత మౌక్తికౌఘమ్।
నివత్స్యతో విశ్వపతే రవన్యాం
కాలేన భృత్యేన కృతం వితానమ్॥ 46

**అర్థం:** శ్యామలం= నీలవర్ణం కలిగిన; తారాభిః= చుక్కలచేత; ఆదర్శిత మౌక్తిక+ఓఘం= చూపబడిన ముత్యాల సమూహం కలిగియున్న; అంతరిక్షం= ఆకాశం; అవన్యాం= భూమియందు; నివత్స్యతః= నివసింపనున్న; విశ్వపతేః= జగన్నాథుడైన కృష్ణునికి; భృత్యేన= సేవకుడైన; కాలేన= కాలపురుషునిచేత; కృతం= చేయబడిన; వితానం= మేల్కట్టు అన్నట్లు; అలక్ష్యత= చూడబడెను.

**తా॥** నక్షత్రాల కాంతిచేత ప్రకాశిస్తున్న నీలాకాశం, నేలమీద నివాసం చేయబోతున్న జగన్నాథుడైన శ్రీకృష్ణునికి కాలమనే భృత్యునిచేత ముత్యాలు పొదుగబడిన వితానమో (చాందినీయో) అన్నట్లు కనబడుతుండెను. రూపక సంకీర్ణమైన ఉత్ప్రేక్షాలంకారం.

*147. అభృంగ నాద ప్రతిపన్నమౌనా*
*నిమేషభాజో నియతం వనస్థాః।*
*దూరంగతే స్వామిని పుష్కరిణ్య*
*స్త త్ప్రాప్తిలాభాయ తపోవితేనుః॥* 47

**అర్థం:** స్వామిని= నాథుడైన సూర్యుడు; దూరం గతే (సతి)= అస్తమిస్తుండగా; నియతం= విధిగా ఎప్పుడు (ఉండెడి); వనస్థాః= నీటియందు ఉండే/ అడవిలో ఉండే మునులు; అభృంగనాద ప్రతిపన్నమౌనాః= తుమ్మెదలనాదం లేనందున పొందబడిన మౌనంగల; నిమేషభాజః= ముడుచుకొనియున్న- ధ్యానమందు కన్నులను మూసుకొనియున్న; పుష్కరిణ్యః= తామరపూల సముదాయాలు; తత్+ప్రాప్తి లాభాయ= తమ పతిని పొందడం సిద్ధించడానికి; తపః= తపస్సును; వితేనుః= చేసినవి.

**తా॥** సూర్యుడు అస్తమించాడు. తమ ప్రియుడు లేడని విచారంతో పద్మినీ సమూహాలు ముకుళించాయి. తత్ఫలితంగా తుమ్మెదల మ్రోత లేనందువల్ల మౌనం వహించాయి. ఎల్లప్పుడు నీళ్ళల్లో ఉండడంవల్ల పద్మినులు తిరిగి తమ పతిని పొందే ఫలం సిద్ధించడానికి తపస్సు చేస్తున్నాయి.

సామాన్యంగా వనమందున్న మునులు మౌనంగా, కన్నులను మూసుకొని ధ్యానమగ్నులై భగవంతుని సాక్షాత్కారం కోసం తపస్సు చేస్తుంటారు కదా!

"వనం కానన నీరయోః:- (విశ్వః) వన శబ్దానికి అడవి, నీరు అని అర్థం. శ్లేష. తుమ్మెదల రొదలేదనే భావం మౌనత్వాన్ని ఆరోపించడానికి, తపశ్చర్యకు ఉపయోగపడడం వల్ల పరిణామాలంకారం.

సూర్యునియందు పతిత్వాన్ని ఆరోపించడం వల్ల పుష్కరిణులకు పత్నీత్వం గమనింపబడుతున్నది. కాబట్టి ఇక్కడ ఏకదేశవర్తి రూపకం. పద్మాలు ముకుళించి యున్నందువల్ల కన్నులు మూసుకొని యున్నవి అనే అభేదాధ్యవసాయం వల్ల లక్షణామూలాతిశయోక్తి. సూర్యప్రాప్తి లాభంకోసమనేది ఫలోత్ప్రేక్ష. 'తపస్సు చేసెను' అనే మాట స్వరూపోత్ప్రేక్ష. వాచకం లేనందువల్ల గమ్యోత్ప్రేక్ష. ఇన్ని అలంకారాల సంకరమైన శ్లోకమిది.

*148. నిమిలితానాం కమలోత్పలానాం*
*నిష్పన్న సఖ్యైరివ చక్రవాకైః।*
*విముక్త భోగైర్విదధే విషణ్ణై*
*ర్విబోధవేలావధికో విలాపః॥* 48

**అర్థం:** చక్రవాకైః= జక్కువ పక్షులతో; నిమీలితానాం= ముకుళించిన; కమల+ఉత్పలానాం= కమలాలకు, కలువపూలకు; నిష్పన్న సఖ్యైః, ఇవ= కలిగిన స్నేహంచేతనో అన్నట్లు; విషణ్ణైః= దుఃఖిస్తున్నవై; విముక్త భోగైః= వదలివేసిన సుఖాలు కలవై; విబోధవేలా+అవధికః= ప్రభాత సమయం వరకు గల; విలాపః= శోకశబ్దం; విదధే= చేసెను.

**తా॥** చక్రవాక పక్షులు, కమలోత్పలాలు నీటిలోనే ఉండడం వల్ల వాటికి సఖ్యత ఉన్నది. ఆ పక్షులు పగలు కలుసుకొంటూ తిరుగుతాయి. రాత్రి కాగానే తిరిగే ఆ పక్షులకు ఎడబాటు కలుగుతుంది. ఆడ మగ జక్కువలు .తెల్లవారే

దాకా కువ కువ మంటూ (విరహంతో) శోకిస్తుంటాయి. కమలోత్పలాలు సౌహార్దంతో రాత్రి ముడుచుకొని ఉన్నాయి. సుఖానుభవ కృత్యాలను విడిచి జక్కువలతో పాటు ప్రాతః కాలందాకా సానుభూతిని తెలిపినవి.

సహృదయులైన మిత్రులు ఒకరికి మూర్ఛాది దురవస్థ కలిగినప్పుడు తాము తాంబూలాది భోగాలను వదలుకొని, తెలివికి వచ్చేదాకా విలపిస్తున్నట్లే, చక్రవాక పక్షులు ఎడబాటు కలిగి తెల్లవారేదాకా శోకిస్తూ బాధపడుతుంటే, సౌహార్దంతో కమలోత్పలాలు కూడా ముకుళించి ప్రభాత సమయం దాకా విషణ్ణవదనలై యున్నవని వర్ణితం.

ఇక్కడ విరహంవల్ల ఏర్పడిన చక్రవాకాల విలాప విషయమై కమలోత్పలాల సఖ్యం యొక్క హేతువును ఉత్ప్రేక్షించడం వల్ల హేతూత్ప్రేక్షాలంకారం. విశేషణ సామ్యం వల్ల కమలోత్పలాలకు మూర్ఛపోయిన పురుషుని వృత్తాంతం తోస్తున్నందు వల్ల సమాసోక్త్యలంకారం. ఆ రెండు అలంకారాలు అన్యోన్యంగా అనుప్రాణిత మైనందువల్ల సంకరాలంకారం.

వివరణ:- రాత్రివేళ నీలోత్పలాల యొక్క వికాసం ప్రసిద్ధమా? 'సాహిత్య చింతామణి' యందు కవిసమయ ప్రసిద్ధ పరిగణన ప్రస్తావంలో, 'రాత్రావేవ నీలోత్పల వికాసః, దివైవ కమల వికాసః' అని ఉన్నది కదా! మరి నీలోత్పలాలు రాత్రిపూట ముకుళించడం ఎలా పొసగుతుంది? ఏ విధంగా చెప్పబడింది? అంటే, సత్యమే.

*"ఇద మావిస్మిత జ్యోత్స్నం స్నిగ్ధ నీలోత్పలం ముఖమ్।*
*ఇతి జ్యోత్స్నోత్పలా యోగా దయుక్తం నామ రూపకమ్"*

అని ఉదాహరించిన దండి (కవి) చేత, రాత్రి వేళలో నీలోత్పలాలు (నిమీలనం) ముకుళించడం అంగీకరింపబడింది. ఆ శ్లోక వ్యాఖ్యలోనూ అలాగే చెప్పబడింది. *"యదాజ్యోత్స్నా- చంద్రికా, తదోత్పలం నవికసతీతి జ్యోత్స్నోత్పల యోగః అసంగతః"* (వెన్నెలకు కలువలు వికసింపవు అని). ఇలాగా, (వికసించడం,

ముకుళించడం) రెండు విషయాలూ కూడా కవి సమయ ప్రసిద్ధివల్ల ఉపపన్నమైనవే. ఈ కావ్యమందే, ఇక ముందు రాత్రి యమునా నదీ వర్ణనలో– "నిమిషితా సిత నీరజలోచనా, ముకుళితాబ్జ ముఖీ సవితుస్సుతా" అని చెప్పబడ నున్నది. ప్రభాత వర్ణనలోనూ నీలోత్పల వికాసం చాలా చోట్ల చెప్పబడగలదు. 'శ్రీమద్రామాయణ'మందు కూడా పగలు గంగా వర్ణనయందు, "క్వచిత్ ఫుల్లోత్పలచ్ఛన్నాం, క్వచిత్ పద్మవనాశ్రితామ్" అని ఉన్నది.

*149.* *తమిస్ర నీలాంబర సంవృతాంగీ*
*శ్యామాబభౌకించిదతీత్య సంధ్యాం।*
*ప్రాచీనశైలే సమయా న్నిగూఢం*
*సముద్యతా చంద్ర మివాభిసర్తుమ్॥* 49

**అర్థం:** కించిత్= కొద్దిగా; సంధ్యాం= సంధ్యాకాలాన్ని; అతీత్య= దాటి; తమిస్ర నీలాంబర సంవృతాంగీ= చీకటి అనే నల్లని వస్త్రం చేత కప్పబడిన అవయవాలు గల; శ్యామా= రాత్రి అనే యువతి; ప్రాచీనశైలే= పూర్వాచలమందు; సమయాత్= కాలమనే సంకేతం వల్ల; నిగూఢం= నిలీనమైయున్న; చంద్రం= చంద్రుణ్ణి; అభిసర్తుం= సమీపించడానికి; సముద్యతా, ఇవ= ఉద్యమిస్తున్నట్లు; బభౌ= ప్రకాశించెను.

**తా॥** సంధ్యాసమయం కొద్దిగా గడిచిన వెంటనే, చీకటి అనే నల్లని వస్త్రంచేత అవయవాల నన్నిటినీ కనబడకుండా కప్పుకొన్న రాత్రి అనే పడుచు, పూర్వాద్రియనే సంకేత స్థలమందు కాలమనే సంకేతంవల్ల నిలీనమైన చంద్రుని దగ్గఱికి అభిసరించడానికి యత్నిస్తున్నట్లు ప్రకాశించింది.

**వ్యాఖ్య:**– రాత్రిని అభిసారికగా వర్ణిస్తున్న శ్లోకం.

సంజ వెలుగు ఉండే సమయం దాటిపోయింది. రాత్రి అనే యువతి చీకటి అనే నీలాంబరాన్ని తన అవయవాలు కానరాకుండా (ముసుగుగా) కప్పుకొన్నది. "శ్యామాషోడశ వర్షాస్త్రీ త్రివృతా శారిబా నిశా" (రత్నమాల).

ప్రాచీన శైలమందు కాలమనే సంకేతంవల్ల నిలీనమైయున్న చంద్రుని వద్దకు అభిసరించడానికి ఉద్యమిస్తున్నట్లు ప్రకాశించింది.

ప్రాచీన శైలమన్నచోట ప్రాచీన శబ్దశక్తిచేత, అది మొదలే పరిచితమైన సంకేత స్థలంగా గమనింపబడుతున్నది.

*"సమయః కాలసిద్ధాన్త ప్రతిజ్ఞా శపథేషు చ। సంకేతాచార యోశ్చ"* (రత్నమాల). అభిసారిక తన నెవరు గుర్తించకుండా, కొంచెం చీకటిగా ఉన్నప్పుడు నల్లని ముసుగు బట్టను దేహంమీద కప్పుకొని ప్రియుడున్న సంకేత స్థలానికి అభిసరిస్తున్నది అన్నట్లు రాత్రి ప్రకాశిస్తున్నదని వర్ణితం.

ఇక్కడ *"తమిస్ర నీలాంబర"* అని నైల్యమనే సామాన్య ధర్మం యొక్క ప్రయోగం వల్ల ఉపమ బాధింపబడి పరిశేషాత్ రూపకం సిద్ధించింది. దానిచే ఉత్థాపితమైన 'శ్యామా, సమయాత్' అనే పదాలు శ్లిష్టరూపకాలు. చంద్రునికి నాయకత్వ రూపణం గమనింపబడుతున్నందున ఏకదేశవర్తి రూపకం. దానిచే ఉత్థాపితమైనది అభిసారికాత్యోత్ప్రేక్ష. ఇలా సంకరాలంకృత శ్లోకం.

*150. నిశాకరేణ ప్రతిపన్న సత్త్వా*
*నిక్షిప్త దేహేవ పయోధి తల్పే।*
*జగత్సమీక్ష్యా జహతీ చ కార్శ్యం*
*ప్రాచీదిశా పాండరతామయాసీత్॥* 50

**అర్థం:** నిశాకరేణ= చంద్రుని చేత; ప్రతిపన్న సత్త్వా= ప్రాప్తగర్భయైన; పయోధి తల్పే= సముద్రమనే పడకయందు; నిక్షిప్త దేహా, ఇవ (స్థితా)= ఉంచబడిన శరీరం కల దానివలె ఉన్నట్టి; జగత్+సమీక్ష్యా= లోకంచేత బాగా చూడదగిన; కార్శ్యం, చ= బక్కచిక్కిన తనాన్ని కూడా; జహతీ= వదలివేస్తున్న; ప్రాచీ, దిశా= ప్రాగ్దిక్కాంత; పాండరతాం= తెలుపువన్నెను; అయాసీత్= పొందెను.

**తా॥** చంద్రునిచేత తూర్పుదిక్కు (అనే స్త్రీ) గర్భవతి యైనది. అంటే ప్రాగ్దిశా గర్భమందు చంద్రుడున్నాడని అర్థం. సముద్రమనే సెజ్జమీదనే సంశ్లేషించినందు వల్ల అక్కడనే తన దేహాన్ని ఉంచింది. తొలుత చీకటి ఆవరించి యుండడం చేత కృశత్వాన్ని పొందినట్లున్న ప్రాగ్దిశ, లోకంచేత ఉదయిస్తున్న చంద్రకిరణ సంపర్కం వల్ల చూడదగినదై ఆ కార్శ్యాన్ని వదలి తెల్లగా వెలిగింది.

చంద్రునివల్ల ప్రాగ్దిశ శుభ్రతను ఫాండరత్వాన్ని పొందింది. 'పాండుర' అని 'పాండర' శబ్దం ఉకారంతో ఉంటే 'తెలుపు, పసుపు కలిపిన వన్నె' గల రూపమని అర్థం. 'పడి-గతౌ' అనే ధాతువుకు 'పండేర్దీర్ఘశ్చ' అని దీర్ఘం కలిగి, 'అరన్' ప్రత్యయం చేరడం వల్ల 'పాండర' శబ్దం నిష్పన్నం.

*"శుక్లశుభ్రశుచిశ్వేత విశద శ్వేత పాండరాః।*
*అవదాతః సితో గౌరో వళక్షోధవళోఽర్జునః॥"* (అమరం)

ఇక్కడ ప్రాచీ దిశకు గర్భవతిగా ఉన్న రూపం గమనింపబడుతున్నందు వల్ల ఏకదేశవర్తి రూపకాలంకారం. ఈ రూపకం 'పయోధి తల్పే' అనే రూపకం చేత అనుప్రాణితమై 'నిక్షిప్త దేహా' అనే ఉత్ప్రేక్షచేత, అంధకారం యొక్క ఆవరణయందు కార్శ్యం అభేదాధ్యవసాయ రూపమైన అతిశయోక్తి చేతనూ అనుప్రాణితమైనది. సంకరాలంకారం.

*151. తమః ప్రసంగేన విముచ్యమానా*
*గౌర ప్రభా గోత్రభిదాఽభి నంద్యా।*
*విధూదయారంభ విశేష దృశ్యా*
*ప్రాచీదిశాఽ భాసత దేవకీవ॥* 51

**అర్థం:** తమః ప్రసంగేన= అంధకార సంపర్కంచేత/ (భగవత్ప్రవేశంవల్ల) తమోగుణం యొక్క, పాపంయొక్క, శోకం యొక్క, సంపర్కం చేత; విముచ్యమానా= విడువబడుతున్నట్టి; గౌరప్రభా= ధవళకాంతి; గోత్రభిదా= పర్వతాలను పగులగొట్టిన

ఇంద్రునిచేత; అభినంద్యా= పొగడదగినదై; విధు+ఉదయ+ఆరంభ విశేష దృశ్యా= చంద్రోదయారంభంచేత బాగా చూడయోగ్యయైనట్టి/ కృష్ణుని యొక్క ఆవిర్భావారంభం చేత అతి రమణీయమైనట్టి; ప్రాచీదిశా= ప్రాగ్దిశ (తూర్పుదిక్కు); దేవకీ, ఇవ= దేవకీదేవి వలె; అభాసత= ప్రకాశించెను.

**తా॥** ప్రాచీదిశ చీకటి విడిపోయినందువల్ల తెల్లని వన్నెకలదై ఇంద్రుని చేత పొగడదగియున్నది. చంద్రోదయారంభ సమయాన రమణీయంగా శోభిస్తున్నది.

దేవకీదేవి తన గర్భమందు భగవానుడు ప్రవేశించినందువల్ల తమస్సు/ శోకమంతా దూరమై, ధవళవర్ణంతో శోభిస్తూ గోప సంఘంచేత కీర్తింపదగి యున్నది. శ్రీకృష్ణావిర్భావం కాబోతున్నందువల్ల ఆమె చూడముచ్చటగా నున్నది. కాబట్టి ప్రాగ్దిశ దేవకిలాగా ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్య:**- దేవకీదేవికి ప్రాగ్దిశ సాదృశ్య వర్ణన.

1) ప్రాగ్దిశ చీకటి విడిపోతున్నందువల్ల తెల్ల తెల్లగా శోభిస్తున్నది. గౌరోగుణే సితే పీతే (రత్నమాల). దేవకి తన కడుపులో భగవానుదున్నందువల్ల కష్టాలన్నీ, శోకమంతా తొలగిపోతుండగా శుభ్రంగా కనబడుతున్నది.

2) ప్రాగ్దిశ ఆ, దిక్పతియైన ఇంద్రునిచేత కొనియాడబడుతున్నది. తమస్సు తొలగింది. శుచిగా నున్నది. ఇంద్రుడు హర్షిస్తున్నాడని అర్థం.

*"తమోஉంధకారే స్వర్భానౌ విఘ్నే శోకే గుణాంతరే"*- (విశ్వ నిఘంటువు)

*గోత్రభిత్:*- గాంత్రాయతే ఇతి= గోత్రః- భూమిని కాపాడేది (త్రైజ్-పాలనే). పర్వతమని అర్థం. గోత్రాన్ భినత్తి ఇతి= గోత్రభిత్ (భిదిర్-విదారణే) పర్వతాలను భేదించినవాడు- 'ఇంద్రుడు' అని అర్థం. "గోత్రభి ద్వజ్రీవాసవో వృత్రహావృషా" (అమరం). దేవకీదేవి, దేవకార్యార్థం భగవానుడు ఆవిర్భవింప నున్నాడని గోపాలకుల బృందంచేత పొగడబడుతున్నది.

*"గోత్రస్త్రోతాగవాంత్రిషు"*- (శేష నిఘంటువు) గోవులను పాలించేవాడు, గోత్ర శబ్ద వాచ్యుడు. వసుదేవుడు, నందుడు గోపాలన సంబంధం కలవారు.

*"గోత్రంతునామ్ని చ"*- (అమరం). గోత్ర శబ్దానికి పేరు, కులం అని కూడా అర్థం. వసుదేవుని కులానికీ, నందుని కులానికి భేదముంది. వసుదేవ, నంద కులాలకు విశేష సంబంధం ఉన్నందువల్ల వారి బృందం 'గోత్రభిద్' అనబడుతుంది. కాబట్టి (గోత్రభిదా) నందాది సంఘంచేత కీర్తింపబడుతున్నది దేవకి.

3) ప్రాచీన దిశ చంద్రుడు ఉదయిస్తున్న కాలాన చాలా చూడయోగ్యంగా ఉన్నది. దేవకీదేవి శ్రీకృష్ణుని ఆవిర్భవింపనున్న సమయాన అతి రమణీయంగా ప్రకాశిస్తున్నది. 'విధు' శబ్దం శ్లిష్టం.

*"విధుః శశాంకే కర్పూరే హృషీకేశేచ రాక్షసే"* (విశ్వ నిఘంటువు)

*"దేవక్యాం దేవ రూపిణ్యాం విష్ణుః సర్వగుహాశయః।*
*ఆవిరాసీత్ యథా ప్రాచ్యాం దిశీందురివ పుష్కలః॥"*

అని దేవకియందు ప్రాచీ సామ్యం చెప్పబడింది. ఇక్కడ దేవకితో సామ్యం ప్రాగ్దిశకు పోషింపబడింది కదా! ఉపమాలంకారం, తమః ప్రసంగంచేతనూ, విధూదయంచేతనూ, అని- శ్లేషమూలకమైన అభేదాధ్యవసాయ రూపాతి శయోక్త్యలంకారం చేత అనుప్రాణితమైనది. సంకరం.

*152.* అపత్యలాభం యదువీరపత్న్యా
మహోదధౌ మగ్న సముత్థితేన।
తద్వంశ మాన్యేన సమీక్ష్య పూర్వం
ప్రాప్తం ప్రతీతేన పురోధసేవ॥ 52

**అర్థం:** యదువీర పత్న్యాః= యదువంశ శ్రేష్ఠుడైన వసుదేవుని భార్యయైన దేవకివలన; అపత్యలాభం= సంతానలాభాన్ని; సమీక్ష్య= ఆలోచించి; మహా+ఉదధౌ= సముద్రమందు; మగ్న సముత్థితేన= మునిగి లేచినట్టి; తద్వంశ మాన్యేన= ఆ యదువంశమందు పూజ్యుడైన చంద్రునిచేత; ప్రతీతేన= సాదరుడైన; పురోధసా, ఇవ= పురోహితునిలాగా; పూర్వం= ముందే; ప్రాప్తం= పొందబడినాడు.

**తా॥** యదువంశానికి మూలపురుషుడు చంద్రుడు. సముద్రంలో మునిగి లేచి వచ్చాడు. యదువంశమందు శ్రేష్ఠుడైన వసుదేవుని పత్నివల్ల కలుగబోయే సంతానాన్ని గూర్చి ఆలోచించాడు. పుత్రుడు పుట్టగానే జాతకర్మాదులను చేయడానికి, పుట్టకముందే స్నానం చేసి వచ్చిన పురోహితునివలె, చంద్రుడు ప్రకాశించాడు.

వీరశబ్దం శ్రేష్ఠవాచి, "వీరస్తు సుభగే శ్రేష్ఠే"– (విశ్వ.) 'ప్రతీత' శబ్దానికి సాదరమని అర్థం. 'ప్రతీతః సాదరే ఖ్యాతే' (విశ్వః). చంద్రుడు ఆ వంశానికి కూటస్థుడైనందువల్ల చంద్రుడు ఆదరింపదగినవాడు. ఒక వంశానికి ఒక పురోహితుడు ఆదరణీయుడు. శుభకార్యాదులను చేయడానికి కొంచెం ముందే వచ్చి కార్యాన్ని ఉపక్రమిస్తాడు. అలా పురోహితుడు లాగా ఆదరణకు యోగ్యుడైన చంద్రుడు ఉదయించి ప్రకాశించాడని తాత్పర్యం.

అస్తమించిన చంద్రుడు మళ్ళీ ఉదయించిన విషయం, తన వంశమందు కలుగబోయే సంతాన లాభాన్ని ఆలోచించి, ముందే వచ్చాడు అని కారణం చెప్పబడింది. కాబట్టి ఇది హేతూత్ప్రేక్షాలంకారం.

*153.* క్ష్వేళోపమే సంతమసే నిరస్తే
సోమం సుధాస్తోమమివో ద్వమంతీ।
దుగ్ధోదవేలేవ దుదోహ లక్ష్మీ
మాశామనోజ్ఞా మమరేంద్ర మాన్యా॥ 53

**అర్థం:** క్ష్వేళ+ఉపమే= గరళ సదృశమైన; సంతమసే= చీకటి; నిరస్తే= తొలగింపబడగా; సుధాస్తోమం, ఇవ= అమృత పుంజంలాగా; సోమం= సోమరసాన్ని; ఉద్వమంతీ= వమనంచేస్తున్న; అమర+ఇంద్ర, మాన్యా= దేవరాజు యొక్క మన్ననను పొందే; ఆశా= తూర్పుదిక్కు (అనే స్త్రీ); దుగ్ధోదవేలా= పాలకడలి చెలియలి కట్ట; ఇవ= వలె; మనోజ్ఞాం= శోభ అనే; లక్ష్మీం= లోక మాతను; దుదోహ= (పితికెను) జనింపజేసెను.

**తా॥** విషంతో సమానంగా ఉన్న చీకటి తొలిగింపబడగా, అమృత పుంజం వలె సోమాన్ని కక్కుతున్న దేవేంద్రునికి మాన్యమైన దిక్కు (ప్రాచీదిశ), పాల సంద్రంయొక్క చెలియలి కట్టవలె శోభ అనే లక్ష్మిని ఉదయింపజేసింది.

**వ్యాఖ్య:-** చంద్రోదయం కాగానే చీకటి తొలగింది. ప్రాగ్దిశ అతి సుందరంగా ప్రకాశించిందని వర్ణితం.

*"క్ష్వేళస్తు గరళం విషం"*- (అమరం). విషం వ్యాపించినట్లు చీకటి వ్యాపించి యుండగా చంద్రునికంటె మొదట కనిపించే అతని కిరణాలచేత చీకటి తొలగి పోయింది.

దేవేంద్రుని ఆదరానికి పాత్రమైన దిక్కు తూర్పు. ఆ ప్రాగ్దిశాంగన అమృత పుంజంలాగా ఉన్న సోమను కక్కింది. 'సోమ' శబ్దానికి చంద్రుడని అర్థం. చంద్రుడు సుధాకరుడు అంటే అమృత కిరణుడు కదా!

'సోమం ఉద్వమంతీ' అంటే చంద్రుణ్ణి ఆవిర్భవింపజేసింది ప్రాగ్దిశ అని అర్థం. తూర్పున చంద్రోదయం పూర్ణచంద్రుడన్న భావమే కదా!

'ఉద్వమన' అంటే కక్కుట అని అర్థం. ఈ మాట 'గ్రామ్యం'గా అనిపించిననూ అలంకార శాస్త్ర రీతిగా ఇది అందమైనమాట.

*"నిష్ఠ్యూతో ద్గీర్ణ వాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్।*
*అతి సుందర, మన్యత్తు గ్రామ్య కక్ష్యాం విగాహతే॥"*

అని (నిష్ఠ్యూతం= ఊంచుట; ఉద్గీర్ణం= త్రేన్పు; వాంతం= ఓకలించుట అనే పదాలు చాలా సుందరమైన అర్థాన్ని ఇస్తాయి) 'దండి' అనే కవి చెప్పినాడు.

చంద్రోదయమప్పుడు సముద్రం పొంగుతుంది. చెలియలికట్ట దాటునట్లు అలలు- పెరుగుతాయి. జలవృద్ధి కలుగుతుందని అర్థం.

'వేలా' అంటే సముద్రతీరమనీ, నీరు పొంగుట అని నిఘంటువు. "వేలాబ్ధి తీరాంబు వృద్ధ్యోః"- (రత్నమాల). 'లక్ష్మి' శబ్దానికి శోభ అనీ, జగన్మాత శ్రీదేవి అని అర్థం.

సముద్రాన్ని మథించినప్పుడు హాలాహలం మొదట పుట్టింది. ఆ కాలకూట మణగిపోగానే అమృతం జనించింది. జలధిని తరచినప్పుడు జలం పొంగి తీరాన్ని చేరింది. చంద్రుడు పుట్టాడు. లక్ష్మి అవతరించింది.

ఆ విధంగానే, ప్రాగ్దిశ వ్యాపించిన చీకటిని తొలగించే అమృత కిరణున్ని ఆవిర్భవింపజేసింది. సముద్రం పొంగు (పోటెక్కి) నట్లు మనోజ్ఞమైన శోభ అనే లక్ష్మిని జనింపజేసింది అని శ్లోక భావం.

శ్లేష మూలాతిశయోక్తిచేత అను ప్రాణితమైన ఉపమాలంకారం ఉన్న శ్లోకమిది. ఇట్టి కవిత్వశైలి కవితార్కిక కేసరికే సరి. దేశికుల కైత లలిత పదాలతో కూడినదే అయినా, అర్థం సముద్రంలాగా లోతైనది. భావం పర్వతం వలె మహోన్నతమైనది కదా!

*154.* తమ స్సమాక్రాంతి వశేన పూర్వం
జజ్ఞే నిమగ్నైరివ భూత ధాత్ర్యామ్।
తతస్తుషారాంశు కరావగూఢై
రుత్త భ్యమానై రివ శైలశృంగైః॥ 54

**అర్థం:** పూర్వం= చంద్రోదయారంభం కంటె ముందు; శైలశృంగైః= పర్వత శిఖరాలు; తమః+సమాక్రాంతి, వశేన= చీకటియొక్క ఆక్రమణకు అధీనమవడంచేత; భూతధాత్ర్యాం= ప్రాణులను పోషించే భూమియందు; నిమగ్నైః, ఇవ= మునిగినట్లు; తతః= చంద్రోదయారంభమైన తర్వాత; తుషార+అంశు, కర+అవ గూఢైః= శీతల కిరణాలు అనే చేతుల చేత ఆవరింపబడినవై; ఉత్తభ్యమానైః, ఇవ= పైకి లేపబడినట్లు; జజ్ఞే= సంభవించెను.

**తా॥** చంద్రోదయమయ్యేంతవరకు చీకటి బాగా వ్యాపించియున్నందువల్ల పర్వత శృంగాలు కనబడలేదు కాబట్టి అవి నేలలోకి క్రుంగిపోయినట్లు ఉత్ప్రేక్షింపబడినాయి. తర్వాత చంద్రోదయం కాగానే నేలపైన కిరణాలు ఆవరించాయి. బహుశః చంద్రుడు తన చేతులతో క్రుంగిన పర్వత శిఖరాలను లేవనెత్తినందువల్లే కాబోలు అవి మళ్ళీ పైకి స్పష్టంగా గోచరించాయని మరొక ఉత్ప్రేక్ష, ఉత్ప్రేక్షలు పరస్పరాను ప్రాణితాలవడంవల్ల సంకరాలంకారం.

*155.* *దిశస్త దానీ మవనీధరాణాం*
*సగైరికైః పారద పంకలేపైః।*
*చకాశిరే చంద్రమసో మయూఖైః*
*పంచాయుధస్యే వశరైః ప్రదీప్తైః॥* 55

**అర్థం:** తదానీం= అప్పుడు; దిశః= దిక్కులు; అవనీ ధరాణాం= పర్వతాల యొక్క; సగైరికైః= గైరికాది ధాతువులతో కూడిన; పారద పంకలేపైః= పాదరస ద్రవం యొక్క పూతలవంటి; చంద్రమసః= చంద్రునియొక్క; మయూఖైః= కిరణాలచేత; ప్రదీప్తైః= ప్రజ్వలించిన; పంచ+ఆయుధస్య= ఐదు ఆయుధాలు గల మన్మథుని యొక్క శరైః, ఇవ= బాణాలచేతవలె; చకాశిరే= ప్రకాశించాయి.

**తా॥** చంద్రోదయమైన సమయాన మన్మథుని బాణాల లాగా చంద్రకిరణాలున్నాయి. అరవిందం, అశోకం, చూతం (మామిడి), నవమల్లిక, నీలోత్పలం

(నల్లకలువ) అనే ఐదు పువ్వులే ఆయుధాలుగా కలవాడు మన్మథుడు. కాబట్టి మన్మథునికి పంచాయుధుడనే పేరు.

ఉన్మాదనం, తాపనం, శోషణం, స్తంభనం, సంమోహనం అనే ఐదు (5) పేర్లు గలవి మన్మథుని బాణాలు. ఈ మన్మథుని బాణాలవలె ప్రకాశించే చంద్ర కిరణాలచేత దిక్కులన్నీ ప్రకాశించాయి. ఎలా ప్రకాశించాయి?

పర్వతాల మీద గైరికాది ధాతువులుంటాయి. అవి బంగారు వన్నెలో ఉంటాయి. బంగారు వన్నెగల గైరికాదిధాతువులకు పాదరసం (వెండివలె తెల్లని ద్రవం) కలిపినట్టి బురదతో పూతపూసినట్లు దిక్కులన్నీ చంద్రకిరణాలచేత రంజకంగా ప్రకాశించాయి.

సగైరికాది పంకమనే రూపకానికి పంచాయుధుని బాణాలో అన్నట్లు ప్రకాశించే చంద్రకిరణాలు అనే ఉత్ప్రేక్షాలంకారానికి 'సంసృష్టి' ఈ శ్లోకమందు గోచరిస్తుంది. ప్రపంచమంత సంమోహితమైయున్న సమయమది అని భావం. *"గైరికం కనకే ధాతౌ"* అని *"రసస్తు పారదే సూదే"* అని విశ్వ ప్రకాశ నిఘంటువు.

156. *సమున్నమంతీ కుటిలాయతాత్మా*
*శశాంక లేఖోదయ దృశ్య కోటిః*
*వియోగి చేతోలవనే ప్రవీణా*
*కామోద్యతా కాంచన శంకులేవ॥* 56

**అర్థం:** సం+ఉత్+నమంతీ= (పైకి లేస్తున్నప్పుడు) ఉదయిస్తుండగా; కుటిల+ఆయత+ఆత్మా= వంకరగానూ, పొడవుగానూ ఆకారం కలిగిన; శశాంక లేఖా+ఉదయ, దృశ్యకోటిః= చంద్రకళ (రేఖ) యొక్క (మొదటి భాగం) చూడదగిన అంచు (కొన) కలిగియున్నదై; కామ+ఉద్యతా= మన్మథునిచే ఎత్తబడిన; వియోగిచేతః +లవనే= విరహజనుల మనస్సులను కోయడమందు; ప్రవీణా= సమర్థమైన; కాంచన శంకులా, ఇవ= బంగారు శస్త్రి (కొడవలి) వలె; చకాశే= ప్రకాశించెను.

**తా॥** చంద్రుడు ఉదయించగా అతని మొదటి కళ (రేఖ) వక్రంగా, దీర్ఘమైన అకృతి కలిగియుం(టుం)ది. ఆ చంద్రరేఖ మన్మథునిచే ఎత్తబడి ఎడబాసియున్న స్త్రీ పురుషుల మనస్సును కోసే కనక లవిత్రం (కొడవలి) లాగా ప్రకాశించింది.

చంద్రరేఖ విరహజనులను కామమోహితులను చేస్తుందని తాత్పర్యం. స్వరూపోత్ప్రేక్షాలంకారం.

*157. తమాంసి దుర్వార బలః సకాలః*
*ప్రాయోవిలోప్తుం సహసా దిశాంచ।*
*మనాంసి కామశ్చ మనస్వి నీనాం*
*ప్రాయుంక్త శైత్యాధిక మర్ధ చంద్రమ్॥* 57

**అర్థం:** దుర్వారబలః= సామాన్యంగా వారింపరాని బలంగల; సః= ఆ; కాలః = కాల పురుషుడు; కామః, చ= మన్మథుడును; దిశాం= దిక్కులయొక్క; తమాంసి= చీకట్లను; మనస్వినీనాం= మనస్సు కలిగియున్న స్త్రీల యొక్క; మనాంసి, చ= మనస్సులను కూడా; ప్రాయః= బహుశః; సహసా= అతి వేగంతో; విలోప్తుం= నశింపజేయడానికి; శైత్య+అధికం= శీతలత్వంచేతనూ/ పదను-వాడిచేతనూ, అధికమైనట్టి; అర్ధచంద్రం= అర్ధచంద్రుణ్ణి/ అర్ధచంద్ర బాణాన్ని; ప్రాయుంక్త= ప్రయోగించాడు.

**తా॥** దుఃఖంచేత వారింపబడే బలంగల కాలపురుషుడు, దిక్కులయొక్క చీకట్లను నశింపజేయడానికి చల్లదనంచే ఉత్తేజితమైన అర్ధచంద్రుణ్ణి ప్రయోగించాడు. అలాగే కాముడు-మన్మథుడు కూడా మనస్సు కలిగిన స్త్రీల మనస్సులను వినాశపరచడానికి నిశితమైన అర్ధచంద్ర బాణాన్ని ప్రయోగించాడు.

ఇది రాత్రి వర్ణన. కాబట్టి కాలపురుషుడూ, కాముడూ అర్ధచంద్ర ప్రయోగం చేశారని ఆలంకారికోక్తి.

*"అర్ధచంద్రస్తు చంద్రకే, గళహస్తే బాణభేదే"*- (విశ్వః) 'అర్ధచంద్ర' శబ్దం అర్ధచంద్ర రేఖకు, ఆ పేరుగల బాణానికి అర్థమిస్తుంది. 'శైత్యం' అనేది శీతత్వం, నిశితత్వం (శ్లేష గలది) రెండు అర్థాలను కలిగియున్న పదం.

కాలానికీ, కామునికీ ఒకే (ప్రాయుంక్త) క్రియా పదం ప్రయోగింపబడినది. అర్ధచంద్ర ప్రయోగరూప క్రియతో అన్వయించి, పరస్పరంగా ఔపమ్యం ప్రదర్శింప బడింది. కాబట్టి తుల్యయోగితాలంకారం. 'శైత్యాధిక మర్ధచంద్రం' అనే శ్లేషమూలాతిశయోక్తిచే అను ప్రాణితమైనది తుల్యయోగితాలంకారం.

అందువల్ల సంకరాలంకృత శ్లోకమిది.

*158. కరేణ సంకోచిత పుష్కరేణ*
*మదప్రతిచ్ఛంద కళంక భూమా।*
*క్షిప్త్వా తమః శైవల మున్మమజ్జ*
*మగ్నోదిశానాగ ఇవేందురబ్ధేః॥* 58

**అర్థం:** మద ప్రతిచ్ఛంద కళంక భూమా= మదజలంతో సమానమైన కళంకం అధికంగా కలిగియున్న; ఇందుః= చంద్రుడు; సంకోచిత పుష్కరేణ= ముడుచుకొన్నట్లు చేయబడిన, పద్మాలు కల/ ఏనుగు తొండం చివరి భాగం కల; కరేణ= కిరణం చేత/ తొండంచేత; తమః శైవలం= నాచుతో సమానంగా ఉన్న చీకటిని; చీకటి అనే నాచును; క్షిప్త్వా= తొలగించి/ విసరివేసి; మగ్నః= మునిగిన; దిశానాగః, ఇవ= దిగ్గజం లాగా; అబ్ధేః= సముద్రం నుంచి; ఉన్మమజ్జ= పైకి లేచాడు.

**తా॥** మదజలం కలది దిగ్గజం. కళంకం కలవాడు చంద్రుడు. ముడుచుకొన్న చివరి భాగం గల తొండంచేత నాచును తీసివేసి మునిగిన దిగ్గజం సముద్రం నుంచి పైకి లేచింది. కమలాలను ముడుచుకొన్నట్లు చేసిన కిరణంచేత నాచువంటి చీకటిని తొలగించి మునిగిన చంద్రుడు సముద్రం నుంచి పైకి లేచాడు.

ఇందు చంద్రుడు దిగ్గజాలతో పోల్చబడినాడు. కాబట్టి ఉపమాలంకారం. "పుష్కరం కరిహస్తాగ్రే వాద్య భాండముఖే జలే! వ్యోమ్ని ఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః॥" (అమరం) 'పుష్కర' శబ్దానికి చాలా అర్థాలున్నాయి. అందులో ఇక్కడ దిగ్గజ పరమైన అర్థం 'ఏనుగు తొండం కొన' అని. చంద్రపరమైన అర్థం 'పద్మం' అని, శ్లిష్టపదమిది.

అట్లే "బలిహస్తాంశవ కరాః" 'కర' శబ్దానికి పన్ను, చేయి, కిరణం అని అనేకార్థాలున్నాయి. 'కర' శబ్దం కూడా శ్లిష్టమే. కాబట్టి కరాది శబ్ద శ్లేషమూలాతి శయోక్తిచే అనుప్రాణితమైనదది ఉపమాలంకారం.

*159.* మదోదయా తామ్రకపోల భాసా
శక్రస్య కాష్ఠా శశినా చకాశే।
ఉదేయుషా వ్యంజయితుం త్రిలోకీం
నాథస్య సానాభిరివాంబు జేన॥ 59

**అర్థం:** శక్రస్య= ఇంద్రునియొక్క; కాష్ఠా= దిక్కు (తూర్పుదిక్కు); త్రిలోకీం= మూడులోకాలను; వ్యంజయితుం= ప్రకాశింపజేయుడానికి; ఉదేయుషా= ఉదయించినట్టి; మద+ఉదయ+ఆ తామ్ర కపోల భాసా= మదాన్ని జనింపజేయడం చేత ఎఱ్ఱబారిన గండస్థలం లాగా కాంతిగల; శశినా= చంద్రునిచేత; నాథస్య= నారాయణుని యొక్క సా= ప్రసిద్ధమైన; ఆ, నాభిః= పొక్కిలి; అంబుజేన, ఇవ= కమలంవలె; చకాశే= శోభించెను.

**తా॥** ఇంద్రుని దిక్కు అంటే ప్రాగ్దిశ, మదం కలుగజేసినందువల్ల ఎఱ్ఱని వన్నెగల గండస్థలంతో సమాన కాంతిగల్గిన చంద్రునిచేత, మూడు లోకాలను ఉత్పత్తి జేయదానికి ఉదయించిన పద్మంగల నారాయణుని నాభివలె ప్రకాశించింది.

*"సుదర్శనం చాస్యరరాజశౌరేః తచ్చక్రవత్ ఖం సుభుజోరు నాళమ్।*
*యథాఽఽ ఽది పద్మం తరుణార్కవర్ణం రరాజ నారాయణ నాభిజాతమ్॥"*

(భారతం). నారాయణుని చక్రంలాగా బాలసూర్యునివన్నె గలిగిన ఆయన నాభియందు ఉదయించిన ఆది కమలం కూడా బాగా ప్రకాశించింది- అని భారతంలో చెప్పబడినట్లే, జగత్త్రయాన్ని ఉద్భవింపజేసిన నారాయణుని నాభీ పద్మంవలె లోకాలను ప్రకాశింపజేయడానికి ఉదయించిన చంద్రుని చేత ప్రాగ్దిశ అరుణ వర్ణంతో శోభించిందని తాత్పర్యం.

"దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చతాః" (అమరం) దిక్కులపేర్లు. 'కాష్ఠా' శబ్దం స్త్రీలింగం. కాబట్టి, చంద్రునికి కపోల సాదృశ్య వర్ణనం, 'కాష్ఠ'కు (దిక్కుకు) పద్మోత్పాదకమైన భగవానుని నాభిసామ్యం- రమణీ సామ్యం- చెప్పబడింది. ఉపమాలంకారం.

*160. సమీపతః సంతమసాంబురాశేః*
*బభార శంఖాకృతి రిందు బింబః।*
*పిత్తో పరాగాదివ పీతిమానం*
*దోషావిలప్రోషిత దృష్టి దత్తాత్॥* 60

**అర్థం:** సంతమస+అంబురాశేః= సముద్రం వంటి చీకటికి; సమీపతః= సమీపమందు; శంఖ+ఆకృతిః= శంఖం యొక్క ఆకారం వంటి ఆకృతిగల; ఇందు బింబః= చంద్రుని స్వరూపం; దోషా+ఆవిల, ప్రోషిత దృష్టి దత్తాత్= రాత్రియందు ప్రియురాలి విరహ దుఃఖంవల్ల కలిగిన కన్నీటిచే కలుషితమైన; దోష+ఆవిల, ప్రోషిత దృష్టిదత్తాత్= కాంతికి ప్రతిబంధకమైన కళంకంచేత వికృతమైన (ప్రోషిత, దృష్టి, దత్తాత్) ప్రవాసంలో ఉన్న దంపతుల యొక్క దృష్టిచేత ఆవహించిన; పిత్త+ఉపరాగాత్, ఇవ= పిత్త ద్రవ్యంచేత పులుమబడిన; పీతిమానం= పీత (పసుపు) వర్ణాన్ని; బభార= భరించెను.

**తా॥** చీకటి సముద్రం లాగా అంతట వ్యాపించియున్నది. సముద్రం దగ్గర ఉన్న తెల్లని శంఖం యొక్క రూపంవంటి రూపంగల చంద్రుని ఆకృతి,

రాత్రిపూట విరహ దుఃఖాన్ని అనుభవించే (ప్రవాస) దంపతుల దృష్టిలో వికారం సంభవించినందువల్ల/ కాంతి ప్రతిబంధకమైన కళంకంచేత వికృతమైన పిత్తద్రవ్య సంపర్కంవల్ల, ఆవహించిన పసుపు వన్నెను భరించెను. (పీతిమ- పసుపువన్నె).

తెల్లని చంద్రుని ఆకృతి రాత్రి ఉదయించే సమయాన సముద్రం దగ్గర ఉన్న తెల్లని శంఖరూపంలాగా ఉంది. అయితే కాంతిని తగ్గించే కళంకంచేత, దృష్టిదోషం కలిగిన- పచ్చకామిళ్ళ రోగం కలిగిన కన్నుల చూపు వ్యాపించిన వస్తువులన్నీ పసుపు వన్నెతో శోభించినట్లే చంద్రుని రూపం పసుపువన్నెతో రంజితమైయున్నదని రాత్రి వర్ణన. ఇది తార్కిక వర్ణన.

తెల్లని శంఖం పచ్చగా కనబడడం భ్రమయే. అది కంటిచూపులోని దోషం. 'దోషా విల' అన్నచోట శ్లేష మూలకమైన అభేదాధ్యవసాయ రూపాతిశయోక్త్య లంకారం.

పిత్తద్రవ్య సంపర్కంవల్ల రంజితమైనది కాబట్టి తెల్లని శంఖం వంటి రూపం కలిగిన చంద్రుని రూపం కళంకాంకితమై పసుపువన్నెతో శోభిస్తున్నదని హేతువును వర్ణించినందువల్ల హేతూత్ప్రేక్ష. ఈ హేతూత్ప్రేక్ష ఉపమాతిశయోక్తులచే అనుప్రాణితమైనందువల్ల సంకరాలంకారం.

*161. కృశోదరీ లోచన కృష్ణ లక్ష్మా*
*రాత్ర్యాః సమిద్ధోదయరాగ ఇందుః।*
*కస్తూరికా కుంకుమ చిత్రి తాత్మా*
*కర్పూర విన్యాస ఇవాన్వభావి॥* 61

**అర్థం:** కృశ+ఉదరీ, లోచన కృష్ణ లక్ష్మా= సన్నని ఉదరం గల స్త్రీ యొక్క కన్నులవలె నల్లని చిహ్నం గలిగినట్టి; సమిద్ధ+ఉదయరాగః= ప్రకాశిస్తున్న, ఉదయించే సమయాన ఎరుపు వన్నె కలిగినట్టి; ఇందుః= చంద్రుని రూపం; కస్తూరికా కుంకుమ చిత్రిత+ఆత్మా= కస్తూరి మరియు కుంకుమ కలిసిన వర్ణం (రంగు) చేత చిత్రించబడిన

రూపం కలిగియున్న; రాత్ర్యాః= రాత్రియొక్క; కర్పూర విన్యాసః, ఇవ= కర్పూర తిలక విన్యాసంవలె; అన్వభావి= అనుభవింపబడింది.

**తా॥** స్త్రీ కన్ను (ల) వలె నల్లని గుర్తుగల కళంకమూ, ఉదయించే కాలాన దీపించే అరుణిమ కలిగియున్న చంద్రుని రూపం, రాత్రి (అనే వనిత) యొక్క కస్తూరి, కుంకుమ కలిసిన వర్ణంతో చిత్రించిన ఆకృతిగల కర్పూర తిలకం లాగా అనుభవింపబడింది.

తెల్లని వన్నె వల్లనూ, కళంకమూ ఉదయరాగం అనే రెండు కలిసిన వన్నె వల్లనూ రాత్రి వనితగా ఊహింపబడడం ఉత్ప్రేక్షాలంకారం. వనితగా విశేషణ సామ్యంవల్ల భావించడంచేత సమాసోక్త్యలంకారం. ఉత్ప్రేక్ష మరియు సమాసోక్తి రెండు అన్యోన్యంగా అనుప్రాణితాలైనందువల్ల సంకరాలంకారం.

*162. ప్రసాద మంతఃకరణస్య దాతా*
*ప్రత్యక్షయన్ విశ్వమిదం ప్రకాశైః*
*తమశ్చరాగం చ విధూయ చంద్రః*
*సంమో (సన్మో) దనం సత్త్వమివోల్లలాస॥* 62

**అర్థం:** అంతః కరణస్య= మనస్సుకు; ప్రసాదం= స్వచ్ఛతను- ఆహ్లాదాన్ని; దాతా= ఇచ్చునట్టి; ఇదం= ఈ; విశ్వం= ప్రపంచాన్ని; ప్రకాశైః= కాంతులచేత; ప్రత్యక్షయన్= చూపిస్తున్న; చంద్రః= చంద్రుడు; తమః= చీకటిని; చ= ఇంక; రాగం, చ= ఉదయించినప్పటి అరుణ వర్ణాన్ని; విధూయ= విదలించి; తమః, చ= ఇంక; రాగం, చ= తమోగుణాన్నీ; రాగంచ= రజోగుణాన్నీ; విధూయ= వదలి; సంమోదనం= ఆనందకరమైన/ సత్+మోదనం= నక్షత్రాలను సంతోషపరచునట్టి/ సత్పురుషులకు ఇష్టమైనట్టి; సత్త్వం, ఇవ= సత్త్వగుణంలాగా; ఉల్లలాస= భాసించెను.

**తా॥** చంద్రుడు మనస్సును ఆహ్లాదపరుస్తూ, తన కిరణకాంతులచే ప్రపంచాన్ని ప్రదర్శింపజేస్తూ, అంధకారాన్నీ అలాగే ఉదయారుణిమనూ వదలి

ఆనందకరుడై రోహిణ్యాదితారలకు సుఖాన్ని కలిగిస్తూ, తమోగుణాన్నీ, రజోగుణాన్నీ విడిచి, సత్పురుషుల కిష్టమైన సత్త్వగుణంవలె ప్రకాశించెను ('సత్' శబ్దానికి చుక్కలు, సజ్జనులు అని అర్థం).

సత్త్వగుణం రజస్తమస్సులను విడిచి ఒకప్పుడు స్వచ్ఛంగా ప్రకాశిస్తుంది.

*"రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।*
*రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥"* (భ.గీ. 14-10)

ప్రకృతి సహజాలైన గుణాలు మూడు విడువనట్టివి. అయినా, ప్రాచీన కర్మలవల్లనో, ఆహారవైషమ్యాల వల్లనో గుణాలు ఎక్కువ, తక్కువగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు సత్త్వగుణం రజస్తమోగుణాలను అణచివేసి ప్రకాశిస్తుంది. అట్లే రజోగుణాన్నీ సత్త్వగుణాన్నీ అణచి, తమోగుణమూ; సత్త్వతమోగుణాలను అణచివేసి రజోగుణమూ ప్రకాశిస్తుంది. ఒక్కొక్కప్పుడు ఒక్కగుణం తక్కిన గుణాలను అంటే వాటి పనులను చేయనీయక, తన పనినే చేస్తూ ప్రకాశిస్తుంది. కాబట్టి, వృద్ధిచెందిన సత్త్వగుణం మనస్సుకు ఏకాగ్రతను కలిగిస్తుందని భావం. 'ప్రసాద'మంటే మనస్సు పరిశుద్ధంగా ఉండడం మానస తపస్సు అనబడుతుంది.

*"మనః ప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః।*
*భావ సంశుద్ధి రిత్యేతత్ తపోమానసముచ్యతే॥"* (భ.గీ. 17-16)

మనస్సు యొక్క నైర్మల్యమూ, మనస్సుతో పరసమృద్ధిని కోరడమూ, వాగింద్రియాన్ని స్వేచ్ఛగా సంచరింపనీయక నియమించి మితంగా భాషించడమూ, ధ్యేయ వస్తువునందు మనస్సును నిలుపడమూ, ఆత్మకంటె వేరైన ఏ వస్తువులను గానీ చింతింపక ఉండడం- ఇదంతా మనస్సుతో నిర్వహింపబడే తపస్సుగా చెప్పబడుతున్నది.

*"శ్రద్ధయా పరయాతప్తం తపస్తత్ త్రివిధం నరైః।*
*అఫలా కాంక్షి భిర్యుక్తైః సాత్త్వికం పరిచ క్షతే॥"* (భ.గీ. 17-17)

ఫలాన్ని కోరకుండా, భగవదారాధన బుద్ధితో కూడిన మానవులు గొప్ప శ్రద్ధతో చేసే కాయిక, వాచిక, మానసిక తపస్సులు- సాత్త్విక మనబడుతాయి. మనః ప్రసాదం సత్త్వా (సత్త్వగుణా) ధీన మని చెప్పబడింది కదా!

*"సర్వ ద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।*
*జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వ మిత్యుత॥"* (భ.గీ.)

ఈ దేహమందు కన్నులు మొదలైన జ్ఞానేంద్రియాలవల్ల వస్తువుల యథార్థ రూపాన్ని తెలిపే జ్ఞానం ఉదయిస్తుందో అప్పుడు ఆ సత్త్వగుణం ఎక్కువ వృద్ధిగా నున్నదని గ్రహించవలెను. వివృద్ధ సత్త్వగుణం (ప్రకాశైః= జ్ఞానైః) జ్ఞానేంద్రియాలచే విశ్వాన్ని ప్రత్యక్షీకరింప జేస్తుంది అని ప్రస్పష్టం.

ఉపమాలంకారం. చంద్రశబ్దం పుంలింగం. సత్త్వ శబ్దం నపుంసక లింగం. ఉపమానోపమేయాలకు వేర్వేఱుగా లింగ దోషమున్నప్పటికీ, కవులు ఎక్కువగా పట్టించుకోలేదు. అంటే కొందరు ఆదరించారు, మరికొందరు ఆదరించలేదు. లింగభేద బాధకమైన సత్త్వ శబ్దంచేత ఉపమాలంకారం ఒకవేళ నిరసింపబడితే, పారిశేష్యంవల్ల 'ఇవ' శబ్దానికి సంభావన పరమైన ఉత్ప్రేక్షాలంకార మనుకోవచ్చును.

వామనుడు ఉత్ప్రేక్షయందు కూడా లింగభేదాన్ని దోషంగా భావించలేదు.

*163. నిశాకరో వారిధి నిః స్వనానాం*
*నిష్పాదకః కుందరుచిశ్చకాశే।*
*ఉదేష్యత శ్చక్ర భృతో నియోగాత్*
*ప్రాదుర్భవన్ ప్రాగివ పాంచజన్యః॥* 63

**అర్థం:** కుందరుచిః= మల్లెపూవు యొక్క కాంతివంటి కాంతి కలిగిన; వారిధి నిఃస్వనానాం= సముద్ర ఘోషలను; నిష్పాదకః= కలిగించునట్టి; నిశాకరః= చంద్రుడు; ఉదేష్యతః= పుట్టబోతున్న; చక్రభృతః= చక్రధారియైన శ్రీకృష్ణుని యొక్క; నియోగాత్=

అజ్ఞవల్ల; ప్రాక్= (కృష్ణుడు పుట్టక) ముందే; ప్రాదుర్భవన్= పుట్టుతూ; కుంద రుచిః = ముకుందుని యందు అభిరతి (భక్తి) యున్న; పాంచజన్యః, ఇవ= (శ్రీకృష్ణుని) శంఖంవలె; చకాశే= ప్రకాశించాడు.

**తా॥** చంద్రుడు మల్లెపూవులాగా తెల్లని కాంతికలవాడు. సముద్రం నుంచి ఉదయించినవాడు చంద్రుడు. చంద్రోదయ సమయాన సముద్ర తరంగాలు ఉవ్వెత్తుగా లేచి ఎగసిపడుతూ పెద్ద ధ్వనిని జనింపజేస్తుంటాయి. పుత్రోదయంతో సముద్రుడు సంతోషిస్తూ ఉప్పొంగిపోతుంటాడని కవి సమయం. ఈ సముద్ర ఘోషకు కారణమైనవాడు చంద్రుడు. అవతరించనున్న చక్రధారియైన కృష్ణుని నియమంవల్ల ఆయన అవతరించక ముందే పుట్టుతున్న, ముకుందుని యందు భక్తి కలిగియున్న పాంచజన్యం- సముద్రఘోషవలె ధ్వనించే శంఖం-లాగా చంద్రుడు ప్రకాశించాడు. పాంచజన్యమనే శ్రీకృష్ణుని శంఖం కూడా సముద్రమందే పుట్టిందని గమనార్హం.

కుంద శబ్దం నపుంసక లింగమైతే మల్లెపూవు అని అర్థం. పుంలింగమైతే ముకుందనిధి, ముకుందుడని అర్థం. 'రుచి' అంటే కాంతి, అభిరుచి, భక్తి కూడా. "కుందం మాఘ్యేచకుందో నా నిధిభేద మురద్విషోః"- (నానార్థ రత్నమాల). సముద్ర నిఃస్వనాలకు సదృశమైన గంభీర స్వనాలను కలిగించేది పాంచజన్యం కాబట్టి తాద్రూప్యంచేత ఉత్ప్రేక్షింపబడింది.

*164.* మృగేణ నిష్పన్న మృగాజిన శ్రీః
స్వపాద విక్షేప మితాంతరిక్షః।
మురద్విషో వామన మూర్తి భాజః
పర్యాయతా మన్వగమచ్ఛశాంకః॥64

**అర్థం:** మృగేణ= కృష్ణమృగం- లేడిచేత; నిష్పన్న, మృగ+అజిన శ్రీః= నిష్పన్నమైన జింకచర్మం యొక్క శోభ కలిగిన; స్వపాద విక్షేప మిత+అంతరిక్షః=

తన కిరణాల ప్రసారంచేత కొలువబడిన ఆకాశం కలిగిన; శశాంకః= చంద్రుడు; (మృగేణ, నిష్పన్న మృగాజిన శ్రీః= కృష్ణ మృగమనే జింకచర్మంచేత అందం కలిగియున్న; స్వపాద విక్షేప మితాంతరిక్షః= తన పాదంపెట్టి కొలువబడిన ఆకాశం కలవాడు వామనమూర్తి); వామనమూర్తి భాజః= పొట్టి బ్రహ్మచారి రూపధారియైన; మురద్విషః= మురారియైన భగవానుని యొక్క; పర్యాయతాం= సాదృశ్యాన్ని; అన్వగమత్= పొందెను.

**తా॥** చంద్రుడు మృగాంకుడు. జింకను చిహ్నంగా కలవాడు. (శశాంకుడు-కుందేలు గుర్తు కలవాడు అని కూడా చంద్రునికి పేరు ఉన్నది). వామనావతార మందు నారాయణుడు బ్రహ్మచారియై కృష్ణాజిన ధారణంతో గుజ్జురూపాన్ని ధరించి చాలా అందంగా శోభించాడు. చంద్రుడు ఆకాశంలో తన కిరణ కాంతులను అన్ని దిక్కుల ప్రసరింపజేశాడు. వామనమూర్తి తన వామపాదాన్ని ఆకాశానికి ఎత్తి అంతరిక్షాన్ని కొలిచాడు. కాబట్టి చంద్రుడు వామనమూర్తితో సమానంగా శోభించాడు. ఈ మనోహరమైన సాదృశ్య వర్ణనగల ఉపమాలంకారం చేత సుశ్లోకితం.

*165. జిగాయ శంఖాశ్రిత శైవలాభః*
*చారు ద్యుతే శ్చంద్ర మసః కళంకః।*
*ఉదీయమానస్య మహోర్మియోగాత్*
*సాభిచ్యుతం సాగర మూలపంకమ్॥* 65

**అర్థం:** శంఖ+ఆశ్రిత, శైవల+ఆభః= శంఖాన్ని తగులుకొన్న నాచుతో సమానమైన ప్రకాశం కలిగిన; చారుద్యుతేః= అందమైన కాంతికల్గిన; చంద్రమసః= చంద్రునియొక్క; కళంకః= మచ్చ; ఉదీయమానస్య= పైకి లేచివస్తున్న వాని యొక్క; మహా+ఊర్మిభిః= గొప్ప కెరటాలతో; యోగాత్= సంబంధంవల్ల; సాభిచ్యుతం= అంటుకొన్న; సాగర మూల పంకం= కడలి బురదను; జిగాయ= గెల్చెను.

**తా॥** శంఖానికి చుట్టుకొన్న నాచుతో సమాన కాంతి కలిగియున్న రమ్యమైన ప్రభ కలిగిన చంద్రుని యొక్క కళంకం, సముద్రపుటడుగు నుంచి పైకి లేచివస్తున్న చంద్రబింబాన్ని అంటుకొన్న సాగర మూలపంకాన్ని ఎగసిపడుతున్న పెద్ద తరంగాల రాపిడివల్ల జయించెను.

శంఖంలాగా ధవళవర్ణంతో శోభించేది చంద్రబింబం. శంఖానికి చుట్టుకొన్న నాచుతో సమాన ప్రకాశం కలది చంద్రుని కళంకం. నాచుతో కూడిన శంఖం లాగా కళంకంచేత అంకితుడైన చంద్రుడు మనోజ్ఞంగా ప్రకాశిస్తున్నాడు. అయితే రాత్రి పాతాళంలో సంచరించి, అక్కడి నుంచి సముద్ర రంధ్రమార్గంగా పైకి లేచివస్తుంటే సముద్రపు టడుగున నున్న బురద చంద్రబింబానికి అంటుకొన్నది. ఆ బురద సముద్రపు టలల రాపిడికి తొలగిపోయింది. చంద్రుడు ఎప్పటివలె అందంగా ప్రకాశించాడు. చంద్రుని కళంకం తాను బింబమందు ఉండగా, బింబానికి మరొక మచ్చ చేరిన బాగుండదని భావించి బింబానికి అంటుకొన్న సముద్రపు టడుగు బురదతో పోరాడింది. గుట్టలవంటి పెద్ద కెరటాల సహాయంతో ఆ కళంకం సాగర మూలపంకాన్ని జయించింది–అని స్వామిదేశికన్ ఉత్ప్రేక్షించాడు. కవితార్కిక సింహ బిరుదాంచితుడు కదా స్వామి. తర్కసహనమైన వర్ణన.

'జయతి' అనే పదం ఉత్ప్రేక్షా వాచకం కాదు. కాని "స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి" అని 'దండి' అనే మహాకవి 'జయతి' అనే పదాన్ని ఉపమావాచకాల్లో చేర్చడంవల్ల, ఆ పదం ఉపమావాచకంగా రూఢియైనది. అయినా, చంద్రబింబానికి లగ్నమైన బురదకు ఉపమ సిద్ధించనందువల్ల తద్రూపంగా ఉండే ఉత్ప్రేక్షగా వర్ణించడం ఔచిత్యమే. కాబట్టి ఆ శబ్దానికి ఉత్ప్రేక్షయే పర్యవసానం అని ఉపమోపక్రమోత్ప్రేక్ష'గా వర్ణించారు దేశికులు.

ఇలా ఉద్దండ పండితులైన శ్రీ అప్పయ్య దీక్షితులు వ్యాఖ్యానించారు.

166. ఉదేత్య తుంగా దుదయాద్రి శృంగాత్
తమోగజా నగ్రకరేణ నిఘ్నన్।
నిశాకర స్తన్మద లేప లక్ష్మా
సితాభిశుః సింహదశా మయాసీత్॥ 66

**అర్థం:** తుంగాత్= ఉన్నతమైన; ఉదయ+అద్రి, శృంగాత్= ఉదయపర్వత శిఖరం నుంచి; ఉత్+ఏత్య= పైకి లేచి; తమః+గజాన్= తమస్సులు (చీకట్లు) అనే ఏనుగులను; అగ్రకరేణ= ముందరి కిరణమనే చేతితో; నిఘ్నన్= కొట్టుతూ; తత్+మదలేప లక్ష్మా= ఆ ఏనుగుల మదం యొక్క పూతలాగా ఉన్న గుర్తుగల; సిత+అభిశుః= తెల్లని కిరణాలుగల; నిశాకరః= చంద్రుడు; సింహదశాం= సింహం యొక్క దశను; అయాసీత్ పొందెను.

**తా॥** ఎత్తైన ఉదయాద్రి శిఖరం నుంచి పైకి లేచి చీకట్లను తన ముందున్న కిరణంచేత తొలిగించిన చంద్రుడు, పర్వత శిఖరం మీద విహరించే ఏనుగులను చంపుతుండగా వాటి మదపు పూతచే శోభించే సింహం యొక్క దశను పొందాడు.

ఈ శ్లోకంలో ఉదయాద్రిపైనుంచి ఆకాశంలోకి వస్తున్న చంద్రుడు చీకట్లను తొలగించాడని వర్ణన. చీకట్లు ఏనుగులతో పోల్చబడినాయి. చీకట్లే గజాలు కాబట్టి రూపకాలంకారం. చంద్రుని ముందరి కిరణం ప్రసరించగానే చీకట్లు తొలగిన విషయాన్ని సింహం, ఏనుగులను తన ముందరి పంజాతో కొట్టి చంపినట్లు వర్ణితం.

అగ్రమైన కరం= అగ్రకరం అని సమానాధికరణ (కర్మధారయ) సమాసం. 'కర్మ' శబ్దానికి కిరణమనీ, చేయి అని అర్థం. శ్లిష్ట పదమిది. సింహం తన పంజాతో ఏనుగులను కొట్టగా వాటి మదజలం సింహానికి పూతగా అంటుకున్నది. ఈ మదలేపం లాగా శోభిస్తున్నది చంద్రుని మచ్చ- కళంకం. అందువల్ల చంద్రుడు సింహదశను పొందాడని వర్ణింపబడింది.

ఇందు ఒకరి దశ మరొకరికి సంభవించకున్నా, సంభవించినట్లు వర్ణించడం వల్ల, అసంభవద్వస్తు సంబంధ నిబంధనమైన నిదర్శనాలంకారం. 'తమోగజాలు' అనే రూపకం చేతనూ, 'అగ్రకర' మనే శ్లిష్ట రూపకం చేతనూ గజమద లేపత్వ'మనే ఉత్ప్రేక్షచేతనూ ఉత్థాపితమైన సంకరాలంకారమిది.

"హస్తాగ్రా గ్రహసాదయో గుణ గుణినోర్భేదాభేదాభ్యామ్" అనే వామనుని వాక్యంవల్ల 'అగ్రకర' మన్నచోట అవయవానికీ అవయ వికీ అభేదం చెప్పబడింది. 'సితాభిశుః' అన్నచోట 'అభిశు' శబ్దం తాలవ్యాంతపదం.

"అభీషుః ప్రగ్రహే రశ్మౌ"- (అమరం) 'వల్మిక వల్మీక' అన్నట్లు 'అభిశుః' అని హ్రస్వమధ్యపదంగా ఇక్కడ ప్రయోగింపబడింది. ఇకముందు, దీర్ఘ మధ్యపదంగా అభీశుభిః సూర్య ఇవాభిదీప్తః' అని చెప్పనున్నది.

*167. నిశీథలక్ష్మ్యా ఇవ పుండరీకం*
*నిర్వేశ సింధోరివ ఫేన చక్రమ్।*
*తమన్వ వైక్షంత విలాస తంత్రాః*
*తారా మణీనా మివ సూతి శుక్తిమ్॥* 67

**అర్థం:** విలాస తంత్రాః= ఉల్లాసమే ప్రధానంగా గల విలాసవంతులు; నిశీథ లక్ష్మ్యాః= అర్ధరాత్రి యొక్క శోభ అనే లక్ష్మియొక్క; పుండరీకం, ఇవ= తెల్ల తామర పూవులాగా; నిర్వేశ సింధోః= సుఖభోగమనే సముద్రం యొక్క; ఫేన చక్రం, ఇవ= నురుగు సమూహం లాగా; తారామణీనాం= చుక్కలు అనే ముత్యాలయొక్క; సూతిశుక్తిం, ఇవ= ఉత్పత్తిని చేసే ముత్యపు చిప్పయో అన్నట్లు; తం= ఆ చంద్రుణ్ణి; అన్వవైక్షంత= ఉత్ప్రేక్షించారు.

**తా॥** విలాసవంతులైన వ్యక్తులు, నిశీథ శోభ అనీ లక్ష్మియొక్క తెల్ల కమలమో అనీ, ఆనందమనే సముద్రం యొక్క ఫేన పుంజమో (నురుగు ముద్ద) అనీ, నక్షత్రాలు అనే ముత్యాలను ఉత్పత్తి చేసే ముత్తెపు చిప్పయో అన్నట్లు తెల్లని చంద్ర బింబాన్ని జూచి పలు విధాలుగా ఊహించారు.

తంత్ర మనే శబ్దానికి గల నానార్థాలలో ప్రధానమనే అర్థం ఒకటి.

*"తంత్ర స్వరాష్ట్ర వ్యాపారే తంతువాయే పరిచ్ఛదే।*
*శాస్త్రే ప్రధానే సిద్ధాంతే ప్రయోగేఽధ్వర కర్మణామ్॥"*

(ప్రకాశ నిఘంటువు)

ఒక్క చంద్రుణ్ణే పలురకాలుగా ఉత్ప్రేక్షించడంవల్ల ఇది మాలారూపమైన ఉత్ప్రేక్షాలంకారం. ఈ ఉత్ప్రేక్ష లక్ష్మీ శబ్ద శ్లేష మూలకమైన అతిశయోక్తిచేత ఉత్థాపితం. అలాగే మిగతా రెండవ మూడవ పదాలు రూపకాలంకారంచే ఉత్థాపితమైన ఉత్ప్రేక్ష.

*168. ఉదార తారాగణ బుద్బుదౌఘ*
*శ్చంద్రేణ సంపన్న సుధా ప్రసూతిః।*
*అశేష దృశ్యా మధిగమ్య లక్ష్మీ*
*మాలోక దుగ్ధోదధి రాబభాసే॥* 68

**అర్థం:** ఉదార తారాగణ బుద్బుద+ఓఘః= గొప్ప నక్షత్రాల సముదాయమనే నీటి బుడగల సముదాయంగల; చంద్రేణ= చంద్ర మండలంచేత; సంపన్న సుధా ప్రసూతిః= సంపత్తును పొందిన అమృతోత్పత్తిగల; ఆలోక దుగ్ధ+ఉదధిః= చంద్రుని ప్రకాశం అనే పాలకడలి; అశేష దృశ్యాం= సంపూర్ణంగా రమ్యమైన; లక్ష్మీం= శోభ అనే లక్ష్మిని; అధిగమ్య= పొంది; ఆ బభాసే= ప్రకాశించెను.

**తా॥** చంద్రమండల ప్రకాశమే క్షీరసముద్రంగా రూపింపబడింది. చుక్కల గుంపు అనేది నీటి బుడగల గుంపు. చంద్రునితోపాటు సంపన్నమైన అమృతోత్పత్తి కలది పాలకడలి. చంద్రుని ప్రకాశమే అంటే వెన్నెలయే పాలసముద్రం. చంద్రమండల శోభ విశ్వరమ్యమైనది. పాలసముద్రమందే లక్ష్మి ఆవిర్భవించింది.

కెరటాల వల్ల కలిగిన బుద్బుదాలు కలిగి, అమృతమూ, లక్ష్మీదేవియు ఉద్భవించడంవల్ల పాలకడలి అమితంగా ప్రకాశించింది. ఉదారమైన నక్షత్రాలు

కలిగిన అమృత కిరణుడైన చంద్రుని ప్రకాశం- వెన్నెల విశ్వంలో వ్యాపించి అధికంగా శోభించింది. చంద్రుని ధర్మాలను పాలకడలి ధర్మాలుగా తాద్రూప్య రంజనం చేసినందువల్ల; సావయవరూపకాలంకారం. ఈ రూపకం లక్ష్మీ శబ్దంచేత కలిగిన శ్లేషచేత అనుప్రాణితమయింది.

*169. ప్రకాశయన్ విశ్వమిదం యథావత్*
*చంద్రోదయోద్దీపిత సౌమ్యతారః।*
*ఆసీన్నిశీథో జగతః ప్రభూతా*
*దంధస్య దైవా దివ దృష్టి లాభః॥* 69

**అర్థం:** విశ్వం= సమస్తమైన; ఇదం= వస్తు సముదాయాన్ని; యథావత్= ఉన్నదున్నట్లు బాగా; ప్రకాశయన్= ప్రకాశింపజేస్తున్నట్టి; చంద్ర+ఉదయ, ఉద్దీపిత, సౌమ్య, తారః= చంద్రోదయం చేత ప్రకాశింపబడిన. మనోజ్ఞమైన నక్షత్రాలు కలిగి యున్నట్టి; నిశీథః= అర్ధరాత్రి; జగతః= లోకానికి; చంద్రోదయోద్దీపిత సౌమ్యతారః= చంద్రోదయ గుళికలు అనే వైద్యం (మందు) చేత ఉత్తేజితమైన, అనుగ్నమైన కనుగ్రుడ్లు కలిగిన; అంధస్య= గ్రుడ్డివానికి; ప్రభూతాత్= గొప్పదైన; దైవాత్= అదృష్టంవల్ల; దృష్టి లాభః, ఇవ= చూపు వచ్చినట్లు; ఆ సీత్= ఉండెను.

**తా॥** నడిరేయి చంద్రోదయంచేత మనోజ్ఞమైన చుక్కలు కలిగినదై లోకానికి సమస్త వస్తువులను ఉన్నదున్నట్లుగా ప్రకాశింపజేస్తున్నది. ఈ విధంగా ప్రకాశిస్తున్న అర్ధరాత్రి, గ్రుడ్డివాడు చంద్రోదయమనే పేరుగల మందును వైద్యుడు చెప్పినట్లుగా పథ్యంతో వాడినందు- తిన్నందు- వల్ల సులోచనాలను (గాజు అద్దాలను) ఉపయోగించకున్నను గొప్ప అదృష్టంచేత కనీనికలు- కనుగ్రుడ్లు స్పష్టంగా వస్తువులను కనుపింపజేసే చూపు ఆ గ్రుడ్డివానికి వచ్చినట్లు ఉన్నది.

నిశీథం గ్రుడ్డితనమన్నమాట. చీకటిగల నడిరేయి చంద్రోదయంచేత వస్తువులను లోకానికి ప్రకాశింపజేస్తున్నది. చంద్రోదయంచేత అర్ధరాత్రి లోకంలో

వస్తువులన్ని కనబడుతున్నట్లే, గ్రుడ్డివానికి- అంధునికి చంద్రోదయ గుళికలను మ్రింగడం వల్ల అదృష్టవశాన అతనికి దృష్టిలాభం కలిగినట్లు- అంధత్వం పోయి వస్తువులన్ని కనబడుతున్నట్లు ఉపమింపబడింది. ఉపమాలంకారం.

"సౌమ్యో బుధే మనోజ్ఞేస్యాత్ అనుగ్నే సోమదైవతే"- (విశ్వ నిఘంటువు).

*170. విశోధితా ద్విష్ణు పదాత్ క్షరంతీ*
*విష్వఙ్ముఖీ సాగర వృద్ధి హేతోః (తుః?)*
*తమోమయీం సూర్య సుతాం నిగీర్య*
*జ్యోత్స్నా నదీ శోణ మపివ్యముంచత్॥* 70

**అర్థం:** విశోధితాత్= చీకటి తొలగింపబడినట్టి/ కడుగబడినట్టి; విష్ణుపదాత్= ఆకాశం నుంచి/ విష్ణుమూర్తి యొక్క (వామ) పాదం నుంచి; సాగర వృద్ధి హేతోః= చతుస్సముద్రాలను పొంగించే కారణం వల్ల/ సగర పుత్రులను స్వర్గమనే ఊర్ధ్వలోకానికి చేర్చే కారణం వల్ల; విష్వక్+ముఖీ= నలువైపుల వ్యాపించినదై; క్షరం తీ= ప్రసరిస్తున్న; జ్యోత్స్నా నదీ= వెన్నెల అనే గంగానది; తమోమయీం= చీకటి వంటి నల్లని రూపం కలిగియున్న; సూర్యసుతాం= యమునా నదిని; నిగీర్య= గ్రసించి; శోణం, అపి= శోణమనే నదాన్ని కూడా; వ్యముంచత్= వదలి వేసెను, విడిచిపెట్టెను.

**తా॥** చంద్రుని వెన్నెల పలుదెసల ప్రసరిస్తున్నది. "చంద్రికా కౌముదీ జ్యోత్స్నా"- (అమరం). చీకటి తొలగిపోతున్నందువల్ల ఆకాశం తెల్లబడుతున్నది. చంద్రోదయమై ఆకసంలో వెన్నెల నలుదిక్కుల ప్రసరించడం నాలుగు సముద్రాలు ఉప్పొంగడానికి హేతువు.

చంద్రోదయ సమయాన సముద్రం పోటెక్కడం కవి సమయం. పుత్రోదయం తండ్రి ఉత్సాహానికి కారణం కదా!

క్రమంగా వెన్నెల చీకటిని మ్రింగివేసింది. చంద్రోదయ కాలాన ఉండిన (శోణం) ఎరుపు వన్నెను కూడా వెనుకకే వదలివేసి వెన్నెల ప్రకాశిస్తున్నది అని ముఖ్యార్థం.

'విష్ణుపదం' అంటే ఆకాశమనీ, విష్ణు పాదమని అర్థం. శ్లిష్టపదమిది. జోత్స్నా నదీ– వెన్నెల అనేది గంగానది– మిన్నేరుగా రూపింపబడుతున్నది. ఇక గంగానదీపరమైన అర్థం:

త్రివిక్రమావతారమందు బలిచక్రవర్తినుంచి మూడడుగుల నేలను అడిగి పొందిన వామనమూర్తి కుడిపాద తలంచేత భూమినంతటిని కొలిచి ఆక్రమించాడు. ఇక రెండవ ఎడమపాదంచేత ఆకాశాన్ని ఆక్రమించాడు. ఆ సమయంలో సత్యలోకాధిపతియైన చతుర్ముఖ బ్రహ్మచేత ధర్మకమండలు తీర్థంతో విష్ణుమూర్తి పాదం కడుగబడింది. శోధింపబడి నిర్మలమైన విష్ణు పాదం నుంచి ఉద్భవించి పెరిగిన గంగానది నలుదిక్కుల ప్రసరించింది. సాగర వృద్ధికోసం మేరుపర్వతం మీద బ్రహ్మపుత్రగా ప్రసరించి అలకనందా, సీతా, చక్షుః, భద్రానదులై నలు ప్రక్కల విభక్తయై ప్రవహించింది. అలకనందా భేదాలైన సప్రసు, నళినీ, హ్లాదినీ, పావనీ నదులు తూర్పుదిక్కు ప్రవహించాయి. సీతా (సితా) అసిక్నియా, చక్షుః సింధువులు పడమటి దిక్కు ప్రవహించాయి. ఏడవదిగా మిగిలిన గంగానది భగీరథుణ్ణి అనుసరించి దక్షిణదిక్కు ప్రవహించింది. కపిల మునిశాపంచేత హతులైన (సాగర వృద్ధిహేతోః) సగర చక్రవర్తి పుత్రుల సమూహాన్ని స్వర్గానికి పంపి ఉద్ధరించడం కోసం భగీరథుని వెంట ప్రవహించి సాగర వృద్ధిని కలిగించింది. క్రమంగా గంగ, నల్లని నీరుగల యమునా నదిని తనతో కల్పుకొని క్రమ్మివేసింది. 'శోణ' అనే నదం (పడమటికి పారేది) తనలో కలిసినా, తాను (గంగ) సముద్రంలో ప్రవేశించే ముందు 'శోణ'ను కూడా విడిచిపెట్టి, ప్రవహించింది.

ఆ విధంగానే, జ్యోత్స్న ఆకాశం నుంచి పలు దిక్కుల ప్రవహించి ప్రకాశించింది అని వర్ణింపబడింది. 'విష్ణుపదాత్' అనే శ్లేష చేతను 'సూర్యసుతను గ్రసించి' అనే అపహ్నుత్యలంకారం చేతను సంకీర్ణమైన రూపకాలంకారంతో సజ్జితం.

*171.* *ప్రియా ముఖై స్తోయమధు ప్రదిష్టం*
*పీత్వానవం ప్రీత ఇవాంబురాశిః।*
*సమేత్య చంద్రద్యుతి నర్తకీభి*
*స్తరంగితం తాండవ మాతతాన॥* 71

**అర్థం:** అంబురాశిః= సముద్రుడు; ప్రియాముఖైః= ప్రియురాండ్రైన నదీ ముఖాల చేత/ ప్రవాహాలచేత; ప్రదిష్టం= ఇవ్వబడిన; నవం= క్రొత్తదైన; తోయ మధు= నీరు అనే మద్యాన్ని; పీత్వా= త్రాగి; ప్రీతః, ఇవ= ఆనందించిన వాడు వలె; చంద్ర ద్యుతి నర్తకీభిః= చంద్రకాంతులు అనే నాట్యకత్తెలచేత; సమేత్య= కూడుకొని; తరంగితం= అలలతో వృద్ధిని పొందిన; తాండవం= ఉద్ధతమైన నాట్యాన్ని; ఆతతాన= విస్తరింపజేసెను.

**తా॥** సముద్రునికి నదులు ప్రియురాండ్రు. సముద్రుడు శృంగార నాయకుడు. నదులు ప్రేమచేత ఇచ్చిన క్రొత్త నీరు అనే కల్లును త్రాగి ఆనందమయుడయ్యాడు. కాబట్టి (వెన్నెల) చంద్రకాంతులు అనే నాట్యకత్తెలతో కూడి కెరటాలు ఎగసిపడుతుండే ఉద్ధతమైన (తాండవ) నాట్యాన్ని బాగా విస్తరింప జేశాడు.

వెన్నెల అన్నిదెసలా వ్యాపించగా సముద్ర తరంగాలు ఉవ్వెత్తుగా ఎగసిపడే నైసర్గిక విషయం సరసాలంకారంగా సుశ్లోకితం.

ఇందు, నదులు ప్రియురాండ్రనడం అధ్యవసాయ రూపాతిశయోక్తి. "ముఖం నిస్సరణే వక్త్రే"- (విశ్వని). ముఖశబ్ద శ్లేషచేత, ప్రవాహాలకు- ముఖాలకు అభేదమైన అధ్యవసాయ రూప అతిశయోక్త్యలంకారం వర్ణితం.

'తోయమధు, చంద్రద్యుతి నర్తకీభిః' అనే రూపకాలచేత 'అంబురాశి'కి శృంగార నాయకత్వ రూపణం గమ్యమైనందువల్ల ఏకదేశ వర్తి రూపకాలంకారం. 'పీత్వా' అని నదీ జలప్రవేశమందు సముద్రుని పానత్వం అధ్యవసాయ రూపాతిశయోక్తి. 'ప్రీత ఇవ' అనడం కావ్యలింగం, హేతూత్ప్రేక్షాలంకారమూను.

'తాండవం' అని సంక్షోభమందు తాండవత్వం అధ్యవసాయ రూపాతిశయోక్త్య లంకారం. ముఖ్యంగా సంకరాలంకృత శ్లోకమిది.

*172. కళంక చిత్రీకృత మిందు ఖండం*
*తమః సమాధ్యాసిత సత్త్వకల్పమ్।*
*అశుష్క శైవాలమివా బభాసే*
*సిద్ధాపగా సైకత మర్ధదృశ్యమ్॥ 72*

**అర్థం:** కళంక చిత్రీకృతం= కళంకంచేత చిత్రీకరింపబడిన; తమః సమాధ్యాసిత సత్త్వకల్పమ్= తమస్సుతో సమానంగా ఉన్న సత్త్వసదృశమైన; ఇందు ఖండం= అర్ధచంద్రబింబం; అశుష్కశైవాలం= పచ్చని నాచుకలిగిన; అర్ధదృశ్యం= సగమున్న భాగమందు కనబడుతున్న; సిద్ధ+ఆపగా, సైకతం= ఆకాశ గంగయొక్క ఇసుకదిన్నె; ఇవ= వలె; ఆబభాసే= ప్రకాశించెను.

**తా॥** అష్టమినాటి అర్ధచంద్రబింబం వర్ణితం.

సగం చీకటి, సగం వెలుగు ఉన్న బింబం కదా! తమోగుణంలోనే ఉన్న సత్త్వగుణం లాగా కనబడుతున్న అర్ధబింబం కళంకంతోనే చిత్రీకరింపబడింది.

'చిత్రీకృతం' అనే పదం మొదట చిత్రీకరింపబడని వస్తువు ఇప్పుడు చిత్రీకరింపబడింది అనే అర్థాన్ని తెల్పుతుంది. అచిత్రం చిత్రంగా కృతమైనందువల్ల 'చిత్రీకృతం' అని 'త్ర'కు గుడిదీర్ఘం (త్రీ) ('చ్విప్రత్యయం' అంటారు) చేరుతుంది. (ఇలాగే 'సంఘీభూతం, గుణీభూతం, విశదీకృతం). చంద్రుని కళంకం పూర్వం ఉదయరాగంచే తిరస్కరింపబడి అచిత్రంగా ఉండింది. క్రమంగా అది స్ఫుటంగా కనబడుతున్నది. కాబట్టి 'చిత్రీకృతం' అనబడింది. బింబమందు సగం నలుపు, సగం తెలుపు ఉన్నందువల్ల ఇందు ఖండం 'కళంక చిత్రీకృతం' అని విశేషణ పదంగా ప్రయోగింపబడింది.

ఈ కళంకం పచ్చి (ఎండిపోని) నాచుగా చెప్పబడింది. ఆకాశగంగ యందలి ఇసుక తిన్నె తెల్లగా ఉంటుంది. దేవయోనులైన సిద్ధులు ఆకాశంలో సంచరిస్తారు కాబట్టి, అచ్చటి నది 'సిద్ధాపగ' అని పేర్కొనబడింది. అయితే, ఈ ఇందుఖండం పచ్చినాచు కలిగియున్న ఆకాశగంగా పులిన ప్రదేశంలాగా కనబడుతూ ప్రకాశిస్తున్నదని ఉత్ప్రేక్షింపబడింది. ఈ ఉత్ప్రేక్షాలంకారం 'తమస్సమాధ్యాసిత సత్త్వ కల్పం' అనే ఉపమాలంకారంతో భాసిస్తున్నందువల్ల 'సంసృష్టి' అలంకారం సుశ్లోకితం.

*173. స్వమధ్య సంపన్న విశుద్ధ ధామా*
*శ్యామాచసా దేవక నందనీచ।*
*తమః క్షిపంత్యౌ జగతాం త్రయాణా*
*మన్యోన్య సంవాద మివాన్వ భూతామ్॥* 73

**అర్థం:** స్వమధ్య సంపన్న విశుద్ధధామా= తన అర్ధరాత్రి యందు సంపన్నమైన శుభ్రమైన కాంతి (వెన్నెల) కలిగిన; శ్యామా= రాత్రి (నిశ); స్వ= తనయొక్క; మధ్య= నడుమునందు; సంపన్న= హేయ గుణాలు లేని; విశుద్ధ ధామా= పరంజ్యోతిని కలిగియున్న; సా= ఆ; దేవకనందనీ, చ= దేవకుని పుత్రికయైన దేవకి కూడా; త్రయాణాం= మూడు; జగతాం= లోకాలయొక్క; తమః= చీకటిని/ శోకాన్ని; క్షిపంత్యౌ= తొలగిస్తూ; అన్యోన్య సంవాదం= పరస్పరంగా ఐకమత్యాన్ని; అన్వభూతాం, ఇవ= అనుభవించాయన్నట్లున్నాయి.

**తా॥** రాత్రి, దేవకీదేవి కూడా ఒకరు మరొకరితో సమాన ధర్మాన్ని ఆచరించే అనుభవం కలిగియున్నారని ఉత్ప్రేక్షితం.

'మధ్యం' శబ్దానికి 'నడుమ, నడుము' అని రెండర్థాలు. రాత్రియందు, దేవకీదేవి యందు కర్మబోధకమైన ధర్మవిషయంలో ఐక్యమున్నది. ఈ ధర్మైక్యం ప్రసిద్ధమైనది కాదు, కాబట్టి, ఉపమాలంకారం కాదు, కేవలం ఉత్ప్రేక్షయే అని

వివక్షితం. 'తమః' అంటే చీకటి, శోకమని అర్థాలు. 'నిశ' యొక్క నడిరేయి శుభ్రమైన చంద్రకాంతి (వెన్నెల)తో ప్రకాశిస్తున్నందువల్ల మూడు లోకాల చీకటి తొలగిపోతున్నది. దేవకుని కూతురైన దేవకీదేవి యొక్క నడుము (గర్భం) కల్యాణ గుణసంపన్నమైన పరంజ్యోతితో ప్రకాశిస్తున్నందువల్ల ముజ్జగాల శోకం తొలగి పోతున్నది.

ఈ రెండింటి యొక్క సంవాదానుభవ లక్షణం ఒకే క్రియతో అన్వయిస్తున్నందువల్ల తుల్యయోగితాలంకారం. ఈ క్రియాన్వయం శ్లేషతో అనుప్రాణితమై, సంభావింపబడినందున ఉత్ప్రేక్షాలంకారం. ఇట్లు సంకరాలంకృత శ్లోకమిది.

*174.* *శాఖావకాశేషు కృత ప్రకాశై*
*శ్చంద్రాతపై రాశ్రిత చారకృత్యైః*
*హతావశిష్టాని తమాంసి హంతుం*
*స్థానం తదాక్రాంత మమృగ్య తేవ॥* 74

**అర్థం:** శాఖా+అవకాశేషు= చెట్లకొమ్మల సందులయందు; కృత ప్రకాశైః= చేరిన వెలుగులు గల; చంద్ర+ఆతపైః= వెన్నెలలచేత; ఆశ్రితచార కృత్యైః= (వచ్చిన) ఆశ్రయించిన గూఢచారుల చేష్టలచేత; హత+అవశిష్టాని= చంద్రునిచేత నశింప (జేయు)బడిన చీకట్లలో మిగిలినట్టి; తమాంసి= చీకట్లను; హంతుం= నశింపజేయడానికి; తత్+ఆక్రాంతం= ఆ చీకట్లచే ఆక్రమింపబడిన; స్థానం= ఆ చెట్ల మూల రూపమైన ప్రదేశం; అమృగ్యత, ఇవ= వెదుకబడినదో అన్నట్లు ఉన్నది.

**తా॥** చంద్రుని వెలుగులు చెట్లకొమ్మల సందుల్లో ప్రకాశిస్తున్నాయి. చంద్రుని చంద్రికల (వెన్నెల)చేత చీకట్లు నశింపబడగా మిగిలిన చీకట్లను నాశనం చేయడానికి, మిగిలిన చీకట్లచే ఆక్రమింపబడిన స్థానాన్ని, పగవారున్నచోటును వెదకి, వెదకి హతమార్చడానికి వచ్చి చేరిన గూఢాచారుల చేష్టలలాగా, చెట్ల

మూల ప్రదేశాన్ని వెదకి అక్కడక్కడున్న శత్రువులైన చీకట్లను నశింపజేయడానికి చంద్రుని వెలుగులు చెట్లకొమ్మల మధ్యలో చేరి వెదకుతున్నట్లున్నాయి.

ఇందు 'ఆతప' శబ్దానికి ప్రకాశం అని అర్థం. 'చంద్రుని ఆతపం' అంటే వెన్నెలయే కదా! "ప్రకాశోద్యోత ఆతపః" (అమరం).

గూఢచారుల కృత్యంలాగా చెట్ల కొమ్మల సందుల్లో చేరిన చంద్రుని వెలుగులు శత్రుస్థానాన్ని వెదకడం స్వరూపోత్ప్రేక్షాలంకారం.

చంద్రాతపం మిగిలిన శత్రువులైన తమస్సులను- చీకట్లను (హంతుం) నశింపజేయడానికి చెట్ల కొమ్మల్లో చేరడమనేది ఫలోత్ప్రేక్షాలంకారం.

*175. పరాకృతధ్వాంత నికాయ పంకైః*
*పర్యాప్త తారాగణ ఫేన పుంజైః।*
*అశోభత ద్యౌరసమాయుధస్య*
*యశః ప్రవాహైరివ చంద్రపాదైః॥* 75

**అర్థం:** ద్యౌః= అంతరిక్షం, (ఆకాశం). పరాకృత ధ్వాంత నికాయ పంకైః= తొలగింపబడిన చీకటి గుంపు బురదగల; పర్యాప్త తారాగణ ఫేన పుంజైః= నిండుగానున్న చుక్కల గుంపు అనే నురుగుల గుంపులు గల; చంద్ర పాదైః= చంద్రుని కిరణాలచేత; అసమ+ఆయుధస్య= బేసి సంఖ్యలోనున్న ఆయుధాలుగల మన్మథుని యొక్క; యశః ప్రవాహైః, ఇవ= కీర్తి ప్రవాహాలతో వలె; అశోభత= శోభించెను.

**తా॥** చంద్రకిరణాలచేత బురద పూసినట్లున్న చీకట్లు తొలగిపోయినందు వల్ల నీలాకాశం తెల్లగా శోభించింది. ఇప్పుడు తెల్లని వెలుగులతోనున్న ఆకాశం పంచశరుడైన మన్మథుని కీర్తి ప్రవాహాలో అన్నట్లు ప్రకాశించింది. ఈ నల్లని చీకట్లు దూరంగా తొలగియున్నచోట అక్కడ ప్రకాశించే చుక్కల సమూహం మొత్తం ప్రవాహంలో ఉబికివచ్చే నురుగుల గుంపులో అన్నట్లు ఆకాశమంతా

ధవళంగా శోభించినట్లు, అది విషమ బాణుడైన కాముని కీర్తి ప్రవాహమో అన్నట్లు- ప్రేమ వ్యాపించినట్లు- ప్రకాశించిందని వర్ణితం.

రూపకాలంకారంతో సంకీర్ణమైన ఉత్ప్రేక్షాలంకారం.

*176. దదానయా దిక్సరితాం ప్రసాదం*
*ప్రసక్త హంసాగమయా స్వకాంత్యా।*
*అపాకృతధ్వాంత ఘనప్రవృత్త్యా*
*శరత్త్విషా చంద్రికయా చకాశే॥ 76*

**అర్థం:** దిక్‌సరితాం= దిక్కులకు, నదులకు; ప్రసాదం= నైర్మల్యాన్ని, (స్వచ్ఛతను); దదానయా= ఇస్తున్నట్టి; స్వకాంత్యా= తన కాంతి కలిగినట్టి; ప్రసక్త హంస+ ఆగమయా= రాబోయే భగవానుని అవతారాన్ని సూచిస్తున్నట్టి, (శరదృతు పక్షమ్మందు) హంసల రాకడను తెల్పునట్టి; అపాకృత ధ్వాంత ఘన ప్రవృత్త్యా= తొలగింపబడిన నీలవర్ణంగల మేఘాల (వలె) స్వభావం కలిగినట్టి; శరత్ త్విషా= శరత్కాల మందలి కాంతివంటి కాంతి కలిగినట్టి; చంద్రికయా= వెన్నెల చేత; చకాశే= ఆకాశం (రాత్రిపూట) ప్రకాశించెను.

**తా॥** నీలాకాశం శరత్కాలమే వచ్చినట్లు శోభించిందని వర్ణితం.

శరత్కాలం నదులను- జలప్రవాహాలను నిర్మలంగా, స్వచ్ఛంగా ఉండునట్లు చేస్తుంది. వర్షాకాలం పోగానే హంసల గుంపు తిరిగి వచ్చి సంచరించడానికి అనుకూలంగా ఉంటుంది. నల్లని మేఘాలు సంచరించకుండా చేస్తుంది కాబట్టి దిక్కులన్నీ తెల్లగా శోభిల్లునట్లు చేస్తుంది.

హంస శబ్దానికి భగవానుడు అనే అర్థం. నీలాకాశం భగవానుని శ్రీకృష్ణుని అవతారాన్ని సూచిస్తూ అవతారానికి కారణమవుతూనే శరత్కాల మందలి శోభతో సమానమైన శోభగల చంద్రిక- వెన్నెలతో ప్రకాశించే లాగా ఒప్పియుండెను అని (రాత్రి) వర్ణింపబడుతున్నది. ఉపమాలంకారం. తాత్పర్యం సుస్పష్టం.

177. కళావతా కామవిహార నాట్యే
కాలోచితం కల్పయతేవ నర్మ।
అమోఘమాయా పలితం కరణ్యాః
ప్రాయో దిశాం దీధితయః ప్రయుక్తాః॥ 77

**అర్థం:** కళావతా= చంద్రుడు అనే నాట్యకళ తెలిసిన సూత్రధారునిచేత; కామవిహార నాట్యే= (యువతీ యువకుల) మన్మథ విహారమనే నాట్యమందు; కాల+ఉచితం= సమయోచితమైన; నర్మ= హాస్యరసాన్ని; కల్పయతా, ఇవ= కల్పించబడుటచేతనో అన్నట్లు; దిశాం= దిక్కులు అనే స్త్రీలకు; అమోఘమాయా పలితం కరణ్యాః= నాశనం లేని మాయచేత నెరసిన కురులుగా చేయబడినట్టి; దీధితయః = చంద్రకిరణ కాంతులు; ప్రాయః= తరచుగా; ప్రయుక్తాః= ప్రయోగింపబడినాయి.

**తా॥** కళావంతుడు చంద్రుడు. అతడు నాట్యశిల్పకళ నెఱిగిన నటుడు. యువతీ యువకుల విహారమే కామవిహారం. మన్మథ విహారమనే నాట్యమందు చంద్రుడనే సూత్రధారుడు సమయోచితంగా హాస్యరసాన్ని కల్పిస్తున్నాడన్నట్లు దిక్కుల యందు చంద్రకిరణాలు ప్రసరిస్తున్నాయి. నవ్వు తెల్లగా ఉంటుంది కదా! హాస్యం మనస్సును ఉల్లసింపజేస్తుంది.

"కాలే శిల్పే విత్త వృద్ధౌ చంద్రాంశే కలనే కళా" (యాదవ నిఘంటువు). మాయ అమోఘమైనది. ప్రకృతి పరిణామశీలమైనది. మారుతుంటుంది. కాబట్టి మాయ నశించనిది. ఊహించరాని విధంగా తాను మారుతూ, చరాచర పదార్థాలకు మార్పును కలిగిస్తుంది. అది అమోఘం. అమోఘమాయా పలితం కరణ్యాః దీధితయః– 'పలితం' అంటే ముసలితనంచేత తలవెంట్రుకలు తెల్లనివైయుండడం. అమోఘమైన మాయచేత తెల్లగాలేని శిరోజాలు తెల్లగా జేయబడి విరబోస్తున్నట్లున్నాయి చంద్ర కిరణాలు. పలిత శబ్దానికి నానార్థాలున్నాయి. "పలితం జరసాశౌక్ల్యమ్"–

*"సుఖం దుఃఖం మలంఛిద్రం కీలాసం సిధ్మలాలసః*
*రభసః పలితం చిత్రం తద్వతి త్రిషుధర్మిణి॥"* (యాదవ నిఘంటువు)

*"తద్వతి త్రిషుధర్మిణి"* అని అనడంవల్ల 'ఆ ధర్మం కలిగిన వస్తువునందు' అనే అర్థమూ ఉన్నది. కాబట్టి (*"పలితం కరణ్యాః= పలితాః"*) దిక్కులు అనే స్త్రీల శిరోజాలు తెల్లగా నైనవి అని అర్థం.

ప్రకాశించే దిక్కులు అనే కాంతుల వన్నెలు మారిపోయి, శరీర వర్ణమే వేరైనదన్నట్లు తోస్తుందని అర్థం.

దిక్కాంతల తలలు ముగ్గుబుట్టలగునట్లు చంద్రకిరణాల కాంతులు బాహుళ్యంగా వెల్లివిరిసినాయని సారార్థం.

ఇందు, 'కళావతా' అన్నచోట శ్లేషాలంకారం. 'కల్పయతేవ' అన్నచోట స్వరూపోత్ప్రేక్షాలంకారం. 'కామ విహార నాట్యం' అనేది రూపకాలంకారం. దిక్కులకు చంద్రకిరణ ధావళ్య మనే ముసుగు వేసి మాయా పలితమనే తాదాత్మ్యంతో నిగరణ చేసినందువల్ల అధ్యవసాన రూపాతిశయోక్త్యలంకారం. ఇట్లు సంకరాలంకృత శ్లోకమిది.

*178. కదంబ మాలాభి రధీత లాస్యః*
*కల్యాణ సంభూతి రభూత్ ప్రజానామ్।*
*ప్రియోదయస్ఫీత రుచో రజన్యాః*
*సంతోష నిఃశ్వాస నిభః సమీరః॥* 78

**అర్థం:** కదంబ మాలాభిః= కడప చెట్ల సమూహాలచేత; అధీత లాస్యః= నేర్చుకొనబడిన నాట్యం కలిగినట్టి; ప్రజానాం= జనులకు; కల్యాణ సంభూతిః= ఆనందాన్ని ఉదయింపజేయునట్టి; ప్రియ+ఉదయ, స్ఫీత రుచః= ప్రియుడైన చంద్రుని యొక్క ఉదయంచేత వృద్ధిచెందిన (ముఖ) కాంతి కలిగిన; రజన్యాః= రాత్రి (అనే ప్రియురాలి) యొక్క; సంతోష నిఃశ్వాస నిభః= సంతోషం వల్ల కలిగిన నిట్టూర్పు వలె ఉన్నట్టి; సమీరః= గాలి; అభూత్= ఉండెను.

**తా॥** కదంబతరులకు లాస్యం నేర్పునట్టి, ప్రజలకు ఆనందాన్ని జనింపజేయునట్టి, ప్రియుడైన చంద్రుని అభ్యుదయం చేత కాంతి పెరిగిన రాత్రి, సంతోషంతో నిట్టూర్పు విడిచినట్లుగా, గాలి వీచిందని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** శ్రీకృష్ణావతార కాలాన వాయువు పుణ్యగంధవహమై సుఖస్పర్శగా వీచిందని వర్ణితం.

వాయువు నాట్యాధ్యాపకుడు. వరుసగా ఉన్న కదంబ వృక్షాలకు లాస్యం నేర్పుతున్నాడు. దీనివల్ల మందమందంగానూ, సువాసనతోనూ, చంద్రికా సంపర్కం వల్ల చల్లగానూ వీచుతున్నట్లు గోచరిస్తున్నది. ప్రజలకు సుఖస్పర్శను కలిగిస్తూ మంగళకరంగానూ, ఆనంద జనకంగానూ గాలి ప్రసరిస్తున్నది.

చంద్రుడు నిశాపతి కాబట్టి, పతి యొక్క అభ్యుదయాన్ని జూచి, సతియైన రాత్రికి ముఖకాంతి పెరిగింది. తత్ఫలితంగా రాత్రి అధికానందంతో నిట్టూర్చినట్లు గాలి సంచరిస్తున్నదని వర్ణింపబడింది.

ఇందు 'లాస్యం నేర్పిన వాయువు' అనడంవల్ల 'గాలికి చెట్ల కదలిక' అనే మాటను కప్పి పుచ్చినట్లయింది. కాబట్టి అతిశయోక్త్యలంకారమిది. కల్యాణ మనే సంభూతి- ప్రజలకు కల్యాణ సంభూతి యెట్లు కలుగునో అట్లు వీచిందనడం వల్ల సమాసోక్త్యలంకారం.

'సంతోష నిఃశ్వాసనిభః' అన్నచోట ఉపమోపక్రమోత్ప్రేక్షాలంకారం. ఈ అలంకారాలు పరస్పరంగా అనుప్రాణితమైనందున, సంకరాలంకారం.

*179. ప్రాయేణ హంసై రవధూతసంగా*
*చారుస్మితా సంభృత భృంగనాదా।*
*సర్వోపభోగ్యే సమయే ప్రసుప్తం*
*కుముద్వతీ కోకనదం జహాస॥* 79

**అర్థం:** హంసైః= హంసలచేత; అవధూతసంగా= వదలిన సహవాసం కలిగినట్టి; చారుస్మితా= అందమైన (నవ్వు) వికాసం కలిగినట్టి; సంభృత భృంగ నాదా= సంపాదింపబడిన తుమ్మెదల మ్రోత కలిగినట్టి; కుముద్వతీ= కలువతీగ; సర్వ+ఉపభోగ్యే= అందరికి అనుభవింపదగినట్టి; సమయే= (అర్ధరాత్రి) కాలమందు; ప్రసుప్తం= నిద్రించినట్టి/ ముడుచుకొనియున్న; కోకనదం= తామరకమలాన్ని; ప్రాయేణ= బహుశః; జహాస= పరిహసించెను.

**తా॥** కుముద్వతికి హంసలతో సహవాసం ఉండదు. రమ్యంగా (కలువలతో) వికసించి యుంటుంది. కలువపూల చుట్టూ తుమ్మెదలు చేరి మ్రోగుతుంటాయి. అందరికీ సుఖింపదగిన రాత్రి సమయాన ముడుచుకొని యున్న తామరను జూచి కుముద్వతి పరిహసిస్తున్నట్లున్నదని తాత్పర్యం.

**వ్యాఖ్య:**– కుముద్వతి తామరకమలాన్ని పరహసించిందని వర్ణితం.

సూర్యకిరణాలచేత సరస్సులో కమలాలు దినమంతా వికసించి యుంటాయి. సూర్యుడు క్రుంకి యున్నప్పుడు కమలాలు ముడుచుకొని యుంటాయి.

చంద్రకిరణాలచేత కలువలు కొలనులో వికసిస్తాయి. 'కుముద్వతి' అంటే సూర్యుడు క్రుంకి యున్నప్పుడు కమలాలు ముడుచుకొని యుంటాయి.

చంద్రకిరణాలచేత కలువలు కొలనులో వికసిస్తాయి. 'కుముద్వతి' అంటే కుముదాలు–కలువపూలు గల తీగ, కలువపూవులున్న జలాశయమని కూడా అర్థం. 'కుముద్వతి' శబ్దం స్త్రీ లింగం. 'కోకనదం'– తామరపూవు అని అర్థం. ఇది పుంలింగం. కుముద్వతి ఒక వేశ్యతో సమానంగా వర్ణింపబడింది.

హంసై రవధూతసంగా– హంసలు కమలాలున్న కొలనులోనే ఆనందంగా సంచరిస్తాయి. కలువలున్న కొలనులో సంచరించవు. కాబట్టి కుముద్వతికి హంసల సహవాసం ఉండదు. హంసలు కుముద్వతితో ఎప్పుడు కలిసి ఉండవు– అని అర్థం. 'హంస' శబ్దానికి సన్న్యాసులని కూడా (వీతరాగులు) అర్థం.

*"హంసో విహంగ భేదేస్యాత్ అర్కే విష్ణౌ హయాంతరే।*
*యోగి మంత్రాత్మ భేదేషు పరమాత్మని మత్సరే॥"* (విశ్వ నిఘంటువు)

విరక్తులైన యోగులకు వనితా సుఖభోగాలు ఉండవు కదా! చారుస్మితా- తెల్లని కలువలున్న తీగ- కుముద్వతి వెన్నెలకు బాగా వికసించి శోభిస్తున్నందువల్ల బాగా నవ్వుతున్నట్లు ఉత్ప్రేక్షింపబడింధి.

*సంభృత భృంగనాదా:-* కలువలున్నచోట తుమ్మెదలు ఝుమ్మని నాదం చేస్తుంటాయి కాబట్టి, కుముద్వతితో ఉల్లాసంగా- హాస్య రసానుభవంతో మెల్లగుతుంటాయి. 'భృంగ' శబ్దానికి విటుడు అనే అర్థమూ ఉంది.

*"అళి చాతకయోర్భృంగః షిడ్గ ధూమ్యాట యోరపి"-* (నా. రత్నమాల) వేశ్య నవ్వుతున్నప్పుడు ఆమెతో కూడియున్న విటుడు కూడా ఏదో గొణుగుతూ నవ్వుతుంటాడు.

*సర్వోప భోగ్యే సమయే ప్రసుప్తం కోకనదం ప్రాయేణ జహాస:-* రాత్రి సుఖాన్ని అనుభవించడానికి అనుకూలమైనది. అందువల్ల, కుముద్వతి "భోగానుభవయోగ్యమైన నడురేయి సమయాన వీతరాగులైన పరమ హంసల సహవాసం చేస్తూ, తత్ఫలితంగా స్త్రీలతో భోగానుభవజ్ఞానం లేకుండా ముడుచుకొని పడుకొని యుండడం నీకు తగునా?" అని కోకనదాన్ని, జనాన్ని పరిహసిస్తున్నట్లున్నది (రాత్రి వర్ణన).

కుముద్వతి వేశ్యగా ప్రతీయమాన మవడంవల్ల సమాసోక్త్యలంకారం. దీధితి ధావళ్యం హాసత్వంగా ఉత్ప్రేక్షింపబడింది.

*180. కళంక లక్షేణ సమైక్షి కాచిత్*
*కస్తూరికా పత్ర విశేషకాంతిః।*
*సుధాంశు బింబ వ్యపదేశ దృశ్యే*
*ముగ్ధే రజన్యా ముఖపుండరీకే॥* 80

**అర్థం:** సుధాంశు బింబ వ్యపదేశ దృశ్యే= చంద్రమండలమనే వ్యాజంచేత చూడదగినట్టి; ముగ్ధే= సుందరమైన; రజన్యాః= రాత్రియొక్క; ముఖపుండరీకే= తెల్లని కమలం వంటి ముఖమందు; కళంక లక్ష్మేణ= కళంకమనే నెపంతో; కాచిత్= ఒకానొక విధమైన; కస్తూరికా పత్ర విశేషకాంతిః= కస్తూరిచే చిత్రింపబడిన చిత్రక- తిలక శోభ; సమైక్షి= చూడబడెను.

**తా॥** చంద్రుని బింబం-మూర్తి- (పూర్ణబింబం కాదు) తెల్ల తామరలాగా శోభిస్తున్నది. ఆ మూర్తి యందు కళంకం నల్లని మచ్చ యున్నది. రాత్రి యనే పడతి యొక్క తెల్లని అందమైన ముఖమందు కళంకం అనేది కస్తూరిచే చిత్రితమైన ఒక విధమైన తిలకశోభగా కనబడింది. చంద్రబింబమనే వ్యాజంతో రాత్రి అనే పడతి ముఖం తెల్లగా ఉన్నదని చెప్పబడింది. ఆ విధంగానే కళంకమనే వ్యాజంతో కస్తూరి తిలకంగా వర్ణింపబడింది. ఈ రెండు చోట్లనూ అపహ్నుత్యలంకారం. రజని- రాత్రి ఒక నాయికగా వర్ణితమైనందున సమాసోక్త్యలంకారం. ఈ మూడు అలంకారాలు పరస్పరం అనుప్రాణితాలు కాబట్టి సంకరాలంకారం.

'ముఖపుండరీక'మనే చోట ఉపమాలంకారం యొక్క సంసృష్టి. (ఈ రెండవ సర్గలోనే 61 శ్లోకమందు రెండు రంగులను కలిపి చిత్రించిన తిలకంగా వర్ణితం. ఇక్కడ కళంకాన్ని కస్తూరిచే ఒక విధంగా చిత్రించిన తిలకంగా వర్ణించడం విశేషం. ఇదొక శోభగల రాత్రి వర్ణితం.)

*181.* *తలేష్వ వేపంత మహీ రుహాణాం*
*ఛాయాస్తదా మారుత కంపితానామ్।*
*శశాంక సింహేన తమోగజానాం*
*లూనా కృతీనా మివ గాత్ర ఖండాః॥* 81

**అర్థం:** తదా= అప్పుడు; మారుత కంపితానాం= గాలిచే చలింపబడిన; మహీరుహాణాం= చెట్లయొక్క; తలేషు= అధః= ప్రదేశమందలి; ఛాయాః= నీడలు;

శశాంక సింహేన= చంద్రుడు అనే సింహంచేత; లూన+ఆకృతీనాం= ఛేదింపబడిన ఆకారాలుగల; తమస్+గజానాం= చీకట్లు అనే ఏనుగుల యొక్క గాత్ర ఖండాః, ఇవ= దేహాల ఖండాలో అన్నట్లు; అవేపంత= కంపించినవి.

**తా॥** చంద్రకాంతిచేత చెట్లనీడలు నేలమీద వ్యాపించి ఉన్నాయి. గాలిచేత చెట్లు కదలినప్పుడు చెట్లకింద నీడలు కూడా కదలుతున్నాయి. చంద్రుడు అనే సింహం చీకట్లు అనే ఏనుగుల శరీరాలను చీల్చివేయగా, ఆ గజాల శరీరఖండాలు క్షణకాలం కంపిస్తున్నవన్నట్లు వృక్షచ్ఛాయలు విడివిడిగా కంపించే వర్ణన ఇది. రూపకాలంకారంతో సంకీర్ణమైన ఉత్ప్రేక్షాలంకారం.

*182. తమస్తరంగా నవసాదయంత్యా*
*సమేయుషీ చంద్రికయా మహత్యా।*
*శ్యామా బభౌ సాంద్రనవోత్పలశ్రీః*
*సురస్రవంత్యేవ కళిందకన్యా॥* 82

**అర్థం:** తమస్+తరంగాన్= కెరటాల వంటి చీకట్లను; అవసాదయన్త్యా= తొలగించే; చంద్రికయా= వెన్నెలతో; సమేయుషీ= సంగమించిన; సాంద్ర నవోత్పలశ్రీః = దట్టమైన కువలయ శోభగల; శ్యామా= (నల్లని) రాత్రి; మహత్యా (అత ఏవ)= గొప్పదైనందుననే; సురస్రవంత్యా= గంగానదితో; కళిందకన్యా, ఇవ= యమునా నదివలె; బభౌ= ప్రకాశించెను.

**తా॥** అలలవంటి చీకట్లను అణచివేసే వెన్నెలతో కలిసిన రాత్రి దట్టనైన తెల్ల కలువ (కైరవ) శోభతో ప్రకాశించింది. దీనికి ఉపమానం యమునా నది అని వర్ణితం.

గంగానది తెల్లని గొప్పతరంగాలతో ప్రవహిస్తుంది. యమునానది నల్ల కలువ శోభవంటి తరంగాలతో ప్రవహిస్తుంది. కాబట్టి, యమునానది తన జలతరంగాల నైల్యాన్ని అణచివేసే గంగానదితో కలిసి నవోత్పల శోభతో

ప్రకాశించింది. యమునానది గంగానదితో సంగమించి తన తరంగాల నైల్యాన్ని తొలగించుకొని తెల్లకలువల శోభతో ప్రకాశించినట్లే రాత్రి వెన్నెలతో కలిసి తరంగాల వంటి చీకటిని తొలగించుకొని తెల్లగా ప్రకాశించింది.

*"స్యాదుత్పలం కువలయ మథనీలాంబుజన్మచ।*
*ఇందీవరంచ నీలేఽస్మిన్ సితే కుముదకైరవే॥"* (అమరం)

ఉపమాలంకారం.

*183. స్వవిప్రయోగ వ్యసనాన్ని పీతం*
*భృంగాపదేశేన కుముద్వతీభిః।*
*సుధాభిరాప్లావ్య కరస్థితాభిః*
*ప్రచ్యావ్యయామాస విషం సుధాంశుః॥* 83

**అర్థం:** సుధాంశుః= అమృత కిరణుడైన చంద్రుడు; కుముద్వతీభిః= కలువతీగల చేత; స్వవిప్రయోగ వ్యసనాత్= తన యెడబాటు వలని దుఃఖంవల్ల; భృంగ+అపదేశేన= తుమ్మెదల నెపంచేత; నిపీత= త్రాగబడిన; విషం= విషాన్ని; కరస్థితాభిః= కిరణం అనే చేతి యందున్న; సుధాభిః= అమృతం (పుజల్లుల)తో; ఆప్లావ్య= తడిపి; ప్రచ్యావ్యయా మాస= తొలగించెను.

**తా॥** కుముద్వతులకు (కలువ తీగెలకు) చంద్రుడు భర్త. చంద్రుని యెడబాటును సహించలేక దుఃఖపడుతూ విషాన్ని త్రాగినాయని వర్ణితం.

'భృంగాపదేశం' అంటే కలువలు విసించియున్నప్పుడు తుమ్మెదలు కలువల లోపల ప్రవేశించడం, పగలు చంద్రుడు కనబడనందువల్ల- భర్త వియోగం వల్ల కలువలు ఎడబాటు సహించలేకపోవడమే- కలువలు ముడుచుకొని యుండడం వల్ల నల్లని తుమ్మెదలు లోపల ఉండడమే విషం త్రాగినట్లు వర్ణింపబడింది. 'కర' శబ్దానికి కిరణమనీ, హస్తమనీ అర్థం. శ్లిష్టపదమిది.

చంద్రుడు తన కిరణమనే చేతియందున్న అమృతాన్ని (ముదుచుకొనియున్న) కలువల మీద కురిపించి విషాన్ని తొలగించాడు. వెన్నెల చేత కలువలు వికసించగానే తుమ్మెదలు బయటకు వెడలిపోయినాయని భావం.

కుముద్వతులకు చంద్రునికి దాంపత్య భావం అనేది సమాసోక్త్యలంకారం. వ్యసనంవల్ల, విషపాన మనేది హేతూత్ప్రేక్షాలంకారం.

'భృంగాపదేశం' చేత అపహ్నుత్యలంకారం మొత్తం సంకరాలంకారం.

*184. చకాశిరే పత్ర కళాసమృద్ధ్యా*
*వ్యోమోపమే వారిణి కైరవాణి।*
*కళంక దృశ్య భ్రమరాణి కాలే*
*స్వనాథ (నాథేన) సాధర్మ్య ముపాగతాని॥ 84*

**అర్థం:** వ్యోమ+ఉపమే= ఆకాశ సదృశమైన; వారిణి= జలమందు; పత్ర, కళా సమృద్ధ్యా= కళలవంటి పూరేకుల సమృద్ధిచేత; కళంక దృశ్య భ్రమరాణి= కళంకం వలె చూడదగిన తుమ్మెద కలిగినట్టి; కైరవాణి= కలువలు; కాలే= రాత్రి సమయాన; స్వనాథ సాధర్మ్యం= తమ నాథుడైన చంద్రునితో సామ్యాన్ని; ఉపాగతాన్ని= పొంది యున్నట్లు ప్రకాశించాయి.

**తా॥** ఆకాశంలాగా సరస్సులోని నీరు స్వచ్ఛంగా ఉన్నది. ఆ నీటి యందున్న కలువపూల రేకులు చంద్రుని కళలను పోలియున్నవి. చంద్రుని కళంకంవలె కలువలలోని తుమ్మెదలున్నాయి. ఈ విధంగా కైరవాలు- తెల్లకలువ పూలు రాత్రిపూట తమ నాథుడైన (ఆకాశాన కళా సమృద్ధి కలిగి, కళంకంతో కూడియున్న) చంద్రునితో సాదృశ్యాన్ని పొందినట్లు ప్రకాశించాయి (ఇది జీవాత్మలకు నాథుడైన నారాయణునితో సామ్యాన్ని పోలియున్నది).

పత్రకళాది ధర్మసాదృశ్యంచేత ఉత్ప్రేక్షితమైనందున ఉపమాసంకీర్ణమైన ఉత్ప్రేక్షాలంకారం.

*185. (సరిన్ముఖై స్తోయ మధు ప్రదిష్టం*
*పీత్వా నవం ప్రీత ఇవాంబురాశిః)*

*సరిన్ముఖోపాహృత మంబురాశిః*
*పీత్వేవ తోయం మధు జాతహర్షః।*
*చకార చంద్ర ప్రతిబింబితానాం*
*కరగ్రహైః కామపి రాసలీలామ్॥* 85

**అర్థం:** సరిత్+ముఖ+ఉపాహృతం= నదుల ద్వారా తేబడిన; తోయం= నీరు అనే; మధు= తేనెను; పీత్వా, ఇవ= త్రాగియో అన్నట్లు; జాతహర్షః= సంతోషం కలవాడైన; అంబురాశిః= సముద్రుడు; చంద్ర ప్రతిబింబితానాం= చంద్రుని ప్రతిచ్ఛాయల యొక్క; కరగ్రహైః= కిరణాలనే చేతులను పట్టుకోవడంచేత; కాం, అపి= విలక్షణమైన (ఆశ్చర్యకరమైన); రాసలీలాం= రాసక్రీడను; చకార= చేసెను.

**తా॥** నదుల నీరు సముద్రంలోనే చేరుతుంది. నదులు ప్రియురాండ్రు. సముద్రుడు నదులకు నాయకుడు. నదుల నీరు తేనెలాగా తియ్యగా ఉంటుంది. సముద్రజలం ఉప్పుగా ఉంటుంది. సముద్రుడు, ప్రియురాండ్రు తమ ముఖాల చేత అందించిన నీరు అనె తేనెను త్రాగియే కాబోలు, అలలతో చెలరేగుతూ ఆనందపడినాడు.

తనయందు చేరిన చంద్రుని ప్రతిచ్ఛాయలు కాంతలు.

*"ప్రతిమానం ప్రతిబింబం ప్రతిమా ప్రతియాతనా ప్రతిచ్ఛాయా"*- (అమరం). చంద్రుని ప్రతిచ్ఛాయల (స్త్రీల) కిరణాలు అనే చేతులను పట్టుకొని సముద్రుడు ఆశ్చర్యకరమైన రాసక్రీడను ఆడినాడు.

(రాబోయే శ్రీకృష్ణుని అవతారమందలి రాసలీల సూచితం).

'కామపి అనడంవల్ల- "నారీ నారీ నడుమ మురారి"- "అంగనామంగనా మంతరే మాధవః"- అన్నట్లు, శ్రీకృష్ణుని పలు మూర్తులవలె మాత్రం ఇందు లేకపోవడం గమనార్హం. ఛాయలు అనేకం. కడలి- సముద్రుడొక్కడే కదా!

నదులకూ, సముద్రునికీ నాయికా నాయక భావ ప్రతీతి చేత సమాసోక్త్యలంకారం. 'కరగ్రహైః' అన్నచోట శ్లేషాలంకారంచేత సముద్ర క్షోభయందు రాసక్రీడత్వాన్ని అధ్యవసింప జేసినందువల్ల అధ్యవసాయ రూపమైన అతిశయోక్త్యలంకారం.

*186. ప్రసాద భాజోరుభయో రభూతా*
*ముభా వనిర్ధార్య మిథో విశేషౌ।*
*నభః స్థలే శీతరుచిః సతారే*
*సకైరవే తత్ప్రతిమాచ తోయే॥* 86

**అర్థం:** సతారే= చుక్కలతో కూడిన; నభఃస్థలే= ఆకాశమందు; శీతరుచిః= చల్లనికాంతిగల చంద్రుడు; సకైరవే= కలువలతో కూడిన; తోయే= సరోవర జలమందు; తత్ ప్రతిమాచ= ఆ చంద్రుని బింబం; ప్రసాద భాజోః= స్వచ్ఛమైన ప్రకాశాన్ని పొందుతున్న; ఉభయోః= రెండింటికి; ఉభౌ= రెండు; అనిర్ధార్య మిథో విశేషౌ= నిర్ధారింపరాని పరస్పర భేదాలు; అభూతాం= ఉన్నాయి.

**తా॥** ఆకాశంలో చుక్కలు చంద్రుడు స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నారు. సరస్సులోని జలమందు కలువలు, చంద్రబింబమూ స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాయి. ఆకాశమందలి శోభ, సరోవర జలశోభ ఒక్క రీతిగా ఉంది. సరస్సు నందున్న శోభ ఆకాశమందున్న ప్రకాశానికి సమానంగా ఉన్నది. కాబట్టి, ఈ రెండింటిలో ఆకాశ సరోవర జలాల్లో ఒక్క ఆకాశంలోని శోభకే ప్రాధాన్యం- శ్రేష్ఠత్వం ఉన్నది అట్టి శ్రేష్ఠమైన శోభ మరొక దానికి సరోవరజలానికి లేదని చెప్పలేము.

నభస్తోయాల యొక్క భేదాన్ని నిర్ధారించే శక్తిలేనందువల్ల తుల్య యోగితాలంకారం. ఆకాశానికీ జలానికీ అన్యోన్య సాదృశ్య రూపమైన ఉపమేయోపమ చెప్పబడింది. ఆ రెండింటికి వేరొక సాదృశ్యం లేదు.

187. నభస్తుషారాంశు మయూఖ యోగాత్
తమిస్రయా మోక్ష మవిందతేవ।
అతృష్యతః (అవిద్యయా) తత్త్వ విదో నిశాయా
మంతర్ముఖం చిత్తమివాత్మయోగాత్॥ 87

**అర్థం:** నభః= ఆకాశం; తుషార+అంశు, మయూఖాత్= శీతల కిరణాలుగల చంద్రుని యొక్క కిరణ సంపర్కంవల్ల; తమిస్రయా= చీకటిచేత (అవిద్య యా, ఇవ= అజ్ఞానంచేతనే); మోక్షం= విముక్తిని; అవిందత= పొందెను; అతృష్యతః= ఆశలేనట్టి; తత్త్వవిదః= తత్త్వజ్ఞానికి; నిశాయాం= రాత్రియందు; అంతర్ముఖం= లోచూపుగల; చిత్తం, ఇవ= మనస్సువలె; ఆత్మయోగాత్= ఆత్మ విషయమైన యోగాభ్యాసం వల్ల; మోక్షం పొందెను.

**తా॥** ఆకాశం చీకటిచేత ఆవరింపబడియున్నది. ఆకాశం చంద్రుని కిరణ కాంతిచేత చీకటినుంచి విముక్తిని పొందింది. చంద్రికవల్ల చీకటి విడిపోయిందని భావం. తృష్ణలేనట్టి – విరక్తి కలిగిన తత్త్వజ్ఞానికి రాత్రిపూట బయటి వస్తువులను చూచే అవకాశం లేనందువల్ల యోగాభ్యాసం వల్ల అతని మనస్సు లోచూపును కలదై మోక్షాన్ని పొందినట్లే, ఆకాశం చీకటినుంచి విముక్తిని పొందింది.

తత్త్వజ్ఞానికి బహిర్వ్యాసంగం లేనందువల్ల అతని మనస్సు యోగాభ్యాసం వల్ల ఆత్మ సాక్షాత్కారాన్ని పొందినట్లే ఆకాశం వెన్నెలవల్ల చీకటి తొలగిపోయి రాత్రిపూట నిర్మలంగా స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నది. రెండు (ఇవ) ఉపమా వాచకాలు ఉన్నాయి. ఉపమాలంకారం.

188. సహోదితా చంద్రమసా బభాసే
జ్యోత్స్నా పయోధే రుపజాతరాగా।
తదాతనే సంజననేఽపి శౌరేః
సహాయినీ సాగర సంభవేవ॥ 88

**అర్థం:** చంద్రమసా, సహ= చంద్రునితో కూడా; పయోధేః= సముద్రం నుంచి; ఉదితా= ఉద్భవించిన; ఉపజాతరాగా= సంజాతమైన, ఉదయరాగం (ఎరుపువన్నె) కలిగిన; జ్యోత్స్నా= వెన్నెల; తదాతనే= అప్పుడే; సంజననే, అపి= అవతరించిననూ; శౌరేః= విష్ణుమూర్తికి; సహాయినీ= సహధర్మచారిణియైన; సాగర సంభవా, ఇవ= సముద్రం నుంచి అవతరించిన లక్ష్మీదేవియో అన్నట్లు; బభాసే= శోభించెను.

**తా॥** చంద్రుడు సముద్రం నుంచి ఉద్భవించాడు. చంద్రునితో కూడి పుట్టిన ఎర్రని కాంతిగల వెన్నెల, చంద్రునితోనే ఉండి, తెల్లని కాంతితో ఆహ్లాదకరంగా లక్ష్మీదేవియో అన్నట్లు ప్రకాశించింది.

లక్ష్మీదేవి సముద్రం నుంచి సంభవించింది. చంద్రునికి సహోదరియే. చంద్రునితోడ పుట్టినప్పటికీ విష్ణుమూర్తికి సహధర్మచారిణియై ఆయన అవతరించినప్పుడల్లా అనురాగం కలిగినదై అవతరించిన లక్ష్మీదేవియో అన్నట్లు వెన్నెల ప్రకాశించింది.

"రాఘవత్వేఽభవ త్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని।
అన్యేషు చావతారేషు విష్ణో రేషా నపాయినీ॥" (వి.పు.)

విష్ణువు శ్రీరాముడుగా అవతరించినప్పుడు లక్ష్మీదేవి సీతమ్మగా అవతరించింది. అట్లే శ్రీకృష్ణావతారమందు రుక్మిణిగా అవతరించి సహధర్మచారిణి యైనది. విష్ణువు ఏ యే అవతారమెత్తినా, లక్ష్మి అతనితో ఎడబాయకుండా అవతరించిందని సుప్రసిద్ధం.

చంద్రునితో కూడా సముద్రం నుంచి పుట్టింది జ్యోత్స్న (వెన్నెల). లక్ష్మీదేవి కూడా సాగరసంభవ. జ్యోత్స్న ఉదయరాగం (ఎరుపు వన్నెకలది). అయినా చంద్రునితో తెల్లని కాంతి కలదై సహచరించింది.

లక్ష్మి అనురాగం కలది. కాబట్టి విష్ణువుకు సహధర్మచారిణిగా అవతరిస్తూ ఉండింది. (సహ, అయతే= సహాయినీ (అయ-గతౌ). 'ఇని' ప్రత్యయం చేరింది- తోడ నడచునది అని అర్థం.)

జ్యోత్స్నకు తాదాత్మ్యం వల్ల స్వరూపోత్ప్రేక్షాలంకారం.

*189. ప్రబుద్ధ తారాకుముదాబ్ధి చంద్రే*
*నిద్రాణ నిఃశేషజనే నిశీథే।*
*స తా దృశో దేవ పతేః ప్రసూతిం*
*పుష్యన్ బభౌ పుణ్యతమో ముహూర్తః॥* 89

**అర్థం:** ప్రబుద్ధ తారా కుముద అబ్ధి, చంద్రే== మేల్కొన్న చుక్కలు, కలువలు, సముద్రాలు, చంద్రుడు కలిగియున్నట్టి; నిద్రాణ నిఃశేషజనే= నిద్రిస్తున్న సమస్త జనులు కలిగినట్టి; నిశీథే= అర్ధరాత్రియందు; సః= ఆ కాలం; తాదృశః= అటువంటివాడే అయిన; దేవపతేః= శ్రీకృష్ణుని యొక్క; ప్రసూతిం= పుట్టుకను- అవతారాన్ని; పుష్యన్= సంపాదిస్తూ; పుణ్యతమః= మిక్కిలి పుణ్యమైన; మహూర్తంగా; బభౌ= భాసించెను.

**తా॥** అర్ధరాత్రియందు నక్షత్రాలు తళతళ మెరుస్తుంటాయి. కలువ పూవులు వికసించి యుంటాయి. సముద్రాలు అలలచే క్షోభను పొందుతుంటాయి. చంద్రుడు ఆహ్లాదంగా వెలుగుతుంటాడు. ఇవన్నీ జాగరణ చేస్తున్న ఆ సమయాననే సమస్త జనులు నిద్రపోతుంటారు.

(సః, తాదృశః). ఆ కాలమే అటువంటిది. ('తాదృక్' శబ్దం యొక్క షష్ఠీ విభక్తి, ఏకవచనం. కాబట్టి, 'దేవపతేః' అనే శబ్దానికి విశేషణమవుతుంది). ఆ

సమయం అటువంటి శ్రీకృష్ణుని అవతారాన్ని సంపాదిస్తున్నదై పాపరాశిని నశింపజేసే, చాలా పుణ్యమైన ముహూర్తంగా భాసించింది.

"ముహూర్తః స్వల్పకాలేస్యాత్ ఘటికాద్వితయేఽపిచ"- (శబ్దార్ణవ నిఘంటువు). ముహూర్తమనే పదానికి కొద్దికాలమనియు రెండు గడియల (48 నిమిషాల) సమయమని అర్థం.

పుణ్యముహూర్తం:-

*"యద్బాల్యే యచ్చకౌమారే స్థావిరే యచ్చ పాతకమ్।*
*తత్ క్షాళయతి గోవింద స్థిథౌ తస్యాం విభావితః॥"*

గోవిందుడు అవతరించిన తిథినాడు బాల్య కౌమార వార్ధక్య దశలలో చేసిన వారి వారి సకల పాతకాలను (గోవిందుడు) శ్రీకృష్ణుడు కడిగివేస్తాడు అని పురాణాలలో ఆ కాల స్వరూపం ప్రకటింపబడింది.

అర్ధరాత్రియందు జాగరణ, నిద్ర రెండూ ఉంటాయి. ముహూర్తం-శ్రీకృష్ణుడు అవతరించిన అర్ధరాత్రి సమయం కూడా అట్టిదే. దేవకీదేవి మొదలైన వ్యక్తులు జాగరావస్థలో నున్నారు. కంసుడు, అతని చారులు (సేవకులు) మొదలైన వారు గాఢనిద్రావస్థలో ఉన్నారు. అట్టి దేవదేవుడు, క్షీరార్ణవ నికేతనుడు అవతరించే ముహూర్తం పుణ్యతమమైనది.

*190. భాగేన పూర్వేణ తమోమయేన*
*ప్రకాశ పూర్ణేన చ పశ్చిమేన।*
*తదా నిశీథః స సతాం ప్రసత్యై*
*సంసార ముక్త్యోరివసంధి రాసీత్॥* 90

**అర్థం:** తదా= అప్పుడు- భగవదవతార సమయాన; తమోమయేన= చీకటితో నిండిన; పూర్వేణ= మొదటి; భాగేన= భాగంచేత (పూర్వ రాత్రిచే); ప్రకాశ పూర్ణేన=

చంద్రుని వెలుగుతో నిండిన; పశ్చిమేన= అపర రాత్రిచేతనూ, (కూడియున్న); సః= ఆ; నిశీథః= అర్ధరాత్రి; సంసార ముక్త్యోః= సంసారానికి- ముక్తికి; సంధిః, ఇవ= మధ్యకాలం లాగా; సతాం= సత్పురుషులను; ప్రసత్త్యై= అనుగ్రహించడం కోసం; ఆసీత్= ఉండెను.

**తా॥** అర్ధరాత్రి భగవానుడవతరించే సమయమందు, పూర్వరాత్రి అంధకారమయమై ఉండింది. అపరరాత్రి వెన్నెలతో ప్రకాశిస్తు ఉండింది. ఈ పూర్వాపర రాత్రులకు మధ్యకాలం (సంధి)గా ఉన్న ఆ నడిరేయి, తమోగుణ వికారమైన పూర్వరాత్రిచే సంసార కాలంతోనూ, ఆవిర్భవించిన స్వరూప జ్ఞానపూర్ణమైన అపర రాత్రిచే ముక్తి కాలంతోనూ కూడినదై, సజ్జనులకు- బ్రహ్మవిదులకు హృదయ ప్రసన్నత కోసమే ఉండింది.

సత్పురుషులకు దుఃఖకాలం గడిచిపోయినదై, సుఖకాలం ఆసన్నమై ఈ రెండు కాలాలకు సంధికాలం లాగా అర్ధరాత్రి శోభిస్తుండింది.

"అస్తి బ్రహ్మేతిచేద్వేద, సంతమేనం తతో విదుః"- 'బ్రహ్మ ఉన్నాడు' అని తెలిసికొన్నందువల్ల మహర్షులు ఇతనిని బ్రహ్మవిదునిగా గుర్తించారు- అనే ఉపనిషద్వాక్యంవల్ల 'బ్రహ్మవిదులు సత్' శబ్ద వాచ్యులు అయ్యారు.

ఉపమాలంకార సజ్జిత మీ శ్లోకం.

*191.* ప్రాగేవ జాతేన సితేన ధామ్నా
మధ్యోపలక్ష్యేణ చ మాధవేన।
ప్రకామ పుణ్యా వసుదేవ పత్న్యా
సంపన్న సామ్యేవ నిశా బభాసే॥ 91

**అర్థం:** ప్రకామ పుణ్యా= మిక్కిలి పుణ్యం కలిగించే రాత్రి; ప్రాక్, ఏవ= మొదటనే; జాతేన= పుట్టిన; సితేన= తెల్లని; ధామ్నా= కాంతి (గల బలరాముని) చేత; (చంద్రునిచేత); మధ్య+ఉపలక్ష్యేణ= నడురేయి యందు ఆవిర్భవించే స్థితి గల నడుమ

నందు; గుర్తింపదగిన; మాధవేన= శ్రీకృష్ణునిచేత; చ= కూడా (ఉపలక్షితమైన); నిశా= రాత్రి; ప్రకామ పుణ్యా= మిక్కిలి పుణ్యం కలిగినదై; వసుదేవ పత్న్యా= దేవకీదేవి చేత; సంపన్న సామ్యా, ఇవ= పొందిన సామ్యం అన్నట్లు; బభాసే= ప్రకాశించెను.

**తా॥** రాత్రి మొదట చంద్రకాంతి కలిగియున్నది. రోహిణి గర్భమందు తెల్లని వన్నె కలిగిన బలరాముడు ఉదయించాడు. ఇక దేవకీదేవి (మధ్య) నడుము శ్రీకృష్ణుడు అవతరించబోయే దశ కలిగియున్నది.

నడురేయి, దేవకీదేవి యొక్క నడుముతో సామ్యాన్ని పొందినట్లున్నది. కాబట్టి రాత్రి 'ప్రకామ పుణ్యా'- మిక్కిలి పుణ్యకరి అనబడింది. దేవకి 'ప్రకామపుణ్యా' అంటే మిక్కిలి పుణ్యవతి యని అర్థం.

రాత్రి ప్రకామపుణ్యకరి:- ప్రాణులకు చాలా కామానుభవాన్ని కలిగించేది. మొదట ఈ 'నిశ' యందు సితధాముడైన కామపాలుడు ఆవిర్భవించాడు. మధ్య శబ్దోప లక్షితమైనది, అర్ధరాత్రి. మరియు శ్రీకృష్ణుడావిర్భవించే దశయందున్న దేవకి యొక్క నడుము. ఆమెయొక్క నడుముతో నడురేయికి సాదృశ్యం, స్పష్టంగా గోచరించనందువల్ల సాదృశ్యోత్ప్రేక్షగా వర్ణింపబడింది. మొత్తం రాత్రియందు నడురేయి మాత్రం 'ప్రకామపుణ్య'గా వర్ణితం.

*192. సహప్రతిచ్ఛంద శశాంక భేదైః*
*సరస్వతాం తాండవిన స్తరంగాః।*
*అవేక్ష్య శౌరే రవతార వేళాం*
*సంతోష నిఘ్నా ఇవ సంప్ర ణేదుః॥* 92

**అర్థం:** సరస్వతాం= సముద్రాల యొక్క; తరంగాః= కెరటాలు; శౌరేః= శ్రీకృష్ణుని యొక్క; అవతారవేళాం= అవతరించే సమయాన్ని; అవేక్ష్య= చూచి; సంతోష నిఘ్నాః, ఇవ= సంతోషంచేత పరవశమైనవి అన్నట్లు; ప్రతిచ్ఛంద శశాంక భేదైః, సహ= ప్రతిబింబించిన చంద్రులతో కూడ; తాండవినః, సంతః= ఉద్ధృతమైన నృత్తం కలవి అవుతూ; సంప్రణేదుః= ధ్వనించాయి.

**తా॥** చంద్రోదయమందు సముద్ర క్షోభ ఆలంకారికంగా వర్ణితం.

సముద్రపుటలలు, చంద్రుని ప్రతిబింబాలతో కలిసి, శ్రీకృష్ణావిర్భావ సమయాన్ని తెలుసుకొని, ఆనందంతో తాండవ నృత్యం చేస్తూ, అద్భుతంగా నినదిస్తున్నాయి.

చంద్రాధీనమైన సముద్ర క్షోభకు తాండవత్త్వమూ, తరంగాధీనమైన ధ్వనికి సంతోషాధీనమైన ప్రణాదత్త్వమూ, తరంగాదులలో అంతర్గతమైన చంద్ర ప్రతిబింబాల యొక్క ప్రకాశ హేతువుచేత సంతోషాధీనమైన ప్రఫుల్లత్వం ఉత్ప్రేక్షింపబడినది.

హేతువుగల ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, కావ్యలింగం అనే అలంకారాల సంకరం.

*193. అవాది తో దీరిత వాద్య ఘోషం (తూర్యనాదం)*
*దిశాభి రామ్రేడిత దివ్యగీతమ్।*
*సతా ముపస్థాపిత సత్త్వలాస్యం*
*సంగీత మంగల్య మభూత్ తదానీమ్॥* 93

**అర్థం:** తదానీం= భగవదవతారవేళయందు; అవాదిత+ఉదీరిత, వాద్యఘోషం= మ్రోగింపబడని వాద్య పరికరాలనుంచే; పైకి ఎగసిన వాద్యధ్వని (తూర్యనాదం) కలిగినట్టి; దిశాభిః= దిక్కులచేత; ఆమ్రేడిత దివ్యగీతం= ప్రసరింపబడిన దేవలోక గానం కలిగినట్టి; సతాం= సజ్జనులకు; ఉపస్థాపిత సత్త్వ లాస్యం= స్థాపింపబడిన సత్త్వగుణంతో కూడిన నృత్యం (నాట్యం) కలిగినట్టి; సంగీతం= సంగీత (మనే) కళ; మంగల్యం= మంగళంగా; అభూత్= (అయెను) ఉండెను.

**తా॥** శ్రీకృష్ణ భగవానుడు అవతరించే సమయమది. వాద్యపరికరాలు ఎవరిచేతను ప్రయోగింపబడలేదు. అయినా, ఆయా వాద్యాలు తమ తమ కళా ప్రభావంచేత వాద్యఘోషను విస్తరింపజేశాయి. ఆకాశంలో గంధర్వాదులు పలు దిక్కుల సంచరిస్తూ చేసే దివ్యగానం దశ దిశల ప్రసరించింది. సత్పురుషులకు

సత్త్వగుణమంటే కుతూహలం అధికం కదా! అందుకోసం, సత్త్వగుణమే నాట్య మాడింది. ఇది మహూర్తబలం.

*"గీతం నృత్తం చ వాద్యంచ త్రయం సంగీత ముచ్యతే"॥-* (సంగీత రత్నాకరం). గీతం; నృత్తం, వాద్యం- ఈ త్రికం, మంగళ మయమైన సంగీతం. ఇదే తూర్యత్రికమని (నృత్తగీతవాద్యాల కలయిక) చెప్పబడింది.

'సతాం' అనడంవల్ల, సజ్జనులు కానివారికి ప్రబల వాద్య గీతాదులచేతనూ నిద్రాభంగం కలుగదు. మేల్కోలేరు వారు. వారికి తమోగుణమే ఉద్రేకించి యుంటుంది అనే భావం స్ఫురిస్తుంది.

*194.* *ప్రదీపితైః కంసగృహేషు దీపై*
*స్తాపైశ్చ భావేషు తపోధనానామ్।*
*అలభ్యత క్షిప్ర మలబ్ధ భంగై*
*రహేతు నిర్వాణదశానుభూతిః॥* 94

**అర్థం:** కంసగృహేషు= కంసుని భవనాలలో; ప్రదీపితైః= ప్రజ్వలించే; దీపైః = దీపాలచేత; తపోధనానాం= తపస్సే ధనంగా గల; మహాత్ముల యొక్క; భావేషు హృదయాలయందు; ప్రదీపితైః= దుష్టుల పీడచేత ఉద్దీపించే; తాపైః, చ= తాపాల చేతనూ; అలబ్ధ భంగైః= అవి భంగం పొందనివే అయినను; అహేతు నిర్వాణ దశా+అనుభూతిః= నిష్కారణమైన నాశన స్థితి యొక్క అనుభవం; క్షిప్రం= (తొందరగా) శీఘ్రంగా; అలభ్యత= పొందబడెను.

**తా॥** కంసుని రాజభవనాలలో దీపాలు విశేషంగా ప్రజ్వలిస్తున్నాయి. తాపసుల మనస్సునందు అసురులు మొదలైన దుర్జనులచే పీడింపబడుతున్నందు వల్ల తాపాలు పెరుగుతున్నాయి. ఈ దీపాలూ, తాపాలూ ఆరిపోయే స్థితిని పొందేవికావు. అయినా, భగవదవతార ముహూర్త బలమది. నిష్కారణంగా దీప ప్రమితలలో (దశా) వత్తులున్నా, వాటి జ్వాలలు నశించాయి.

'దశా' శబ్దానికి వత్తి, అవస్థ, స్థితి అనే నానార్థాలున్నాయి. తపోధనుల హృదయ తాపాలు (నిర్వాణదశను) ఆరిపోయే స్థితిని పొందినాయి.

దీప తాపాలకు నిర్వాణదశ– నాశస్థితి– ప్రాప్తించే లక్షణాన్ని ఏక క్రియతో అన్వయించినందువల్ల తుల్యయోగితాలంకారం.

ఇప్పుడు వినాశస్థితి ప్రసిద్ధంగా జరుగకున్ననూ, తాపసులకూ కంసునికీ భగవానుడు అవతరించిన తర్వాత జరుగబోయే శుభాశుభ సూచకమైన, దైవికమైన ప్రసిద్ధకారణాన్ని మనస్సున భావించి, వినాశస్థితి కలిగె ననడం వల్ల విభావనా లంకారం.

*195. అజః స్వజన్మార్హతయాఽను మేనే*
*యా మష్టమీం యాదవ భావ మిచ్ఛన్।*
*ద్వితీయ యా భావిత యోగనిద్రా*
*సాఽభూత్త దానీం ప్రథమా తిథీనామ్॥* 95

**అర్థం:** అజః= విష్ణు భగవానుడు; యాదవ భావ= యాదవత్వాన్ని; ఇచ్ఛన్= కోరుతున్నవాడై; యాం= ఏ; అష్టమీం= అష్టమీ తిథిని; స్వజన్మ+అర్హతయా= తన అవతారానికి యోగ్యంగా; అనుమేనే= అంగీకరించెనో; ద్వితీయయా= రెండవదైన, నవమీ తిథిచేత; భావితయోగనిద్రా= ఉత్పాదింపబడిన భగవానుని యోగనిద్ర; సా= అది; తదానీం= అప్పుడు; తిథీనాం= తిథులలో; ప్రథమా= ప్రథమ తిథి; అభూత్= ఆయెను.

**తా॥** శ్రీకృష్ణ భగవానుడు యాదవ వంశంలో అవతరించాలని సంకల్పించాడు. దేవకీదేవి యొక్క అష్టమ గర్భమవడంవల్ల తాను మొదట జనించడం యోగ్యమని అష్టమీ తిథిని అంగీకరించాడు. భగవానుని ప్రేరణచేత తన మాయా రూపమైన యోగనిద్ర తర్వాత నవమీ తిథి యందు యశోదకు జనించింది. శ్రీకృష్ణుడు అఘటిత ఘటనా సమర్థుడు కదా! వాస్తవంగా, భగవానుడు,

అవతరించిన అష్టమినాటి రాత్రే తన తర్వాత యశోదా గర్భమందు యోగనిద్రా రూపిణియైన దుర్గాదేవి అవతరించే విధంగా సంకల్పించినట్లు జరిగింది. కృష్ణావతరణ ముహూర్తానికి అష్టమీ (రాత్రి) తిథియే ఉండింది. ఆ తర్వాత, ఆ రాత్రిపూట అష్టమికీ రెండవదైన నవమీ తిథి కాలమందు యశోదకు మాయాదేవి అవతరించింది.

ఒకే రాత్రి ఇద్దరు అవతరించిన ముహూర్తాలు వేర్వేరుగా నున్నవే కాని దిన భేదం లేదనడం గమనీయం.

అష్టమీ తిథి, ప్రథమా తిథిగా ఎట్లు అవుతుంది? విరోధం కదా! భగవానుని సకలావతారాల కాలాల కంటెనూ ఈ అష్టమీ తిథి అర్ధరాత్రి అవతరించడం వల్ల, అష్టమి ప్రథమ- శ్రేష్ఠమైనదని అర్థం. ఎంతో ప్రాథమ్యాన్ని వహించింది. నవమీ తిథి అష్టమికి రెండవదైనందువల్ల, నవమి ద్వితీయగా చెప్పబడింది కాబట్టి విరోధం పరిహరింపబడింది. ఇది విరోధాభాసాలంకార లక్షణం.

*196. అథ సితరుచి లగ్నే సిద్ధ పంచగ్రహోచ్చే*
*వ్యజనయ దనఘానాం వైజయంత్యాం జయంత్యామ్।*
*నిఖిల భువన పద్మక్లేశ నిద్రాపనుత్త్యై*
*దినకర మనపాయం దేవకీ పూర్వసంధ్యా॥* 96

**అర్థం:** అథ= చంద్రుడు ఉదయించిన పిమ్మట; అనఘానాం= పాపాలకు విరోధాలైన- పుణ్య దివసాలలో; వైజయంత్యాం= పతాకం వంటి శ్రేష్ఠమైన; జయంత్యాం= జయంతినాడు రోహిణీ నక్షత్రంతో కూడియున్న శ్రావణమాస, కృష్ణపక్షమందలి అష్టమీ తిథియందు; సిద్ధ పంచగ్రహ+ఉచ్చే= సంపన్నమైన ఐదు గ్రహాలు ఉచ్చస్థానమందుగల; సితరుచిలగ్నే= చంద్రయుక్తమైన వృషభలగ్నమందు; దేవకీ పూర్వ సంధ్యా= దేవకీదేవి అనే ప్రాతఃకాల సంధ్య; నిఖిలభువన పద్మక్లేశ నిద్రా+అపనుత్త్యై= సమస్త లోకాలు అనే తామర పువ్వుల యొక్క కష్టమనే నిద్రను-

ముడుచుకొనియుండే స్థితిని- పోగొట్టడం కోసం; అనపాయం= అస్తమయం లేనట్టి; దినకరం= (శ్రీకృష్ణుడు అనే) సూర్యుణ్ణి; వ్యజనయత్= ఉదయింపజేసెను- ప్రసవించెను.

**తా॥** చంద్రోదయమైన తర్వాత పుణ్యదినాలలో శ్రేష్ఠమైన శ్రావణ బహుళ అష్టమినాడు రోహిణీ నక్షత్రమున్న సుముహూర్తమందు, జయంతి తిథియందు, దేవకీదేవి శ్రీకృష్ణ భగవానుణ్ణి ప్రాదుర్భవింపజేసింది. శ్రీకృష్ణుడావిర్భవించిన ముహూర్తమందు ఐదు గ్రహాలు- చంద్రుడు, అంగారకుడు, బుధ, గురు, శనైశ్చరుడు ఉచ్చస్థానమందున్నారు. ఈ గ్రహాలకు ఉచ్చస్థాన రాశులు క్రమంగా వృషభం, మకరం, కన్యా, కర్కాటకం, తులా రాశులు కదా!

'బృహజ్జాతకం' అనే జ్యోతిశ్శాస్త్ర గ్రంథమందు, సూర్యాది గ్రహాలకు ఉన్నత స్థానాలైన రాశులు క్రమంగా చెప్పబడిన ప్రామాణిక శ్లోకమిట్లున్నది-

*"అజ వృషభ మృగాంగనా కులీరాః।*
*ఝష వణిజౌచ దివాకరాది తుంగాః॥"*

"సితరుచి లగ్నే" అని ప్రత్యేకంగా చెప్పబడింది ఎందుకు? అంటే పంచగ్రహాలు ఉన్నత స్థానాల యందు ఉన్నమాట చెప్పినప్పటికీ ఏ లగ్నమందు ఆవిర్భవించిన సంగతి తెలియదు కదా! అందుకే 'సితరుచి' అంటే తెల్లని కాంతిగల చంద్రుడు అని అర్థం. సితరుచితో యుక్తమైన లగ్నమందు అని మధ్యమ పదం లోపించిన సమాసపదమిది.

చంద్రునితో కూడిన వృషభలగ్నమందు శ్రీకృష్ణుడావిర్భవించాడని విశదీకరింపబడింది.

*"తతోఖిల జగత్పద్మ బోధాయాచ్యుత భానునా।*
*దేవకీ పూర్వ సంధ్యాయా మా విర్భూతం మహాత్మనా॥"*

శ్రీ విష్ణుపురాణమందున్న శ్లోకమిది. ఉత్తరార్ధ శ్లోకంలో ఈ అర్థమే వివరింపబడింది.

దేవకీదేవి శ్రీకృష్ణభగవానుణ్ణి ఆవిర్భవింపజేసింది. ప్రాతః సంధ్య సూర్యుణ్ణి ఉదయింపజేసింది. ఎందుకు? పద్మాలు నిద్రలోనున్నాయి అంటే ముకుళించి మొగ్గగా సంకుచిత దశ యందున్నవి. సూర్యుడు ఉదయించిన వెంటనే అతని కిరణాలచే పద్మాలు వికసిస్తాయి. లోకాలన్నీ క్లేశ భూయిష్ఠమై యున్నాయి. శ్రీకృష్ణుని ఆవిర్భావంచేత సకల లోకాలు చైతన్యం కలిగినవై భాసిస్తాయి. నిద్రనుంచి మేల్కొలుపేవాడని ఆవిర్భవింపజేయడమని అర్థం.

దేవకియే పూర్వసంధ్య. కష్టాలలో నున్న లోకాలే నిద్రిస్తున్న పద్మాలు. 'అచ్యుత భానుడు' చ్యుతిలేని సూర్యుడు అన్నట్లే 'అనపాయ దినకరుడు' అస్తమయం లేని సూర్యుడు అని అచ్యుతుని- శ్రీకృష్ణుని విషయమై అభేదాధ్యవసాయం ప్రదర్శింపబడింది.

'వి+అజనయత్'- 'వి' ఉపసర్గవల్ల *"అజాయమానో బహుధా విజాయతే"* పుట్టుక లేనివాడు అనేక రూపాలతో పుట్టుతుంటాడు- అనే శ్రుతి యొక్క అర్థాన్ని బోధిస్తున్న క్రియాపదం. రూపకాలంకారం, అతిశయోక్త్యలంకారం కలిసి సంకరమైన శ్లోకం, మాలినీ వృత్తం.

*197. అవతరతి ముకుందే సంపదా మేక కందే*
*సురభిత హరిదన్తాం స్వాదు మాధ్వీక దిగ్ధామ్।*
*అభజత వసుదేవ స్థాన మానంద నిఘ్నై*
*రమర మిథున హస్తై రాహితాం పుష్ప వృష్టిమ్॥* 97

**అర్థం:** సంపదాం= ముల్లోకాల అభివృద్ధులకు; ఏక కందే= ముఖ్యకారణమైన; ముకుందే= శ్రీకృష్ణుడు; అవతరతి (సతి)= ఆవిర్భవించగా; వసుదేవ స్థానం= వసుదేవుని (గృహాది) స్థానం; ఆనంద నిఘ్నైః= ఆనందానికి అధీనమైన- ఆనంద పరవశమైన; అమర మిథున హస్తైః= దేవదంపతుల చేతుల చేత; ఆహితాం= సమకూర్చబడిన; సురభిత హరిత్+అంతాం= సువాసితమైన దిగంతాలు గల; స్వాదు

మాధ్వీక దిగ్ధాం= మధురమైన, మకరందంచేత ఆర్ద్రమైన; పుష్పవృష్టిం= పూలవానను; అభజత= పొందెను.

**తా॥** ముల్లోకాల సంపదలకు మూలకందమైన శ్రీకృష్ణుడు అవతరించాడు. సస్యమూలవాచకమైన కందశబ్దానికి అన్య నిరపేక్ష కారణమని లాక్షణికమైన అర్థం.

'వసుదేవస్థానం' అంటే కంసుని కారాగృహమందు వసుదేవుడు నివసించిన చోటు మాత్రమే కాక, రోహిణీ మొదలైన వారి నివాసగృహాలూ, నందుని గోకుల మందిరాల నన్నిటినీ గ్రహించవలసి యుంటుంది.

ముకుందుడు అవతరించగానే వసుదేవునికి సంబంధించిన భవనాలలో ఆనందం అంబరాన్ని చుంబించింది. నిలింప దంపతులందఱు ఆనందపరవశులై దిగంతాల వరకు పరిమళించే, మధుర మకరంద స్యందియైన పూలను సేకరించి, తమ చేతులతో వసుదేవుని స్థానం మీద పూలవానను కురిపించారు.

ముకుందునికి కందత్వం రూపింపబడింది. అందువల్ల కందంనుంచి ఉద్భవించిన సంపదలన్నిటికి ఓషధిత్వ రూపణం గమ్యమవుతున్నది. కాబట్టి, ఏకదేశవర్తి రూపకాలంకారం. సర్గాంతమందు మాలినీ వృత్త రచిత శ్లోకం.

శ్రీకృష్ణావతరణం అనే రెండవ సర్గ సమాప్తం.

# తృతీయ సర్గ

198. *అథ జగంతి బభూవు రనావిలా*
*న్యతిమిరా హరితః ప్రచకాశిరే।*
*అభజదేవ నిశా దివస శ్రియం*
*జనన భాజిని దేవ దివాకరే॥* 1

**అర్థం:** అథ= తర్వాత; దేవ దివాకరే= శ్రీకృష్ణుడనే సూర్యుడు; జనన భాజిని (సతి)= ఆవిర్భావాన్ని పొందగా- అవతరించగా; జగంతి= లోకాలు; అనా విలాని= ప్రసన్న చిత్తం కలవై; బభూవుః= శోభించాయి; హరితః= దిక్కులు; అతిమిరాః= చీకటిలేనివై; ప్రచకాశిరే= ప్రకాశించినాయి; నిశా= రాత్రి; దివసశ్రియం= దిన శోభను; అభజత్, ఏవ= పొందినదే అయింది.

**తా॥** శ్రీకృష్ణుడు అనే సూర్యుడు ఉదయించాడు. లోకాలు నిద్రనుంచి మేల్కొని చైతన్యం కలిగి ఉన్నాయి. దిక్కులన్నీ అంధకారం తొలగిపోయి ప్రకాశించాయి. రాత్రి దినశోభగా పరిణమించింది.

'హరిత్' శబ్దం దిగర్థకం. *"దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః"*- (అమరం). రూపక సంకీర్ణమైన, క్రియా యౌగపద్య రూపమైన సముచ్చయాలంకారం. సర్గవృత్తం ద్రుత విలంబితం.

*"ద్రుత విలంబిత మాహ నభౌ భరౌ"* అని, ద్రుత విలంబిత వృత్త లక్షణం.

(ఈ శ్లోకమందు భగవదవతార మహిమ వల్ల, సత్పురుషులకు తత్త్వజ్ఞానోదయమై, రాగద్వేషాదులు తొలగిపోయి, మిక్కిలి హితమైన అనుష్ఠాన ప్రావణ్యమేర్పడింది. సంసారమనే ఈ లోకానికి కూడా అదే అనుభవరూపమై నిత్య దివసాయమానమైన మోక్షస్థాన సామ్యం సంపాదింపబడింది అనే అర్థమూ ద్యోతకమవుతున్నది).

*199. నన్నృతు రప్సరసోదివి నందితాః*
*కిమపి గీత మగీయత కిన్నరైః।*
*శ్రుతి సుఖైః సమతోషయత స్వనై*
*రమర దుందుభి రానక దుందుభిమ్॥* 2

**అర్థం:** అప్సరసః= అచ్చరలు; దివి= స్వర్గలోకమందు; నందితాః= ప్రీతిమతులై; నన్నృతుః= నాట్యమాడిరి; కిన్నరైః= కిన్నరులచేత; కిం, అపి= అనిర్వాచ్యమైన, అతి మధురమైన; గీతం= గానం; అగీయత= ఆలపించబడెను; ఆనక దుందుభిః= ఆనకాలు, దుందుభులు తాను పుట్టినప్పుడు మ్రోగినందువల్ల 'ఆనక దుందుభి' అని పేరు కలిగిన వసుదేవుణ్ణి; అమర దుందుభిః= దేవతల యొక్క భేరి; శ్రుతిసుఖైః= చెవులకు ఇంపును గొల్పే; స్వనైః= ధ్వనులచేత; సమతోషయత= సంతోషింపజేసెను.

**తా॥** శ్రీకృష్ణావతార సమయాన స్వర్గలోకమందు అప్సరసలు సంతోషించి నాట్యమాడారు. కిన్నరులు అపరిచ్ఛేద్య విషయమైనందువల్ల ఆశ్చర్యంతో ఏమి గానం చేయాలో అనుకొంటూనే అతి మధురమైన అనిర్వచనీయమైన అద్భుత గానం చేశారు. దేవతల దుందుభి (భేరి), తాను పుట్టినప్పుడు ఆనకాలు (తమ్మళి బాజలు) దుందుభులు మ్రోగినందువల్ల ఇప్పుడు ఆయన జన్మసాఫల్యమైనదని చెప్తున్నట్లు, వసుదేవుణ్ణి శ్రవణసుఖహేతువైన ధ్వనులచేత చాలా సంతోషింప జేసెను.

*200. దశసు తత్ర దిశా స్వశరీరిణీ*
*జయ జయేతి బభూవ సరస్వతీ।*
*అజిత మేక మగోచరయత్ స్వయం*
*స్వరస వృత్తి రసా వసురాంతకమ్॥* 3

**అర్థం:** తత్ర= వసుదేవస్థానమందు; దశసు, దిశాసు= పది దిక్కుల యందు; జయ, జయ, ఇతి= 'జయ జయ' అని; అశరీరిణీ= శరీరంలేని; సరస్వతీ= వాక్కు

బభూవ= ఆయెను; అసౌ= ఈ జయ జయ అనే వాణి; అసుర+అంతకం= రాక్షసాంతకుడైన; అజితం= శ్రీకృష్ణుణ్ణి; ఏకం= ముఖ్యంగా ఒక్కనినే; స్వరసవృత్తిః= స్వారస్యంగల వ్యాపారం కలదవుతూ; స్వయం= తానే; అగోచరయత్= గోచరింప జేసెను.

**తా॥** ఆ వసుదేవస్థానమందు అశరీరవాణి పది దిశలలో 'జయజయ' అని వ్యాపించింది. ఎనిమిది దిక్కులు, భూమ్యాకాశాలు మొత్తం పది దెసల వ్యాపించిన ఈ వాక్కు శ్రీకృష్ణుని ఒక్కనియందే ప్రవర్తింపజేసెను.

"విష్ణా వప్యజితా వ్యక్తౌ"- (అమరం). 'అజిత' శబ్దం విష్ణుమూర్తి అనే అర్థం కలది. విష్ణువు ఇంతకుముందే అసురాంతకుడు, ఇకముందు కూడా శ్రీకృష్ణుడు (విష్ణువే కాబట్టి) ఆ రాక్షసాంతక వృత్తినే పాటించగలడని- ఇతరులెవరిచేతనూ (అజితుడు) జయంపబడడు- తానే జయ శీలుడవుతాడని వాణి స్పష్టంగా ప్రకటించింది. "వినయో జయః సత్యసంధః" అని శ్రీవిష్ణు సహస్రనామావళిలో 'జయః' అనే పేరు విష్ణువుకు వర్తిస్తున్నది కదా!

'హే జయ! ఓ కృష్ణా! త్వం జయ= నీవు జయించుము- జయమును పొందుము' అనే అర్థాన్ని కూడా అశరీరవాణి పలుదెసల వ్యాపింపజేసింది. 'జయ జయ' అని ద్విరుక్తిచే తన సమ్మతినీ వాణి తెల్పింది.

201. *అనతి వేల సమీరణ చోదితైః*
*శిశిర శీకర శీభరి తాంబరైః।*
*జల ధరై రభితో దివి దధ్వనే*
*సురగజై రివ సూచిత మంగళైః॥* 4

**అర్థం:** అనతివేల, సమీరణ చోదితైః= తీవ్రత లేని వాయువుచేత, ప్రేరేపింపబడినట్టి; శిశిర, శీకర, శీభరిత+అంబరైః= చల్లని తుంపురు వానచే స్ఫురితమైన ఆకాశం కలిగినట్టి; సూచిత, మంగళైః= సూచింపబడిన శుభం కలిగినట్టి;

సురగజైః, ఇవ= ఐరావతం మొదలైన దిగ్గజాలవలె; జలధరైః= మేఘాలచేత; దివి= ఆకాశమందు; అభితః= అంతటా; దధ్వనే= ధ్వనింపబడినది.

**తా॥** శ్రీకృష్ణుడు అవతరించినప్పుడు చాలా మెల్లగా వీచిన గాలిచేత సంచరిస్తున్న మేఘాలు ఆకాశమంతటా చల్లని వాన తుంపురులతో వ్యాపించాయి, శుభసూచకమైన గర్జన చేశాయి, ఉరిమినాయి. ఐరావతం, పుండరీకం అనే మొదలైన పేర్లుగల అష్టదిగ్గజాలు చల్లని రమణీయ వాతావరణానికి కోలాహలంగా నీటిని తొండంతో పీల్చి అంతటా వెదజల్లుతూ, మంగళకరమైన ఘీంకార ధ్వనులు జేశాయి. దిగ్గజాల లాగా మేఘాలు కూడా గర్జించాయి. గజ ఘీంకారాలు, మేఘ గర్జనలు శుభసూచకాలు.

"శీభరః స్ఫారరమ్యయోః"- (నిఘంటువు). 'శీభృకత్థనే'- ధాతువుకు ఔణాదికమందు 'అరన్' ప్రత్యయం చేరి 'శీభర' శబ్దం నిష్పన్నమయినది.

"*మందం మందం జలధరా జగర్జురను సాగరమ్*"- (శ్రీ భాగవతం). జగన్మంగళకరమని సూచితం. ఇది 'సముచ్చయోపమాలంకారం.

*202. వవు రథో మరుత స్త్రిదశాంగనా*
*వదన సౌరభ సారభృతః శుభాః।*
*ముదిత నిర్జరముక్త సురద్రుమ*
*ప్రసవ వృష్టి మధు ద్రవ మేదురాః॥*

**అర్థం:** అథః= అనంతరం; త్రిదశాంగనా-భృతః=/ త్రిదశ+అంగనా= దేవతా స్త్రీల యొక్క; వదన= ముఖం యొక్క; సౌరభ సార= సౌగంధ్య ఉత్కర్షాన్ని; భృతః= ధరించినట్టి; ముదిత-మేదురాః/ ముదిత= సంతోషించిన; నిర్జర దేవతలచేత; ముక్త= వదలబడిన; సురద్రుమ= కల్పవృక్షం యొక్క; ప్రసవ= పూలవృష్టియొక్క; మధుద్రవ= మకరంద ద్రవాలచేత; మేదురాః= సాంద్రములైన; శుభాః= మంగళములైన; మరుతః = వాయువులు; వవుః= వీచినవి.

**తా॥** దేవతాంగనల ముఖ సుగంధ సారాన్ని వహించినట్టి, బృందారకులచే వదలబడిన కల్ప, సంతాన, హరిచందన, పారిజాత, మందార తరువుల పూలవాన యొక్క పూవు తేనియల ద్రవంచేత దట్టమైన మంగళవాయువులు వీచినాయి.

"స్యాదుత్పాదే ఫలే పుష్పే ప్రసవో గర్భమోచనే"- (శబ్దార్ణవం)

"వవౌ వాయుః సుఖస్పర్శః పుణ్య గంధవహః శుచిః"- అని శ్రీ భాగవత మందున్నట్లే ఇక్కడ కూడా రమణీయంగా వర్ణితం.

*203. మధురి పోరవతార మహోత్సవే*
*ముముదిరే మధురాపుర దేవతాః।*
*యదభిగంతరి భక్తజనే వరం*
*దదు రశేష మతంద్రిత చేతసః॥* 6

**అర్థం:** మధురిపోః= మధువైరి యైన శ్రీకృష్ణునియొక్క; అవతార మహోత్సవే= అవతరణమనే గొప్ప ఉత్సవమందు; మధురాపుర దేవతాః= మధురానగర దేవతలు; ముముదిరే= సంతోషించారు; యత్+అభిగంతరి= (ఎవరిని) శ్రీకృష్ణుణ్ణి చూడవచ్చిన; భక్తజనే= భక్తజనం విషయమై; అశేషం= సమస్తమైన; వరం= కోరిన వస్తువును; అతంద్రిత చేతసః= తత్తరపాటు లేకుండా; దదుః= ఇచ్చినారు.

**తా॥** శ్రీకృష్ణావతార మహోత్సవమందు మధురానగర దేవతలు చాలా ఆనందాన్ని పొంది, శ్రీకృష్ణుని దర్శనార్థమై వచ్చిన భక్తజనులకు సంతోషానికి స్ఫూర్తి చిహ్నంగా అశేష వరదానాలను చేశారు. సంతోషంకంటె మించిన దానం చేయడం అదొక ఆనందం కదా!

*204. అవదధానధియో మునయస్తదా*
*యదనధీత మధీత వదం జనాః।*
*నిగమ జాత మశేష మవేక్ష్య తా*
*న్నిరవిశన్నివ ముక్తిమయీం దశామ్॥* 7

**అర్థం:** తదా= శ్రీకృష్ణుడు అవతరించినప్పుడు; అవదధాన ధియః= అవధానం గల బుద్ధిమంతులైన; మునయః= మునీశ్వరులు; యత్= ఏదైతే; నిగమ జాతం= వేద సముదాయం; అనధీతం= నేర్వబడలేదో; తత్= అది; అశేషం= సంపూర్ణంగా; అంజసా= శీఘ్రంగా; అధీతవత్= నేర్చినట్లు; తాన్= ఆ వేదాలను; అవేక్ష్య= మనస్సులో ప్రవేశించినట్లు స్పష్టంగా చూచి; ముక్తిమయీం= ముక్తి రూపమైన; దశాం= స్థితిని; నిరవిశన్, ఇవ= అనుభవించిన విధంగా సుఖాన్ని పొందారు.

**తా॥** మునులు అవధాన ధీశక్తి కలవారు. పూర్వం వేదం చదువకున్నను, శ్రీకృష్ణావతార సమయాన శీఘ్రంగా వేదాలను సంపూర్ణంగా చదివినట్లు, మనస్సులో శక్తిని పొందిన వారైనట్లు గ్రహించి, మోక్షరూపమైన ఆనందస్థితిని అనుభవించారన్నట్లు కనబడిరి. ఉత్ప్రేక్షాలంకారం.

*205. ప్రసదనం శరదాగమ సంభవం*
*నభసి మాసి నదీభిరుపాదదే।*
*మహిత యోగ విదాం మతిభిః సమం*
*శ్రుతిభిరప్యనుప ప్లవ నీతిభిః॥* 8

**అర్థం:** నభసి, మాసి= శ్రావణమాసమందు; నదీభిః= నదులచేత; శరత్+ఆగమ సంభవం= శరదృతువు రాకడవల్ల సంభవించే; ప్రసదనం= నైర్మల్యం; ఉపాదదే= పొందబడెను; మహిత యోగవిదాం= ఉత్కృష్టమైన యోగవిద్య తెలిసిన వారి యొక్క; మతిభిః= బుద్ధులతో; సమం= సమానమైన; అనుప ప్లవ నీతిభిః= మీమాంసాన్యాయ శాస్త్రాలతో కూడిన; శ్రుతిభిః, అపి= వేదాలచేత కూడా; ప్రసదనం= స్పష్టమైన అర్థస్ఫూర్తి; ఉపాదదే= పొందబడెను.

**తా॥** శ్రీకృష్ణుడవతరించినది శ్రావణమాసం. కాబట్టి, వర్షాకాలమందు నదులు శరత్కాలం రాకడవల్ల కలిగే స్వచ్ఛతను పొందినాయి. యోగశాస్త్రజ్ఞుల మనస్సులు ప్రసన్నంగా– శుభాశ్రయాన్ని పొందాయి. వేదాలు న్యాయమీమాంసా శాస్త్రాలకు విరుద్ధంగా లేని అర్థస్ఫురణను పొందినాయి. యోగవేత్తల బుద్ధులు

'ప్రసదనం' అంటే స్థిరమైన శుభాశ్రయాన్ని పొందినాయి. వేదాలు అనుసృతోప క్రమాది న్యాయాలచే 'ప్రసదనం' అంటే త్వరగా అర్థాన్ని స్పష్టంగా తెల్పినాయి అని 'ప్రసదన' శబ్దానికి సహోక్తిబలంచేత భిన్నార్థాలుండడంవల్ల సహోక్త్యలంకారం. నదులకూ, శ్రుతులకూ 'ఉపాదదే' అన్న ఏక క్రియాన్వయం వల్ల తుల్యయోగితా లంకారం.

*206. నిఖిల చేతన మానస నిః సృతాః*
*కలుషతాః సముదే (పే)త్య కిలక్షణాత్।*
*వివిశు రంభ ఇవ స్వయ మాపగాః*
*జలనిధేరివ భోజపతేర్మనః॥* 9

**అర్థం:** నిఖిల చేతన మానస నిస్సృతాః= సకల జీవుల మనస్సులలో నుంచి బయటకు స్రవించిన; కలుషతాః= కాలుష్య భావాలు; ఆపగాః, కిల= నదుల లాగా; సముదే (పే)త్య= ఒక్కచోట కూడి (కలిసి); జలనిధేః, ఇవ= సముద్రునికి వలె; భోజపతేః= కంసుని యొక్క; అంభః, ఇవ= నీటినివలె; మనః= మనస్సును; స్వయం వివిశుః= చేరినవి.

**తా॥** సమస్త జీవుల మనస్సులలో ఉన్న కలుష భావాలు క్షణంలో వెళ్ళి ఒకచోట చేరి నదులన్నీ సముద్రపు నీటిలో చేరినట్లు, భోజవంశాధిపతియైన కంసుని మనస్సును చేరిపోయినాయి. కంసుని అనుచరుల సహాయపరుల మనస్సులలో కూడా కాలుష్యమంతా చేరిందని భావం.

గమ్యోత్ప్రేక్ష, ఉపమాలంకారాల సంసృష్టి.

*207. అసుర వీర గృహేణి పృథ గ్విధై*
*రశుభ శంసిభి రానశిరే ముహుః।*
*అమర రాజ పురేషు జజృంభిరే*
*శుభనిమిత్త శతాని పునః పునః॥* 10

**అర్థం:** అసుర వీర గృహాణి= రాక్షసులలో వీరుల యిండ్లు; పృథక్, విధైః= వేర్వేరు విధాలైన; అశుభ శంసిభిః= అమంగళ సూచికలచేత; ముహుః= మాటి మాటికి; ఆ నశిరే= వ్యాపించినాయి; అమర రాజపురేషు= దేవరాజులైన దిక్పాలకుల నగరాల యందు; శుభనిమిత్త శతాని= అనేక శుభశకునాలు; పునః పునః= మళ్ళీ మళ్ళీ; జజృంభిరే= విజృంభించాయి.

**తా॥** రాక్షస వీరుల గృహాలలో పలురకాలైన అశుభశకునాలు- ముందు కాలాన ఆపదలు రానున్నవనే దుర్నిమిత్తాలు చాలా వ్యాపించాయి. ఇంద్రాది దిక్పతుల నగరాలలో మాత్రం శుభకార్య సూచకాలైన శకునాలు మీది మీద చెలరేగినాయి.

*208. చరమతశ్చ ఋణాదివ దేవకీ*
*పతి రముచ్యత శృంఖలతః స్థిరాత్।*
*నిఖిల బంధ నివర్తక సంనిధౌ*
*విగళనం నిగళస్య కిమద్భుతమ్॥* 11

**అర్థం:** దేవకీపతిః= వసుదేవుడు; చరమతః= చివరిదైన; ఋణాత్= ఋణం నుంచి; ఇవ= వలె; స్థిరాత్= దృఢమైన; శృంఖలతః, చ= నిగళాల నుంచి కూడా; అముచ్యత= విడువబడెను; నిఖిల బంధ నివర్తక సంనిధౌ= సకల బంధాలనుంచి నివృత్తిని కలిగించే భగవంతుని సన్నిధియందు; నిగళస్య= సంకెల యొక్క; విగళనం= విడిపోవడం; కిం, అద్భుతం= ఏమి ఆశ్చర్యం? సర్వబంధాలు విడిపోవడంలో ఆశ్చర్యమేమీ లేదు.

**తా॥** పుట్టిన వ్యక్తి మూడు ఋణాలు తీర్చుకొనవలసి యుంటుంది. అవి 1) ఋషి ఋణం- వేదశాస్త్రాధ్యయనంచేత తీర్చబడుతుంది. 2) దేవఋణం- యజ్ఞాలచేత తీర్చబడుతుంది. 3) పితౄణం- సంతానం పొందితే తీరుతుంది.

"బ్రహ్మచర్యేణ ఋషిభ్యః, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః, ఏష అనృణో భవతి" అని శ్రుతి బోధిస్తున్నది. వసుదేవుడు మొదటి రెండు ఋణాల నుంచి

ఇంతకుముందే విముక్తుడయ్యాడు. చరమతః ఋణాత్- ఇప్పుడు సంతానాన్ని పొంది, చివరి మూడవదైన పితౄణం నుంచి విముక్తుడయ్యాడు. మూడవదైన పితౄణం నుంచి విడువబడినట్లే, వసుదేవుడు కంసునిచే వేయబడిన సంకెళ్ళనుంచి కూడా విడువబడినాడు. కృష్ణావిర్భావంచేత సంకెళ్ళు విడిపోయినాయి. అవిద్య మొదలైన మిక్కిలి దృఢమైన బంధాలను కూడా విడిపించే శ్రీకృష్ణభగవానుడే స్వయంగా తనకు పుత్రుడై ఆవిర్భవించడంవల్ల, దృఢమైన శృంఖలాలు వసుదేవునికి విడిపోవడం ఆశ్చర్యమా?

ఋణత్రయం వసుదేవునికి తీరిపోయింది. "పితా పితృమాన్ యోని యోనౌ" జగత్పితయైన శ్రీకృష్ణభగవానుడే వసుదేవుడు తండ్రిగా కలవాడు, అయినాడు అని శ్రుతి పలుకుతున్నది. "ప్రజయా చ మనుష్యః పూర్ణః"- ఋషి ఋణం, దేవర్ణం తీరిపోయినా, పితౄణం తీరకపోతే జనులు ముక్తిని పొందలేరు. చివరిదైన పితౄణం తీరిపోతే, అంటే సత్సంతానాన్ని పొందితే పూర్ణ మానవుడుగా విరాజిల్లుతాడని వేదం ఘోషిస్తున్నది.

*"శ్రియః పతిః శ్రీమతి శాసితుం జగజ్జగన్నివాసే వసుదేవ సద్మని"*- (మాఘ కవి). (శ్రియఃపతియైన శ్రీకృష్ణుడు జగత్తును శాసించడానికి జగత్తులో ఒక మూలలో నున్న వసుదేవుని సదనమందు జనించడం వల్ల, అవిద్యాది సకల బంధాలనుంచి నివర్తింపజేసే భగవత్సన్నిధిలో నుండగా- వసుదేవునికి నిగళాల విగళనం అద్భుత కృత్యమా? ఆశ్చర్యం కానే కాదని తాత్పర్యం.

అర్థాపత్త్యలంకారంచే అనుప్రాణితమైన (సామాన్యంచేత విశేషార్థాన్ని సమర్థించే) అర్థాంతరన్యాసాలంకారంచే సుశ్లోకితం.

209. *ఉదిత మాత్మని దేవక సంభవా*
*దనుజ భేదన మంకగతం దధౌ।*
*కమపికాంచన భూభృద ధిత్యకా*
*హరి హయోపల శృంగమివాద్భుతమ్॥* 12

**అర్థం:** దేవక సంభవా= దేవకుని పుత్రికయైన దేవకీదేవి; ఆత్మని= తన యందు; ఉదితం= పుట్టినట్టి; అంకగతం= ఒడిలో కూర్చున్నట్టి; దనుజ భేదనం= రాక్షసులను చీల్చి చెండాడునట్టి, శ్రీకృష్ణుణ్ణి; కాంచన భూభృత్, అధిత్యకా= బంగారు కొండ- మేరుపర్వతం యొక్క మీదనున్న భూమి; కం, అపి= అనిర్వచనీయ రూపమైనందుననే; అద్భుతం= ఆశ్చర్యమైన; హరిహయ+ఉపల శృంగం, ఇవ= ఇంద్రనీలమనే రత్నం యొక్క శిఖరమును వలె; దధౌ= ధరించెను.

**తా॥** దేవకుని కూతురైన దేవకీదేవి తన కన్న బిడ్డడైన, అసుర సంహారకుడైన శ్రీకృష్ణుణ్ణి తన ఒడియందు- అంకమందు కూర్చుండబెట్టుకొన్నది. ఈ దృశ్యం ఎట్లున్నదో ఉత్తరార్ధం వివరిస్తున్నది.

బంగారుకొండ అనబడే మేరుపర్వతం పైనున్న భూమి, ఆశ్చర్యకరమైన, ఒక విలక్షణమైన ఇంద్రనీలమనే రత్నశిఖరాన్ని ధరించినట్లున్నది. 'కాంచన భూభృదధిత్యకా' అనేది ఉపమానం. దేవకీదేవి ఉపమేయం. శ్రీకృష్ణుడు ఉపమేయం. హరిహయోపలశృంగం ఉపమానం.

*"క్రీడాంబు యంత్రే శృంగోఽ స్త్రీ పర్వతాగ్ర ప్రభుత్వ యోః"*- అనే నిఘంటువును బట్టి 'శృంగ' శబ్దం పుంలింగమందు కూడా ఉన్నది. ఇవ= ఉపమావాచకం. 'దధౌ' అనేది సాధారణ క్రియాపదం. కాబట్టి ఇది ఉపమాలంకారం.

*210. విధృత శంఖరథాంగ గదాంబుజః*
*శబలితః శుభయా వనమాలయా।*
*పితురసూతముదం పృథుక స్తదా*
*జలధి డింభనిభో జననీ ధృతః॥* 13

**అర్థం:** విధృత శంఖరథాంగ గదా+అంబుజః= ధరింపబడిన శంఖం, చక్రం, గద, కమలం కలిగియున్నట్టి/ ధరింపబడిన శంఖాలు, చక్రవాక పక్షుల ధ్వనియు,

కమలాలు కలిగియున్న; శుభయా= మనోజ్ఞమైన; వనమాలయా= వైజయంతి అనే పూలమాలచేత; శబలితః= చిత్ర వర్ణాలుగలవాడు కనుకనే; జలధి డింభనిభః= సముద్ర శిశువువలె శ్యామల వర్ణంతో ప్రకాశించే; జననీధృతః= తల్లిచే ధరింపబడినట్టి; పృథుకః = అర్భకుడు (శ్రీకృష్ణుడు); తదా= అప్పుడు; పితుః= తండ్రికి; ముదం= సంతోషాన్ని; అసూత= కల్పించెను.

**తా॥** దేవకి తన ఒడిలో నుంచుకొన్న అర్భకుడైన శ్రీకృష్ణుడు తన మీది ఎడమచేత శంఖాన్ని, కుడిచేత చక్రాన్ని, క్రింద ఎడమచేత కౌమోదకి అనే గదను, కుడిచేత తామర కమలాన్ని ధరించి, మనోజ్ఞమైన వనమాల అనబడే ఐదు వన్నెల పూలమాలచేత నానావర్ణాలతో చిత్రింపబడి యున్నాడు. కాబట్టి, శంఖాలు, చక్రవాక పక్షుల ధ్వనియు, తామర కమలాలను ధరించి మనోహరమైన తీరాల యందలి, ద్వీపాల యందలి వనాల పంక్తులచే పలు వన్నెలతో చిత్రింపబడిన సముద్రపోతం లాగా శోభిస్తూ- సముద్రంవలె శ్యామలవర్ణ శోభితుడైన శ్రీకృష్ణుడు తండ్రికి ఒక ఆనందమనే కన్యను ప్రసవింపజేశాడు. అంటే తల్లి ఒడిలోనున్న శ్రీకృష్ణుడు వసుదేవునికి చాలా సంతోషాన్ని కలిగించాడని తాత్పర్యం.

*"గద వ్యక్తాయాంవాచి"* అనే ధాతువుకు ధ్వని యనే అర్థం చెప్పబడింది. ఈ శ్లోకమందు శ్లిష్టపదాలున్నాయి. శ్లేషాలంకార భూషితమైన శ్లోకమిది.

*211. పితర మబ్జభువా మనపాయినం*
*ప్రియతమాంకగతం పరిపశ్యతా।*
*స విభు రానక దుందుభినా మహాన్*
*అవితథైః స్వగుణై రభితుష్టువే॥* 14

**అర్థం:** అబ్జ భువాం= బ్రహ్మలకు; అనపాయినం= అపాయం లేని- నిత్యసిద్ధమైన; పితరం= తండ్రియైన నారాయణుణ్ణి; ప్రియతమా+అంకగతం= భార్యయైన దేవకియొక్క ఉత్సంగమందు ఉన్న తనయుణ్ణి; పరిపశ్యతా= బాగా

చూస్తున్న; ఆనక దుందుభినా= వసుదేవునిచేత; సః= ఆ బ్రహ్మలకు తండ్రియైన; మహాన్= పూజ్యుడైన; విభుః= సర్వవ్యాపకుడైన శ్రీకృష్ణ భగవానుడు; అవితథైః= అమోఘమైన– సత్యమైన; స్వగుణైః= స్వామియొక్క కల్యాణ గుణాలతో; అభితుష్టువే= స్తోత్రం చేయబడెను.

**తా॥** నారాయణుడు ప్రతికల్పమందు వేర్వేరు బ్రహ్మలకు నిత్యసిద్ధుడైన తండ్రిగా ఉండేవాడు. సర్వవ్యాపకుడై అఖిలలోక పూజ్యుడైన శ్రీకృష్ణభగవానుడు, తన పత్నియైన దేవకీదేవి ఒడిలో పొందికగా ఉన్న దృశ్యాన్ని చూచిన వసుదేవుడు, సకల కల్యాణ గుణాలచేతనూ, సత్యసంకల్పంచే శోభిస్తున్నాడని తనివిదీర స్తుతించాడు. పితామహులకు పితృదేవుడైన సర్వేశ్వరుడు తనను తండ్రిగా చేసుకొన్నాడనే భావనచేత భగవద్వైభవాన్ని వసుదేవుడు మనసార స్తుతించాడు.

*212. ప్రణిపతామి భవన్త మనన్యధీ*
*రఖిలకారణ మాశ్రిత తారణమ్।*
*అనుగమాదనిదం ప్రథమా గిరః*
*కిమపి యత్పద మేక మధీయతే॥* 15

**అర్థం:** అఖిల కారణం= సర్వజగత్కారణుడవైన; ఆశ్రిత తారణం= శరణాగతులకు ఉత్తారకుడవైన; భవంతం= నిన్ను; అనిదం ప్రథమాః= అనాదియైన వేదవాక్కులు; కిం, అపి= పరిచ్ఛేదింప శక్యం కానట్టి; ఏకం= ముఖ్యమైన; యత్ పదం= ఎవనియొక్క స్వరూపాన్ని; అనుగమాత్= పొంది; అధీయతే= స్మరిస్తున్నాయో; తం= అట్టి; భవంతం= నిన్ను; అనన్య ధీః (సన్)= ఇతరులను కోరని మనస్సు కలవాడనై; ప్రణిపతామి= ప్రణమిల్లుతున్నాను (అనుగమాత్– 'ల్యబ్‌లోపే పంచమీ'– ప్రాప్య– పొంది అని అర్థం).

**తా॥** సర్వజగత్కారణుడైనట్టి, ఆశ్రితులైన శరణాగతులైన వారిని సంసారం నుంచి తరింపజేసేవాడు భగవానుడు.

*"సర్వే వేదాయత్పద మామనంతి, తపాంసి సర్వాణిచ యద్వదంతి।*
*యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి, తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి॥*
*ఓమిత్యేతత్॥"*- (కఠోపనిషత్- 2వల్లి. 15)

ఇందు పదమంటే (పద్యతే భక్తజనైరితి పదం) భక్తులచేత పొందదగిన భగవంతుని స్వరూపం అని అర్థం. ప్రపన్నునికే ప్రాప్య స్థానమది. వేదాలన్నీ ప్రాప్యమైన ఏ బ్రహ్మతత్త్వాన్ని సమగ్రంగా నిరూపిస్తున్నాయో, ఉపాసనాత్మకమైన (తపాంసి) బ్రహ్మవిద్యలన్నీ ఏ బ్రహ్మతత్త్వాన్ని చెప్పుతున్నాయో, ఏ బ్రహ్మతత్త్వాన్ని పొందగోరేవారు గురుకుల మందు ఇంద్రియ నిగ్రహాది బ్రహ్మచర్య నియమాలను పాటిస్తూ గురూపదేశంచేత బ్రహ్మోపదేశాన్ని పొంది చిరకాలం ఉపాసన తత్పరు లవుతున్నారో, ప్రాప్యమైనట్టి ఆ బ్రహ్మ స్వరూపాన్ని గూర్చి ఒక్కమాటలో చెబుతాను. ఆ మాటయే ప్రణవం- ఓంకారం. ఈ పదమందే బ్రహ్మతత్త్వమంతా ఇమిడి ఉన్నది.

*"సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం"*- అధ్యవసాయ జ్ఞానాన్ని సారథిగా కల్గి, మనస్సు అనబడే కళ్ళెం కలవాడైన మానవుడు సంసార మార్గానికి ఆవలనుండే శ్రీమహావిష్ణువునకు ఉత్తమ నివాసస్థానమైన, పునర్జన్మలేని ఆ శ్రీవైకుంఠాన్ని పొందుతాడు.

ఇట్లు అనాదియైన వేదవాక్కులు ఏ పరబ్రహ్మతత్త్వాన్ని కీర్తిస్తున్నాయో, అట్టి పరబ్రహ్మ స్వరూపుడవైన నిన్ను ఇతర విషయాలను అపేక్షించని మనస్సు- ఆకించన్యం- కలవాడనై స్తుతిస్తూ నమస్కరిస్తున్నాను- అని వసుదేవుడు దేవకీ నందుణ్ణి స్తోత్రం చేశాడు.

*213.* *విషమ కర్మ విపాక పరంపరా*
*వివశవృత్తిషు దేహిషు దుస్తరమ్।*
*కరుణయా తవ దేవ! కటాక్షితాః*
*కతిచి దేవతరంతి భవార్ణవమ్॥* 16

**అర్థం:** విషమకర్మ విపాక పరంపరా వివశవృత్తిషు= దురన్తమైన కర్మల యొక్క ఫలప్రదాన పరంపరచేత వశమందులేని నడవడిగల; దేహిషు= జీవులలో; హేదేవ= ఓ దేవా!; తవ= నీ యొక్క; కరుణయా= కృపచేత; కటాక్షితాః= కటాక్షింపబడిన; కతిచిత్, ఏవ= కొందఱు మాత్రమే; భవ+అర్ణవం= సంసారం అనబడే సముద్రాన్ని; తరంతి= దాటుతుంటారు (అని వసుదేవుడు స్తుతిస్తున్నాడు).

**తా॥** ఓ దేవా! దుష్కర్మల బలంచేత సంసారమందు పలుజన్మలను అనుభవించేవారు జీవులు. వీరిలో భగవత్కృపా కటాక్ష పాత్రులైన భక్తజనులు కొందరు మాత్రమే సంసారమనే కడలినుంచి కడదేరుతారు. భగవంతుణ్ణి ఆశ్రయించడం కూడా భగవత్కృపాయత్తమే కదా!

*214.* *త్వదనుభావ మహోదధిశీకరై*
*రవశపాతిభి రాహిత శక్తయః।*
*అవధి భేదవతీ ముపభుంజతే*
*స్వపద సంపద మబ్జ భవాదయః॥* 17

**అర్థం:** అబ్జభవాదయః= బ్రహ్మాది దేవతలు; అవశపాతిభిః= కోరనప్పటికీ అవశ్యంగా వచ్చిపడినట్టి; త్వత్+అనుభావ మహోదధి శీకరైః= నీ యొక్క ప్రభావమనే సముద్ర జలబిందువులచేత; ఆహితశక్తయః (సంతః)= ఉత్పాదింపబడిన తమ తమ అధికారాలను నిర్వర్తించే సామర్థ్యం కలవారవుతూ, అవధి భేదవతీం= మర్యాదా భేదం కలిగినట్టి; స్వపద సంపదం= తమ తమ సత్యలోకాది సంపదను; ఉపభుంజతే= అనుభవిస్తున్నారు.

**తా॥** ఓ దేవా! బ్రహ్మాది దేవతలు తాము అపేక్షింపకున్ననూ అవశ్యంగా సంప్రాప్తమైనట్టి నీ మహిమ అనే సముద్రపు నీటి తుంపరలచేత నీ యొక్క కొద్దిపాటి ప్రభావంచేతనే ఏర్పరచబడిన తమ తమ అధికారాలను నిర్వహించే శక్తి కలవారు కదా!

*"వశ ఆయత్తతా యాం స్యాత్ వశమిచ్ఛా ప్రభుత్వయోః।*
*వివశః స్యా దవశ్యాత్మానిష్ట దుష్టధియో రపి॥"* (విశ్వ. ని.)

ఆ దేవతలు తమకేర్పరచబడిన అధికార పదవులందలి వైభవాలను నీ ప్రభావలేశంచేత అనుభవిస్తున్నారు.

*"ఏక ఏవ జగత్స్వామీ శక్తిమాన్ అచ్యుతః ప్రభుః।*
*బ్రహ్మేంద్ర యమ వహ్నీందు దివాకర మనుగ్రహాః।*
*తచ్ఛక్త్యా విష్టితాః సర్వే మోదంతే దివి దేవతాః॥"* (పురాణాలు)

అచ్యుత భగవానుడొక్కడే సర్వజగత్కారణుడైన శక్తిగల ప్రభువు. చతుర్ముఖ బ్రహ్మ, ఇంద్రుడు, యముడు, అగ్ని, చంద్రుడు, సూర్యుడు మొదలైన దేవతలు ఆ సర్వేశ్వరుని అనుగ్రహ బలంచేత పొందిన పదవులందు ఆధిపత్యం వహించి ఆనందిస్తున్నారు- అని పురాణాలు బోధిస్తున్నాయి (వసుదేవుడు శ్రీకృష్ణుని మహిమను స్తుతిస్తున్నాడు).

*215. శ్రుతి కిరీట శుభాశ్రయ విగ్రహః*
*పరమ సత్త్వనిధిః ప్రతి పద్యసే।*
*జగదనుగ్రహ మారుత చోదితో*
*వివిధ రూప తరంగ వికల్పనామ్॥* 18

**అర్థం:** శ్రుతి కిరీట శుభాశ్రయ విగ్రహః= ఉపనిషత్తులచే అలంకరింపబడిన కిరీటం, శుభత్వం, ఆశ్రయత్వంగల మూర్తిని కలిగియున్నట్టి; పరమ సత్త్వనిధిః= ఉత్కృష్టమైన సత్త్వగుణం యొక్క నిధివైన నీవు; జగత్+అనుగ్రహ మారుత చోదితః (సన్) లోకానుగ్రహమనే వాయువు చేత ప్రేరితుడవవుతూ; వివిధ రూపతరంగ వికల్పనాం= పలు అవతారాలు (రూపాలు) అనే తరంగాల రచనను; ప్రతి పద్యసే= పొందుతున్నావు.

**తా॥** హే భగవన్! నీ దివ్యమంగళ విగ్రహం వేదాంతాలనే ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడుతున్నది. కిరీటం ప్రభుత్వ లక్షణం. శుభాశ్రయత్వం కలది నీ మూర్తిత్వం, అంటే యోగులు ధ్యానం చేయడానికి సులభమైన ఆలంబనం- ఆధారంగా ప్రకాశిస్తుంది. రజస్తమస్సులతో కలియకుండా ఉండే ఉత్కృష్టమైన సత్త్వగుణానికి నిధి యైనది నీ రూపం. నీవు లోకాన్ని అనుగ్రహించడం కోసం గాలిచే చలింపబడిన అనేక రూపాలు అనే కెరటాల యొక్క కల్పన చేస్తుంటావు.

జగదనుగ్రహార్థమై నీవు అనేక అవతారాలను పొందుతావు అనే విషయంలో వాయువుచే ప్రేరితమైన వివిధ తరంగాలను కల్పన చేస్తావనడం రూపకాలంకార వాక్యమిది. అనుగ్రహంచేత వివిధ రూపాలను ధరిస్తాడు భగవంతుడు. గాలిచే చలించిన వివిధ తరంగాలుగా రూపాలు- అవతారాలు ఆరోపింపబడినాయి. ఇట్లు ఏక దేశవర్తి రూపకంచేత భగవంతుని యందు సముద్రత్వం ప్రతీయమాన మవుతుంది.

సముద్రపరమైన అర్థం ఇలా ఉంది:- ఉపనిషత్ప్రతి పాదితమైన, అలంకృతమైన శేషశాయియైన భగవానుని శుభాశ్రయ విగ్రహం కలది సముద్రం. 'పరమసత్త్వనిధిః' అంటే ఉత్కృష్టమైన శంఖాలకు, (శుక్తికలకు) ముత్యపు చిప్పలకు, తిమి, తిమింగలాది జంతువులకు నిధి- ఆకరమైనట్టిది సముద్రం. అనుగ్రహ కారణంగా కల్పించుకొన్న రూపాలే అవతారాలే గాలిచే కల్లోలితాలైన అలలు కలది సముద్రం. సత్త్వ శబ్దానికి నానార్థాలున్నాయి.

*"సత్త్వం గుణే పిశాచాదౌ బలే ద్రవ్య స్వభావయోః।*
*ఆత్మని వ్యవసాయేఽపి చిత్తే ప్రాణిషు"* (విశ్వ. ని.)

*216.* *త్వయిన దేవ యదా యతతే న తత్*
*జగతి జంగమ మన్య దథాపి వా।*
*ఇతి మహిమ్ని తవ ప్రమితే పరం*
*విభజనే వివిధైః స్థిత మాగమైః॥* 19

**అర్థం:** హే దేవ= ఓ దేవా!; త్వయి= నీ విషయమై; యత్= ఏది; న, ఆయతతే= అధీనమందు లేదో; తత్= అది; జంగమం= చరవస్తువు; అథ= మరియు; అన్యత్, అపి, వా= మరొక స్థావర- అచర- వస్తువైనను కూడా; జగతి= ప్రపంచమందు; న= లేదు; ఇతి= ఈ విధంగా; తవ= నీ యొక్క; మహిమ్ని= ప్రభావం; ప్రమితే (సతి)= పరిచ్ఛిన్నం-కొలువబడుతున్నది, అవుతుండగా; వివిధైః= అనేకములైన; ఆగమైః= శాస్త్రాలచేత; విభజనే, పరం= వివరించడమందే; స్థితం= స్థిరంగా ప్రవర్తింప బడుతున్నది.

**తా॥** ఓ దేవా! నీ యధీనమందు లేని చరాచర వస్తుజాతం ప్రపంచమందు లేదు. ఇట్లు సర్వజగత్తు నీ వశమై యున్నదనడమే కాక, నీ మహిమను శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణ, పాంచరాత్రాది శాస్త్రాలన్నీ వివరించి చెప్పడానికే ప్రవర్తిస్తున్నాయని వసుదేవుడు స్తుతిస్తున్నాడు.

'జంగమం అన్యత్' అనడం వల్ల చేతన, అచేతన మనే రెండు విధాలైన సృష్టి చెప్పబడింది. 'అథాపివా' అనడంచేత సమష్టి సృష్టికి కారణతత్త్వమైన నిత్య విభూతి కూడా గ్రహింపబడుతున్నది. ఇట్లు విశ్వమంతా నీ యధీనమందే యున్నదని చెప్పడమే కాదు, నీవు చరాచర వస్తువులలో అంతర్యామివై యున్నావనీ, పారతంత్ర్యం కూడా సిద్ధమై యున్నదని భగవన్మహిమ సకల శాస్త్రాలచే విస్తారంగా బోధింపబడుతున్నదిగా వసుదేవుని వినుతి.

*217.* *అఖిల లోక పితుస్తవ పుత్ర తా*
*మహమయాచ మనన్య మనో రథః।*
*వరద! వాంఛిత దాన ధృత వ్రతే*
*త్వయి తదేవ మయత్న మపచ్యత॥* 20

**అర్థం:** హే వరద!= వరప్రసాదివైన ఓ దేవా!; అఖిల లోక పితుః= సమస్త జగత్తుకు తండ్రివైన; తవ= నీ యొక్క; పుత్రతాం= పుత్రభావాన్ని; అనన్య మనోరథః

= వేరే ఒక ఆశ లేనివాడనైన; అహం= నేను; అయాచం= (పూర్వం) కోరియున్నాను; వాంఛితదాన ధృతవ్రతే= కోరినదానిని ఇవ్వడమందు స్థిరమైన నియమంగల; త్వయి= నీ విషయమై; తత్, ఏవ= ఆనాటి ప్రార్థనయే; అయత్నం= ఇప్పుడు ప్రార్థించకుండ గానే; అపచ్యత= పక్వమైనది, ఫలించినది.

**తా॥** హే వరద! జగత్పితవైన నీవే నాకు పుత్రుడవై పుట్టవలెనని పూర్వమెప్పుడో మరొకదాన్ని అభిలషించక నిన్ను ప్రార్థించి యుంటిని. అభీప్సిత వరాన్ని ఇచ్చే దీక్ష కలిగియున్న నిన్ను కంసునిచే హింసింపబడుతున్న ఈ సమయాన మళ్ళీ ప్రార్థించే యత్నం చేయకున్ననూ, అప్పటి ప్రార్థనయే ఇప్పుడు ఫలించిందని వసుదేవుని స్తుతి.

"సకృదేవ ప్రపన్నాయ"- అన్నట్లు ప్రపన్నుడు ఒక్కసారి అకించనుడై ప్రార్థిస్తే చాలు, ఫలం తప్పక లభిస్తుంది కదా! మళ్ళీ మళ్ళీ ప్రార్థించే అవసరం లేదు అనే శాస్త్ర విషయాన్ని స్మరింపజేస్తున్నది ఈ స్తుతి.

*218. అవని భార నిరాకరణార్థినాం*
*క్రతుభుజా మభిలాష మవంధ్యయన్।*
*జిత రిపూణి బహూని దయానిధే!*
*విహరణాని విధాతు మిహార్హసి॥* 21

**అర్థం:** హే దయానిధే= ఓ కృపానిధీ!; అవని భార నిరాకరణ+అర్థినాం= భూమియొక్క బరువును తొలగించడానికి ప్రార్థించినట్టి; క్రతు భుజాం= యజ్ఞ భోక్తలైన దేవతలయొక్క; అభిలాషం= కోరికను; అవంధ్యయన్= విఫలం చేయకున్నవాడవై; జితరిపూణి= జయింపబడిన శత్రువులు గల; బహూని= అనేకములైన; విహరణాని= చేష్టితాలను; ఇహ= ఈ భూలోకమందు; విధాతుం= చేయడానికి; అర్హసి= తగియున్నావు.

**తా॥** భూభారాన్ని పోగొట్టడానికి కోరిన దేవతల కోరికను ఫలింపజేసే కృపా సముద్రుడవైన నీవు పగవారిని జయించే క్రీడలను ఈ అవతారమందు చేయ సమర్థుడవు.

*219. దనుజ మోహన దోహలినా త్వయా*
*సహజ లాంఛన సంవరణం క్షమమ్।*
*తదధునా శమయన్ మమ సాధ్వసం*
*యవనికా మధిగచ్ఛ యథేప్సితమ్॥* 22

**అర్థం:** దనుజ మోహన దోహలినా= రాక్షసులను మోహింపజేసే కోరికగల; త్వయా= నీ చేత; సహజ లాంఛన సంవరణం= సహజమైన చిహ్నాలను కప్పివేయడం- ఆచ్ఛాదించడం; క్షమం= యోగ్యమైనది; తత్= అందువల్ల; అధునా= ఇప్పుడు; మమ= నా యొక్క; సాధ్వసం= భయాన్ని; శమయన్= పోగొట్టుతూ; యథా+ఈప్సితం= కోరబడిన రీతిగా; యవనికాం= తెరరూపమైన వేరే రూపాన్ని; అధిగచ్ఛ= గ్రహింపుము- పొందుము.

**తా॥** ఓ కరుణానిధీ! నీవు రాక్షసులను, దుష్టులను మోహింపజేసే ఇచ్ఛను కలవాడవు. కాబట్టి, నీ సహజ చిహ్నాలైన నాలుగు భుజాలను శంఖచక్రాది లక్షణాలను దాచుకోవడం మంచిది. నీవు సామాన్య మనిషివే అని భావించే అవకాశం ఉంటుంది. అప్రాకృత రూపంతో ఉన్న నిన్ను, ఇప్పుడున్న నీ స్వరూపాన్ని దర్శిస్తున్న నాకు భయం కలుగుతున్నది. నీవు శిశువుగానే ఉండి క్రమంగా వృద్ధిపొందడం అవసరమని అపేక్షిస్తున్నాను. నీ శక్తిని దాచడం వల్లనూ, రాక్షసులచే బాధ కలుగుతుందనే నా భయాన్ని తొలగించడానికి నీవు ఈ నీ సహజ లక్షణాలకు తెరవేసి ఆచ్ఛాదించుకోవయ్యా స్వామీ! ఈ అప్రాకృత రూపాన్ని దాచుకొని ప్రాకృత శిశువువలె ప్రవర్తించవయ్యా! వసుదేవుడు ఈ విధంగా స్తోత్రం చేయడంవల్ల నా పుత్రుడవని ఇతరులు భావించకుండా, ఈ రూపానికి ముసుగువేసి

రూపాంతరాన్ని ధరించవయ్యా అనడం వల్ల, నందగోకులానికి పయనించే ప్రార్థన అభివ్యక్త మవుతుంది. వేరే రూపాన్ని ధరించి, మరొకచోట పెరగడం మంచిదని ప్రార్థన.

"దోహలం దోహదం ఛందః"- అనే నిఘంటు ప్రమాణం వల్ల దోహల శబ్దానికి 'ఇచ్ఛ- కోరిక' అని అర్థం. 'క్షమ' శబ్దం "యోగ్యశక్తహితాః క్షమాః" (అమరం). యోగ్యమనే అర్థమిస్తుంది.

నీవు ఈ అప్రాకృతమైన స్వరూపంతో ఉంటే దనుజులు పారిపోతారు. వారిని మోహింపజేసి వారు నీ దగ్గరికి రావడానికి కూడా, నీ స్వరూపం గోపనీయమనే అర్థమూ ఉన్నది.

*220. ఇతి సభీత మవేక్ష్య దయానిధిః*
*స్మితముఖో వసుదేవ మభాషత।*
*త్వమసి మేజనకః కిమిహాన్యథా*
*కిమపితాత! ముధాకథితం త్వయా॥* 23

**అర్థం:** ఇతి= ఈ విధంగా; భీతం= భయపడిన; వసుదేవం= వసుదేవుణ్ణి; అవేక్ష్య= చూచి; సః= శంఖచక్రాది పర రూపంతో ఉన్నట్టి; ఆ, దయానిధిః= దయా సముద్రుడు; స్మితముఖః= నగుమోము కలవాడై; అభాషత= పలికెను; త్వం= నీవు; మే= నా యొక్క; జనకః, అసి= కన్నతండ్రివై ఉన్నావు; ఇహ= ఈ విషయంలో; అన్యథా= వేరే విధం; కిం= ఏమి (ఉన్నది); తాత= ఓ తండ్రీ!; త్వయా= నీ చేత; కిం, అపి= ఏదో; ముధా= వ్యర్థంగా; కథితం= చెప్పబడింది.

**తా॥** శంఖ చక్రాదులను ధరించిన నాలుగు చేతులున్న పరరూపాన్ని మార్చుకోవలసినదని భయపడి మాటాడుతున్న వసుదేవుణ్ణి జూచి, దయానిధి చిన్నగా నవ్వుతూ ఇలా పలికాడు- నీవు నన్ను కన్నతండ్రివి. తండ్రి పల్కవలసిన రీతిగా పల్కకుండా, ఎందుకు వేరేవిధంగా మాట్లాడుతున్నావు?

"ప్రణిపతామి భవంతమనన్యధీః"- (15వ శ్లో.) నీ యందే మతిని నిల్పి నమస్కరిస్తున్నాను- అని తండ్రీ! పుత్రుల విషయంగా తండ్రులు అనరాని, చెప్పరాని మాటలనేవేవో నీవు అంటున్నావేమి? అలాగా చెప్పతగదు- అని ఒక అర్థం.

'సభీతం' అనియు, సః, భీతం అని కూడా వేర్వేఱుగా చెప్పవచ్చును. చిరునవ్వుతో పలుకడంలో విశేషమేమిటంటే- నేను తండ్రికి చెప్పదగని మాటలను అనుచితంగా నీవు పల్కుతున్నావు. చతుర్భుజత్వ రూపాన్ని మార్చి సామాన్య శిశువుగా ఉండమంటావేమి? అన్యథా ఇహకిమ్? పుత్రుని విషయంలో మరొక రీతిగా మారుమనడం యుక్తమా? కన్నతండ్రివి నీవే భయంతో ఏదేదో మాటాడుతున్నావు. అది నాకు స్వీకరింపతగినదిగా లేదు. తండ్రీ! నేను ఈ రూపంతో శిశువుగానే, ఇక్కడనే ఉండి కూడా (కంసాది) దనుజులను వధించడం నాకు సుకరమే. నీవు 'అన్యథా' పల్కడం 'ముధా' (నీవు నా కన్నతండ్రివి. నందుడు పెంచి పోషించే తండ్రి. కన్న కొడుకు విషయంలో తండ్రి స్వయంగా అన్యథా- మరొక విధంగా వర్తింపుమనడం సముచితం కాదే. అయినా, తండ్రీ! నీ మాటను పాటించడం అనుసరించడం నాకు యుక్తమే అని మరొక అర్థం.

*221.* *ఇయ మమర్త్య పితుస్తవగేహినీ*
*దివిషదాం జననీ మమచానఘా।*
*అభిమతం యువ యోార నవగ్రహం*
*సమయభావిమయైవ సమర్థ్యతే॥* 24

**అర్థం:** అనఘా= పూజ్యురాలైన; అమర్త్య పితుః= దేవతలకు తండ్రివైన; తవ= నీ యొక్క; గేహినీ= పత్నియైన; దివిషదాం= ఇంద్రాది దేవతలకూ; మమ, చ= నాకు కూడా; జననీ= తల్లి; ఇయం= ఈ దేవకీదేవి; యువయోః= మీ ఇద్దరికి; అభిమతం= ఇష్టమైన కృత్యం; అనవగ్రహం= ప్రతిబంధకం లేకుండా, సమయభావి= సరియైన కాలాన జరుగునట్టిది; మయా, ఏవ= నా చేతనే; సమర్థ్యతే= సంపాదింపబడును.

**తా॥** ఇంద్రాది దేవతలకు కాశ్యపరూపంలో ఉండిన నీవే తండ్రివి. నీ గృహిణియైన ఈ దేవకీదేవియే అదితి రూపంలో ఉండిన పూజ్యురాలు. ఈమె ఇప్పుడు మొదలైన దేవతలకూ, ఉపేంద్రుడనే పేరుతో ఉండిన నాకు కూడా (అప్పుడు) తల్లియే. ఇప్పుడు మీ ఇద్దరికీ పుత్రుడనైన నేను మాత్రమే మీకిష్టమైన కంసుణ్ణి కడతేర్చే కార్యాన్ని నిర్విఘ్నంగా నెరవేర్చుతాను. ఎవరికైనా కాలం కలిసి రావాలి. సరియైన కాలం కోసం ఎదిరి చూడాలి. కౌమారావస్థ తర్వాత కంసవధ నేనే అవశ్యంగా చేస్తాను. సర్వశక్తిగల నీ విప్పుడే ఎందుకు చేయకూడదు? అనే శంకను నివారిస్తూ 'సమయభావి' అనే పదప్రయోగంతో ఎక్కడ ఉన్ననూ మరువకుండా అవశ్యంగా మీ ఇష్టాన్ని నిర్వర్తిస్తానని ప్రతిజ్ఞను చేశాడు శ్రీకృష్ణుడు.

*222. యది బిభేషి భజామి మనుష్యతా*
*మథచ మాం నయ నంద గృహం క్షణాత్।*
*దుహితరంచ సమానయ తస్యతాం*
*గత భయోభవ దూరగతేమయి॥* 25

**అర్థం:** నీవు ఇప్పుడు చేయవలసిన ఒక పని ఉన్నది, అని తండ్రితో శ్రీకృష్ణుడు చెబుతున్నాడు:

యది బిభేషి= నీవు భయపడుతున్నావు, అయితే (అహం= నేను); మనుష్యతాం= మానవరూపాన్ని; భజామి= పొందుతాను; అథ= తర్వాత; మాం= నన్ను; నందగృహం= నందుని ఇంటికి; క్షణాత్= క్షణకాలంలోనే; నయ= తీసుకొని పొమ్ము; తస్య= ఆ నందుని యొక్క; తాం= (ఇప్పుడే పుట్టినట్టి); ఆ= దుహితరం, చ= పుత్రికను కూడా; సమానయ= (ఇక్కడికి) తెచ్చుకొనుము; మయి= నేను; దూరగతే (సతి)= దూరంగా ఉండగా; గత భయః= నిర్భయుడవై; భవ= ఉండుము.

**తా॥** తండ్రీ! నా యీ పరరూపం నీకు చూడశక్యం కాకున్నది కదా! అందుకే నీవు భయపడుతున్నావు. అయితే, నేను మనుష్య రూపాన్ని పొందుతున్నాను.

వెంటనే- క్షణకాలంలోనే నన్ను నందుని ఇంటికి చేర్చుము. అక్కడ నందునికి ఇప్పుడే పుట్టిన అతని పుత్రికను ఇక్కడికి తెచ్చుకొనుము. నందునికి నా యందు తన సంతానమనే భ్రాంతి కలుగుతుంది. అట్లే నీకు పుట్టినది పుత్రికయే కాని పుత్రుడు కాడనే భ్రాంతి కంసునికి కలుగుతుంది. కంసుడు నీ సంతానమేది? ఎక్కడున్నది? అని కోపావేశంతో వచ్చి అడిగితే, ఇదో! ఈ కన్యయే ఈ బిడ్డయే నా సంతానం అని చెప్పవయ్యా! నిర్భయంగా చూపించు.

*గతభయోభవ దూరగతేమయి:*- నేను ఇక్కడ ఉంటే, జరుగరానిదేదైనా జరుగుతుందనే భయం నీకుంటుంది. కాబట్టి, దూరంగా ఉండడం ఆవశ్యకం. నేను నందుని ఇంటిలో దూరంగా ఉంటే, నన్ను పోషించి, రక్షించే విషయమై నీవు భయపడవలసిన అవసరం లేదు.

మమ్ము రక్షించేవాడు దూరంగా ఉన్నాడు. కాబట్టి, కంసునివల్ల మాకేదైన ఆపద సంభవించునేమో అనే భయం మీకు కలుగకూడదు. నా రక్షణ విషయంలో కానీ, మీరు, మీ రక్షణ విషయంలోకానీ భయాన్ని వదలండి. నేను ఇప్పుడు చెబుతున్నట్లే మీరు ప్రవర్తించి, నిర్భయంగా ఉండండి అని శ్రీకృష్ణుడు ప్రస్తుతం హితమైన కార్యాన్ని ఆలస్యం చేయక ఆచరించడం ఆవశ్యకమని వసుదేవుణ్ణి ప్రోత్సహించాడు.

223. *అథనిశమ్య నియోగమభంగురం*
*మధుజితో మధురాక్షర మంథరమ్।*
*హితమిదం ప్రతిపద్య తమాదదే*
*గురుతరం కృపయా లఘుతాంగతమ్॥* 26

**అర్థం:** అథ= తర్వాత (అయం= ఈ వసుదేవుడు); అభంగురం= ఎప్పుడూ మరొక విధంగా కానట్టి; మధుర+అక్షర, మంథరం= కమ్మని అక్షరాలు కలిగినదై మృదువుగా ప్రసరించునట్టిదైన; మధుజితః= శ్రీకృష్ణుని వలన; నియోగం= ఆజ్ఞాపించ

బడిన మాటను; నిశమ్య= విని; ఇదం= శ్రీకృష్ణుణ్ణి నందగృహానికి తీసుకొనిపోవడమనే; హితం= హితమైన కృత్యాన్ని; ప్రతిపద్య= విచారించి; గురుతరం= మిక్కిలి బరువైన (తనను) దాన్ని; కృపయా= దయచేత; లఘుతాం= తేలికగాను; గతం= పొందినట్టి; తం= ఆ శిశువును (కృష్ణుణ్ణి); ఆదదే= (నందగృహానికి గొనిపోవుటకు) స్వీకరించెను.

**తా॥** తిరుగులేనిదీ, మధురాక్షరాలను కలిగి మృదువుగా పల్కబడిన శ్రీకృష్ణుని మాటను విన్నాడు వసుదేవుడు. నందుని ఇంటికి తీసుకని పోవలసినదన్న మాట హితమైనదనుకొన్నాడు. కృపచేత బరువు తేలిక కాగా, ఆ శిశువు నెత్తుకొన్నాడు వసుదేవుడు.

*గురుతరం కృపయా లఘుతాం గతమ్:*– శ్రీకృష్ణభగవానుడు గురువు. జగత్పిత జగదాచార్యుడు.

*"పితా పుత్రేణ పితృమాన్ యోని యోనౌ"*– అని వేదవాక్యమున్నది. దాని అర్థమిది: పితా= సర్వజగత్తుకు తండ్రియైన పరమాత్మయే; యోని యోనౌ= పలు జన్మలలో; పుత్రేణ= తానే సృజించిన కుమారునితో; (దశరథ వసుదేవాదులతో); పితృమాన్= మంచి తండ్రిని కలవాడు. తండ్రివల్ల పుత్రునికి పిత్రానందం; పుత్రునివల్ల తండ్రికి పుత్రానందం. ఉభయనిష్ఠం. 'పితృమాన్' శబ్దంలో ఏకశేష వృత్తి చేత 'మాతృమాన్' అని (మాతాచ పితాచ= పితరౌ) మాతృ శబ్దం కూడా గర్భితమైనది.

'పితృమత్' పదంలోని 'మత్' ప్రత్యయం ప్రశస్తివాచకం. కాబట్టి, పితృమాన్ శబ్దానికి ప్రశస్తిని గన్న తల్లిదండ్రులు కలవాడై, ఆనందాన్ని పొందువాడని అర్థం. ఇది భగవల్లీలా రసస్ఫోరకం.

*"లోకవత్తులీలా కైవల్యమ్"*– అనే బ్రహ్మసూత్రంలో ఈ అర్థం గర్భితం. ఇంతేకాక *"స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"*– అనే వేద వాక్యం కూడా 'భగవానుడు జన్మించగా, జన్మించగా సానపట్టిన మాణిక్యం లాగా అధికంగా ప్రకాశిస్తుంటాడు' అనే అర్థాన్ని తెల్పుతున్నది.

"పలపిఅప్పా యొళి వరుముషనలమ్"- (తి.వా.మొ.షి. 1-3-2) అనే కావతారాలను కలిగియున్న భగవానుడు, అవతరించేకొద్దీ ప్రకాశించే కల్యాణ గుణాలు కలవాడు- అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. కర్మమూలంగా కాక, కృపామూలకంగా భగవానుడు అవతరిస్తాడు. కాబట్టి, జన్మించే కొద్దీ గురుత్వం, కాంతి మరెంతో మించి వృద్ధి చెందుతుంది.

ఇక్కడ, పూర్వం జగత్పితయైన శ్రీకృష్ణభగవానుడు ఇప్పుడు తనకు తండ్రిగా ఉన్న వసుదేవునితోనూ, వసుదేవుడు తనకు పుత్రుడైన కృష్ణునితోనూ పరస్పరమైన ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

*"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।*
*ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥"* (భ.గీ.)

సాధు పరిత్రాణం, దుష్కృద్వినాశనం, ధర్మసంస్థాపనం అనే మూడు అవతార ప్రయోజనాలు కంఠోక్తములు కాగా, 'చ' కారంచేత ఉభయనిష్ఠమైన ఈ ఆనందానుభవం కూడా నాల్గవదైన భగవదవతార ప్రయోజనమని సూచింపబడినది.

భగవానుడు విశ్వంభరుడు కాబట్టి, తన గొప్ప బరువును దూరంగా మోసుకొనిపోవడం తన తండ్రియైన వసుదేవునికి శక్యం కాదని, తానే దయదలచి తన బరువును తగ్గించుకొని లఘువు- తేలికగా అయ్యాడు.

*224.* *తుహిన భాను దివాకర లోచనం*
*నిగమ నిఃశ్వసితం స్వ సుతస్య తత్।*
*అనుబభూవ ముహుర్ముహు రాదరాత్*
*అనఘ మానన మానక దుందుభిః॥* 27

**అర్థం:** అనక దుందుభిః= వసుదేవుడు; తుహినభాను, దివాకర, లోచనం= శీత కిరణుడైన చంద్రుడు, సూర్యుడు కన్నులుగా కలిగినట్టి; నిగమ నిఃశ్వసితం= వేదం నిట్టూర్పుగా కలిగినట్టి; అనఘం= రమ్యమైనట్టి; స్వ సుతస్య= తన పుత్రుని యొక్క; తత్= ఆ; ఆననం= ముఖమును; ఆదరాత్= ప్రేమవలన; ముహుః, ముహుః = మాటికి మాటికి; అనుబభూవ= చూచుచుండెను.

**తా॥** వసుదేవుడు ఆ శిశువును చేతులతో నెత్తుకొని, సూర్యచంద్రులు నేత్రములుగా ఉన్నట్టి; *"అస్యమహా భూతస్య నిఃశ్వసితమేతద్యత్ ఋగ్వేదో యజుర్వేదః"*– ఆ పరమాత్మయొక్క నిట్టూర్పు ఏదో, అదే ఋగ్వేదం, యజుర్వేదం'– అనే శ్రుతి ప్రకారంగా (కృష్ణభగవానుని) నిట్టూర్పు వేదంగా కలిగినట్టి, తన కుమారుని యొక్క అందమైన ముఖాన్ని చూస్తూ, భగవానుడే యని స్మరిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తుండెను.

*225. శ్రుతి సుగంధి తదానన చంద్రికా*
*ముషిత మోహతమా ముని సం నిభః।*
*అధిజగామ స తన్మయతాం క్షణాత్*
*అనిమిషత్వముత ప్రతి సందధే॥* 28

**అర్థం:** శ్రుతి సుగంధి–తమాః/ శ్రుతి= వేదంచేత; సుగంధి= మంచి పరిమళం కలిగిన; తత్= ఆ పుత్రుని యొక్క; ఆనన= ముఖం యొక్క; చంద్రికా= (వెన్నెల) కాంతిచేత; ముషిత= తొలగింపబడిన; మోహ తమాః= అజ్ఞానం అనే అంధకారం కలిగినట్టి; ముని సంనిభః= మునితో సమానుడైన; వసుదేవుడు; క్షణాత్= త్రుటికాలంలో; తన్మయతాం= తన్మయత్వాన్ని, తదేక సాక్షాత్కార మగ్నత్వాన్ని; అధిజగామ= పొందెను; ఉత= లేదా; సః= ఆ వసుదేవుడు; అనిమిషత్వం= రెప్పపాటు లేమిని, దేవత్వాన్ని; ప్రతిసందధే= తిరిగి మళ్ళీ ధరించెను.

**తా॥** వేద పరిమళాన్ని వీచే పుత్రుని ముఖం యొక్క చంద్రిక కాంతిచేత అజ్ఞానాంధకారం తొలగిపోగా మునివలె ధ్యానమధికమైన రీతిగా ఉండి, ఒక్క

క్షణంలో వసుదేవుడు తన్మయుడై పుత్రుణ్ణి దీర్ఘంగా చూస్తూ ఉండిపోయాడు. కాకపోతే- అథవా రెప్పపాటులేని చూపుతో పూర్వమున్న దేవత్వాన్ని వసుదేవుడు మళ్ళీ పొందినట్లు తాను శ్రీకృష్ణుని ముఖాన్ని తేరిపార చూస్తుండెను.

**వ్యాఖ్య:**- వసుదేవుడు నిర్నిమేషంగా తన కుమారుని ముఖాన్ని ఏకాగ్రంతో చూడడం ఉత్ప్రేక్షితం.

సహజమైన కమ్మని వాసన 'సుగంధం' అనబడుతుంది. అంతకంటె మంచివాసన కలిసినప్పుడు 'సుగంధి' అనే శబ్దం ప్రయోగింపబడుతుంది. శోభనమైన గంధం కలది 'సుగంధి' అనబడుతుందని విగ్రహవాక్యం.

*"గంధస్యేదుత్పూతి సు సురభిభ్యః"*- అనే వ్యాకరణ సూత్రంచేత సుగంధ శబ్దానికి 'ఇత్' ప్రత్యయం చేరగా 'సుగంధి' శబ్దం నిష్పన్నం. సహజమైన ముఖవాసనతో శ్రుతి పరిమళం కలిసింది. కాబట్టి, శ్రుతి సుగంధియైనది శ్రీకృష్ణుని ముఖం.

శ్రీకృష్ణుని ముఖం యొక్క చంద్రిక చేత వసుదేవుని అజ్ఞానమనే చీకటి పారిపోయింది. 'చంద్రిక' అనడం వల్ల ముఖకాంతి నిగరణచేయబడి అధ్యవసించి నందున అతిశయోక్త్యలంకారం. మోహమనే తమస్సు అనడంవల్ల (మోహతమః) రూపకాలంకారం.

ముఖకాంతిచేత, ముషితమైన (దొంగిలింపబడిన) మోహతమస్సు కలవాడు 'ముషిత మోహతమాః' అనబడినవాడు వసుదేవుడు. జ్ఞానం కలిగింది. మునివలె ధ్యానపరుడయ్యాడు. ముఖాన్ని చూస్తూ తన్మయత్వాన్ని పొందినాడు. తాదాత్మ్యాన్ని పొందినాడనే అర్థాన్ని కొందరు చెప్పడం పొసగదు. 'మయట్' ప్రత్యయం 'ఐక్యం' అర్థాన్ని చెప్పదు. తాదాత్మ్యం ఆరోపింపబడలేదు. అంతర్యామి కత్వావిర్భావం కూడా- ధ్యానమని ఇక్కడ చెప్పనందువల్ల- కుదురదు. తన్మయత్వం అంటే తత్ప్రచురత్వం- అని అర్థం.

'ప్రణవోధనుః' అనే మంత్రమందు "శరవత్ తన్మయో భవేత్" అన్నట్లు తదేక సాక్షాత్కార మగ్నత్వాన్ని పొందినాడని అర్థం. క్షణాత్- అతి శీఘ్రంగా మునితో సమాన రూపమైన దశ వసుదేవునికి కలుగడం ఆశ్చర్యమని భావం.

ఇతడు వేరొకడు కాని పుత్రుణ్ణి కనురెప్పలు గొట్టకుండా చూస్తూ తన్మయత్వాన్ని పొంది ముని సదృశుడయ్యాడు వసుదేవుడు. ఒకే విధంగా ముఖదర్శనం చేయడం దర్శన సమానాకార స్ఫూర్తి రూపాన్ని పొందినాడు. ఇదొక ఉత్ప్రేక్షాలంకారం.

ఉత-కాదేని-లేక; 'అనిమిషత్వం ప్రతిసందధే'- పుత్రుణ్ణి మరొకచోట విడిచిపెట్టే వసుదేవునికి తర్వాత దర్శనం కలుగుతుందో లేదో అనే ఆశ్వాసనార్థం నిర్నిమేషత్వాన్ని ప్రతిసంధానం చేశాడు.

'ప్రతిసంధానం' అంటే విశ్లేషించిన దాన్ని- ఎడబాసిన- గత విషయాన్ని, పునః సంఘటింపజేయడం. వసుదేవుడు పూర్వజన్మ వృత్తాంతాన్ని స్మరించాడేమో! పూర్వజన్మలో వసుదేవుడు కాశ్యప రూపంతో ఉన్న అనిమిషుడు- దేవతా రూపం కలవాడు కదా! కనురెప్పపాటు లేకుండా శ్రీకృష్ణుని ముఖదర్శనం చేయడంవల్ల వసుదేవునికి పూర్వజన్మలోని అనిమిషత్వం-కాశ్యపుడనే దేవరూపం సంఘటించిందేమో అన్నట్లుండెను. ఇది కూడా ఉత్ప్రేక్షాలంకారమే. ఈ రెండూ ఉత్ప్రేక్షను సూచించే 'వాచకం' ప్రయోగింపబడనందువల్ల గమ్యోత్ప్రేక్షలు. సంసృష్టియే కదా!

*226. జిగమిషుః సదిశో దశ యాదవః*
*సకృద వైక్షత సాధ్వసవిహ్వలః।*
*అనఘ వైభవ మర్భక ముద్వహన్*
*అమిత గుప్తి నిరుద్ధగతౌ గృహే॥* 29

**అర్థం:** అనఘ వైభవం= మొక్కవోని ప్రభావంగల; అర్భకం= శిశువును; ఉద్వహన్= ఎత్తుకొని; జిగమిషుః= వెళ్ళగోరువాడైన; సః= ఆ; యాదవః= వసుదేవుడు; అమితగుప్తి నిరుద్ధగతౌ= పలువురు కాపరులచేత ఆపివేయబడిన గమనంగల;గృహే= గృహమందు; సాధ్వసవిహ్వలః= భయంచేత విహ్వలుడవుతూ; దశ, దిశః= పది దిక్కులను; సకృత్= ఒక్కసారి; అవైక్షత= కలయ జూచెను.

**తా॥** నందగోకులానికి పోగోరిన వసుదేవుడు, అఖండిత ప్రభావంగల తన శిశువును చేతులతో ఎత్తుకొని, ద్వారాలను బంధించి పలువురు కాపరులచేత పిట్టలు కూడా బయట పడడానికి వీలులేనట్టి ఆ భవనమందు భయంతో కలవరపడుతూ పది దిక్కుల నొక్కసారిగా తిరిగి చూచాడు.

*227. విజఘటే సహసైవ కవాటికా*
*వ్రజ మథ వ్రజతో యదుభూభృతః।*
*ఉపలకల్పమశేరత రక్షకాః*
*సరణి మాదిదిశు ర్గృహదేవతాః॥* 30

**అర్థం:** అథ= దిక్కులన్నిటినీ ఒక్కసారి చూచిన తర్వాత; వ్రజం= గోకులానికి; వ్రజతః= వెళ్ళనున్న; యదుభూభృతః= యదువంశ రాజైన వసుదేవునికి; సహసా, ఏవ= శీఘ్రంగానే; కవాటికా= ద్వారం; విజఘటే= తెరచుకొన్నది; రక్షకాః= కాపరులు; ఉపలకల్పం= పాషాణంతో సమానంగా; అశేరత= నిశ్చేష్టులై యుండిరి; గృహదేవతాః = గృహాధి దేవతలు; సరణిం= నిర్గమన మార్గాన్ని; ఆదిదిశుః= చూపించారు.

**తా॥** నందగోకులానికి పోనున్న వసుదేవునికి, ఆ ఇంటి నుంచి బయట పడడానికి ఆలోచిస్తుండగా, అకస్మాత్తుగా ద్వారాలన్నీ తెరచుకొన్నాయి. ద్వారపాలకులు బండరాళ్ళలాగా అచేతనులయ్యారు. గృహాధిష్ఠాతృలైన దేవతలు వసుదేవునికి బయటకు వెళ్ళే దారిని చూపించారు.

కారాగృహద్వార కవాటానికి అల్పత్వం చెప్పబడినందువల్ల 'కవాటికా' అని స్త్రీలింగం ప్రయోగింపబడింది.

"స్త్రీ స్యాత్ కాచిన్మృణా ల్యాదిర్వి వక్షాఉ పచయే యది"- అని స్త్రీత్వం. 'గౌరాదిత్వాత్ జీష్ప్రత్యయ మందు 'కేణః' అని హ్రస్వత్వం కల్గగా 'కవాటికా' రూపం నిష్పన్నం.

*228. క్షర దసూనివ యామిక రక్షకాన్*
*ముషిత మంజుగిరః శుకశారికాః।*
*యదుకులేందు రపశ్య దమీలితాన్*
*పరిజనా నపి చిత్ర గతా నివ॥* 31

**అర్థం:** యదుకుల+ఇందుః= యదువంశానికి చంద్రునివలె ఆహ్లాదకుడైన వసుదేవుడు; క్షరత్+అసూన్, ఇవ= పోయిన ప్రాణాలు గలవారివలె ఉన్నట్టి; యామిక రక్షకాన్= జాముకాలాన్నిబట్టి నియమింపబడే కారాగృహ రక్షకులను; ముషిత మంజుగిరః= మానివేసిన, మంజులమైన మాటలుగల; శుకశారికాః= చిలుక గోరువంక పక్షులను; అమీలితాన్, అపి= తెరచియున్న కన్నులుగల వారినైననూ; చిత్రగతాన్, ఇవ= ఛాయా చిత్రపటమందున్న వారిని వలెనే; పరిజనాన్= పరివార జనులను; అపశ్యత్= చూచెను.

**తా॥** యదుకుల చంద్రునివలె ఆహ్లాదకరుడైన వసుదేవుడు జాముకొకసారి మార్చి నియమింపబడే రక్షక భటులను ప్రాణం పోయినవారిని వలెను, కారాగృహమందున్న చిలుక గోరువంక పక్షులకును మంజుభాషణలను మానివేసి యున్నట్టి వాటినిగానూ, మిగత పరివారజనులకు కన్నులు తెరచుకొని యున్నప్పటికీ, చిత్రపటమందలి ప్రతిమలవలె నిశ్చేష్టితులై యున్నవారినిగానూ చూచాడు.

చిత్రపటమందున్న ప్రతిమలు కన్నులు తెరచియున్నను చూడజాలవు కదా! అట్లే ఈ పరిజనుల నిద్ర విలక్షణమైనదని భావం.

శారికలు కూడా చిలుకలు లాగా ముద్దు మాటలనాడే స్వభావం కలిగిన పక్షులే. కొందరు ఆడచిలుకలను శారికలంటారు. ఇట్టి సన్నివేశంవల్ల వసుదేవునికి కారాగృహం నుంచి శ్రీకృష్ణుణ్ణి- అర్భకుణ్ణి ఎత్తుకొని బయటకు వెళ్ళే మార్గం సుగమమయిందని తాత్పర్యం.

*229. ఉపయతో విశిఖాం సదనాంతరాత్*
*కువలయాభ కుమార తనుత్విషా।*
*శతమఖోపల మేచకయా ద్రుతం*
*శమిత సంతమసా హరితో బభుః॥* 32

**అర్థం:** సదన+అంతరాత్= కారాగృహం యొక్క మధ్య భాగం నుంచి; విశిఖాం= రథ్యను-నడు వీధి మార్గమును; ఉపయతః= చేరుకొంటున్న వసుదేవునికి; హరితః= దిక్కులు; శతమఖ+ఉపల, మేచకయా= ఇంద్రనీలమణి యొక్క శ్యామల వర్ణం (కాంతి) గల; కువలయ+ఆభ కుమార తనుత్విషా= ఇందీవర పుష్పకాంతి వంటి కాంతిని కలిగియున్న కుమారుడైన శ్రీకృష్ణుని యొక్క దేహకాంతిచేత; ద్రుతం= త్వరగా; శమిత సంతమసాః= తొలగింపబడిన చీకటి గలవై; బభుః= ప్రకాశించాయి.

**తా॥** చెరసాలలోనుంచి రాజమార్గాన్ని చేరుకొంటున్న వసుదేవునికి దిక్కులు ఇంద్రనీలమణియొక్క శ్యామల వర్ణం కలిగిన ఇందీవర పుష్పకాంతి లాంటి కాంతిని కలిగియున్న కుమారుడైన (శ్రీకృష్ణుని) శరీర ప్రభచేత చీకట్లు తొలగిపోయి ప్రకాశించాయి.

"ఉపలః ప్రస్తరే రత్నే" (విశ్వని.)- గృహదేవతలచేత చూపబడిన దారి వల్ల బయటపడిన వసుదేవుడు రాజమార్గంలోకి వచ్చేసరికి, శ్రీకృష్ణుని- అర్భకుని ఇంద్రనీలమణి కాంతివంటి దేహం యొక్క తేజస్సుచేత చీకటి తొలగిపోయి, దారి స్పష్టంగా కనబడసాగింది.

230. శ్రుతిమయో విహగః పరితః ప్రభుం
వ్యచరదాశు విధూత నిశాచరః।
అనుజగామ చ భూధర పన్నగః
స్ఫుట ఫణామణిదీప గణోద్వహః॥ 33

**అర్థం:** శ్రుతిమయః= వేదాత్ముడైన; విహగః= సుపర్ణుడనబడే గరుడ పక్షి; ప్రభుం= శ్రీకృష్ణుని; పరితః= చుట్టు, అంతట; ఆశు= వేగంగా; విధూత నిశాచరః= ఎగురగొట్టబడిన రాక్షసులు కలవాడవుతూ; వ్యచరత్= సంచరించెను; చ= మరియు; భూధర పన్నగః= భూమిని ధరించే సర్పం- ఆదిశేషుడు; స్ఫుటఫణామణి దీపగణ+ ఉద్వహః, సన్= విప్పిన పడగలమీది మణులు అనే దీపాల సమూహాన్ని వహిస్తున్న వాడవుతూ; అనుజగామ= అనుసరించెను.

**తా॥** అది రాత్రి సమయం కాబట్టి రాత్రించరులైన రాక్షసులను గరుత్మంతుడు తన రెక్కలవలన గాలిచేత వేగంగా ఎగురగొట్టుతూ శ్రీకృష్ణుని పైన చుట్టూ తిరుగుచుండెను.

గరుత్మంతుడు సుపర్ణుడు- మంచి రెక్కల బలంకలవాడు. వేదమే శరీరంగా కలవాడు. "*సుపర్ణోసిగరుత్మాన్ త్రివృత్ తేశిరో గాయత్రం చక్షుః స్తోమ ఆత్మా*" అనే వేదమంత్రం గరుత్మంతుడు త్రివృద్గాయత్ర్యాది రూపం కలవాడు- అని విశదీకరిస్తుంది. సుపర్ణుడు వేదమూర్తి. రాక్షసులను తన రెక్కల గాలిచేత దూరంగా విసరిపారవేయడం గరుడుని స్వభావం.

భాగవతమందు, శ్రీకృష్ణునిపై వాన చినుకులు పడకుండా ఆదిశేషుడు అనే నాగసర్పరాజు తన పడగలను విప్పి వెంటవచ్చినట్లు శ్రీశుకసూక్తి కలదు. శ్రీవేదాంతదేశికులు ఆదిశేషుణ్ణి 'భూధర పన్నగః' అన్నారు.

ఆదిశేషుడు తన వేయి పడగలమీద భూమిని మోసేవాడని పురాణ ప్రసిద్ధం. శ్రీకృష్ణుడు భూభారాన్ని తగ్గించడానికి అవతరించాడు. కాబట్టి, ఆదిశేషుణి యొక్క భారం కూడా తగ్గుతుంది కదా! శ్రీమన్నారాయణునికి సర్వవిధాలైన కైంకర్యంచేసే

ఆదిశేషుడు ఇక్కడ తన పడగల మీద ఉన్న మణి దీపాల కాంతిచేత నంద గోకులానికి పోయే మార్గాన్ని ప్రకాశింపజేస్తూ, శ్రీకృష్ణుని మోసుకొనిపోయే వసుదేవుని వెంట చరించాడు.

*231. దినకరోపమ దీధితి భిస్తదా*
*దనుజ దేహవిదారణ దారుణైః।*
*పరిగతః కిల పంచ భిరాయుధై*
*ర్యదుపతిః ప్రజహౌ వసహాయతామ్॥* 34

**అర్థం:** తదా= ఆ సమయాన; దినకర+ఉపమ దీధితిభిః= సూర్యునితో సమాన కిరణ కాంతులుగల; దనుజ దేహవిదారణ దారుణైః= రాక్షసుల దేహాలను చీల్చుటచేత భయంకరమైన; పంచభిః= ఐదు; ఆయుధైః= ఆయుధాలచేత; పరిగతః= పరివృతుడైన; యదుపతిః= వసుదేవుడు; అసహాయతాం= తోడ నడిచేవారు లేకుండ; ప్రజహౌ, కిల= ప్రకాశిస్తూ వెళ్ళెనట.

**తా॥** నందగోకుల గ్రామానికి శ్రీకృష్ణుణ్ణి ఎత్తుకొని పోవుచున్న సమయంలో వసుదేవునికి సహాయులెవ్వరు లేరు. (సహ అయంతే-గచ్ఛంతి ఇతి=సహాయాః) తోడుగ నడిచేవారు సహాయులు. సహాయులు లేని భావం= అసహాయత అనబడును. "సహాయాస్తు సయాత్రాః స్యుః"- (శబ్దార్ణవం). అసురుల శరీరాలను ఛిన్నం, భిన్నం చేయడం చేత దారుణమైన స్వభావం గలిగినట్టి, సూర్యునితో సమానమైన కిరణకాంతులు కలిగిన శంఖ, చక్ర, గదా, ఖడ్గ, శార్ఙ్గములనే పంచాయుధాలచేత ఆవరింపబడిన వసుదేవుడు ప్రకాశిస్తూ, ఎవ్వరు తోడు లేకుండా- ఒంటరిగా వెళ్ళాడట.

ఆదిశేషుడు, గరుత్మంతుడు వచ్చినట్లే, పంచాయుధాలు కూడా శ్రీకృష్ణునికి ఉపచారం చేయడానికి వచ్చినాయి కదా! తత్ఫలితంగా వసుదేవునికి, చీకటి రాత్రిపూట, మార్గమంతా ప్రకాశిస్తున్నదని తాత్పర్యం.

232. ప్రగుణ మిందు నివేదిత పద్ధతి
ర్యదుకులేందు రథో యమునానదీమ్।
పరమ పూరుష మక్షత పౌరుషః
పతగరాజ ఇవాశు వహన్ యయౌ॥ 35

**అర్థం:** అథః= తర్వాత; అక్షత పౌరుషః= అఖండ పరాక్రముడు; అత ఏవ= కావుననే; పతగరాజః, ఇవ= గరుడునివలె; పరమ పూరుషం= పురుషోత్తముడైన భగవంతుణ్ణి; వహన్=.ఎత్తుకొని సాగుతున్న; యదుకుల+ఇందుః= యదుకులానికి చంద్రునివంటి వసుదేవుడు; ప్రగుణం= ఋజువుగా; ఇందునివేదిత పద్ధతిః= చంద్రుని చేత తెలియజేయబడిన దారిని కలవాడవుతూ; ఆశు= శీఘ్రంగా; యమునా నదీం= యమునానదిని; యయౌ= చేరుకొన్నాడు.

**తా॥** తర్వాత మొక్కవోని శౌర్యం కలవాడు కాబట్టి పక్షిరాజైన గరుత్మంతుని వలె పరమ పురుషుడైన భగవంతుణ్ణి చేతులతో నెత్తుకొని సాగుతున్న వాడు వసుదేవుడు "అజిహ్మ ప్రగుణౌ"- (అమరం). 'సన్మహత్పరమోత్తమోత్కృష్టాః'- ఈ పదాలు పూజ్యార్థకాలు. నిష్కపటంగా- నేరుగా చంద్రుడు చూపిన దారిలో వెళ్ళుతున్న వసుదేవుడు యమునానది దగ్గరికి చేరుకొన్నాడు.

233. తను తరంగ పృషత్కణ శీతలః
సురభి కైరవ సౌహృద వాసితః।
అభిసమేత మసేవత మారుతో
యమునయా ప్రహితో యదుపుంగవమ్॥ 36

**అర్థం:** తను తరంగ పృషత్ కణ శీతలః= చిన్నవైనట్టి, అలల బిందు కణాలచేత; శీతలః= చల్లనైన; సురభి-వాసితః/ సురభి= వాసనగల; కైరవ= కలువలయొక్క; సౌహృద= మిత్రభావం- సంసర్గం-చేత; వాసితః= పరిమళించిన; యమునయా=

యమునానదిచేత; ప్రహితః= పంపబడిన; మారుతః= వాయువు; అభిసమేతం= తన దగ్గరికి వచ్చినట్టి; యదుపుంగవం= వాసుదేవుణ్ణి; (వసుదేవుణ్ణి); అసేవత= సేవించెను.

**తా॥** యమునానదిలోని సూక్ష్మమైనట్టి తరంగ బిందు కణాలచేత చల్లనైనదియు, వాసనగల కలువపూల సంసర్గంచేత పరిమళించునదియు, ఆ నదిచే పంపబడినదియునైన గాలి, తన కెదురుగా వచ్చిన వసుదేవుణ్ణి, శ్రీకృష్ణుణ్ణి కూడా సేవించెను. శ్రమను తొలగించేవిధంగా కమ్మని, చల్లని వాయువు వసుదేవుని సేవ చేసెనని తాత్పర్యం.

*234.* *పవన కంపిత పల్లవ పాణికా*
*ప్రహిత పుష్పభరా పదవీ ముఖే।*
*ఉపజుహోవకిల భ్రమరస్వనై*
*ర్యదుపతిం యమునోపవనస్థలీ॥* 37

**అర్థం:** పవన-పాణికా/ పవన= గాలిచేత; కంపిత= కదిలింపబడిన; పల్లవ= చిగురుటాకులు అనే; పాణికా= చేతులు గలిగినట్టి; పదవీముఖే= దారికి ముందు భాగమందు; ప్రహిత పుష్పభరా= రాల్చబడిన పూల సముదాయం కలిగినట్టి; యమునా+ఉపవనస్థలీ= యమునానదికి గట్టున ఉన్న ఆ రామభూమి; యదుపతిం= వసుదేవుణ్ణి (శ్రీకృష్ణుణ్ణి); భ్రమర స్వనైః= తుమ్మెదల మ్రోతలచేత; ఉపజుహోవ, కిల= ఆహ్వానించెనట.

**తా॥** గాలిచే కదిలిన పల్లవాలే చేతులుగా కలిగినట్టిదియు, మార్గమందు పూలసముదాయాన్ని పరచినట్టి యమునా తీరమందలి ఉపవనభూమి వసుదేవుణ్ని (వాసుదేవుణ్ణి) తుమ్మెదల ఝుమ్మనునట్టి ధ్వనులచే ఆహ్వానించింది. రాజు నడిచే దారిలో రాజోపచారంగా పూలు పరచి ఆహ్వానించునట్లే యమునా తటమందున్న ఆరామభూమి వసుదేవుణ్ణి రాజోపచారంగా ఆహ్వానించిందని ఉత్ప్రేక్ష.

*235. నిమిషితాసిత నీరజలోచనా*
*ముకుళితాబ్జముఖీ సవితుః సుతా,*
*లలిత దీన రథాంగయుగస్వనా*
*కుహక దైన్య మశోచదివ ప్రభోః॥* ౩౮

**అర్థం:** నిమిషిత+అసిత, నీరజలోచనా= మూసుకొనిన నల్లని ఇందీవర పుష్పాలవంటి నేత్రాలు గలిగినట్టి; ముకుళిత+అబ్జముఖీ= ముడుచుకొని యున్న కమలం వంటి మొగము కలిగినట్టి; లలిత దీన రథాంగ యుగ స్వనా= మనోజ్ఞమైన, విరహంచేత కలిగిన చక్రవాక (పక్షి) దంపతుల యొక్క ధ్వనులు కలిగిన; సవితుః= సూర్యుని యొక్క; సుతా= పుత్రికయైన యమున; ప్రభోః= శ్రీకృష్ణుని యొక్క; కుహక దైన్యం= కపట దీనస్థితిని గూర్చి; అశోచత్, ఇవ= ఏడ్చినట్లుండెను.

**తా॥** యమునా జలం నల్లగా ఉంటుంది కాబట్టి, నల్లని ఇందీవర పుష్పముల వలె యమున కన్నులు మూసుకొని యున్నవని అర్థం. రాత్రిపూట కమలాలు ముడుచుకొని యుండునని కవి సమయం. యమున ముఖం వికసించనట్టి కమలంవలె ముడుచుకొని యున్నది.

'లలిత' అనే పాఠం కంటే 'కలిత' అనే పాఠం బాగుంటుందని విజ్ఞుల ఆశయం. 'కలిత' అంటే ప్రాప్తమైన, పొందినట్టి అని అర్థం. జక్కువ పక్షులజంట రాత్రిపూట ఎడబాసి దీనంగా కువకువ ధ్వనిచేస్తుంటాయి. యమున అనే నదికి చైతన్యం కల్పించడం ఆలంకారికుల లక్షణం. అచేతనాలకూ చైతన్య మారోపింపబడడం రాసిక్యం. జక్కువ పక్షులజంట పొందిన విరహం వల్ల కలిగిన ధ్వనిగల (రూపంతో) సూర్యసుత– యమున, తన ప్రభువైన శ్రీకృష్ణుడు కంసుని భయంవల్ల నందగోకులానికి తాను పుట్టిన రాత్రే పయనించే దీనస్థితి కలవాడైనాడని శోకిస్తున్నట్లు ఉన్నదని ఉత్ప్రేక్షితం.

"*నా భావభేదే, స్త్రీనృత్తే, లలితం త్రిషు సుందరే*" (శబ్దార్ణవం). దైన్యానికి అనర్హుడైనవాని దైన్యాన్ని చూచి స్త్రీలు ఇలాగా ఏడుస్తారు అని భావం.

*236. వికచ కైరవ తారకితాకృతిం*
*తనుమతీమివ శారద యామినీమ్।*
*త్వరిత మంబునిధేరభిసారికాం*
*తరితుమైహత సత్యసమీహితః॥* 39

**అర్థం:** వికచ- ఆకృతిం/ వికచ= వికసించిన; కైరవ= కలువపూలచేత; తారకిత= చుక్కలవంటి; ఆకృతిం= ఆకారం కలిగినది కావున; తనుమతీం= శరీరం కలిగిన; శారద యామినీం, ఇవ (స్థితాం)= శరత్కాలమందలి రాత్రివలె ఉన్నట్టి; అంబునిధేః, అభిసారికాం= సముద్రుని గూర్చి పోతున్న ప్రియురాలైన- అభిసారిక యైన, యమునానదిని; సత్యసమీహితః= అమోఘమైన అభిలాషను కలిగియున్న వసుదేవుడు; త్వరితం= శీఘ్రంగా; తరితుం= దాటుటకు; ఐహత= కోరెను.

**తా॥** వసుదేవుడు యమునానదిని త్వరగా దాటగోరెను. యమున ఎట్లున్నది? నక్షత్రాల కాంతిచే అలంకరింపబడిన శరత్కాల రాత్రియే మూర్తీభవించినట్లున్నది. నీలవర్ణ జలంగల యమున వికసించిన కలువలచే అలంకరింపబడియున్నది. నక్షత్రాలే కలువపూలుగా ఉన్నాయి. 'అభిసారిక' అంటే తన ప్రియుని కలుసుకోవడానికి పోయే ఒక ప్రేయసి. "*రతార్థినీతుయా యాతి సంకేతం సా అభిసారికా*". శారద రాత్రియే రూపందాల్చినట్లున్న యమున, తన ప్రియుడైన సముద్రునితో కలియడానికి పోతున్నది కాబట్టి 'అభిసారిక' అనబడినది. శాస్త్ర సమ్మతమైన సదాచార పరుడూ, అప్రతిహత వ్యాపారంగల వాడూ అయిన వసుదేవుడు అభిసారికయైన యమునను త్వరగా దాటిపోగోరినాడు.

*237. భవతి కిం ను భవిష్యతి వా కిమి*
*త్యనవధారిత శౌరి విహారయా।*
*చకితయేవ విరోచన కన్యయా*
*విధుత వీచికరం కిల వివ్యథే॥* 40

**అర్థం:** అనవధారిత శౌరి విహారయా= తెలియరాని భగవత్క్రీడగల; విరోచన కన్యయా= సూర్యుని సుతయైన యమునా నది; కిం, ను, భవతి= ఇప్పుడేమి కష్టం వచ్చునో?; కిం, వా, భవిష్యతి= ఇక ముందు ఏమి కష్టం రానున్నదో?; ఇతి= అని; చకితయా (సత్యా)= భయపడుతూ; విధుత వీచికరం= కల్లోలితమైన తరంగాలనే చేతులు ఉండునట్లుగా; వివ్యథే, కిల= బాధపడెనట.

**తా॥** సూర్యుని కూతురైన యమునానది భగవంతుని క్రీడ-లీల తెలియనిదై, కంసుడు మాత్రం క్రూరుడు కదా! ఇప్పుడేమి ఆపద సంభవించునో? ఇక ముందు ఏమి సంభవింపనున్నదో? అని కంసుని చరిత్రను చింతిస్తూ, భయపడుతున్నదై అలలు అనే చేతులనెత్తి వణకుతూ బాధపడుతున్నట్లుండెనని తాత్పర్యం.

నందగోకులానికి పయనించడం కృష్ణుని లీలయే కాని కంసుని భయంతో కాదు అనే విషయం తెలియక, యమున భయంతో వణుకుతున్నదేమో అన్నట్లు కొంచెం అలలు చెలరేగినాయట. దేశికుల వాగ్విలాసమిది.

*238. ఘన తమః పరిపాక మలీమసైః*
*గురుభి రూర్మిగణై రనుపప్లుతః।*
*అతితతార దినాధిపతేః సుతా*
*మనఘ యోగమనా ఇవ సంసృతిమ్॥* 41

**అర్థం:** ఘనతమః పరిపాక మలీమసైః= గాఢాంధకారం యొక్క పరిణామాల చేత మలినములైన; గురుభిః= గొప్పవైన; ఊర్మిగణైః= అలల సముదాయాలచేత; ఘన తమః పరిపాక మలీమసైః= సాంద్రమైన తమోగుణం యొక్క పరిణామం చేత ఏర్పడిన మలినాలైన; గురుభిః= గొప్పవైన; ఊర్మిగణైః= ఆరు ఊర్ముల సముదాయాల చేత; అనుపప్లుతః= చిక్కుపడని వాడైన వసుదేవుడు; అనఘ యోగమనాః= పాపాలకు విరోధియైన యోగం ముదిరిన మనస్సుగల మహాత్ముడు; సంసృతిం, ఇవ= సంసారాన్ని వలె; దిన+అధిపతేః= సూర్యుని యొక్క సుతాం= పుత్రికయైన యమునానదిని; అతి తతార= సులభంగా దాటినాడు.

**తా॥** పాపాలకు విరోధియైనది యోగం. యోగసిద్ధిని పొందిన మనస్సు గలవాడు మహాత్ముడు, గొప్పజ్ఞానం కలవాడు అని అర్థం. "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే"- జ్ఞానమనే అగ్ని జ్ఞానప్రతిబంధకాలైన పాపకర్మలను కాల్చివేసి బుగ్గిచేస్తుంది. మలినాలు పోయిన తర్వాత మనస్సు భగవంతునికి అధీనమవుతుంది.

సంసారం అనే సముద్రం షడూర్మలతో విజృంభిస్తుంది. ప్రకృతి సంబంధం చేత జీవుని జ్ఞానం సంకోచింపబడుతుంది. సత్త్వగుణం తగ్గి తమోగుణం చెలరేగుతుంది. ఈ తమోగుణ పరిపాకం చేత షట్+ఊర్మలు ఏర్పడి, ప్రబలుతాయి. ఆకలి, దప్పి, శోకం, మోహం (అజ్ఞానం), ముసలితనం, మరణం అనేవి ఆరు తరంగాలు షడూర్మలనబడును.

ఉపాసకుల మనస్సును షడూర్మలు ప్రతిబంధించవు. యోగి షడూర్మలలో చిక్కుకొనక, భగవద్ధ్యానపరుడై సంసార సాగరాన్ని సులభంగా దాటిపోతాడు.

పాపరాశిని పంచబంగాళం చేసే యోగ మనస్కుడైన మహాత్ముడు సంసారాన్ని దాటినట్లే, వసుదేవుడు దట్టమైన చీకటి పెరుగుట చేత మలినాలైన గొప్ప తరంగాల సముదాయంలో చిక్కుకొననివాడై సూర్యసుతయైన యమునా నదిని చులకనగా దాటినాడు. శ్లేషానుప్రాణితోపమాలంకార సజ్జిత మీ శ్లోకం.

239. యదుపతేర్యమునా త్వరితం యతః
ప్రతియతశ్చ సమర్పిత పద్ధతిః।
స్వయ మమర్త్య మదావళ మజ్జనీ
చరణ లంఘ్యజలా సమజాయత॥ 42

**అర్థం:** స్వయం= తాను; అమర్త్య మదావళ మజ్జనీ= దేవతల గజాలైన ఐరావతం మొదలైన వాటిని మునిగేవిధంగా జలకాలాడించే; యమునా= యమునా నది; చరణ లంఘ్యజలా (సతీ)= పాదాలచేత దాటదగిన నీరుగల దవుతూ; త్వరితం= శీఘ్రంగా;

యతః= పోవుచున్నట్టి; ప్రతియతః, చ= తిరిగి వచ్చునట్టి; యదుపతేః= వసుదేవునికి; సమర్పిత పద్ధతిః= అర్పించబడిన మార్గం కలదిగా; సమజాయత= ఆయెను.

**తా॥** ఐరావతాది దేవతల గజాలు జలకాలాడునంత లోతైన నీరుగల యమునా నది, శ్రీరాముడు ప్రార్థించినందువల్ల మార్గమును ఇచ్చిన సముద్రుని వలె కాకుండా, వసుదేవునిచే ప్రార్థింపబడకుండగనే స్వయంగా, పోయేటప్పుడూ, తిరిగి వచ్చేటప్పుడు కూడా వసుదేవుడు నడిచిపోదగినంత మాత్రమే నీరు గలదై, ఆ యదుపతికి దారిని కల్పించి శోభించింది.

*240. అజని పశ్చిమతో భృశమున్నతా*
*రవిసుతా పురతః స్థలశేషితా।*
*అధిరురోహ పదం కిమసౌ హరేః*
*ప్రతియయౌ యదివా పితరం గిరిమ్॥* 43

**అర్థం:** రవిసుతా= సూర్యుని పుత్రికయైన యమున; పశ్చిమతః= పడమటి భాగమందు; భృశం= మిక్కిలి; ఉన్నతా= ప్రవాహం పెరిగినదిగా; అజని= అయినది; పురతః= ముందు- పూర్వభాగమందు; స్థలశేషితా= భూమియే మిగులునట్లుగా; అజని= అయినది; అసౌ= ఈ యమునానది; హరేః, పదం= విష్ణు పదమును- ఆకాశమును; అధిరురోహ, కిమ్= అధిరోహించినదైనదా?; యది, వా= లేదా?; పితరం= తండ్రియైన కళింద పర్వతమును గూర్చి; ప్రతియయౌ= తిరిగిపోయినదో?

**తా॥** వసుదేవునికి దారిని కల్పించడానికి తన ప్రవాహాన్ని నిరోధించింది- ఆపివేసింది. తత్ఫలితంగా మీది భాగమంతా నీరు పెరిగింది. క్రింది భాగమంతా భూమి కన్పడునట్లుగా పల్లె- వట్టె యేర్పడింది. ఇక్కడ ఇట్లు, యమున యొక్క స్వరూపం, స్వభావమూ ఉత్ప్రేక్షింపబడింది.

'హరేః పదం' అంటే విష్ణుపదమనీ, ఆకాశమనీ రెండు అర్థాలున్నాయి. గంగానది విష్ణుపాదమందు జనించింది. పశ్చిమ భాగం జలం పెరిగింది కదా!

యమునా నది తనకు విష్ణుపాద సంబంధం ఉండాలనే అపేక్షతో ఆకాశానికి పెరిగిందా అన్నట్లు భావింపబడుతున్నది.

యది, వా- కాకపోతే, తన భర్తయైన సముద్రుడు తన సవతియైన గంగకు జలప్రవాహం గంభీరంగా ఉంటుందని గంగానదిని ఎక్కువగా ప్రేమిస్తుంటాడు- అనే విషయాన్ని సహించలేకపోయింది యమునానది. తూర్పుభాగంలో ప్రవాహం ఆగిపోయినందువల్ల పట్టె యేర్పడింది కదా! యమున, తన భర్త గంగనే అధికంగా ప్రేమించే విషయాన్ని సహించలేక, తన పుట్టింటికి- కళింద గిరికి తిరిగిపోయిందో అన్నట్లున్నది. పతి వాల్లభ్యం పొందని స్త్రీలు తమ పుట్టింటికి తిరిగి పోవడం లోక పరిపాటియే కదా! ఇందు, యమున యొక్క సంస్థానం ఉత్ప్రేక్షితం.

*241.* అకృత సేతు మనాకలిత ప్లవాం
జనన సింధు దృఢ ప్లవ ముద్వహన్।
రవిసుతా మతి లంఘ్య రమాపతిం
సపది ఘోష సమీపముపానయత్॥ 44

**అర్థం:** జనన-ప్లవం/ జనన సింధు= భవసాగరానికి; దృఢ ప్లవం= దృఢమైన పడవవంటి శ్రీకృష్ణుణ్ణి; ఉద్వహన్= పైకి ఎత్తుకొన్న వసుదేవుడు; అకృతసేతుం= నిర్మింపబడని వంతెన గలిగినట్టి; అనాకలిత ప్లవాం= కూర్చబడని పడవ గలిగినట్టి; రవిసుతాం= యమునా నదిని; అతిలంఘ్య= దాటి; రమాపతిం= ఆ శ్రీకృష్ణుణ్ణి; సపది= ఆ క్షణంలోనే; ఘోష సమీపం= గొల్ల పల్లె దగ్గఱకు; ఉపానయత్= తీసుకొని వచ్చెను.

**తా॥** సంసార సముద్రాన్ని దృఢమైన పడవవలె దాటించే శ్రీకృష్ణుణ్ణి తన మీద ఎత్తుకొని యున్న వసుదేవుడు, ఆనకట్ట, వంతెన లేనట్టి, ఒక నావ కూడా లేకుండా ఉన్నట్టి యమునా నదిని దాటి శ్రీకృష్ణుణ్ణి క్షణకాలంలో గొల్లపల్లెకు దగ్గఱగా కొనిపోయెను.

'ఘోష' శబ్దానికి గొల్లవారుండే పల్లె- గ్రామమని అర్థం. "ఘోష ఆభీర పల్లీస్యాత్"- (అమరం).

*242.* అథ కయాచన కారణ నిద్రయా
వివశ సుప్తజనం వ్రజ మావిశత్।
ధనద పత్తన సంపది యత్ర సా
స్వసుత మగ్ర్య మసూయత రోహిణీ॥ 45

**అర్థం:** అథ= తర్వాత; కయాచన= ఆశ్చర్యమైన; కారణ నిద్రయా= జగత్కారణ భూతయైన నిద్రచేత; వివశ సుప్తజనం= పరవశమై నిద్రిస్తున్న జనం కలిగినట్టి; వ్రజం= గోకుల గ్రామంలోకి; ఆవిశత్= ప్రవేశించెను; ధనద పత్తన సంపది= కుబేరుని పట్టణం యొక్క సంపదవంటి సంపదను కలిగియున్న; యత్ర= ఏ వ్రజమందు; సా= తన పెద్ద భార్యయైన; రోహిణీ= రోహిణీదేవి; అగ్ర్యం= మొదట పుట్టిన; స్వసుతం= తన కుమారుడైన బలరాముణ్ణి; అసూయత= ప్రసవించినదో; ఆ గోకులమునందు ప్రవేశించినాడు వసుదేవుడు.

**తా॥** భగవన్మాయ అనే నిద్రాదేవి జగత్కారణమైనట్టిది, అనిర్వాచ్యమైనట్టిది. మనం తెలుసుకొనజాలని, ఆశ్చర్యభూతయైన ఆ నిద్రాదేవిచేత గోకులమందలి జనమంతా గాఢంగా నిద్రపోయి పరవశమై యున్నది. వసుదేవుడు ఆ గోకులమందు ప్రవేశించాడు.

ఆ గోకులంలోనే తన పెద్ద భార్యయైన రోహిణీదేవి యొక్క గర్భం నుంచి జనించిన తన మొదటి కుమారుడైన బలరాముడున్నాడు.

వసుదేవుడు ఇంతకుముందు చూడని బలరాముణ్ణి గోకులంలోకి ప్రవేశించిన తర్వాత గోకులంలోకి వచ్చి పోయే తొందరలో ఉన్నప్పటికీ తాను ఇప్పుడు చూడగలిగినాడని ఉత్తరార్థం సూచిస్తున్నది.

కుబేరుడు ధనపతి. అతని రాజధాని అలకాపట్టణం. అలకాపట్టణం యొక్క సంపద యెట్టిదో, అట్టి సంపదతో శోభించే (వ్రజం) గోకులంలోకి వసుదేవుడు చేరుకొన్నాడనీ, అక్కడ జ్యేష్ఠ పత్నికి పుట్టిన రౌహిణేయుణ్ణి చూశాడన్న ప్రస్తావనను కూడా సుశ్లోకిస్తున్నది.

*243. ఉపగతే వసుదేవసుతేఽ౽ంతికం*
*నరకవైరిణి నందకుటుంబినీ।*
*అరణి సంభవ పావక సంగమాత్*
*అభజతా ధ్వర వేదిరివ శ్రియమ్॥* 46

**అర్థం:** నందకుటుంబినీ= నందుని పత్నియైన యశోద; వసుదేవసుతే= వసుదేవుని పుత్రుడైన; నరకవైరిణి= నరకాసురునికి విరోధియైన భగవానుడు శ్రీకృష్ణుడు; అంతికం= దగ్గటికి; ఉపగతే (సతి)= రాగానే; అధ్వరవేదిః= యాగవేది- హోమకుండం; అరణి-సంగమాత్/ అరణి= అగ్నిమథనం చేసే కట్టెనుంచి; సంభవ= పుట్టినట్టి; పావక= అగ్నియొక్క; సంగమాత్= కలయిక వల్ల; ఇవ= వలె; శ్రియం= శోభను; అభజత్= పొందెను.

**తా॥** నరక సంహర్తగానున్న వసుదేవసుతుడైన శ్రీకృష్ణుడు తన దగ్గరికి చేరుకొన్న వెంటనే నందుని భార్యయైన యశోదాదేవి, 'అరణి' కట్టెయందు ఉద్భవించిన వైతానికాగ్నిని పొందిన యాగవేదివలె ప్రకాశించెను.

యశోద దగ్గరకు శ్రీకృష్ణుడు చేర్చబడెను. యశోద వైతానికాగ్నిని పొందిన యజ్ఞవేదివలె శోభించెనని వైదికోపమానం చెప్పబడింది.

*244. న్యధిత నంద వధూ సవిధే సుతం*
*ద్రుతముపాదిత గోపకుమారి కామ్।*
*అథ నినాయచ దేవక నందనీ-*
*శయన మానక దుందుభి రాశుతామ్॥* 47

**అర్థం:** ఆనక దుందుభిః= వసుదేవుడు; నందవధూ సవిధే= యశోద దగ్గర; సుతం= తన కుమారుడైన శ్రీకృష్ణుణ్ణి; న్యధిత= ఉంచెను; ద్రుతం= శీఘ్రంగా; గోప కుమారికాం= నందగోపుని పుత్రికయైన యోగనిద్రా రూపిణిని; ఉపాదిత= ఎత్తుకొనెను; అథ= ఎత్తుకొన్న తర్వాత; తాం= ఆ కుమారికను; దేవకనందనీ శయనం= దేవకుని పుత్రికయైన దేవకీదేవి యొక్క పురుటింటి పడకలో; ఆశు= తొందరగా; నినాయ, చ= చేర్చెను కూడా.

**తా॥** వసుదేవుడు యశోద ప్రక్కన తన పుత్రుడైన శ్రీకృష్ణుణ్ణి పడుకొన జేసినాడు. వెంటనే ఇక్కడ పుట్టిన యోగ నిద్రావతార రూపమైన నందగోపుని కూతురును తొందరగా ఎత్తుకొని మధురలోనున్న దేవకీదేవియొక్క పడుకలో నుంచడం, అంతా ఒక ఘడియలోనే జరిగింది.

*245.* *అనబబుద్ధ జనార్దన కన్యకా-*
*వినిమయ స్త్వథ భోజ గణేశ్వరః।*
*దృషది తామభిహంతు మపాతయత్*
*ప్రతిజఘాన చ సా చరణేన తమ్॥* 48

**అర్థం:** అథ= నందగోపుని కుమార్తెను తీసుకొని వచ్చిన తర్వాత; భోజగణ+ఈశ్వరః= భోజుని వంశస్థులందరికిని ప్రభువైన కంసుడు; అనబబుద్ధ జనార్దన, కన్యకా వినిమయః, తు= తెలియని, కృష్ణుని యొక్క మరియు యోగ మాయయొక్క మార్పు మాత్రం కలవాడవుతూ; తాం= ఆ గోపకుమారికను; అభిహంతుం= చంపుటకు; దృషది= బండఱాయిమీద; అపాతయత్= పడగొట్టెను; సా, చ= ఆ యోగమాయ అనే కన్యక కూడా; చరణేన= కాలుతో; తం= ఆ కంసుణ్ణి; ప్రతిజఘాన= తిరిగి ఒక తన్ను తన్నెను.

**తా॥** కంసుడు భోజవంశస్థుల సముదాయానికి ఈశ్వరుడు. 'వినిమయం' అంటే ఒక వస్తువును ఇచ్చి, తనకు అవసరమైన వస్తువును పొందుట. శ్రీకృష్ణుని యశోద ప్రక్కన ఉంచి, అక్కడ పుట్టిన గోప కన్యను తెచ్చినట్టి వసుదేవుడు చేసిన

ఈ మార్పు విషయం మాత్రం కంసునికి తెలియదు. ('అన బబుద్ధః, జనార్దన కన్యకా వినిమయః యస్య సః' అని విగ్రహ వాక్యమిది). ఇక్కడ 'తు' శబ్దం పాదపూరణం కోసం ప్రయుక్తం.

"తుః పాద పూరణేభేదే సముచ్చయేఽవధారణే"- (విశ్వ నిఘంటువు). ఈ మార్పు సంగతి తెలియని కంసుడు ఆ కన్యకను చంపదలచి బండమీద విసరి కొట్టినాడు. ఆ కన్యక వెంటనే బదులుగా, కాలుతో కంసుణ్ణి తన్నింది.

*246.* *నృపతి రాశు పదానిహతస్తయా*
*నిపతితోదిత కన్తు (న్దు) కవద్భవన్।*
*దవసమావృత శైల నిభః క్రుధా*
*దరనిమీలిత దృష్టి రదూయత॥* 49

**అర్థం:** తయా= ఆ కన్యచేత; ఆశు= వేగంగా; పదా= కాలుతో; నిహతః= తన్నబడినవాడై; నిపతిత+ఉదిత కంతుకవత్ భవన్= క్రిందపడి పైకి లేచునట్టి బంతివలె అయినవాడై; క్రుధా= కోపంతో; దవ సమావృత శైల నిభః= దావాగ్నిచే ఆవరింపబడిన పర్వతంలాగా ప్రజ్వలిస్తున్నవాడై; దర నిమీలిత దృష్టిః= కొంచెం మూసుకొన్న కన్నులు కలవాడైన; నృపతిః= కంసుడనే రాజు; అదూయత= పరితపించెను.

**తా॥** యోగమాయ అనే గోపకన్య బలంగా ఒక తన్ను తన్నడంచేత క్రింద పడి వెంటనే పైకి ఎగిరే చెండువంటి దశను పొందినాడు కంసుడు. లేచి నిలబడి క్రోధంతో కారుచిచ్చు చుట్టుముట్టిన గుట్టవలె మండిపడుతూ కొంచెం మూసుకొన్న కన్నులు గలవాడై చాలా పరితపించాడు.

"పదంఘ్రిశ్చరణోఽస్త్రియాం"- (అమరం). 'కంతుకః' అనే పదం తకారం నడుమ కలిగియుంటుందన్నాడు ధాతువృత్తికారుడు.

కం= శిరః, దునోతి= నమనో న్నమనేక్షణాదిభిః, ఇతి- దకారమధ్య ఇతి క్షీర తరంగిణీకారః, అని శ్రీమదప్పయ దీక్షితుల వ్యాఖ్యానం.

*247. ఉదపతత్ దివముగ్ర ఘనస్వనా*
*యువతి రూప యుగా త్యయ శర్వరీ।*
*అసురఘాతిభిరష్టభి రాయుధై*
*రలఘుభి శ్చపలాభి రివాశ్రితా॥* 50

**అర్థం:** ఉగ్ర ఘనస్వనా= క్రూరమేఘం యొక్క ధ్వనివంటి ధ్వనిని కలిగినట్టి, ప్రళయకాలమేఘ గర్జన రూపం కలిగినట్టి; అసురఘాతిభిః= రాక్షసులను చంపునట్టి; అష్టభిః= ఎనిమిది; ఆయుధైః= ఆయుధాలచేత; అలఘుభిః= గొప్ప; చపలాభిః= మెఱుపుల చేత; ఇవ= వలె; ఆశ్రితా= ఆశ్రయింపబడినట్టి; యువతి రూపయుగాత్యయ శర్వరీ= తరుణీ రూపంగల ప్రళయకాలరాత్రి; (యోగమాయ) దివం= ఆకాశమునకు; ఉదపతత్= పెరిగెను, వ్యాపించెను.

**తా॥** క్రిందనుంచి పైకి లేచిన ఆ నందగోపుని కన్య యోగమాయ ఎనిమిది భుజాలు కలిగి, రాక్షసులను సంహరించే గొప్ప ఎనిమిది ఆయుధాలను ధరించిన యువతి రూపంతో క్రూరమేఘ ధ్వనివంటి ధ్వని గలదై ఆకాశాన శోభించింది. "సాయుధాష్టమహాభుజా"- (విష్ణుపురాణం). భయంకరమైన ఈ యోగమాయ సన్నివేశం అద్భుతంగా ఉన్నది.

ప్రళయకాల మేఘగర్జనతోనూ, పెద్ద పెద్ద మెరుపులతోనూ, మూర్తీభవించిన యువతిగా శోభిస్తున్న యుగాంత కాలమందు ఉండే రాత్రివలె ఆకాశాన వ్యాపించి యున్నది. ఉపమాలంకారంచేత అనుప్రాణితమైన అపహ్నుత్యలంకారం.

*248. అథ చ భోజ నియంతు రయంత్రితా*
*దనుజహస్తు రుదంత ముదైరిరత్।*
*పటు గభీర ముదార మనాకులం*
*హిత మవిస్తర మర్థ్య మవిప్లవమ్॥* 51

**అర్థం:** అథ= పైకి ఎగిరిన తర్వాత; భోజనియంతుః= భోజవంశ్యులైన రాజుల నందరిని తన అధీనంలో నుంచుకొని శాసించే కంసునికి; అయంత్రితా= అణగి యుండని, స్వతంత్రయైన యోగమాయ; పటు= తీక్షణమైన; గభీరం= గంభీరమైన; ఉదారం= వికటమైన అక్షరాల కూర్పును కలిగినట్టి; అనాకులం= క్షోభలేనట్టి; హితం= ఆచరింపదగినట్టి; అవిస్తరం= సంగ్రహంగా ఉన్నట్టి; అర్థ్యం= అర్థపుష్టియున్నట్టి; అవిప్లవం= విపర్యాసాది భావంలేనట్టిదియువైన; దనుజహంతుః= రాక్షసాంతకుడైన శ్రీకృష్ణుని యొక్క; ఉదంతం, చ= వృత్తాంతాన్ని కూడా; ఉదైరిరత్= చెప్పివేసెను.

**తా॥** కంసుడు భోజవంశరాజులందఱికి నియంత. యోగమాయ అనే శిశువు మాత్రం కంసుని అధీనమందు ఉండక, స్వతంత్రయై పైకి ఎగిరి, అష్టభుజమూర్తిగా ప్రకాశించింది. అంతే కాదు, దానవాంతకుడైన శ్రీకృష్ణుని వృత్తాంతాన్ని ఎంత ముచ్చటగా చెప్పిందో ఈ శ్లోకం యొక్క ఉత్తరార్ధంలోని విశేషణ పదాలు వివరిస్తున్నాయి.

*(8) ఎనిమిది విశేషణ పదాలు కల ఉదంతమిది:-* పటు-కంసునికి సహించరానంత తీక్షణంగా ఉంది చెప్పిన వృత్తాంతం.

"*పటు స్తీక్ష్ణే నీరోగే చతురేఽ న్యవత్*"- (విశ్వ ని.) గభీరం-గంభీరంగా ఉంది. మంద్రధ్వని లేనిది. ఉదారం- పరుషాక్షరాలు కలది. "*వికటాక్షర బంధత్వ మౌదార్యం పరికీర్తితమ్*". అనాకులం- సంభ్రాతంలేనిది. హితం-పథ్యం, శ్రేష్ఠమైనది. అవిస్తరం- ఎక్కువ పదాలు లేనిది. అర్థ్యం- అర్థబలమున్నట్టిది. సత్యమైనది. అవిప్లవం-వర్ణలోపమూ, విపర్యాసమూ మొదలైన అన్యథా భావం లేనిదైన శ్రీకృష్ణుని ఉదంతాన్ని స్పష్టంగా, యోగనిద్రావతారిణి రూపమెత్తి, అష్టభుజ మూర్తియై కంసునికి చెప్పింది.

*249.* అహ మశేష సురాసుర మోహనీ
యవనికా మధుకైటభ మర్దినః।
ప్రబల శుంభ నిశుంభ నిషూదనే
ప్రణిహితా హతయా తవకిం మయా॥ 52

**అర్థం:** అహం= నేను; అశేషసుర+అసుర మోహనీ= సమస్త దేవతలకు, రాక్షసులకు మోహాన్ని కలిగించే దానను; మధుకైటభమర్దినః= మధుకైటభులను సంహరించిన శ్రీమహావిష్ణువునకు; యవనికా= తిరస్కరణిని-తెరను; ప్రబల శుంభ, నిశుంభ నిషూదనే= మిక్కిలి బలవంతులైన శుంభుడు, నిశుంభుడు అనే ఇద్దరు రాక్షసులను వధించే విషయమై; ప్రణిహితా= (భగవానునిచేత) పంపబడిన దానను; హతయా= కొట్టబడిన; మయా= నా చేత; తవ= నీకు; కిం= ఏమి? నన్ను కొట్టినా నీకేది సాధ్యం కాదు అని అర్థం.

**తా॥** ఓ కంసా! నేను సకల దేవదానవులను మోహపరచేదానను. రజస్తమోగుణ రూపులైన మధుకైటభులను నశింపజేసి, సత్త్వగుణాన్ని వృద్ధిచేసిన విష్ణుమూర్తిని ఆచ్ఛాదించే యవనికను. యోగనిద్రను. భగవానుడు నన్ను పురస్కరించుకొని తాను పరులకు కనబడకుండా ఉన్నవాడు. నీకంటెను చాల బలం కలిగియున్న శంభ నిశుంభులనే రాక్షసులను చంపే విషయమై భగవంతుడు ఆజ్ఞాపించిన కార్యాన్ని చేసే పరిచారికను.

*"తత్ర శుంభనిశుంభౌద్వౌదానవౌ నగచారిణౌ।*
*తౌచకృత్వా మనసి మాం సానుగౌనాశయిష్యసి॥"* (హరివంశం)

శుంభనిశుంభులనే ఇద్దరు రాక్షసులు పర్వత సంచారులు. నన్ను వెంటాడే వారిని మనసున తలచుకొని నాశనం చేయగలవు- అన్నమాట ప్రామాణికం.

నీకన్న చాలా బలవంతురాలను. నేను నిన్ను చంపడం చాలా చిన్నపని. అది నాకు సుకరమే అయినా, భగవానుని ఇచ్ఛను, సంకల్పాన్ని అనుసరించి ఉపేక్షించాను, మానుకొన్నాను. నీవు నన్ను 'చంపడానికి నన్ను బండకు విసరి కొట్టిననూ, నీకు ఇష్టంలేని పనిని తొలగించుకోవడం మొదలైన ఏ పనిని కూడా చేయడానికి నీకు శక్యం కాదని యోగమాయ స్పష్టంగా తెల్పింది.

*250.* *వపతి నందగృహే విబుధ ద్విషాం*
*దమయితా వసుదేవ సముద్భవః।*
*అయ మసౌ తవ నాశయితేతి సా*
*దర ముదీర్య జగామ యథేప్సితమ్॥* 53

**అర్థం:** విబుధ ద్విషాం= దేవతలకు శత్రువులైన రాక్షసుల యొక్క దమయితా= ప్రహర్తయైన శ్రీహరి; వసుదేవ సముద్భవః (సన్) వసుదేవునికి (కుమారుడుగా) పుట్టినవాడై; నందగృహే= నందగోపాలుని ఇంటిలో; వసతి= ఉన్నాడు; అయం= ఇక్కడ పుట్టిన బాలుడు; అసౌ= అక్కడ పెరిగి కౌమార దశను పొందినవాడై; తవ= నిన్ను; నాశయితా= నశింపజేయువాడు; ఇతి= అని; సా= ఆ యోగమాయ; దరం= కొద్దిగా; ఉదీర్య= చెప్పి; యథా+ఈప్సితం= చేరగోరిన చోటికి; జగామ= పోయెను.

**తా॥** రాక్షసాంతకుడైన శ్రీహరి వసుదేవుని పుత్రుడుగా ఇక్కడ పుట్టినవాడై నందగోపుని ఇంట్లో పెరుగుతున్నాడు. కౌమార దశగా వర్ధమానుడై ఆ కృష్ణుడు నిన్ను నశింపజేయనున్నాడు అని సంగ్రహంగా కంసునికి తెలియజెప్పి, తనకు ఇష్టమైన ప్రదేశానికి చేరపోయింది యోగమాయ.

"అయం, అసౌ"- ఈ పదాలు, స్వరూప ప్రకారాన్ని పరామర్శించడంవల్ల పునరుక్తిగా భావింపబడవు.

*251.* *మధు హిరణ్య నిభో మధురాపతి*
*ర్దిన హుతాశన దీన దశాంగతః।*
*శ్వసిత జల్పిత వేపిత హుంకృతై*
*రరతి మాయత భీతి రసూచయత్॥* 54

**అర్థం:** మధు, హిరణ్య నిభః= మధువు, హిరణ్యుడు అను రాక్షసులకు సమానుడైన; మధురాపతిః= మధురానగర ప్రభువైన కంసుడు; దిన-దశాం/ దిన

హుతాశన= పగటి నిప్పుయొక్క; దీన= క్షీణించిన; దశాం= స్థితిని; గతః= పొందినవాడై; ఆయత భీతిః= దీర్ఘ భయం కలవాడై; శ్వసిత-కృతైః/ శ్వసిత= వేడి నిట్టూర్పు చేతనూ; జల్పిత= పలురకాలుగా వదరుట చేతనూ; వేపిత= వణకుటచేతనూ; హుంకృతైః= హుంకరించుట చేతనూ; అరతిం= నిర్వేదాన్ని; అసూచయత్= సూచింపజేసెను.

**తా॥** మధువనువాడు, హిరణ్యుదనువాడు ద్వేషించే హృదయంగల అసురులు. ఆ మధు హిరణ్యులకు సమానమైన మనస్సు కలవాడు మధురకు రాజైన కంసుడు. యోగమాయ చెప్పిన మాటను విన్న కంసుడు పగటి నిప్పువలె నిస్తేజస్కుడయ్యాడు. రాబోయే ఆపత్తు ఏ స్థితిలో ఉంటుందో అని పెద్ద భయం కలవాడైనందువల్ల నిట్టూర్పు, వదరుట, వణుకుట, హుంకరించుట మొదలైన విపరీత చేష్టలచేత తనకున్న భయాన్ని వెల్లడిస్తుండెను.

*252. జడమతిః స జనార్దన మాయయా*
*విహసిత స్త్ర పయా జనితవ్యథః*
*అపకృతం వసుదేవ మమోచయత్*
*దయితయా సహ దీనవిలాపయా॥* 55

**అర్థం:** జడమతిః= మూఢబుద్ధిగల; సః= ఆ కంసుడు; జనార్దనమాయయా= భగవంతుని మాయాదేవిచేత; విహసితః= పరిహసింపబడినవాడై; త్రపయా= సిగ్గుచేత; జనిత వ్యథః= ఉదయించిన మనఃక్షోభ కలవాడై; అపకృతం= (తనచే) అపకారం చేయబడిన; వసుదేవం= వసుదేవుణ్ణి; దీన విలాపయా= దైన్యంతో దుఃఖిస్తున్న; దయితయా, సహ= భార్యయైన దేవకితోపాటు; అమోచయత్= చెరనుండి విడిచిపెట్టెను.

**తా॥** కంసుడు మూఢబుద్ధిని కలవాడు. భగవన్మాయయైన యోగనిద్రాదేవి చేత తన్నబడి పరిహసింపబడినవాడు కదా! "ఒక ఆడశిశువును కూడా గెల్వలేక పోతినే; ఎక్కడో పెరుగుతున్న బాలుడైన కృష్ణుణ్ణి ఎట్లు గెల్వగలను" అనే లజ్జతో మనస్సున క్షోభను పొందినవాడయ్యాడు.

'దేవకీ వసుదేవులను చెరసాలలో బంధించి వ్యర్థంగా బాధపెట్టినాను కదా!' అని తలచి, భయపడుతూ దైన్యంతో ఏడుస్తున్న దేవకితోపాటు వసుదేవుణ్ణి కారాగృహ బంధం నుంచి విడిపించాడు.

*253. కిమపిచింతిత మాగతమన్యథా*
*కిమిద మిత్యవశాదు పజాతయా।*
*విషవిదూషిత యేవ మనీషయా*
*ముహురదూయత మోహ విచేష్టితః॥* 56

**అర్థం:** మోహ విచేష్టితః= మోహంచేత చేయబడిన చేష్టలు కలిగినవాడైన కంసుడు; కిం, అపి= ఏదో; చింతితం= తలచబడినది; అన్యథా= (తలచినదానికంటె) వేరొకటి; ఆగతం= జరిగినది; ఇదం, కిం= ఇదేమిటి?; ఇతి= అని; అవశాత్= తన వశమున లేనందువల్ల; ఉపజాతయా= కలిగినట్టి (పొందినట్టి); విషవిదూషితయా, ఇవ= విషంచేత కలుషబడినట్లున్న; మనీషయా= బుద్ధిచేత; ముహుః= మాటికి మాటికి; అదూయత= పరితపించెను.

**తా॥** మూఢుడై అనేక కృత్యాలు చేసిన కంసుడు "నేననుకొన్నది ఒకటి జరిగినది వేరొకటి. దేవకీ వసుదేవులను చెఱసాలలో బంధించి, వారి గర్భజనితులైన శిశువులను, వెంటనే చంపడం నాకు శక్యమవుతుందనుకొన్నాను. ఇప్పుడు అనుకొన్నదానికి వేరొక విధంగా జరిగింది. నందగోకులమందు వసుదేవుని సుతుడు వర్ధమానుడుగా ఉన్నాడుట. ఇదేమిటి? ఏదీ నా వశమున లేకుండా పోయింది. నాకు తెలియక జరిగినదంతా విషం కలిసిన ఆహారాన్ని అనుభవించినట్లున్నది" అంటూ, తాపం కలిగిన బుద్ధితో కంసుడు పదే పదే పరితపిస్తుండెను.

*254. అవిషయే విపదా మసురాంతకే*
*పునరియేష నికార పరంపరామ్।*
*నియతి రేకముఖీ దురతిక్రమా*
*కృతధియా కిముతాஉஉవిలచేత సా॥* 57

**అర్థం:** ఆపదం= ఆపదలకు; అవిషయే= గోచరుడు కానట్టి; అసుర+అంతకే= రాక్షసులను నశింపజేసే కృష్ణుణి విషయమై; పునః= మళ్ళీ; నికార పరంపరాం= అపకారం పరంపరను; ఇయేష= (కంసుడు) కోరెను; ఏకముఖీ= ఒకే లక్ష్యంగలదైన; నియతిః= దైవం; కృతధియా= బుద్ధిమంతునిచేత; దురతిక్రమా= (దాట) మీరరానిది; అవిలచేతసా= కలుషమనస్కునిచేత; కిముత= చెప్పవలసిందేమున్నది?

**తా॥** ఒక్క ఆపదకు కూడా తనను పొందడానికి చోటివ్వని శ్రీకృష్ణుని విషయమై కంసుడు మళ్ళీ వరుసగా అపకారాలను చేయగోరినాడు. మంచి, చెడు పనులకు తగిన ఫలమీయనున్న దైవం బుద్ధిమంతునిచేత కూడా అతిక్రమింప శక్యం కానిది కదా! ఇక దుష్టమనస్సును కలవానిచేత అతిక్రమింపరానిదని చెప్పనవసరమే లేదు. ఏకం ముఖం (లక్ష్యం) యస్యాః సా= ఏకముఖీ, 'నియతిః' అనే పదానికి విశేషణ పదమిది. 'నికారో విప్రకారః స్యాత్' (అమరం). 'నియతిర్నియమే దైవే'- (విశ్వ ని.).

*255.* *పరిబభూవ చుకోప విసిష్మియే*
*పరిజహాస హరిం ప్రజగర్జ చ।*
*పరిణతేన భవాంతర వాసనా౽౽*
*గ్రహగుణేన భజన్ భవితవ్యతామ్॥* 58

**అర్థం:** పరిణతేన= పరిపక్వమైన; భవ+అంతర వాసనా+ఆగ్రహగుణేన= పూర్వజన్మమందు ఉండిన వాసనతో కూడిన ఆగ్రహం అనే గుణంచేత; భవితవ్యతాం= కాబోయే దాన్ని- దుష్కర్మ విపాకాన్ని; భజన్= సేవించువాడై (కంసుడు); హరిం= కృష్ణుణ్ణి; పరిబభూవ= చులకన జేసెను; చుకోప= కోపించెను; విసిష్మియే= విస్మయం చెందెను; పరిజహాస= పరిహసించెను; ప్రజగర్జ, చ= గర్జించెను కూడా.

**తా॥** పూర్వజన్మలో కంసుడు 'కాలనేమి' అనే పేరును కలిగిన రాక్షసుడు. కృష్ణున్ని ద్వేషించినవాడే. వెనుకటి జన్మలోని వైరవాసన పరిపక్వమైనందువల్ల

ఆగ్రహంచేత దుష్కర్మ విపాకాన్ని పొందిన కంసుడు కృష్ణుణ్ణి చులకనగా భావించాడు. అతనిమీద కోపం పెంచుకొన్నాడు. దేవకీ వసుదేవులకు పుట్టి నందగోకులమందు ఉన్నాడని విస్మయం చెందినాడు. నాపైన కూడా అపకారం చేయబూనుకొన్నాడని తన బలగర్వంచేత కృష్ణుణ్ణి పరిహసించాడు. "విపాకో భవితవ్యతా" (హలాయుధ నిఘంటువు). కంసుడు కాబోయే దుర్విధిని తప్పించుకోలేడు కాబట్టి, శ్రీకృష్ణుని గూర్చి శౌర్యోన్మాదం వల్ల గర్జించాడు.

*256.* క్వచన ధామని కంసనివేదితే
సభయ మానకదుందుభి రావసత్।
స్మృతిగతేన సుతేన సజీవితా
దిన శతాని నినాయచ దేవకీ॥ 59

**అర్థం:** ఆనక దుందుభిః= వసుదేవుడు; క్వచన= ఎక్కడనో ఒక (మధురలోనే); కంసనివేదితే= కంసునిచే తెల్పబడిన; ధామని= గృహమందు; సభయం= భయంతో; ఆవసత్= నివసించెను; దేవకీ, చ= దేవకి కూడా; స్మృతిగతేన= స్మరింపబడుతున్న; సుతేన= కుమారునిచేత; సజీవితా= ప్రాణధారిణి యవుతూ; దినశతాని= నూరు రోజులను; నినాయ= గడిపెను.

**తా॥** వసుదేవుడు, కంసుడు తెల్పిన మధురానగరంలోని ఒకానొక గృహమందు, కంసుడు చూపిన ఇంట్లో ఉండకుంటే ఏమి అనర్థం జరుగునో యను భయంతో నివసించాడు. దేవకి కూడా మనస్సున తన పుత్రుడైన శ్రీకృష్ణుణ్ణి తలచుకొంటూ, పాణాన్ని ధరించినదై వంద దివసాలను గడిపింది. చాలా రోజులు గడిపినదని భావం.

*257.* విగత కన్యకయాచ యశోదయా
నియతి సంభృత నిర్భర నిద్రయా।
చిర సమాగత జాగరయాఽ౦తికే
హరి రపత్య మదృశ్యత ధన్యయా॥ 60

**అర్థం:** విగత కన్యకయా= ఎత్తుకపోబడిన బిడ్డ-ఆడశిశువు- కలిగినట్టి; నియతి- నిద్రయా/ నియతి= దైవంచేత; సంభృత= సంపాదింపబడిన; నిర్భర= గాఢమైన; నిద్రయా= నిద్రను కలిగినట్టి; చిర సమాగత జాగరయా= చాలా సేపటికి పొందబడిన మెలకువ కలిగినట్టి; ధన్యయా= పుణ్యవతియైన యశోదచేత; అంతికే= సమీపమందు; అపత్యం= సంతానమైన; హరిః= శ్రీకృష్ణ పరబ్రహ్మ; అదృశ్యత= చూడబడెను.

**తా॥** వసుదేవుడు యశోదకు పుట్టిన ఆడ శిశువును ఎత్తుకొని, యశోద ప్రక్కన శ్రీకృష్ణుణ్ణి పడుకొనబెట్టి పోయినప్పుడు, యశోద దైవవశాన గాఢనిద్రలో ఉండింది. ఒక ఘడియ కాలం తర్వాత మేలుకొన్న యశోద తన పడకలోనున్న హరిని. నీలమేఘశ్యాముడైన పరమ పురుషుణ్ణి- తన సంతానంగా చూచిన ధన్యురాలు.

*258. యదవబుద్ధ నిరాకుల నీతిభి*
*ర్మని గణైరధునాఽపి విమృగ్యతే।*
*తదిద మాగమ మౌళి విభూషణం*
*విధివశా దభవత్ వ్రజ భూషణమ్॥* 61

**అర్థం:** అవబుద్ధ నిరాకుల నీతిభిః= తెలుసుకొనబడిన వ్యాకులంలేని నీతిని కలిగినట్టి; మునిగణైః మునుల సమూహాలచేత; అధునా, అపి= ఇప్పుడు కూడా; యత్= ఏది; విమృగ్యతే= వెదుకబడుతున్నదో; తత్= ఆ; ఇదం= ఈ; ఆగమ మౌళి విభూషణం= వేదాంత శాస్త్రమందు అలంకారంగా ప్రకాశించే పరబ్రహ్మ; విధివశాత్= (నందగోకుల మందలి జనుల) భాగ్యవశంవల్ల; వ్రజ భూషణం= వ్రేపల్లెకు భూషణంగా; అభవత్= అయెను.

**తా॥** వేదార్థాలను చక్కగా తెలుసుకొని వేదం ఒక స్థిరమైన శాసనమని నిరూపించిన న్యాయమూర్తులైన మునులు వేద ప్రతిపాద్యుడైన పరబ్రహ్మను గూర్చి తెలుసుకోవడానికి ఇప్పుడు కూడా అన్వేషిస్తునే ఉన్నారు. శ్రుతికాంత

సిగలో నగగా వెలిగే నీలమేఘశ్యాముడైన ఆ హరి ఇప్పుడు వ్రేపల్లెకు అలంకారంగా శోభిస్తున్నాడు. ఆహా! ఇది వ్రజవాసుల భాగ్యం కదా! 'విధి' శబ్దం భాగ్యం అనే అర్థం కలది.

"దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః"- (అమరం).

*259.* అనఘ వత్సమనాకుల ధేనుకం
ప్రచరదుగ్ధ మచోరభయోద్భవమ్।
వ్రజమనామయ విశ్వజనం విభుః
కృతయుగాస్పద కల్పమ కల్పయత్॥ 62

**అర్థం:** విభుః= విష్ణుమూర్తి (శ్రీకృష్ణుడు); అనఘవత్సం= ఆధి వ్యాధులు లేని దూడలు కలిగినట్టి; అనాకుల ధేనుకం= గడ్డి, నీరుకు కొరతలేని గోవులు కలిగినట్టి; ప్రచరదుగ్ధం= పుష్కలంగా పాలను కలిగినట్టి; అచోరభయ+ఉద్భవం= దొంగల వలని భయం పుట్టనట్టి; అనామయ విశ్వజనం= రోగాలు లేని సమస్త జనులు ఉన్నట్టి; వ్రజం= నందగోకులాన్ని; కృతయుగ+ఆస్పద కల్పం= కృతయుగమందలి వాసస్థానంతో సమానమైనదిగా; అకల్పయత్= చేసెను.

**తా॥** శ్రీకృష్ణుడు ప్రవేశించినప్పటి నుంచి నందగోకులమందు దూడలకు ఆధివ్యాధి రూప దుఃఖం లేదు. గోవులకు గడ్డి, నీరుకు కొరత లేదు. పాలు సమృద్ధిగా కలవు. దొంగల భయం పుట్టలేదు. సకల జనులు నిరామయులై- రోగాలు లేనివారై సుఖంగా ఉన్నారు. శ్రీకృష్ణుడు వ్రేపల్లెను కృతయుగమందున్న వాస స్థలానికి సమానమైనదిగా కల్పించాడు. వ్రజ భూషణుడు కదా!

*260.* అజని గోప గృహేషు మనోరమై
రమిత కాంతిభి రప్సరసాం గణైః
యదను భూతి రసేన సమేష్యతః
శరణయాదవ శైశవ యౌవనే॥ 63

**అర్థం:** మనోరమైః= అందమైన; అమితకాంతిభిః= అధిక లావణ్యం గల అప్సరసాం= దేవవేశ్యల యొక్క; గణైః= సమూహములచేత; గోపగృహేషు= నందుని వ్రజ వాసుల ఇండ్లయందు; అజని= జన్మించడమైనది; యత్+అనుభూతి రసేన= ఏ అప్సరల (వంటి కన్య) యొక్క అనుభవం వల్ల కలిగిన సుఖంతో; శరణ యాదవ శైశవ యౌవనే= రక్షకుడైన శ్రీకృష్ణుని యొక్క బాల్య యౌవన దశలు; సమేష్యతః= సంగమింపనున్నవో.

**తా॥** నంద వ్రజవాసుల ఇండ్లల్లో సుందరమైన అపరిమిత లావణ్యం కలిగినట్టి అప్సరసల వంటి కన్యలెందరో జన్మించారు. భగవంతుని యందు రక్తి, ఆసక్తిగల ఋషులు భగవత్సంకల్పంచేత అచ్చర లేమలవంటి దివ్యావయవ సౌష్ఠవమూ, సౌందర్యమూ కలిగిన ఆకారంతో గోపకన్యలుగా జన్మించారు. యథార్థంగా ఊర్వశి, తిలోత్తమలే గోకులమందు పుట్టినారని భావింపరాదు.

*"ఋషీణాం దేవతానాంచ సంభవం వసుధాతలే"*- (భారతం. 18-6) విష్ణు లోకమందు పూర్వమే సంకల్పించబడిన విషయమని స్పష్టమవుతున్నది.

*"షోడశ స్త్రీ సహస్రాణి వాసుదేవ పరిగ్రహాః.. తాశ్చైవాప్సరసో భూత్వా వాసుదేవ ముపా విశన్॥"*- (భారతం 18-5).

'అనుభూతి' అంటే అనుభవంవలన కలిగిన విషయం అని అర్థం. శ్రీకృష్ణుడు ఇప్పుడు యాదవుడుగా ఉన్ననూ, ఎప్పటికీ జగద్రక్షకుడే. ఆయన బాల్యదశ అప్సరసల లాంటి కన్యలతో క్రీడించడం వల్ల కలిగే సుఖాన్ని పొందగలదు. ఇక యౌవన దశ ఆ గొల్ల పడుచులతో సంభోగం వలని రసాన్ని- రుచిని- పొందగలదని కావ్య నిర్మాత అభిప్రాయమిది.

ఇది చాలా ప్రాచీన విషయమే, అయినా కావ్యమందు అచ్చరలేమల జన్మ, పుట్టుక చెప్పబడినందున శైశవ యౌవన దశలు ఆ పడుచుల అనుభవ జన్యమైన సుఖంతో సంగమించగలవని భవిష్యత్కాలం- సమేష్యతః- ప్రయోగింప బడినది. ఉదా:-

"అతంద్రితా సా స్వయ మేవ వృక్షకాన్ ఘటస్తనీ ప్రస్నవనైర వర్ధయత్।
గుహోఽపియేషాం ప్రథమాత్మ జన్మనాం నపుత్ర వాత్సల్య మపాకరిష్యతి॥"

అనే (కుమార సంభవం) శ్లోకంలోని "నాపా కరిష్యతి"- భవిష్యత్ప్రయోగం, దీక్షితుల వ్యాఖ్యానంలో ఎత్తిచూపబడింది.

261. సురమహీసురతోషణ మాదరాత్
నవముపాదిత నంద ఉదారధీః।
తరళగోపగణాగమ సంకులం
తనయ జన్మమహోత్సవ మద్భుతమ్॥ 64

**అర్థం:** ఉదారధీః= గొప్ప మనస్సు కలిగినవాడైన; నందః= నందగోపుడు; సుర మహీసురతోషణం= దేవతలను, బ్రాహ్మణులను సంతోషింపజేయునట్టి; తరళ-సంకులం/ తరళ= సంభ్రమించే; గోపగణ= గోపకుల సమూహాల యొక్క; ఆగమ= రావడంచేత; సంకులం= క్రిక్కిరిసి యున్నట్టి; అద్భుతం= ఆశ్చర్యమైన; నవం= నూతనమైనట్టి; తనయజన్మ మహోత్సవం= పుత్రుడు పుట్టిన గొప్ప పండుగను-మహోత్సవాన్ని; ఆదరాత్= గౌరవంగా; ఉపాదిత= జరిపెను.

**తా॥** నందగోపుడు గొప్ప మనస్సు కలవాడు. దేవతలను, వేదశాస్త్రజ్ఞులైన భూసురులను సంతోషింపజేయునట్లు ఆహ్వానించాడు. నందగోకులమందు గోపాలురు గుంపులు గుంపులుగా వీథులలో ఊరేగి వచ్చినందువల్ల పరిపూర్ణమై యున్నది. ఇంతకు ముందు సంతానం లేనందున ఈ ప్రథమ పుత్రుని జన్మ మహోత్సవాన్ని ఉల్లాసంతో అద్భుతంగా జరిపినాడు.

"నందస్త్వాత్మజ ఉత్పన్నే జాతాహ్లాదో మహా మనాః।
ఆహూయ విప్రాన్ వేదజ్ఞాన్ స్నాతః శుచి రలంకృతః॥"

"గోపాః పరస్పరం హృష్టాః దధిక్షీర ఘృతాంబుభిః।
ఆసించంతో విలింపంతో నవనీతైశ్చ చిక్షిపుః॥" (భాగవతం)

నందగోపుడు పుత్రుడు పుట్టినందువల్ల ఉత్సాహంతో మహా మనస్వియై అభ్యంగన స్నానమాచరించి నూతన వస్త్రభూషణాలంకృతుడయ్యాడు. వేదశాస్త్ర పారంగతులైన విప్రులను ఆహ్వానించి సత్కరించాడు.

ఇక, వ్రజవాసులైన జనులు పెరుగు, పాలు, వెన్న, మజ్జిగ మొదలైన ద్రవ్యాలను ఒకరికొకరు పూసుకొని చల్లుకొని, జన్మమహోత్సవాన్ని కన్నుల పండుగగా జరుపుకొన్నారు (శ్రీ మద్భాగవత విషయం అను సంధించదగినది).

*"ఓడువార్ విషువార్ ఉగన్దాలిప్పార్*
*నాడువార్ నంబిరాన్ ఎంగుత్తా నెన్బార్।*
*పాడువార్ కళుం పల్ పఱై కొట్టు నిన్టు*
*ఆడువార్ కళుమ్ అయిఱ్ఱాయ్ప్పాడియే॥"* (పెరియా. తి. 1-2)

జనులు కొందరు పరుగెత్తుతున్నారు. మరికొందరు కాలుజారి పడిపోతున్నారు. మన ముద్దులయ్య ఏడీ? ఎక్కడున్నాడని వెదకసాగిరి. కొందరు వాద్యాలను మ్రోగిస్తూ పాటలు పాడగా, వేరే కొందరు నాట్యమాడుతుండిరి. గోకులమంత ఆనందోత్సాహంతో పరవళ్ళు త్రొక్కింది.

*262.* అధి చకార వదాన్యమణేః శ్రియం
వ్యధిత కల్పతరో రను కల్పతామ్।
అ(వ్య) జనయచ్చ సుత ప్రసవోత్సవే
మహతి మేఘవికత్థన మోఘతామ్॥ 65

**అర్థం:** మహతి= గొప్పదైన; సుత ప్రసవ+ఉత్సవే= పుత్రుని జన్మోత్సవ మందు; వదాన్య మణేః= అనేకంగా ఇచ్చునట్టి చింతామణి యొక్క; శ్రియం= శోభను; అధిచకార= అధికరించెను; కల్పతరోః= కల్పతరువును; అనుకల్పతాం= ముఖ్యం కానిదానిగాను; వ్యధిత= చేసెను; మేఘ వికత్థన మోఘతాం= మేఘమునకున్న పొగడ్తను వ్యర్థముగాను; అ(వ్య)జనయత్, చ= చేసినాడు కూడ.

**తా॥** నందగోపుడు తన పుత్రుని జన్మ మహోత్సవాన్ని చాలా గొప్పగా చేశాడు. అధిక సంపదను ఇచ్చునట్టి చింతామణి యొక్క శోభను తాను పొందినాడు. కోరిన దేదైనను ఇచ్చునట్టి కల్పతరువును రెండవ దానిగా చేసి తానే మొదటివాడుగా పేరు పొందినాడు. జలమును వర్షించి, ఔదార్యగుణ విషయమై కొనియాడదగిన మేఘం యొక్క మహిమను వ్యర్థం చేశాడు. అధికంగా దానం చేయువారిని వదాన్యులు అంటారు.

"స్యుర్వదాన్య స్థూల లక్ష దానశౌండాః బహుప్రదే" (అమరం). కల్ప మంటే ముఖ్యమైనది, మొదటిదని అర్థం. అనుకల్ప మంటే అధమమైనదని అర్థం అముఖ్యమైనదని భావం.

"ముఖ్యః స్యాత్ ప్రథమః కల్పోఽను కల్పస్తుతతోఽ ధమః" (అమరం). నందుడు పుత్ర జన్మోత్సవమందు చింతామణి, కల్పతరువు మరియు వర్షాకాల మేఘమున కంటెను అధికంగా దానంచేసి 'వదాన్యుడు' అనే కీర్తిని పొందినాడు- అని తాత్పర్యం.

*263.* *నిధి మనంతమివ స్వయముత్థితం*
*నిరవధిం నిజభాగ మివోదితమ్।*
*వ్రజ భువః ప్రతిలభ్య రమాపతిం*
*జహసు రైంద్ర మసారతరం పదమ్॥* 66

**అర్థం:** వ్రజ భువః= వ్రేపల్లెలో ఉన్న జనులు; స్వయం= తానే; ఉత్థితం= ఉద్గతమై కనబడిన; అనంతం= అంతంలేని; నిధిం, ఇవ= నిధివలె ఉన్నట్టి; ఉదితం= మూర్తీభవించిన; నిరవధిం= హద్దులేని (నిస్సీమమైన); నిజభాగం ఇవ= తమ భాగ్యం వలె ఉన్నట్టి; రమాపతిం= లక్ష్మీనాథుడైన శ్రీకృష్ణుణ్ణి; ప్రతిలభ్య= పొంది; ఐంద్రం= ఇంద్రునిదైన; పదం= స్థానమును (స్వర్గలోకమును); అసారతరం= మిక్కిలి సారం లేనిదానిగాను, జహసుః= పరిహసించారు.

**తా॥** గోకుల వాసులందఱు స్వయంగా కనబడిన, అనంతమైన నిధిలాగా ఉన్నట్టి, అవధిలేని తమ భాగ్యం మూర్తీభవించినట్లున్నట్టి, శ్రీకృష్ణ భగవానుణ్ణి పొంది, స్వర్గలోకాన్ని నిస్సారమైనదిగాను ఎగతాళి చేశారు. భాగమంటే భాగ్యమని అర్థమున్నది. "భాగ్యైకదేశయోర్భాగః" అని రుద్ర నిఘంటువు. "భాగో భాగ్యే రూపకార్యే చతుర్థాం శైకదేశయోః" అని రత్నమాల.

నందగోకుల వాసులెల్లరు స్వారాజ్యం- స్వర్గలోకం కన్న మిన్నయైన సుఖాన్ని అనుభవించారని భావం. శ్రీకృష్ణ భగవానుడే హిరణ్యనిధి కదా!

*264.* *పుత్రం ప్రసూయ తపసా పురుషం పురాణం*
*కాలం చిరం విధివశాత్ కృత విప్రకర్షౌ ।*
*శంకా కళంకిత ధియా వపి దంపతీ తౌ*
*తద్వైభవస్మరణ శాంతరుజావ భూతామ్॥* 67

**అర్థం:** పురాణం, పురుషం= నారాయణుణ్ణి; తపసా= తపస్సుచేత; పుత్రం= కుమారునిగా; ప్రసూయ= కని (ప్రసవించి); చిరం, కాలం= బహుకాలం; విధివశాత్= దైవాధీనంవల్ల; కృతవిప్రకర్షౌ= పుత్రుని నుంచి దూరంగా నున్నవారైన; తౌ= ఆ దేవకీ వసుదేవులు అనబడే; దంపతీ= దంపతులు; శంకా కళంకిత ధియౌ, అపి= భయంచేత కలుషిత బుద్ధిని కలవారైననూ; తత్+వైభవ స్మరణ శాన్తరుజౌ= తమ పుత్రునియొక్క ప్రభావాన్ని స్మరించడంచేత శమించిన తాపం కలవారుగా; అభూతాం= అయినారు.

**తా॥** దేవకీ వసుదేవులు పూర్వం తపస్సు చేసి పురాణ పురుషుడైన నారాయణుణ్ణి తమ పుత్రునిగా పొందినారు. అయినా, చాలాకాలం దైవవశాన పుత్రునికి దూరంగా ఉన్నారు. కంసుని భయంవల్ల వారి మనస్సు క్షోభపడినప్పటికీ ఆ దంపతులు తమ పుత్రుని పరత్వ మహిమను తలచుకొంటూ, తాపాన్ని తొలగించుకొన్న వారయ్యారు. శంక అంటే భయం.

"శంకా వితర్కభయయోః"- (వైజయంతి) 'రుక్' అంటే తాపం. "స్త్రీ రుగ్రు జాచోపతాపరోగ వ్యాధి గదామయాః"(అమరం). వసంత తిలకావృత్తం.

265. నంద సద్మని నవేందు సంనిభౌ
వాస మేత్య వసుదేవ నందనౌ।
వృద్ధి మాపతు రనేహసా స్వయం
స్వాదుభోగ జననీం సుపర్వణామ్॥ 68

**అర్థం:** నవ+ఇందు సంనిభౌ= కొత్త చంద్రునితో సమానులైన; వసుదేవ నందనౌ= వసుదేవుని పుత్రులైన బలరామకృష్ణులు; నంద సద్మని= నందుని గృహమందు; వాసం= నివాసమును; ఏత్య= పొంది; అనేహసా= కాలంచేత; స్వయం, ఏవ= స్వయంగానే; సుపర్వణాం= దేవతలకు; స్వాదుభోగజననీం= మధురమైన భోగాన్ని కలిగించే; వృద్ధిం= వృద్ధిని; ఆపతుః= పొందిరి.

**తా॥** బాలచంద్రునితో సమానశోభ కలిగిన బలరామకృష్ణులు నందుని భవనమందు నివసించారు. బాలచంద్రునికి దినమొక కళ పెరిగినట్లు, చంద్ర సదృశులైన వసుదేవనందనులు దేహం, అందం దిన దినం అభివృద్ధిని పొందుతుండగా జనులకు, దేవతలకు కనువిందుగా నుండెను.

'పర్వం' అంటె పున్నమ, భాగం, ఉత్సవం అని నానార్థాలున్నాయి. దేహం యొక్క పెరుగుదలలో నాలుగు దశలు (భాగాలు) ఉంటాయి. బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధక్యం (జరా/ ముసలితనం) అనే నాలుగు పర్వాలలో జరా (ముదిమి) అనే పర్వం లేనివారై ఎప్పుడూ (30) ముప్పదేండ్లలోపు వయస్సును కలవారుగానే ఉండే దేవతలకు త్రిదశులు, సుపర్వులని పేరు.

ఈ శ్లోకంలో బలరామకృష్ణులు బాలచంద్ర సమానులన్నందున పర్వం-పున్నమవరకు చంద్రకళలు వృద్ధిచెందినట్లు వారు దినదినం అభివృద్ధి చెందుతున్నారని వర్ణితం.

సుపర్వణాం స్వాదుభోగజననీం- అని నవేందు సన్నిభుల వృద్ధి వర్ణింపబడింది. విశేషమేమిటి అంటే చంద్రకళ "దేవానామమృతం ఆయుః ప్రజానాం" (శ్రుతి) దేవతలకు ఆహారంగానూ, మర్త్యులకు ఆహ్లాదకరంగానూ ఉంటుంది.

"ప్రథమాం పిబతే వహ్నిః" అన్నట్లు- చంద్రుని మొదటి కళను అగ్నిదేవుడు పానం చేస్తాడు. అట్లే అమృత కిరణుని కళలను పూర్ణంగా పానం చేయడం వల్ల 'సుపర్వాణ' వాచ్యులకు మధురభోగం జనిస్తుంది. శుక్లపక్ష చంద్రకళలాగా దినదినాభివృద్ధి జెందుతున్న నందగృహనివాసులైన రామకృష్ణులు ఒకానొక సమయాన స్వయంగా కంసుని వధిస్తే, తత్ఫలితంగా దేవతలు తమ తమ పదవులలో ఉండి, స్వాదుభోగాన్ని అనుభవిస్తుంటారు. కాబట్టి వసుదేవనందనుల వృద్ధి (పెరుగుదల) దేవతల స్వాదుభోగ సంపదకు జననిగా కీర్తింపబడింది. శ్రీకృష్ణుడు 'పెరిగి' కంసుని వధించగానే దేవతలకు సుఖం పెరిగి నిశ్చింతగా మనగల్గుతారని భావం.

"రాన్నరావిహ రథోద్ధతా లగౌ"- రనరలగ- గణాలు కలిగియున్న రథోద్ధతా వృత్త రచిత శ్లోకమిది.

శ్రీకృష్ణుని నందగృహ ప్రాప్తివర్ణనం గల తృతీయ సర్గ సమాప్తమ్.

# చతుర్థ సర్గ

266. మనీషితం కైతవ మానుషస్య
శ్రుత్వా భయక్రోధ పరిప్లుతాత్మా।
కంసశ్చిరం ప్రాగ్భవకాలనేమి
శ్చింతార్ణవే మగ్న ఇవావతస్థే॥ 1

**అర్థం:** కైతవ మానుషస్య= కపట మనిషిగా ఆవిర్భవించిన శ్రీకృష్ణ భగవానుని యొక్క; మనీషితం= అభిప్రాయాన్ని; శ్రుత్వా= విని; భయక్రోధ పరిప్లుత+ఆత్మా= భయం, క్రోధం అనే అలలలో మునుగుతూ తేలుతూ ఉన్న మనస్సు కలిగినట్టి; ప్రాక్+భవకాలనేమిః= పూర్వజన్మలో 'కాలనేమి'గా నుండినట్టి; కంసః= కంసుడు; చిరం= చాలాకాలం; చింతా+అర్ణవే= విచారం అనే సముద్రమందు; మగ్నః, ఇవ= మునిగినాడు అన్నట్లు; అవతస్థే= ఉండెను.

**తా॥** శ్రీకృష్ణుడు కపటుడైన మనిషిగా ఆవిర్భవించినవాడు. ఆయన అభిప్రాయాన్ని నందగోవుని బిడ్డవల్ల విన్నాడు కదా! భయమూ, క్రోధమూ, అధికంగా కంసుని మనస్సును కలవరపెడుతున్నాయి. ఇంతకుముందు జన్మలో కంసుడు 'కాలనేమి' అనే అసురుడుగా పుట్టి చచ్చాడు. కాబట్టి, కంసుడు చిరకాలం ఈ జన్మలో విచారసాగరమందు మునిగాడన్నట్లున్నాడు.

**సుబోధినీ వ్యాఖ్య:-** శ్రీకృష్ణుడు తన వధ కొరకే పుట్టినాడని కంసుడు విచార సాగరమగ్నుడయ్యాడు.

సర్వేశ్వరుడైన నారాయణుడు శ్రీకృష్ణుడు అను పేరుతో దేవకీ వసుదేవులకు పుత్రుడుగా ఆవిర్భవించాడు. నందగోకులమందు పెరుగుతున్నాడు. శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుడు. కాబట్టి, పుట్టుకతోనే 'కపటంగల మనిషి' అనబడినాడు. పైగా, కంసుని చంపడానికీ పుట్టి పెరుగుతున్న శ్రీకృష్ణుని అభిప్రాయాన్ని కంసుడు,

తాను బండమీద విసరికొట్టి చంపబోయిన, నందగోపుని కుమార్తెయైన మాయాదేవిచే స్పష్టంగా విన్నాడు.

అందువల్ల కంసుని మనస్సు భయం, క్రోధం అనే కెరటాలలో మునిగి తేలుతున్నది. కరుణాసముద్రుడు భగవానుడు, శరణాగతి చేసినంతనే రక్షించేవాడైనందు వల్ల భయపడవలసిన అవసరం లేదని కంసుని మనస్సు తేలియాడుతున్నది. కాని, తొలి జన్మలో కంసుడు 'కాలనేమి' అనే అసురుడుగా పుట్టి భగవానునిచేతనే చంపబడినాడు. పూర్వజన్మమందుండిన ఆసురప్రవృత్తి యొక్క వాసనా సంస్కారంవల్ల క్రోధమధికమై శ్రీకృష్ణుని ప్రాణం తీయాలి, చంపాలి అనే రేయింబవలు అతని మనస్సు తలమునకలవుతున్నది. తత్ఫలితంగా కంసుడు చిరకాలం చింత అనే సముద్రమందు మగ్నుడైనట్లు ఉన్నాడు.

ఈ శ్లోకం 'చింతార్ణవ' మనేచోట రూపకాలంకారంతో సంకీర్ణమైన ఉత్ప్రేక్షాలంకారం చేత సజ్జితం. ఉపేంద్ర వజ్రా, ఇంద్రవజ్రా (ఉపజాతి వృత్తం) (క్రమంగా 'జతజగగ- తతజగగ, గణాలు).

*267.* స దుర్దమాన్ ఆసుర సత్త్వ భేదాన్
నేతా సమాహూయ నృశంస చేతాః।
ప్రస్థాపయామాస పరై రధృష్యం
నందాస్పదం నాథ విహార గుప్తమ్॥ 2

**అర్థం:** సః= ఆ; నేతా= ప్రభువైన కంసుడు; నృశంస చేతాః= క్రూర మనస్సు కలవాడై; దుర్దమాన్= అణచరానట్టి; ఆసురసత్త్వ భేదాన్= ప్రాణాన్ని తీసే రాక్షసులను; సమాహూయ= పిలిచి; నాథ విహార గుప్తం= శ్రీకృష్ణుని యొక్క లీలచేత గోప్యంగా ఉన్నట్టిదైనందుననే; పరైః= శత్రువులచేత; అధృష్యం= సహింపరాని; నంద+ఆస్పదం= నందుని స్థానమైన గోకుల పురమును గూర్చి; ప్రస్థాపయామాస= పంపెను.

**తా॥** ప్రభువైన కంసుడు క్రూర మనస్కుడు. శ్రీకృష్ణుని చంపదలచినవాడై దమింప శక్యం కానట్టి, ప్రాణాలను హరించే శక్తిగల వ్యక్తులను పిలిచాడు. శ్రీకృష్ణుణ్ణి లీలచేతనే కాపాడబడుతూ, శత్రువులకు చొరరానిదైన నందగోకులానికి తాను ఆజ్ఞాపించిన కార్యాన్ని నెరవేర్చవలసినదని అసురులను పంపించాడు.

*268. కదా చిదంతర్హిత పూతనాత్మా*
*కంస ప్రయుక్తాకిల కాఽపి మాయా।*
*నిద్రా పరాధీన జనే నిశీథే*
*వ్రజం యశోదాకృతిరా వివేశ॥* 3

**అర్థం:** కదాచిత్= ఒకానొకప్పుడు; కంసప్రయుక్తా= కంసునిచేత ప్రయోగింపబడిన; కా, అపి= అనిర్వాచ్యమైన; మాయా, కిల= శాంబరియే; నిద్రాపరాధీన జనే= గాఢనిద్రావశమైన జనం కలిగిన; నిశీథే= అర్ధరాత్రియందు; అంతర్హిత పూతనా+ఆత్మా= కప్పిపుచ్చబడిన 'పూతన' అనే పేరుగల తన ఆకారం కలిగినట్టిదై; యశోదా+ఆకృతిః= యశోదయొక్క రూపంవంటి రూపం కలదిగా; వ్రజం= వ్రేపల్లెలో; ఆవివేశ= ప్రవేశించెను.

**తా॥** కొన్ని రోజులు గడిచిన తర్వాత, కంసుడు పూతన అనే పేరుగల రాక్షసిని గోకులానికి పంపించాడు. అది ఒక మాయ– శాంబరియే. ఆ పూతన నందగోకులమందున్న జనులందరు గాఢనిద్రాపరవశులై యున్న అర్ధరాత్రిపూట తన రూపాన్ని యశోద యొక్క ఆకారంగా మార్చుకొని గోకుల గ్రామంలోకి ప్రవేశించింది. అది ఒక కామరూప రాక్షసి అని తాత్పర్యం.

"పూతనకు మాయా సామ్యం ఇక్కడ చెప్పబడింది కదా! పూతనకు జనులను నిద్రాపరవశులను చేసే సామర్థ్యం మాత్రం లేదు. పూర్వం శ్రీకృష్ణుడు ప్రయోగించిన మాయయే గోకుల వాసులందరిని నిద్రాణులుగా జేసింది. అంతే కాదు; ఆ భగవన్మాయయే పూతన తన ఆకారాన్ని యశోదాదేవి యొక్క ఆకారంగా

మార్చుకొనునట్లు చేసింది. కాబట్టి, 'మాయా' శబ్దానికి 'కాపి' అనే విశేషణ పదం బాగా ఆలోచించి ప్రయోగింపబడింది" అని శ్రీ ఉత్తమూరి వీర రాఘవాచార్య స్వామివారి సంస్కృతటిప్పణి మరియు తమిళ వ్యాఖ్యానం.

*269.* స్తన్యేన కృష్ణః సహ పూతనాయాః
ప్రాణాన్పపౌ లుప్త పునర్భవాయాః।
యదద్భుతం భావయతాం జనానాం
స్తనంధయత్వం న పునర్బభూవ॥ 4

**అర్థం:** కృష్ణః= శ్రీకృష్ణుడు; లుప్త పునర్భవాయాః= నశించిన పునర్జన్మ గలదైన; పూతనాయాః= పూతనయొక్క; స్తన్యేన, సహ= చనుపాలతోపాటు; ప్రాణాన్= ప్రాణాలను; పపౌ= త్రాగెను; (ఇతి)యత్ అద్భుతం= అను విషయం ఆశ్చర్యం; భావయతాం= ధ్యానం చేయునట్టి; జనానాం= భక్తజనులకు; పునః= మళ్ళీ; స్తనంధయత్వం= చనుపాలు త్రాగడం- పునర్జన్మ; న, బభూవ= కలుగలేదు.

**తా॥** శ్రీకృష్ణుడు పునర్జన్మ లోపించిన పూతన యొక్క ప్రాణాలను చనుపాలతో కూడా పానం చేశాడు. ఈ విషయం అద్భుతం కదా! స్తన్యమును త్రాగిన శ్రీకృష్ణుడు పూతనకు మోక్షమిచ్చిన చరిత్రను స్మరించిన, ధ్యానించిన, భక్తులకు మళ్ళీ తల్లిపాలు త్రాగే అనుభవం కలుగలేదు అనగా భగవల్లీలను ఉపాసించే జనులకు జన్మరాహిత్యం కలిగినదని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** స్తన్యమిచ్చిన పూతనకు జన్మరాహిత్యం సిద్ధించడం అద్భుతమని సుశ్లోకితం.

లుప్తపునర్భవయైన పూతన (యశోదయొక్క- తల్లియొక్క రూపాన్ని ధరించి వచ్చి) శ్రీకృష్ణునికి చనుబాలను ఇచ్చింది. కృష్ణుడు పూతన యొక్క స్తన్యంతోపాటు ఆమె ప్రాణాలను త్రాగివేశాడు. పూతన ఒక మాయగా పోల్చబడింది పూర్వ శ్లోకమందు. పూతన చేసిన పని వంచనతో కూడినదని తెలుస్తున్నది కదా!

పూతన తన స్తనములకు విషమును పూసుకొని తల్లిలాగా వచ్చి చనుపాలను కృష్ణునికి త్రాగనిచ్చింది. కృష్ణుడు బ్రతకకూడదని చేసిన పూతన పని ఇది. కృష్ణుడు పూతన యొక్క స్తన్యాన్ని పానం చేస్తున్నప్పుడే ఆమె ప్రాణాలనూ పానం చేశాడు. చంపినాడని భావం.

ఇందు– "లుప్త పునర్భవాయాః" అని పూతనకు విశేషణపదంగా ప్రయుక్తం. (కృష్ణుడు పాలు త్రాగకముందు) పుట్టుక లేకుండ అయినట్టిది పూతన– అని అర్థమిస్తుంది కదా! ఇదెట్లు సమర్థనీయం అంటే ప్రాణాలను పానం చేయకముందు పునర్జన్మలేనిది కాదు పూతన. కాని, ఈ కావ్య రచన కాలమందు మాత్రం స్తన్యమిచ్చిన పూతన పునర్జన్మలేనిదైనదే కదా! కాబట్టి, పూర్వ వృత్తాంత కథనం చేత ప్రాచీనతకు క్షతిలేదనుకోవడం ఒక విధం లేదా– "తల్లి వలె వచ్చి తనకు స్తన్యపానం చేయించనున్నది. స్తన్యమిచ్చిన తల్లికి తాను మేలు చేయాలి" అని కృష్ణుడు పూతనయొక్క స్తన్యాన్ని పానం చేయకముందే సంకల్పించుకొన్నాడు. కాబట్టి పూతన భగవత్సంకల్పం వల్ల మొదటనే "లుప్తపునర్భవ' అనడం మరొక విధంగా సమర్థనీయం. అస్తు.

చంపదలచి విషస్తన్యాన్ని ఇచ్చిన శత్రువుకు పునర్జన్మను కలిగించనట్టి మోక్షఫలం సిద్ధించడం ఒక ఆశ్చర్యం. ఇక్కడ 'పపౌ' అనే క్రియాపదం స్తన్యంతో సహప్రాణాలను త్రాగెను అని సామాన్యార్థాన్ని కలది. అయినా చనుబాలను త్రాగెను. ప్రాణాలను కూడా అపహరించెను అని అర్థం. "త్రాగెను, అపహరించెను" అనే రెండు అర్థాలను కలిగియున్నందువల్ల 'సహోక్త్యలంకారం' ఇది.

ఇక ఉత్తరార్ధం:– శ్రీకృష్ణుణ్ణి స్తన్యపానభావంతో ధ్యానం చేసిన భక్తజనులకు మళ్ళీ తల్లిపాలు త్రాగే పునర్జన్మ కలుగలేదు. ఏ భావంతో ఉపాసన చేస్తే ఉపాసకునికి ఆ భావమే సిద్ధించాలి. స్తనంధయుణ్ణి ధ్యానించే వ్యక్తులకు అధికంగా స్తనంధయత్వమే స్తన్యపాన లాభమే కలుగవలె కదా! ఆ ధ్యానపరులకు తల్లి పాలు త్రాగగలిగే పునర్జన్మ లేకుండా అయింది. ఇదేమిన్యాయం?

స్తనంధయుని ఉపాసకులకు మళ్ళీ స్తనంధయత్వం కలుగలేదు (మోక్షఫలమే లభించింది) అనడం మరొక ఆశ్చర్యం. ఇది విషమాలంకారం.

*"యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి, తథేతః ప్రేత్య భవతి"* అనే శ్రుతి వాక్యం 'మానవుడు లోకంలో ఏ క్రతువు, యజ్ఞం చేస్తే, దేహాంతమందు ఆ క్రతువు ఫలాన్ని పొందుతాడు' అనే అర్థం కలది. వేదాంత శాస్త్రమందు దీన్ని 'తత్క్రతున్యాయం' అన్నారు.

ఈ న్యాయానికి విరుద్ధంగా, రెండవ జన్మలో మళ్ళీ తల్లిపాలను త్రాగజాలని అనర్థమే కలిగింది. ఈ అనర్థ రూపమైన నింద, ఉపాసకులకు ముక్తిని ప్రసాదించే భగవానుని స్తుతియందే పర్యవసించడం వల్ల ఇది వ్యాజస్తుతి అలంకారం. న పునర్భవతి= మళ్ళీ కలుగదు అనుటకు బదులు 'న పునర్బభూవ'= మళ్ళీ కలుగలేదు అనబడినది. పూర్వం కొందరు ఈ కథను స్మరించి ముక్తిని పొందినారు అని తెలుపబడింది.

ఇక్కడ ఒక కవి స్తుతించిన శ్లోకం స్మరణీయం:-

*"గోపాల ఇతి కృష్ణ! త్వాం ప్రచురక్షీర వాంఛయా।*
*శ్రితో మాతృస్తన క్షీర మప్యలభ్యం త్వయా కృతమ్॥"*

ఓ కృష్ణా! గోపాలుడవైనందున ఎక్కువ పాలు లభిస్తాయనే కోరికతో నిన్ను ఆశ్రయించాను. మరి నీవు నాకు తల్లిపాలు కూడా లభింపకుండా చేశావు.

మనం స్వల్ప ఫలాన్ని ఆశించిననూ, భగవాడు అనల్ప ఫలాన్నే ప్రసాదిస్తాడు అని సారాంశం.

*270.* *నిశమ్య తస్యాః పరుషం నినాదం*
*రూక్షం యశోదా రుదితం చ సూనోః।*
*స సంభ్రమావేగము పేత్య భీతా*
*సమగ్రహీద్దుర్గ్రహమాగమానామ్॥* 5

**అర్థం:** యశోదా= నందుని పత్నియైన యశోద; తస్యాః= ఆ పూతన యొక్క పరుషం= కఠినమైన; నినాదం= ధ్వనిని; చ= మరియు; సూనోః= పుత్రుని (కృష్ణుని) యొక్క; రూక్షం= కఠినమైన; రుదితం= ఏడ్పును; నిశమ్య= విని; భీతా= (సతీ)= భయపడినదవుతూ; స సంభ్రమ+ఆవేగం= మనోవ్యాకులం, మిక్కిలి వేగంతో కూడినదిగా; ఉప+ఏత్య= దగ్గరకుపోయి; ఆగమానాం= వేదాలకు; దుర్గ్రహం= అతికష్టంగా పట్టుబడే కృష్ణుణ్ణి; సమగ్రహీత్= చేతులతో నెత్తుకొనెను.

**తా॥** యశోద కృష్ణునిచే ప్రాణమపహరింపబడిన పూతన యొక్క కఠోరధ్వనిని విన్నది. వెంటనే భయంతో నటించిన కృష్ణుని తీవ్రమైన రోదనను విన్నది. యశోదకు ఏమి చేయాలో తోచని భయమూ, మనస్సులో క్షోభ అధికమైనది. కాబట్టి అతివేగంగా కృష్ణుని దగ్గరకుపోయి అతనిని ఎత్తుకొన్నది.

కృష్ణుని లీల తెలియశక్యం కానిది. ఇంద్రియగోచరమైన ప్రత్యక్ష ప్రమాణంతోనూ అనుమాన ప్రమాణంతోనూ భగవానుని (లీలను) తెలిసికో జాలము. శబ్ద ప్రమాణమొక్కటే- వేదం మాత్రమే- భగవంతుని గుణాలను, చేష్టలను తెల్పుతుంది. అట్టి భగవానుని క్రీడను చూచే భాగ్యం నందయశోదలకే కలిగిందని 'ఆగమ దుర్గ్రహం' అనే పదం వివరిస్తుంది.

271. నందశ్చతీవ్రేణ భయేన సద్యః
సమేత్య పశ్యన్ అనఘం కుమారమ్।
తేనైవ తస్య త్రిజగన్నియంతుః
ప్రాయుంక్త రక్షాం పరమార్థవేదీ॥ 6

**అర్థం:** నందః, చ = నందగోపుడు కూడా; తీవ్రేణ= ఎక్కువ తాపం కలిగియున్న; భయేన= భీతిచేత; సద్యః= తత్కాలాననే; సమేత్య= వచ్చి; అనఘం= క్షేమంగా ఉన్న; కుమారం= పుత్రుణ్ణి (కృష్ణుణ్ణి); పశ్యన్= చూస్తున్నవాడై; పరమ+అర్థవేదీ= పరముని పనిగానే తెలుసుకొన్నవాడైనందున; త్రిజగత్+నియంతుః= మూడులోకాలను

నియమించునట్టి; తస్య= ఆ పుత్రునికి; రక్షాం= రక్షను; తేన, ఏవ= ఆ భగవానుని మూలమంత్రం చేతనే; ప్రాయుంక్త= ప్రయోగించి చేశాడు.

**తా॥** దారుణమైన ధ్వనిని విన్న నందగోపుడు కూడా ఏమి అయిందో అనే భయంచేత త్వరగా వచ్చాడు. భయంకరమైన మృత కళేబరం ఒకవైపు పడియున్నది. యశోద చేతులతో నెత్తుకొన్న కృష్ణుణ్ణి చూచాడు. పుత్రుడు ఎప్పటివలె కుశలుడుగానే ఉన్నాడు. "భగవానేవ సర్వస్య రక్షకః" అందరినీ రక్షించేవాడే నా కొడుకును ఆపదనుంచి భద్రంగా కాపాడినాడు అని భావించిన నందగోపుడు, ఇంక ఏమి జరుగుతుందో అని భయపడి భగవానుని మూలమంత్రంచేతనే కృష్ణునికి రక్షించే ప్రయోగం చేశాడు. ఎవడు భగవానుడు? రక్షించేవాడెవడు? "నతుపాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్" పాలించే- రక్షించే సామర్థ్యం శ్రీహరికి తప్ప మరియెవ్వరికీ లేదు కదా! అందువల్ల-

*"రక్షతు త్వా మశేషాణాం భూతానాం ప్రభవో హరిః।*
*యస్యనాభి సముద్భూత పంకజాద భవజ్జగత్॥"*

ఎవని పొక్కిలి నుంచి ఉద్భవించిన కమలంవల్ల పుట్టి గిట్టే ఈ జగత్తు కలిగినదో అట్టి సమస్త భూతాలను సృజించిన హరి- విష్ణుమూర్తి- నిన్ను రక్షించుగాక, అని హరినే రక్షకునిగా అనుసంధానం చేసి కృష్ణునికి రక్షను కట్టినాడు. 'పరమార్థవేది' నందగోపుడు అన్న భావం ఇది.

ఇక కృష్ణుడు 'త్రిజగన్నియంత'- మూడు లోకాలను శాసించేవాడని 'పరాశరుడు, వ్యాసుడు, శ్రీశుకుడు' అనే ముగ్గురు ఋషులే చెప్పినారు. నందగోపుడు 'పరమార్థవేది'- 'కృష్ణుడే భగవాను'డని తెలిసి చేయలేదు. ఈ కవికేసరి, ఋషులు మాత్రమే చెప్పినమాటను బట్టి, భగవంతునికే భగవన్మంత్రం చేత రక్ష కట్టినాడు నందగోపుడు- అని మనకు తెలియజేశాడు.

*272. గోపాశ్చ సంభూయ గుహోపమాక్షీం*
*స్వఘోష నిర్హ్రాదిత విశ్వఘోషామ్।*
*గతాసుమైక్షంత నిశాచరీంతాం*
*భీమాకృతిం భై (భీ) మరథీమివాన్యామ్॥ 7*

**అర్థం:** గోపాః, చ= గోపకులు కూడా; సంభూయ= కలిసి; స్వఘోష-ఘోషాం/ స్వఘోష= తన ధ్వనిచేత; నిర్హ్రాదిత= బాగా మ్రోగబడిన; విశ్వ= సమస్తమైన; ఘోషాం= గొల్లపల్లె కలిగినట్టి; గత+అసుం= పోయిన ప్రాణం గలదియునైన; గుహ+ఉపమ+ అక్షీం= గుహలతో సమానమైన కన్నులుగల; నిశాచరీం= రాత్రిపూట చరించే; తాం= ఆ రాక్షసిని; అన్యాం= మరొక; భైమరథీం, ఇవ= భీమరథిని వలె; ఐక్షంత= చూచినారు.

**తా॥** ఆ రాక్షసి పూతన, శ్రీకృష్ణుడు పాలతో పాటు ప్రాణాలనూ త్రాగినప్పుడే వదలవయ్యా కృష్ణా! అని పలుమార్లు ప్రార్థిస్తూ చివరకు గావు- చావుకేక పెట్టింది. భయంకరమైన ఆ ధ్వని- ఘోష విశ్వఘోషయైనది.

'ఘోష' అంటే గొల్లపల్లె అని అర్థం. "ఘోష ఆభీర పల్లీస్యాత్" (అమరం). గొల్లపల్లె అంతా దాని ఘోష - అరుపు, ధ్వని మ్రోగిందని అర్థం. కాబట్టి గోపాలురూ, గోపికలు అందరూ పరుగెత్తుకొని నందుని భవనానికి వచ్చారు. పూతన చచ్చిపడియున్నది. దాని కండ్లు కొండ గుహలవలె ఉన్నాయి. ఆ రాక్షసి యొక్క కళేబరాన్ని గోపకులందరు చూచారు. ఇది రాక్షసి మాత్రమే కాదు సుమా! అది వేరొక 'భీమరథి'గా వారికి కనబడింది.

'నిర్హ్రాదిత' శబ్ద వ్యుత్పత్తి గమనించదగినదే. 'అవ్యక్తధ్వని' అని అర్థమిచ్చే 'హ్రాద' ధాతువుకు చివర 'ణ్యంతం' ఇత'క్త' ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడిన 'హ్రాదిత' పదానికి ముందు 'నితరాం- మిక్కిలి అనే అర్థమిచే 'నిస్' అనే 'ఉపసర్గ' ప్రయుక్తమైనందున 'నిర్హ్రాదిత' పదమయింది. దీనికి చాలా పెద్ద ధ్వని- మ్రోత అని అర్థం.

"సప్తమ్యాః (త్యాః) సప్తమేవర్షే సప్తమేమాసి సప్తమీ।
రాత్రి ర్భీమ రథీనామ సర్వప్రాణ భయంకరీ॥"

అని లక్షణం. (77) డెబ్బది ఏడవ వయస్సులో (7) ఏడవ నెలలో (7) ఏడవ రాత్రికి 'భీమరథి' అని పేరు. ఇది ప్రాణాపాయాన్ని కలిగించే రాత్రి. కాబట్టి రాత్రించరియైన పూతన కళేబరాన్ని చూచి, శ్రీకృష్ణునికి గండం- ప్రాణాపాయం కలిగించడానికి వచ్చిన 'అపరభీమరథి' అని ఆ భీరులు- గొల్లలు- భావించారు. ఇప్పుడు శ్రీకృష్ణునికి 'పెద్ద గండం' తొలగిపోయిందనుకొన్నారు.

*273. పరశ్వధై స్తత్క్షణ శాతితై స్తాం*
*విచ్ఛిద్య వింధ్యాచల సానుకల్పామ్।*
*అనః ప్రవృత్త్యా బహిరాశు నిన్యుః*
*క్రవ్యాద్బలిం ప్రాజ్యమివక్షిపంతః॥ 8*

**అర్థం:** వింధ్య+అచల సాను కల్పాం= వింధ్య పర్వతం యొక్క చఱియతో సమానమైన (శరీరం కల)దిగా నున్న; తాం= ఆ రాక్షసిని; తత్క్షణ శాతితైః= ఆ క్షణంలోనే పదును పెట్టబడిన; పరశ్వధైః= గొడ్డండ్లచేత; విచ్ఛిద్య= నఱికివేసి; అనః ప్రవృత్త్యా= బండ్లద్వారా; ఆశు= శీఘ్రంగా; బహిః= ఊరుబయటకు; ప్రాజ్యం= బహుళమైన; క్రవ్య+అత్+బలిం= పచ్చిమాంసాన్ని తినే ప్రాణులకోసం ఉపహారమును; క్షిపంతః, ఇవ= విసరివేస్తున్న వారులాగా; నిన్యుః= తీసుకొని పోయినారు.

**తా॥** శ్రీకృష్ణునికి గండం కడతేరిందని సంతోషించిన గోపకులు గొడ్డండ్రను నూరి పదును పెట్టారు. వింధ్య పర్వత సానువువలె కఠినంగా వున్న పూతన కాయాన్ని ముక్కలు ముక్కలుగా కుఠారాలతో తెగ గొట్టినారు. సానువు అంటె కొండ చఱియ.

"స్నుః ప్రస్థః సాను రస్త్రియా"- (అమరం). పర్వతం మీద ఉన్న సమానమైన భూమికి 'సానువు' అని పేరు.

ఆ రాక్షసి యొక్క కాయ ఖండాలను బండ్లమీద పెట్టి తొందరగా ఊరికి దూరంగా ఉండే చోటికి తీసుకొనిపోయారు. 'క్రవ్యం' అంటే పచ్చిమాంసం. దీన్ని తినే ప్రాణులు క్రవ్యాదులు. "అమ మాంస భక్షః క్రవ్యాత్"- (కాశికా.) గద్దలు, నక్కలు మొదలైన ప్రాణులకోసం ఆహారంగా అక్కడక్కడ మాంసం ముక్కలను విసరి పారవేశారు.

*274. గ్రహాది దోషాన్ అపహంతుకామా*
*గోప్తుః సతాం గోపతయః సమేతాః।*
*సువర్ణ సూత్ర గ్రథితాభిరామాం*
*పంచాయుధీమాభరణం బబంధుః॥* 9

**అర్థం:** సతాం= సాధువులకు; గోప్తుః= రక్షకుడైన భగవంతునికి; గ్రహ+ఆది దోషాన్= గ్రహాలు మొదలైన వాటివల్ల శిశువులకు ఏర్పడే దోషాలను; అపహంతు కామాః= తొలగింపకోరుతున్న వారై; సమేతాః= కలిసి వచ్చిన; గోపతయః= గోపతులు; సువర్ణ సూత్ర గ్రథిత+అభిరామాం= బంగారు యొక్క త్రాడుతో కూర్చబడడం చేత అందమైనట్టి; పంచ ఆయుధీం= ఐదు ఆయుధాల సమాహారమైన; ఆభరణం= భూషణాన్ని; బబంధుః= కట్టిరి.

**తా॥** శ్రీకృష్ణుడు సత్పురుషులను రక్షించే భగవానుడు. బాలారిష్టాలకు కారణమైన కొన్ని గ్రహాలవల్ల ఏర్పడే దోషాలను నివారింపగోరిన గోపకులలోని ప్రముఖులు బంగారు తాడుకు 'శంఖం, చక్రం, గద, ఖడ్గం, విల్లు' అనే పంచాయుధాలను చేర్చారు. ఆ మనోజ్ఞమైన ఆభరణాన్ని శ్రీకృష్ణునికి అలంకరించి రక్షగా కట్టినారు. బాలారిష్టాలు కలుగకుండా భగవత్సంబంధమున్న పంచాయుధాల ఆభరణాన్ని పుట్టిన శిశువుకు ఐదవ దినమందు శుభముహూర్తమున ధరింపజేయడం ఆచారం.

"జాతస్య పంచమదినే శుభదేముహూర్తే పంచాయుధాభరణ ధారణ మిష్టమాహుః" అని ఆచారకాండ వాక్యం.

*275. రమ్యాణి రత్నాని రథాంగపాణే*
*రాకల్పతాం నూనమవాప్నువంతి।*
*తదంగ సంస్పర్శ రసాత్ ప్రకామం*
*రోమాంచితా న్యంశుగణై రభూవన్॥* 10

**అర్థం:** రథాంగ పాణేః= చక్రహస్తుడైన శ్రీకృష్ణునికి; ఆ కల్పతాం= ఆభరణం గానూ; అవాప్నువంతి= పొందగలిగిన; రమ్యాణి= ఇంపైన; రత్నాని= రత్నాలు; నూనం= నిశ్చయంగా; తత్+అంగసంస్పర్శ, రసాత్= ఆ బాలకృష్ణుని అవయవం యొక్క స్పర్శ చేత కలిగిన సుఖం వల్ల; అంశుగణైః= కిరణ సమూహాలచేత; ప్రకామం= మిక్కిలి; రోమాంచితాని= పులకాంకితాలుగా; అభూవన్= అయినవి.

**తా॥** చక్రపాణియైన భగవానునికి, బంగారు ఆకృతిగల పంచాయుధాలకు రమణీయ రత్నాలు పొసగబడి, ఆభరణంగా అలంకరింపబడి ఉన్నాయి. ఆ రమ్య రత్నాలు భగవానుని అంగస్పర్శ చేత మిక్కిలి కాంతులతో ప్రకాశించాయి. ఆ రత్నకిరణాలు పులకాంకితాలుగా నున్నవని ఆరోపింపబడినందువల్ల రూపకాలంకారం. పులకలేర్పడడానికి కారణం భగవ దంగ స్పర్శవలని రసమే-సుఖమే అని హేతూత్ప్రేక్షాలంకారం.

*276. స శాయితః క్షేమవిదా జనన్యా*
*పర్యంకి కాయాం ప్రరుదన్ కుమారః।*
*చిక్షేప తుంగం శకటం పదాభ్యాం*
*గాఢాభిఘాతేన గిరీంద్ర సారమ్॥* 11

**అర్థం:** క్షేమ విదా= కుమారుడు రక్షింపబడినాడని గ్రహించినట్టి; జనన్యా= తల్లియైన యశోదచేత; పర్యంకికాయాం= తొట్టెల యందు; శాయితః= పరుండ పెట్టబడిన; సః= ఆ; కుమారః= పుత్రుడైన బాలకృష్ణుడు; ప్రరుదన్= బాగా ఏడుస్తున్న వాడై; గిరి+ఇంద్ర, సారం= గొప్ప పర్వతం యొక్క బలం కలిగియున్న; తుంగం=

ఎత్తైన; శకటం= బండిని; పదాభ్యాం= (కదిలిస్తున్న) పాదాలవలన (కలిగే); గాఢ+అభిఘాతేన= గట్టి ఎదురు దెబ్బతో; చిక్షేప= విసరిపారవేశాడు.

**తా॥** కృష్ణుడు క్షేమంగా ఉన్నట్లు తెలుసుకొన్న యశోద తన కుమారుడైన కృష్ణుణ్ణి శిశువుకు తగిన పర్యంకమందు- తొట్టెలలో పడుకొనబెట్టింది.

*"క్షేమః స్యాన్మంగళే లబ్ధరక్షణే చోరకేఽపిచ"* (విశ్వని.) యశోద, ఈ తొట్టెలలో పడుకోబెట్టితే తన కుమారుడు క్షేమంగా ఉంటాడు- అని భావించింది. సః ప్రరుదన్- కాని ఆ బాలుడు లేస్తూ, మళ్ళీ పడుకొంటూ ఏడుస్తున్నాడు. ఈ అవస్థలో కృష్ణుడు కాళ్ళను ముడుచుకొంటూ, చాచుకొంటూ ఏడుస్తుండడం ఒక వ్యాజం- నెపంగా చేస్తున్నట్లు ఈ పదాలు తెల్పుతున్నాయి.

అక్కడ ఒక బండి ఉన్నది. ఆ బండి 'గిరీంద్ర సారం, తుంగం'- మహా పర్వతంవలె దృఢమైనది. ఎత్తైనది. *"సారో బలే మజ్జని చస్థిరాంశే"* (విశ్వని.) అట్టి పెద్ద శకటాన్ని కృష్ణుడు కాళ్ళను చాచి గట్టిగా తన్ని ఎగురవేశాడు.

*277. విదారితస్తస్య పదాగ్రయోగాత్*
*వికీర్యమాణో బహుధా పృథివ్యామ్।*
*శబ్దాయమానః శకటాఖ్య దైత్యః*
*సంక్షోభయామాస జగంత్య భీక్ష్ణమ్॥* 12

**అర్థం:** తస్య= ఆ కృష్ణునియొక్క; పద+అగ్రయోగాత్= చరణాగ్రం యొక్క సంపర్కంవల్ల; విదారితః= విరుగబడింది, (అత ఏవ= కావున); పృథివ్యాం= నేలమీద; బహుధా= చాలా ముక్కలు ముక్కలుగా; వికీర్య మాణః= చెదరిపడుతున్నవాడై; శబ్దాయమానః= ధ్వని చేస్తున్న; శకట+ఆఖ్య, దైత్యః= శకటమనే పేరుగల రాక్షసుడు; జగంతి= లోకాలను; అభీక్ష్ణం= మిక్కిలి; సంక్షోభయామాస= క్షోభింపజేశాడు.

**తా॥** తొట్టెలలో పడుకొన్న కృష్ణుని కాలుయొక్క కొన భాగం శకటానికి తగులగానే అది ఎగిరిపడి విరిగింది. భూమిపైన ముక్కలు ముక్కలుగా శకటం యొక్క అవయవాలు చెదరిపడినాయి.

"కశ్చిద్దనోః సుతోవీరః కృష్ణస్య వధ కాంక్షయా।
నందస్య ప్రియతామాయాత్ శాకటం వపురుద్వహన్॥" (హరివంశం)

దనువుయొక్క సుతుడైన వీరుడు కృష్ణుణ్ణి చంపే కోరికతోనూ, నందగోపునికి శకటాకారాన్ని ధరించి యుంటే సంతోషం కలిగించినవాడనవుతాననీ, గోకుల మందు చేరినాడు. ఆ శకటాసురుడు కీలు కీలు విరిగి నేలమీద పడుతుండగానే వాడు అరచిన శబ్దం- దళన పతన ఘోష- లోకాలను దద్దరిల్లజేసింది.

*278. యదృచ్ఛ యోత్క్షిప్తపదే కుమారే*
*శైలోపలక్ష్యే శకటే నిరస్తే।*
*సరోజ గర్భోపమ సౌకుమార్యం*
*పస్పర్శ తత్పాదతలం యశోదా॥* 13

**అర్థం:** కుమారే= (బాలకృష్ణుడు) కుమారుడు; యదృచ్ఛయా= స్వేచ్ఛతో; ఉత్క్షిప్తపదే= పైకి లేపబడిన చరణం; శైల+ఉపలక్ష్యే= పర్వతం లాగా కనబడే గొప్ప; శకటే= శకటం; నిరస్తే (సతి)= నిరసింపబడగా; యశోదా= యశోద; సరోజగర్భ+ఉపమ, సౌకుమార్యం= తామర పూవులో నడుమ ఉన్న దుద్దుతో సమానమైన మార్దవం కలిగి యున్న; తత్+పాదతలం= ఆ కుమారుని పాదం యొక్క అడుగు భాగాన్ని; పస్పర్శ= స్పృశించెను.

**తా॥** మొదట ఆలోచించకుండా అకస్మాత్తుగా శిశువు (కృష్ణుడు) కాలులేపినాడు. పర్వతంవలె కనబడుతున్న శకటం తన్నబడి దూరంగా ఎగిరి చక్రం, బుడ్డి, ఆరెలు ఛిన్నాభిన్నంగా పడిపోయిన స్థితిని యశోద చూచింది. శకటాన్ని తన్ని ఎగురవేసిన పాద తలానికి ఎంత నొప్పి, బాధ కలిగిందో అని తప్త హృదయయై బాలకృష్ణుని కాళ్ళు అడుగు భాగాన్ని తాకి, తడవి చూడగా ఆ పాదతలం తామర పూవులోని దుద్దులాగా చాలా మెత్తగా నున్నది. ఏ మాత్రం కమిలిపోకుండా సుకుమారంగానున్న పాదతలాన్ని స్పృశించింది.

"స్వేచ్ఛాయదృచ్ఛా స్వచ్ఛందః స్వైరితా చేరితాః సమాః"- (కేశవని.) "తలం స్వరూపాధరయోః"- (విశ్వని.)

*279.* అథాంగణే జానుపదాగ్రహస్తై
శ్చక్రాయుధే చంక్రమణ ప్రవృత్తే।
ప్రాయోధరిత్రీ పరిషస్వజే తం
సాపత్రపా సాంద్రరజశ్ఛలేన॥ 14

**అర్థం:** అథ= తర్వాత; చక్రాయుధే= కృష్ణుడు; జానుపద+అగ్రహస్తైః= మోకాళ్లు, పాదతలాలు, చేతులు- ఈ అవయవాలచేత; అంగణే= వాకిట్లో; చంక్రమణ ప్రవృత్తే= ఇటు అటు తిరుగుతుండగా; ధరిత్రీ= భూదేవి; స+అపత్రపా= సిగ్గుతో కూడినదై; సాంద్రరజస్+ఛలేన= దట్టమైన ధూళి నెపంతో; ప్రాయః= బహుశః, తం= ఆ కృష్ణుణ్ణి; పరిషస్వజే= ఆలింగనం చేసుకొనెను.

**తా॥** శైశవం కొద్దిగా గడిచిన తర్వాత చక్రాయుధుడైన కృష్ణుడు అంగణంలో చేతులూపూతూ, కాళ్ళతో అటు ఇటు సంచరిస్తున్నాడు. అప్పుడు మహిషీమణియైన భూదేవి, లజ్జగలదవుతూ అంగణంలోని ధూళి ధూసరభావంచేత కృష్ణుణ్ణి కౌగలించుకొన్నది.

కృష్ణుడు వాకిట్లో తిరుగుతుంటే కాలు సేతులకు మట్టి అంటి, ధూళి ధూసరితుడైనాడని భావం.

కృష్ణుడు చక్రాయుధుడన్నందువల్ల భగవానుడని సూచితం. ఆయన మహిషి భూదేవి. అంగణంలో సంచరిస్తున్న అవకాశాన్ని జూచి, సిగ్గుపడుతూనే ఆలింగనం చేసుకొన్నదని ఉత్ప్రేక్షింపబడింది. 'రజశ్ఛలేన' అనడం వల్ల అపహ్నవం. అందువల్ల ఈ శ్లోకం సాపహ్నవోత్ప్రేక్షాలంకార సజ్జితం.

280. *నిర్వ్యాజ మందస్మిత దర్శనీయం*
*నీరాజితం కుండల రత్న భాసా।*
*నందస్తదానీం న జగామ తృప్తిం*
*ముగ్ధాక్షరం ప్రేక్ష్య ముఖం తదీయమ్॥* 15

**అర్థం:** నందః= నందగోపుడు; తదానీం= ఆ బాల్య సమయాన; నిర్వ్యాజ మందస్మిత దర్శనీయం= కారణం లేని చిరునగవుతో చూడముచ్చటగా నున్నట్టి; కుండల రత్నభాసా= చెవులకున్న కుండలాల రత్నాల కాంతిచేత; నీరాజితం= హారతి ఇవ్వబడినట్టి; ముగ్ధ+అక్షరం= స్పష్టంగా లేని అక్షరాలను కలిగినట్టి; తదీయం= కృష్ణునిదైన; ముఖం= ముఖాన్ని; ప్రేక్ష్య= చూచి; తృప్తిం= తృప్తిని, సంతోషానికి అవధిని; న, జగామ= పొందలేదు.

**తా॥** కృష్ణుని బాల్యమందు నందగోపుడు తనయుని ముఖాన్ని చూచి చాలా ఆనంద పడుతుండెను. స్వభావసిద్ధమై మందహాసంతో బాలకృష్ణుని ముఖం దర్శనీయంగా నుండింది. మనస్సును ఆనందపరచుతుండింది.

*"దర్శనీయం తత్ ఆనంద సాంద్రో యత్రమనోలయః"*– (యాదవ ని.) చెవులకున్న కుండలాల రత్నాల కాంతిచేత హారతి ఎత్తినట్లుండింది. కుండలాల యొక్క రత్నకాంతి ముఖాన్ని ఆవరించి ప్రకాశింపజేస్తుండిందని భావం. వచ్చి రాని మాటలను పలుకుతున్న బాల కృష్ణుని అందమైన ముఖాన్ని చూస్తున్న నందుని ఆనందానికి అంతంలేదు. కృష్ణుని మొగాన్ని చూస్తూ నందుడు చాలా ఆనందపడుతుండెను.

281. *విశ్వాని విశ్వాధిక శక్తిరేకో*
*నామాని రూపాణిచ నిర్మిమాణః।*
*నామైక దేశ గ్రహణేఽపిమాతు*
*ర్బ భూవ కృష్ణో బహుమాన పాత్రమ్॥* 16

**అర్థం:** విశ్వాధిక శక్తిః= లోకాలన్నిటి కంటె మించిన శక్తిగలిగినట్టి వాడైన; ఏకః= ఒక్కడే; విశ్వాన్ని= సమస్తమైన; నామాని= పేర్లను; రూపాణి, చ= ఆకారాలను కూడా; నిర్మిమాణః= సృజిస్తున్న; కృష్ణః= బాలకృష్ణుడు; మాతుః= తల్లియొక్క; నామ+ఏకదేశ గ్రహణే, అపి= పేరులోని ఒక భాగాన్ని మాత్రం గ్రహించడమందు కూడా; బహుమాన పాత్రం= కీర్తి పాత్రుడుగా; బభూవ= అయెను.

**తా॥** కృష్ణుడు బ్రహ్మాది జనులు గల ప్రపంచంకంటె అధికశక్తి కలవాడు.

"అనేన జీవేనాత్మనాను ప్రవశ్య నామరూపే వ్యాకరవాణి"- అనే శ్రుతిరీతిగా, ఎవరి సహాయం లేకుండా ఒక్కడు సృజించిన జీవులతోపాటు తాను కూడా అనుప్రవేశం చేసి ఆ జీవులకు నామరూపాలను కల్పించినవాడు కదా కృష్ణ భగవానుడు. అట్టి కృష్ణుడు బాల్యమందు అక్షరాలను స్పష్టంగా ఉచ్చరించలేకుండెను. చిన్నపిల్లల మాటలను పెద్దవారు విని సంతోషించడం లోక పరిపాటి కదా!

బంధువులు వాత్సల్యంతో కృష్ణుణ్ణి నీ తండ్రి పేరేమి? అని అడిగితే సులభంగా 'నందుడు' అని చెప్పేవాడు. కాని తల్లి పేరు అడిగితే 'యశోద' అని పలుకజాలక పేరులో కొంత భాగాన్ని మాత్రమే పలికి- అంటే 'శోద' అని చెప్పేవాడు. ఆహా! తల్లిపేరు కూడా చెబుతున్నాడని అందరిచే పొగడబడుతుండేవాడు. ఈ మాటల్లో 'శ్లోక భావమందు చమత్కారమున్నది. బహుమానించే కారణం లేకున్నా బహుమాన పాత్రుడనడం- కారణం లేకున్నా కార్యోత్పత్తి విభావనాలంకార లక్షణం. విశ్వాధిక శక్తి కలవాడైనా 'యశోద' అనే పేరు పల్కలేకపోవడం- కార్యసామగ్రి ఉన్నా, కార్యోత్పత్తి కాకపోవడం- విశేషోక్త్యలంకార మనబడుతుంది. విశేషోక్తికి విరుద్ధమైన బహుమానోత్పత్తి చెప్పబడింది. ఇట్లు విభావనా విశేషోక్తులను నిర్ణయించలేనందువల్ల, సందేహాలంకారంతో సంకరమై యున్నది.

*282. తరంగితాను శ్రవగంధ మాదౌ*
*తస్యాద్భుతం సంలపితం సఖీభిః।*
*వర్ణస్వరాది వ్యవసాయ భూమ్నా*
*శిక్షా విదాం శిక్షణ మగ్ర్య మాసీత్॥* 17

**అర్థం:** తస్య= ఆ బాలకృష్ణునికి; ఆదౌ= మొదట, మాటలను పల్కే దశ-సమయమందే; తరంగిత+అనుశ్రవ గంధం= వరుసగా వీచబడిన వేదపరిమళం కలది కావుననే; అద్భుతం= ఆశ్చర్యమైన; సఖీభిః= గోపికలతోడ (సల్పిన); సంలపితం= సంలాపం- సంభాషణ; వర్ణస్వర+ఆది, వ్యవసాయ భూమ్నా= వర్ణం, స్వరం, హ్రస్వం మొదలైన మాత్రలను స్పష్టంగా ఉచ్చరించే ఆధిక్యం- వేగం చేత; శిక్షావిదాం= శిక్షాశాస్త్రం తెలిసిన వారికి; అగ్ర్యం= ముఖ్యమైన; శిక్షణం= బోధగా; ఆసీత్= ఉండెను.

**తా॥** బాలకృష్ణునికి మాటలను పల్కనారంభించిన సమయాననే శబ్ద తరంగాలు వీచాయి. పలుకులు వరుసగా స్పష్టంగా ఉచ్చరింపబడినాయని భావం.

"నిగమోవేద ఆమ్నాయ ఆగమానుశ్రవావపి"- (రత్నాకర ని.) చిన్నప్పటి మాటల్లోనే వేద పరిమళం తరంగితమయింది. ఇక, తోటి గోపికలతో సంలపించే దశ వచ్చింది. సఖులు యశోదకు సంబంధించిన వారో లేదా కృష్ణునితో క్రీడించే గోపికలో అని కూడా భావించవచ్చు. ఆ సఖులందరు ఋషుల అంశతో జన్మించినందువల్ల వారికి వేదాంగమైన శిక్షాశాస్త్రం బాగా తెలిసియున్నది. శిక్షాశాస్త్రాన్ని బోధించే యోగ్యత కలవారే.

వర్ణాలంటే అకారాది అక్షరాలు; స్వరాలంటే ఉదాత్తానుదాత్త స్వరితాలు, ఆదిశబ్దం చేత హ్రస్వ, దీర్ఘాది మాత్రలు.

వర్ణాల యొక్క ఉత్పత్తి, స్థాన, ప్రయత్నాదులను బోధించే, ప్రధానమైన వేదాంగం శిక్షాశాస్త్రం. ఆరు (6) వేదాంగాలలో మొదటిది శిక్షాశాస్త్రం. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆఱు శాస్త్రాలు వేదాంగాలుగా ప్రసిద్ధం.

సఖులతో సంభాషించే దశలో కృష్ణుని శబ్దోచ్చారణ వర్ణ, స్వర, మాత్రా బలంతో కూడిన వేగంవల్ల, స్పష్టమైన మాటలను పల్కే విధానం శిక్షాశాస్త్ర పారంగతులైన బోధకులకు బోధించే విధంగా ఉండింది. కాబట్టి, బాలకృష్ణుని మాటలు మొదటనే తరంగిత నిగమ పరిమళాలు.

283. తమీషదుత్థాయ నిలీన మారాత్
సంప్రేక్ష్య దంతాంకుర చారుహాసమ్।
సనాతనీం దృష్టి మనన్య దృష్టిః
సానంద మాలోకత నందపత్నీ॥ 18

**అర్థం:** నందపత్నీ= యశోద; ఈషత్= కొద్దిగా; ఉత్థాయ= లేచి; ఆరాత్= సమీపమందే; నిలీనం= కూర్చున్నట్టి; సంప్రేక్ష్య దంత+అంకుర చారుహాసం= చూడదగినట్లున్న కొంచెం మొలిచిన= (మొలకలవంటి) దంతాలచే అందంగా నవ్వుతున్నట్టి; సనాతనీం= శాశ్వతమైనట్టి; దృష్టిం= దృష్టిని కలిగియున్నట్టి; తం= ఆ; కృష్ణుణ్ణి; అనన్య దృష్టిః, సతీ= వేరేకోరిక లేని చూపుగలదై; స+ఆనందం= సంతోషంగా; ఆలోకత= చూచెను.

**తా॥** కృష్ణుడు తాను నటిస్తున్నట్లు ఎవరికి తెలియకుండా, కొంచెం మొదట లేచి, లేవ ప్రయత్నించి, వెంటనే కూలబడుతూ, కూర్చుంటున్నాడు. కృష్ణుని దంతాలు చిన్న మొలకల్లాగా ఉండడం వల్ల చూడముచ్చటగా ఉన్నాయి. కాబట్టి, అందమైన చిరునగవు కలవాడు. ఆయన దృష్టి అందరిని ఎల్లప్పుడు ఆదరించునట్లు ఉంటుంది. సనాతనమైన దృష్టికలవాడు అనడం వల్ల "చక్షుర్దేవానా ముత మర్త్యానామ్"- అనే శ్రుతి పల్కినట్లు దేవతలకే కాక మనుష్యులకు కూడా భగవానుడే నేత్రం కదా! అట్టి బాలకృష్ణుణ్ణి యశోద తదేక దృష్టితో చూస్తూ చాలా ఆనందపడుతున్నది.

284. పదై స్త్రిభిః క్రాంత జగత్త్రయం తం
భవ్యాశయా భావిత బాల భావమ్।
కరేణ సంగృహ్యా కరాంబుజాగ్రం
సంచారయామాస శనైర్యశోదా॥ 19

**అర్థం:** భవ్య+ఆశయా= శుభచిత్తయైన; యశోదా= యశోద; త్రిభిః= మూడైన; పదైః= పాదాలచేత; క్రాంత జగత్, త్రయం= ఆక్రమింపబడిన మూడు లోకాలు కలవానినిగా; భావిత బాల భావం= భావింపబడిన బాలునిగా ఉన్నవాడైన; తం= ఆ కృష్ణుణ్ణి; కరేణ= (తన) చేతితో; కర+అంబుజ+అగ్రం= (కృష్ణుని యొక్క) కమలం వంటి చేతి వ్రేలును; సంగృహ్య= పట్టుకొని; శనైః= మెల్లగా; సంచారయామాస= నడిపిస్తుండెను.

**తా॥** యశోద తన కుమారుని క్షేమం కోసం మంచి మనస్సు కలది. ఆ కుమారుడు పూర్వం మూడడుగులతో ముజ్జగాలను కొలిచినవాడు. లోకక్షేమాన్ని తన దృష్టియందుంచుకొని బాలునిగా ఆవిర్భవించియున్నవాడు. అట్టి కృష్ణభగవానుని కెందామరవంటి చేతి యొక్క వ్రేలును యశోద తన చేతితో పట్టుకొని మెల్ల మెల్లగా నడకను నేర్పుతూ, నడిపించుచుండెను.

*285. స్ఖలద్గతిం ద్విత్ర పద ప్రచారాత్*
*జానుక్రమే జాతరుచిం కుమారమ్।*
*భుగ్నే సమావేశ్య వలగ్నభాగే*
*స్తన్యం ముదా పాయయతేస్మ ధన్యా॥* 20

**అర్థం:** ద్విత్రపద ప్రచారాత్= రెండు మూడడుగులు నడవడం వల్ల; స్ఖలత్+గతిం= దొరలిపడినవానిని, (అత ఏవ= కావుననే); జానుక్రమే= మోకాళ్ళతో ప్రాకడమందు; జాతరుచిం= ఇష్టపడిన; కుమారం= పుత్రుణ్ణి, కృష్ణుణ్ణి; భుగ్నే= వంగినట్టి; వలగ్న భాగే= నడుమునందు; సమావేశ్య= ఎత్తుకొని; ధన్యా= భాగ్యశాలిని యైన యశోద; ముదా= సంతోషంతో; స్తన్యం= చనుపాలను= పాయయతేస్మ= త్రాగించెను.

**తా॥** యశోద భాగ్యవతి. కృష్ణుడు రెండు మూడడుగులు వేసి నడిచినందు వల్ల, నడకనుంచి దొర్లిపడి మోకాళ్ళతో ప్రాకడం ఆరంభించాడు. అతడు నడక నేర్వాలనుకొన్న తల్లి ఆశయానికి విరుద్ధంగా, నేలమీద మోకాళ్ళతో ప్రాకడానికి

ఇష్టపడిన కుమారుణ్ణి వెంటనే తల్లి వంగి రొండికి ఎత్తుకొని, నడకవల్ల కలిగిన శ్రమను పోగొట్టడం కోసం సంతోషంగా తన స్తన్యపానం చేయనిచ్చెను. యశోద ధన్యలలో మూర్ధన్య గదా!

"మధ్యమం చావలగ్నంచ మధ్యోఽ స్త్రీ"- (అమరం). 'అవలగ్నం'- అకారం లోపించగా 'వలగ్న' రూపం. *"లగే సంగే"*- శరీరం యొక్క పూర్వాపరాలతో కలిసినట్టిది 'నడుము' అని అర్థం.

భుజతీతి= భుగ్నం= భుజోకౌటిల్యే, 'వంగినట్టిది' అని అర్థం. "కుంచితం *నతం; ఆవిద్ధం కుటిలం భుగ్నం వేల్లితం వక్రమిత్యపి"*- (అమరం).

*286. క్రమేణ భూయోఽపి విహార కాంక్షీ*
*నందస్య దారై రభినంద్యమానః।*
*నిత్యాను భూతం నిగమాంత భృంగై*
*ర్నిజం పదాబ్జం నిదధే పృథివ్యామ్॥* 21

**అర్థం:** భూయః, అపి= మళ్ళీ కూడా; విహార కాంక్షీ= క్రీడను కోరినవాడై; నందస్య= నందగోపుని యొక్క; దారైః= పత్నియైన యశోదచేత; అభినంద్యమానః= పొగడబడుతున్న కృష్ణుడు; నిగమ+అంత భృంగైః= వేదాంతాలు అనే తుమ్మెదలచేత; నిత్య+అనుభూతం= ఎల్లప్పుడు అనుభవింపబడుతున్నట్టి; నిజం= ఆత్మీయమైన; పదాబ్జం= చరణ కమలాన్ని; పృథివ్యాం= భూమియందు; నిదధే= పెట్టెను, ఉంచెను.

**తా॥** స్తన్య పానం చేసిన తర్వాత మళ్ళీ విహరింపగోరినవాడై యశోద చేత ప్రోత్సహింపబడుతున్న కృష్ణభగవానుడు, ఉపనిషత్తులు అనే తుమ్మెదల చేత ప్రతిపాదితమైనట్టి (ఆస్వాదింపబడుతున్నట్టి) తనవైన పద్మాలవంటి పాదాలను భూమిపైన పెట్టి స్వయంగా నిల్చియుండెను.

భగవానుని స్వరూప స్వభావాలను ఉపనిషత్తులే గోచరింప జేస్తాయి. తుమ్మెదలు తామర పూవులోని మకరందాన్ని నిత్యం ఆస్వాదిస్తుంటాయి. పాదాలు

పద్మాలవంటివి. కాబట్టి, ఉపనిషత్తులు భృంగాలుగా ఆరోపింపబడినాయి. ఇది రూపకాలంకార లక్షణం.

"దార" శబ్దం పుంలింగం, నిత్య బహువచనం. "దారాః పుంసిచ భూమ్న్యేవ" అని ఆ శబ్దలక్షణం.

287. స సంచరన్ సాధుజనప్రతీపై
ర్మా భుజ్యతాం సేయ మితీవమత్వా।
చక్రాదిభిః పాద సరోజ చిహ్నై
రాముద్రయా మాస మహీమనన్యైః॥ 22

**అర్థం:** సంచరన్= అంగణమందు పర్యటిస్తున్న; సః= ఆ కృష్ణ భగవానుడు; సా= ఆ ప్రసిద్ధమైన; ఇయం= ఈ భూమి; సాధుజన ప్రతీపైః= సాత్త్విక జనులకు విరోధులైన వారిచేత; మా భుజ్యతాం= అనుభవింపబడకూడదు; ఇతి= అని; మత్వా, ఇవ= తలచిందో అన్నట్లు; అనన్యైః= వేరే ఆశ్రయం లేనట్టి; పాదసరోజ చిహ్నైః= చరణ కమలాల యందు గుర్తులుగా ఉన్నట్టి; చక్ర+ఆదిభిః= చక్రం మొదలైన వాటిచేత; మహీం= భూమిని; ఆముద్రయామాస= ముద్రలు కలిగి యున్న దానిగా జేసెను.

**తా॥** కృష్ణభగవానుడు ఇంటి వాకిట్లో సంచరిస్తున్నాడు. భగవత్సంబంధం కలదైన ఆ ప్రసిద్ధభూమి 'సత్త్వగుణం కలిగిన జనులకు శత్రువులైన వ్యక్తులచేత తాను అనుభవింపబడ కూడదనుకొన్నది. ఆ కారణం వల్లనే బాలకృష్ణుడు తన కాళ్ళ అడుగులలో ఉన్నట్టి; ఇతరుల నెవరినీ ఆశ్రయించక తన పాద పద్మాలనే ఆశ్రయించి యున్నట్టి, అసాధారణాలైన శంఖ, చక్ర, కల్పక, ధ్వజ, అరవింద, అంకుశ, వజ్ర లాంఛనాలచేత భూమిని ముద్రవతిగా జేసినాడు. బాలకృష్ణుడు భూమిమీద– అంగణంలో– నడుస్తుంటే పాదముద్రలు పడినందువల్ల భూమి ఆశయాన్నిబట్టి ముద్రించినాడని హేతూత్ప్రేక్షాలంకారం లక్షితం.

288. ఆలంబ్య మాతుః కరపల్లవాగ్రం
శనై శనైః సంచరతో మురారేః।
బభార చిత్రామివ పత్రరేఖాం
ధన్యా పదన్యాసమయీం ధరిత్రీ॥ 23

**అర్థం:** ధన్యా= భాగ్యశాలినియై; ధరిత్రీ!= భూదేవి!; మాతుః= తల్లియైన యశోద యొక్క; కరపల్లవ+అగ్రం= చిగురుటాకుల వంటి చేతులందలి వ్రేలును; ఆలంబ్య= ఆధారం చేసుకొని; శనైః, శనైః= మెల్ల మెల్లగా; సంచరతః= నడుస్తున్న; మురారేః= శ్రీకృష్ణుని యొక్క; పదన్యాస మయీం= అడుగులు పెట్టిన రూపమైన; చిత్రాం, ఇవ= చిత్ర పటంవలె ఉన్నట్టి; పత్రరేఖాం= మకరాది పత్రరేఖను; బభార= భరించెను.

**తా॥** శ్రీకృష్ణుని చేతి వ్రేలును తల్లి పట్టుకొనే బదులు, తల్లి యశోద యొక్క మృదువైన చేతివ్రేలునే కృష్ణుడు పట్టుకొని భూమిమీద మెల్ల మెల్లగా నడుచుచుండెను. కృష్ణుడు అడుగులు పెడుతుంటే చిత్రపటంలాగా ముద్రలు పడినాయి. భూదేవి తన నాథుడు నానావిధాలైన మకరికాది ఆకృతులతో కూడిన పత్రరేఖను అలంకరించినాడన్నట్లు ఆనందంతో భరించిన కృతార్థురాలు కదా!

289. అకర్మ నిఘ్నో భువనాన్యజస్రం
సంకల్పలేశేన నియమ్య దీవ్యన్।
ప్రచారితః ప్రస్నుతయా జనన్యా
పదే పదే విశ్రమ మాచ కాంక్ష॥ 24

**అర్థం:** అకర్మనిఘ్నః= కర్మకు వశుడు కానట్టి; సంకల్ప లేశేన= కొద్ది సంకల్పం చేతనే; భువనాని= లోకాలను; నియమ్య= స్థాపించి; అజస్రం= ఎల్లప్పుడు; దీవ్యన్= క్రీడ సల్పుతున్న కృష్ణుడు; ప్రస్నుతయా= పాలుచేపుతున్న; జనన్యా= తల్లియైన యశోద చేత; ప్రచారితః సన్= నడిపింపబడినవాడవుతూ; పదే పదే= అడుగడుగున; విశ్రమం= విశ్రాంతిని; ఆచకాంక్ష= కోరెను.

**తా॥** పుణ్యపాపకర్మలకు అధీనుడు కానట్టివాడు కృష్ణుడు. సంకల్పశక్తి యందలి ఒక అంశంచేతనే లోకాలను సృజించి, రక్షించి విలయం చేసే-ఆటనాడుకొనే కృష్ణుడు, వాత్సల్యంచేత పాలసేపులధికమవుతున్న తల్లి యశోద చేత నడిపింపబడుతుండెను. కృష్ణుడు ఒక్కొక్క అడుగు వేస్తూ, విశ్రాంతిని కోరుతుండెను. కుమారుని అలసటను పోగొట్టతలచినప్పుడెల్ల తల్లికి పాలసేపులధికం కాగా, కృష్ణుడు స్తన్య పానం చేయాలనే కోరికతోనే అడుగడుగున విశ్రాంతిని కాంక్షిస్తుండెను. ఇది కూడా ఒక క్రీడయే కదా!

*290. సురప్రసూనైః సురభీకృతానా*
*మారోహణాన్యంగణ వేదికానామ్।*
*తమారు రుక్షుం తరళాంఘ్రిపద్మం*
*ధాతార మారోహయ దాశుధాత్రీ॥* 25

**అర్థం:** సుర ప్రసూనైః= కల్పతరు పుష్పాలచేత; సురభీకృతానాం= వాసన గొల్పబడిన; అంగణవేదికానాం= వాకిట్లోని గద్దెల యొక్క ఆరోహణాని= మెట్లను; ఆరురుక్షుం= ఎక్కగోరుతున్న; తరళ+అంఘ్రిపద్మం= చంచలిస్తున్న కమలాలవంటి పాదాలుగల; తం= ఆ; ధాతారం= లోకస్రష్టను; ధాత్రీ= పెంచుతున్న తల్లి; ఆశు= శీఘ్రంగా; ఆరోహయత్= ఎక్కించెను.

**తా॥** మందారం, పారిజాతం, సంతానం, కల్పం, హరిచందనం అనే ఐదు పేర్లుగల చెట్లు స్వర్గమందలి నందనోద్యాన వనంలో ఉండడం వల్ల దేవ తరువులంటారు. అట్టి తరువులు వ్రేపల్లెలో నందగోపుని అంగణంలోనూ ఉండవచ్చును. ఆ ప్రాంగణంలో కొన్ని వేదికలున్నాయి. ఆ దేవ తరువుల పూలు వేదికల మీద రాలిపడినందువల్ల పరిమళభరితమైనాయి. లేదా, దేవతలు నందగోపుని ఇంట బాలకృష్ణుని క్రీడకోసం ఉపయోగపడే ప్రాంగణంలోనూ, వేదికల మీదనూ పూలవాన కురిపించడం వల్ల ఆ స్థలమంతా సువాసన పులుముకొని యుండవచ్చును.

బాలకృష్ణుడు ఆ వేదికలకున్న మెట్లను ఎక్కగోరినాడు. కాని ఆ మెట్లపైన అడుగులు స్థిరంగా పెట్టలేకపోయినాడు. పద్మాలవలె సుకుమారంగానున్న బాలుని పాదాలు చంచలించడాన్ని చూసిన ఒక ధాత్రి- ఉపమాత- లోకాలను సృజించిన ధాతను తొందరగా ఎక్కించెను.

ఆరోహణాలు= సోపానాలు, మెట్లు అని అర్థం.

"ఆరోహణంస్యాత్ సోపానే సమారోహే ప్రరోహణే"- (విశ్వ.) "ధాత్రీ స్యాదుపమాతాపి క్షితిరప్యామలక్యపి"- (అమరం). "ధాత్రీజనన్యామలకీ వసుమత్యు పమాతృషు"- (విశ్వ.)

లోకాలను నిర్మించిన కృష్ణభగవానుడు అంగణంలో నిర్మింపబడిన గద్దెల మెట్లను ఆరోహించలేకపోవడం చిత్రమే. అయినా, బాలుని స్వభావమైనందున స్వభావోక్త్యలంకారం.

"ధాతకు కూడా ఒక ధాత్రి" అనడం చిత్రం కదా! ఆరోహింపజేయడానికి కృష్ణుణ్ణి ధరించింది కాబట్టి "ధాత్రి". ధాత్రికి ధారణశక్తిని కలిగించాడు కాబట్టి కృష్ణుడు 'ధాత'.

*291.* *తలేషు తస్యాంగణ పాదపానాం*
*తాలానుకూలేషు గతాగతేషు।*
*వ్రజస్థితాః స్వర్గసదా మశృణ్వన్*
*దూరోదితాన్ దుందుభి తూర్యనాదాన్॥* 26

**అర్థం:** వ్రజస్థితాః= వ్రేపల్లెలోనున్న గోపకులు, గోపికలు; అంగణ పాదపానాం= వాకిట్లోని చెట్లయొక్క; తలేషు= క్రింది స్థలాల యందు; తాల+అనుకూలేషు= కరతాళాలకు తగినట్టి; తస్య= ఆ కృష్ణుని యొక్క; గత+ఆగతేషు, సత్సు= పోకడ, రాకడలు జరుగుతుండగా; దూర+ఉదితాన్= దూరంగా ఆకాశాన ఉత్పన్నమైన;

స్వర్గసదాం= స్వర్గ నివాసులైన దేవతలయొక్క; దుందుభి తూర్యనాదాన్= భేరీ వాద్య ధ్వనులను; అశృణ్వన్= విన్నారు.

**తా॥** నందగోపకులంలో ఉన్న గోప గోపికలు అంగణంలో ఉన్న చెట్లకింద ఉండి కృష్ణుడు నడుస్తుండగా కరతాళ ధ్వనులు చేశారు. కొందఱు ఒకచోట ఉండి కృష్ణుణ్ణి ఇటురమ్మని పిలుస్తూ చప్పట్లు కొట్టగా ఆ బాలుడు వారి దిక్కు నడిచిపోతున్నాడు. మరొక ప్రక్కనున్న గోపగోపికలు ఓ కన్నయ్యా! ఇటు మా దిక్కురావయ్యా! అంటూ కరతాళ ధ్వనులతో ఆహ్వానించగా ఆ బాలుడు వారి వైపు వస్తున్నాడు.

బాలకృష్ణుని రాకడ పోకడలను దేవతలు ఆకాశమందుండి చూస్తున్నారు. "కృష్ణుడు భూమిమీద బాగా నడుస్తున్నాడు. ఇక మన దేవకార్యం నెరవేరే కాలం చాలా దగ్గరలోనే ఉంది" అని దేవతలు ఆనందంతో భేరీ వాద్యాలను వాయించగా ఆ ధ్వనిని గోపగోపికలు కూడా విన్నారు.

*292.* య ఏష లోక త్రయ సూత్రధారః
పర్యాయ పాత్రాణి చరాచరాణి।
ఆ నర్త యత్యద్భుత చేష్టితోఽసౌ
ననర్త ఖేలం నవనీత కాంక్షీ॥ 27

**అర్థం:** లోకత్రయ సూత్రధారః= మూడులోకాలను నర్తింపజేసే సూత్రధారుడు; యః= ఎవడో; ఏషః= అట్టి ఈ బాలకృష్ణుడు; పర్యాయ పాత్రాణి= క్రమంగా నాట్యవేషధారులుగా ఉన్న; చర+అచరాణి= జంగమ స్థావరాలను; ఆనర్తయతి= నర్తింపజేస్తున్నాడు; అద్భుత చేష్టితః= ఆశ్చర్య చరిత్రగల; అసౌ= ఈ కృష్ణుడు; నవనీత కాంక్షీసన్= వెన్నను కోరువాడవుతూ; ఖేలం= అందమైన క్రీడను; ననర్త= నర్తించెను, నాట్యమాడెను.

**తా॥** శ్రీకృష్ణభగవానుడు మూడులోకాలను నాటకమాడించే సూత్రధారుడు. ప్రపంచంలోని జంగమస్థావరాలు అనే వాటిని ఆ నాటకంలో పాత్రధారులను జేసి నాటకాన్ని ఆడించేవాడు. ఇట్టి అద్భుత చేష్టలను జేసే ఆ బాలకృష్ణుడే నవనీతం-వెన్నను కోరుతూ గోపికల వద్ద ఉండి, వారు ఒక ఆట ఆడుమని వేడుకున్నప్పుడు వారిని సంతోషింపజేసి వెన్నను తాను పొందడానికి అందంగా చిందులు వేస్తూ నాట్యమాడెను.

293. గృహేషు దధ్నో మథన ప్రవృత్తౌ
పృషత్ కణై రుత్పతితైః ప్రకీర్ణః।
నిదర్శయా మాస నిజామవస్థాం
ప్రాచీం సుధాశీకర యోగ చిత్రామ్॥ 28

**అర్థం:** గృహేషు= గోపికల ఇండ్లల్లో; దధ్నః= పెరుగుయొక్క; మథన ప్రవృత్తౌ= చిలికే పనియందు; ఉత్ పతితైః= లేచి పడినట్టి; పృషత్ కణైః= పెరుగు చిల్కిన బిందువులచే; ప్రకీర్ణః= చిమ్మబడిన కృష్ణుడు; సుధాశీకరయోగ చిత్రాం= అమృత కణాల సంపర్కంచేత చిత్రమైన; ప్రాచీం= పూర్వపుదైన; నిజాం= తనదైన; అవస్థాం= దశను; నిదర్శయామాస= ప్రదర్శించెను.

**తా॥** కృష్ణుడు గోపికల ఇండ్లల్లో పెరుగు చిల్కే సమయాన వెన్న కోసం ఆదరంతో దగ్గరగా నిల్చేవాడు కాబట్టి చిల్కుతున్నప్పుడు ఆ పెరుగుచుక్కలు తన శరీరంమీద పడి చిత్రంగా ఉన్నాడు.

వెనుకట పాలసముద్రాన్ని అమృతంకోసం చిల్కిన సమయమందు తన దేహమందు తెల్లని అమృత బిందువులు చిందడం వల్ల యేర్పడిన చిత్రమైన ఆకారం యొక్క స్థితిని దృష్టాంతంగా చూపినాడు.

పెరుగును చిల్కగా తన అవయవాలమీద చిందిన బిందువుల వల్ల కలిగిన చిత్రమైన తన రూపం అమృతబిందువులు చిందిన రూపంగా ప్రదర్శించిన ప్రకృత

క్రియచేత, అశక్యమైన వేరే వస్తువుచేత ఏర్పడిన స్థితిని పేర్కొనడం విశేషాలంకారం. ఈ రూపం అమృతమథనకాలమందలి రూపంవలె ఉన్నదనడం ఉపమాలంకారం.

*294.* *త్రస్యన్ ముకుందో నవనీత చౌర్యాత్*
*నిర్భుగ్న గాత్రో నిభృతం శయానః।*
*నిజాని నిఃశబ్దదశాం యయాచే*
*బద్ధ్వాంజలిం బాల విభూషణాని॥* 29

**అర్థం:** నవనీత చౌర్యాత్= వెన్నను దొంగిలించడం వల్ల; త్రస్యన్= భయంచేత వణుకుతూ; నిర్భుగ్నగాత్రః= ముడుచుకొన్న అవయవాలు కలవాడై; నిభృతం= పూర్తిగా; శయానః= పడుకొన్నట్టి; ముకుందః= ముకుందుడు; నిజాని= తనవైన; బాలవిభూషణాని= బాలురు ధరించే నగలను; అంజలిం, బద్ధ్వా= దోసిలొగ్గి; నిఃశబ్ద దశాం= ధ్వనించక ఉండే స్థితిని గూర్చి; యయాచే= ప్రార్థించెను.

**తా॥** కృష్ణుడు ముకుందుడు అంటే, భుక్తిని ముక్తిని ఇచ్చేవాడు. గోపికల ఇండ్లల్లో వెన్నను దొంగిలించాడు. ఆ కారణంవల్ల భయపడుతూ వణుకుతున్నాడు. వెన్నలేని ఒట్టికుండలను చూచి, తనను వెదకి గోపికలు పట్టుకొంటారని కృష్ణుడు ఆ ఇంటిలోనే ఎక్కడో ఒక మూలకు ఒడలిని ముడుచుకొని నక్కి పడుకొన్నాడు. చేతులు జోడించి పడుకొన్న కృష్ణుడు, తాను ధరించిన మొలత్రాటి గజ్జెలు, అందెలు కదలి ధ్వనించక ఉండాలని ఆ భూషణాలను బద్ధాంజలియై ప్రార్థిస్తుందెనని ఉత్ప్రేక్షింపబడింది.

*295.* *ఆరణ్య కానాం ప్రభవః ఫలానా*
*మరణ్య జాతాని ఫలాన్య భీప్సన్।*
*విస్రంసిధాన్యాంజలినా కరేణ*
*వ్యాధాత్మజాం విశ్వపతిః సిషేవే॥* 30

**అర్థం:** అరణ్య కానాం= అడవిలో అధ్యయనం చేసే ఉపనిషద్భాగాలకు సంబంధించినట్టి; ఫలానాం= ఫలాలకు; ప్రభవః= ఉత్పత్తి స్థానమైన కృష్ణుడు; అరణ్య జాతాని= అడవిలో పుట్టినట్టి; ఫలాని= ఫలాలను; అభీప్సన్= కోరువాడై; విశ్వపతిః= విశ్వాధితియైన కృష్ణుడు; విస్రంసి ధాన్య+అంజలినా= జాతీపోయిన ధాన్యంగల దోసిలి గల్గినట్టి; కరేణ= చేతితో; వ్యాధ+ఆత్మజాం= బోయవాని పుత్రికను; సిషేవే= (చేరి) సేవించెను.

**తా॥** ఆరణ్యకాలు అంటే అరణ్యంలో గురువుల వద్ద నేర్చుకొని చదువదగిన ఉపనిషద్భాగాలు. వాటి ఫలాలు అంటే అందులో ఉన్న దహరాది బ్రహ్మవిద్యలను ఉపాసించడం వల్ల కలిగే సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యాలనబడే మోక్షఫలాలు. అట్టి మోక్షఫలాలకు పుట్టుచోటూ తానే అయ్యి, ఉపాసకులకు ఆ ఫలాలను ఒసగే శక్తిగల వాడు సర్వేశ్వరుడు.

"పతిం విశ్వస్య" అని శ్రుతి పల్కినట్లు, కృష్ణుడు విశ్వాన్ని పాలించే ప్రభువు. కాబట్టి "ఆరణ్య కానాం ఫలానాం ప్రభవః" అనే వాక్యం, "ఫలాధికరణం"లోని "ఫలమత ఉపపత్తేః" (బ్ర.సూ.) అని చెప్పిన అర్థాన్ని తెల్పుతున్నది.

బాలకృష్ణుడు అడవిలో పుట్టిన రేగుపండ్లను అమ్ముకొని బ్రతికే ఒక బోయపిల్లను తాను నివసించే వీధిలో చూశాడు. దోసెడు వడ్లగింజలను- ధాన్యాన్ని ఆ బోయపిల్లకిస్తే అది కొన్ని పండ్లను చేతిలో పెడుతుంది కదా! కృష్ణుడు ఆ పండ్లను తినగోరినాడు. అందువల్ల దోసెడు ధాన్యాన్ని తీసుకొని వేగంగా పోతుంటే వేళ్ళ సందుల్లోనుంచి గింజలు నేలరాలిపోయాయి. ధాన్యం జారిపోయిననూ ఆ దోసిలిని అలాగే చూపుతూ "పండ్లనివ్వు" అంటూ ఆ బోయపిల్లను అడిగాడు.

బాలుని చిన్న దోసిలిలో నుంచి గింజలు రాలిపోవడం స్వభావోక్త్యలంకారం.

'ఆరణ్యకానాం' అనే శ్లేష అంగంగా ఉన్నదై "విశ్వపతి వ్యాధాత్మజను సేవించెను" అనడం వల్ల విభావనా విశేషోక్తులతో కూడి సందేహాలంకారంతో సంకరంగా ఉన్న శ్లోకమిది.

*296. సుజాత రేఖాత్మక శంఖ చక్రం*
*తామ్రోదరం తస్య కరార విందమ్।*
*విలోకయంత్యాః ఫల విక్రయిణ్యా*
*విక్రేతు మాత్మాన మభూద్విమర్శః॥* 31

**అర్థం:** సుజాత రేఖాత్మక శంఖ చక్రం= పుట్టినప్పుడే రేఖల రూపంగా ఉన్న శంక చక్రాలను కలిగియున్న; తామ్ర+ఉదరం= ఎఱ్ఱని అరచేతులు కలిగియున్నట్టి; తస్య= ఆ బాలకృష్ణునియొక్క; కర+అరవిందం= కమలం వంటి హస్తాన్ని; విలోకయంత్యాః= చూస్తున్నట్టి; ఫలవిక్రయిణ్యాః= పండ్లను అమ్మే బోయపిల్లకు; ఆత్మానం= తననే; విక్రేతుం= అమ్ముకోవడానికి (సమర్పించుకోవడానికి); విమర్శః = విచారం; అభూత్= ఆయెను.

**తా॥** కృష్ణుడు ఫలాలను పట్టుకోవడానికి పట్టిన అంజలిని- చేతులను చూచింది. పుట్టుకతోనే శంఖచక్రరేఖలూ, కెందామరలలాంటి అరచేతులను కలిగియున్న చేతులను చూడగానే పండ్లను అమ్ముకొనే ఆ బోయపిల్లకు ఆశ్చర్యం కలిగింది. పండ్లను అమ్మడానికి మారుగా ఆ కృష్ణునికి తననే- ఆత్మనే సమర్పించుకోవాలనే- అమ్ముకోవాలనే భావన ఆ బోయపిల్లకు కలిగింది.

'కృష్ణుని కరారవిందాన్ని చూచిన కిరాతికి' 'ఇంత మంచి ఆలోచన కలిగింది' అనడం, కార్యకారణ సమకాలత్వ లక్షణంగల అతిశయోక్త్యలంకారం. అప్రాకృత సౌందర్యం కలవాడు కృష్ణుడు అని వ్యంజితం.

*297. ఆపూరయత్ స్వాదు ఫలార్పణేన*
*క్రీడాశిశోర్హస్త పుటం కిరాతీ।*
*రత్నైస్తదా కౌస్తుభ నిర్విశేషై*
*రాపూరితం తత్ఫల భాండమాసీత్॥* 32

**అర్థం:** కిరాతీ= పండ్లనమ్ముకొనే ఆ బోయపుత్రిక; క్రీడాశిశోః= లీలచేత శిశువుగా ఉన్న కృష్ణునియొక్క హస్తపుటం= దోసిలిని; స్వాదుఫల+అర్పణేన= రుచిగల పండ్లను సమర్పించడంచేత; (అ) ఆపూరయత్= నింపివేసెను; తదా= అప్పుడే; తత్ ఫలభాండం= ఆ కిరాతి యొక్క పండ్లగంప; కౌస్తుభ నిర్విశేషైః= కౌస్తుభ మణిరత్నానికి ఏ మాత్రం తక్కువగానట్టి; రత్నైః= రత్నాలతో; ఆ పూరితం, ఆసీత్= నింపబడిన దాయెను.

**తా॥** లీలామానుష విగ్రహుడైన బాలకృష్ణుడు ధాన్యం జాఱిపోయినట్లు పండ్లు జాఱిపోకుండా చేతుల వ్రేళ్ళను దగ్గఱగా సవరించుకొని దొప్పగా దోసిలిని అమర్చుకొన్నాడు. ఆ బోయపిల్ల మంచి రుచిగల పండ్లను ఏరి, తన దోసిలితో ఎత్తి, ఆ గోపాలబాలుని దోసిలినిండా పారవశ్యంతో ఫలాలను సమర్పించుకొన్నది.

వడ్లగింజలకు పండ్లను అమ్మడం వినిమయం అంటారు. తనకు అవసరమున్న వస్తువులను గ్రహించి, ఇతరులకు అవసరమున్న, తన వద్దనున్న వస్తువును ఇవ్వడమే వినిమయ పద్ధతి. ధాన్యపు గింజలు లేని క్రీడా శిశువుయొక్క అద్భుతమైన అంజలిని బోయపిల్ల చూచి, ఈ చిన్న దోసిలిలో కొన్ని పండ్లు మాత్రమే ఇముడుతాయి కదా! అయ్యో! అనుకొంటూ ఉంటే, దోసిలిని దొప్పలగా అమర్చుకొన్నాడు బాలకృష్ణుడు. ఆ కృష్ణ పరవశమైన మనస్సుతో కిరాతకి రుచిగల పండ్లను ఏరి, 'ఎన్ని ఫలాలను సమర్పిస్తున్నాను' అనే ధ్యాసలేకుండానే కృష్ణుని దోసిలినిండా ఫలాలను సమర్పించుకొన్నది. ఆ బోయపిల్ల యొక్క ఆదరణకు ప్రసన్నుడైన గోపాల బాలకృష్ణ భగవానుడు తన సంకల్ప మహిమచేత సంపాదించినట్టి కౌస్తుభరత్నంతో సమానమైన రత్నాలచేత, ఆ క్షణకాలంలోనే, బోయపిల్ల యొక్క పండ్లగంపను నింపివేశాడు. అది పండ్లగంప కాదు. రత్నాలతో నిండియున్న భాండంగా కృష్ణుడు మార్చివేసి, ఆ బోయజాతి వనితను అనుగ్రహించాడు.

*"సర్వమావపనం భాండం పాత్రామత్రేచ భాజనమ్"*- (అమరం) ఈ కథ భాగవతంలో నాలుగు శ్లోకాలతో నున్నది. దేశికులు మూడు శ్లోకాలలోనే ఆ కథను సంస్మరింపజేశారు.

*298. ముహుః ప్రవృత్తం నవనీత చౌర్యం*
*వత్సాన్ విముంచంత మదోహకాలే।*
*ఉలూఖలే కుత్ర చిదాత్త పుణ్యే*
*బంధుం సతాం బంధుమియేష మాతా॥* 33

**అర్థం:** నవనీతచౌర్యం= వెన్నను దొంగిలించడాన్ని; ముహుః= మాటిమాటికి; ప్రవృత్తం= చేస్తున్న; అదోహకాలే= పాలుపిండరాని సమయమందు; వత్సాన్= లేదూడలను; విముంచంతం= విడుస్తున్నట్టి; సతాం= సాధువులకు; బంధుం= చుట్టమైన కృష్ణుణ్ణి; మాతా= తల్లి యశోద; ఆత్తపుణ్యే= పొందబడిన పుణ్యకార్యంగల; కుత్రచిత్= ఎక్కడనో ఉన్నట్టి; ఉలూఖలే= రోలునందు; బంధుం= కట్టివేయడానికి; ఇయేష= కోరెను.

**తా॥** కృష్ణుడు నవనీత చౌర్యాన్ని మళ్ళీ మళ్ళీ చేస్తుండెను. మధ్యాహ్న కాలమందు లేదూడలను వాటిని కన్న ఆవులతో కలియడానికి కట్టు విప్పి విడిచి పెట్టుతుండెను. సాధువులైన గోపకులకు చుట్టంవలె హితాన్ని కోరే కృష్ణుణ్ణి తల్లియైన యశోద ఎక్కడనో ఒక రోటికి కట్టివేయదలచింది. రోలు ఎంత పుణ్యం చేసిందో కదా!

భగవంతుణ్ణి బంధించడానికి ఉపయోగపడిన రోలు 'ఆత్తపుణ్య' ఎలా అవుతుంది? అంటే ఎల్లప్పుడు కృష్ణునితో సంశ్లేషించే లాభంవల్ల పుణ్యకార్యం కలది రోలు. యక్షులకు వృక్షరూపంలో ఉండే శాపాన్ని విమోచన చేయడమందు సహాయపడుతున్నందుననూ రోలు భాగ్యశాలియే కదా!

*299. ఆ నీత మగ్రే నిజబంధనార్థం*
*దామాఖిలం సంహిత మప్య పూర్ణమ్।*
*నిరీక్ష్య నిర్విణ్ణధియో జనన్యాః*
*సంకోచ శక్త్యా సబభూవ బంధ్యః॥* 34

**అర్థం:** సః= ఆ బాలకృష్ణుడు; నిజబంధనార్థం= తనను కట్టివేయడానికి గాను; అగ్రే= మొదట; ఆనీతం= తేబడిన; దామ, అఖిలం= త్రాళ్ళనన్నిటినీ; సంహితం, అపి= ఒక దానితో మరొక త్రాడును ముడివేసినప్పటికీ; అపూర్ణం= (కృష్ణుడి నడుము చుట్టూ నిండడానికి) చాలనట్టి స్థితిని; నిరీక్ష్య= చూచి, చూచి; నిర్విణ్ణధియః= ఖిన్నమతియైన; జనన్యాః= తల్లివల్ల; సంకోచ శక్త్యా= (తన నడుమును) తగ్గించుకొన్న శక్తిచేత; బంధ్యః= కట్టివేయదగినవాడుగా; బభూవ= ఆయెను.

**తా॥** యశోద బాలకృష్ణుని నడుమును త్రాడుతో కట్టివేయడానికి తన యింట్లో ఉన్న పెద్ద పొడవైన త్రాడును తెచ్చి కట్టజూచింది. ఆ నడుముకు ఆ త్రాడు చాలలేదు. ఇంట్లో ఉన్న పెద్ద, చిన్న త్రాళ్ళను తెచ్చి ఒకదానితో వేఱొక త్రాడును ముడివేసినా, నడుముకు ఒక చుట్టు నిండుగా చాల లేదు. ఇట్టి స్థితిలో యశోద చాలా ఖిన్నురాలయింది. కృష్ణుడు తల్లి అవస్థను జూచాడు. ఆమెపైన దయకలిగింది. విస్తరించి యున్న తన నడుమును సంకోచింపజేసుకొన్నాడు. తుదకు ఆ నడుమును త్రాళ్ళతో తానే- కృష్ణుడే- కట్టుబడునట్లు చేసుకొని, ఱోటికి ఆమెచే బంధింపయోగ్యుడయ్యాడు.

300. *బద్ధం తథా భావయతాం ముకుంద*
*మయత్న విచ్ఛేదిని కర్మబంధే।*
*తపస్వినీ తత్క్రతు నీతి రాద్యా*
*సవ్రీడ మారణ్య కథాసు తస్థౌ॥* 35

**అర్థం:** బద్ధం= కట్టుబడిన; ముకుందం= భుక్తిని, ముక్తిని ఇచ్చే కృష్ణుణ్ణి; తథా= అట్లు ఱోటికి కట్టబడిన వానిగా; భావయతాం= భావించే, ధ్యానించే వారికి; కర్మబంధే= సంసారబీజమనే కర్మ రూపమైన బంధం; అయత్న విచ్ఛేదిని (సతి)= ప్రయత్నం చేతను తెగిపోకుండా ఉన్నప్పుడు; ఆద్యా= ప్రాచీనమైన; తత్ క్రతు నీతిః = ఏ భావనతో ఉపాసించే వ్యక్తికి ఆ ఫలమే సిద్ధిస్తుంది అనే న్యాయం; తపస్వినీ

(సతీ) దీనమైనదవుతూ; సవ్రీడం= సిగ్గుతో కూడి; ఆరణ్యకథాసు= ఆరణ్యకాలనే ఉపనిషద్భాగాల యందున్న కథల యందు; తస్థౌ= ఉండెను.

**తా॥** కృష్ణభగవానుడు ముకుందుడు అంటే భోగాపవర్గాలను ప్రసాదించే వాడు. అట్టి భగవానుడైన బాలకృష్ణుడు ఱోటికి కట్టబడినాడు. సంసార బంధమందు ఉండడానికి కర్మయే బీజం కదా! ఎంత ప్రయత్నించినా కర్మబంధం విడిపోనిది. సర్వేశ్వరుని పదాల నాశ్రయిస్తేనే ఆ బంధం తెగిపోతుంది. కాబట్టి, బద్ధుడైన భగవానుణ్ణి ఉపాసించే వారికి సంసారబంధమే కల్గుతుంది అనే అభిప్రాయం ఏర్పడుతుంది. ఇది మన భావనయే కాదు.

ఉపనిషత్తులలో 'తత్క్రతున్యాయం' అనే వాక్యమున్నది.

"క్రతూ అధ్వర సంకల్పౌ"- (వైజయంతి). 'క్రతువు' అంటే యాగమనీ, సంకల్పమనీ అర్థద్వయం. అది కృష్ణావతారం తర్వాత ఆరణ్యకాలంలో ప్రవేశించిన నీతికాదు, ఆ నీతి ప్రాబల్యం కదా! ఎవరు ఏ భావనతో ఉపాసన రూపమైన క్రతువు నాచరిస్తే, వారి దేహపతనం తర్వాత ఊర్ధ్వలోకాల్లో ఆ భావనకు తగిన ఫలమే లభిస్తుంది- అని నీతివాక్యానికి అర్థం. భక్తులకు సులభుడైన భగవానుడు లీలగా నటిస్తున్న వాడని భావించి, భగవంతుణ్ణి భవబంధ విముక్తి కోసం ఉపాసించినట్లైతే, ఆ ఫలమే అవశ్యంగా సిద్ధిస్తుంది. సందేహం లేదు. అట్లుగాక, "బద్ధుడైన కృష్ణుణ్ణి ధ్యానించే వ్యక్తులకు భవబంధమే ప్రాప్తిస్తుంది- అనే అపార్థం కలుగుతుంది కదా!" అని ఆరణ్యకాలలో ఉన్న "తత్ క్రతునీతి" అనేది వివర్ణ వదనయై దీనంగా లజ్జతో ఆరణ్యకథల యందే నిలీనమైయున్నది అని సారాంశం.

"మునిదీనౌ తపస్వినౌ"- (విశ్వనిఘంటువు). 'తపస్వి' అంటే ముని, దీనుడు అని రెండర్థాలున్నాయి.

మనిషి లోకంలోనూ తన కోరికకు వ్యతిరేకంగా సంభవించినప్పుడు సిగ్గుతో తలెత్తకుండా ఎక్కడనో ఒకమూల పడియుంటాడు కదా! అట్లే, ఆ 'తత్ క్రతు నీతి' కూడా తన అర్థానికి అన్యథా భావం కలుగుతున్నదని బిడియపడుతూ,

ఆరణ్యకాలలోనే ఉన్న కథలలోనే లీనమైయున్నదని తెల్పబడింది. 'తత్రక్రతునీతి' ఆరణ్యకాలలో-అడవిలో నుండడానికి, వ్రీడ-లజ్జ-యే కారణమని ఉత్ప్రేక్షింప బడింది. కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం. ఈ హేతువు కూడా 'తపస్వినీ' అనే విశేషణగతిచేత ప్రతీయమానమవుతున్నందువల్ల కావ్యలింగాలంకారం. వేదాంత దేశికుల వాగ్విలాస విన్యాసాలు తార్కికాలు కదా!

*301. ఉలూఖలే ప్రగ్రథితేన దామ్నా*
*నిబద్ధమాస్రావిల లోల నేత్రమ్।*
*సహాసమైక్షంత జనాః సమంతా*
*దాలానితం నాగమివానభిజ్ఞాః॥* 36

**అర్థం:** ఉలూఖలే= రోటియందు; ప్రగ్రథితేన= గట్టిగా కట్టబడిన; దామ్నా= త్రాటిచేత; నిబద్ధం= బంధితుడైనట్టి; అస్ర+అవిల, లోల నేత్రం= కన్నీటిచే కలుషితమై చంచలమైన కన్నులు కలిగినట్టి; ఆలానితం= కట్టుకొయ్యయందు కట్టివేయబడిన; నాగం, ఇవ (స్థితం)= ఏనుగువలె ఉన్నట్టి కృష్ణుణ్ణి; సమంతాత్= పూర్తిగా; అనభిజ్ఞాః = తెలియని; జనాః= మనుష్యులు; సహాసం= నవ్వుతూ; ఐక్షంత= చూశారు.

**తా॥** రోటికి గట్టిన త్రాడుతో కట్టబడినవాడై కన్నీటితో చంచలమైన నయనాలు కలిగిన కృష్ణుణ్ణి, ఇదంతా కృష్ణభగవానుని నటనయే అని తెలియని జనులు మొట్టమొదట కట్టుకొయ్యకు బంధింపబడి సహించలేక వ్యాకుల పడుతున్న అడవి యేనుగును నవ్వుతూ చూచినట్లే, చూడసాగిరి.

*302. అనాదరాకృష్టములూఖలంతత్*
*యావర్జునౌ శైలనిభౌ బభంజ।*
*బభూవతుర్బ్రహ్మసుతస్య శాపా*
*న్ముక్తౌమునేర్య క్షవరౌ తదాతౌ॥* 37

**అర్థం:** అనాదర+ఆకృష్టం= అవలీలగా ఆకర్షింపబడిన; తత్= ఆ; ఉలూఖలం= ఱోలు; శైలనిభౌ= పర్వతంవలె నున్న; యౌ= ఏ రెండు; అర్జునౌ= మద్దిచెట్లను; బభంజ= పెళ్ళగించెనో; తౌ= ఆ రెండు చెట్లు; తదా= అప్పుడు; బ్రహ్మసుతస్య= బ్రహ్మపుత్రుడైన; మునేః= నారదముని యొక్క; శాపాత్= శాపం నుంచి; ముక్తౌ= విడువబడిన; యక్షవరౌ= నలకూబరుడు, మణిగ్రీవుడు అను కుబేరుని కుమారులుగా; బభూవతుః= అయినాయి.

**తా॥** ఱోటికి కట్టబడిన కృష్ణుడు ఱోటిని అనాయాసంగా ఈడ్చుకొంటూ నందుని వాకిట నున్న రెండు మద్దిచెట్ల నడుమ అడ్డంగా తట్టించి గట్టిగా లాగేసరికి ఆ రెండు చెట్లు పెళ్ళగింపబడి పడిపోయాయి. పూర్వం కుబేరుని పుత్రులైన నలకూబరుడు, మణిగ్రీవుడు అనబడే యక్షులిద్దరు మద్యపానమత్తులై స్త్రీలతో నగ్నంగా క్రీడిస్తున్న వారిని "శ్రీకృష్ణునితో మీకు సమాగమమయ్యేంత వరకు మద్దిచెట్లుగా స్థావర రూపంతో ఉందురుగాక" అని నారద మహర్షి శపించాడు. ఇప్పుడు ఆ (రెండు) యమళార్జున వృక్షాలు భంగపడిన వెంటనే, నారద శాపవిముక్తులై నలకూబరమణిగ్రీవులుగా ప్రకాశించారు.

*303.* శాపావధిం బ్రహ్మసుతేన దత్తం
సంప్రాప్యతౌ శౌరి సమాగమేన।
దేహేన దివ్యేన విదీప్యమానౌ
స్తుత్వా హరిందామ సమీయతుః స్వమ్॥ 38

**అర్థం:** తౌ= ఆ యక్షవరులిద్దరు; శౌరి సమాగమేన= శ్రీకృష్ణుని సంపర్కం చేత; బ్రహ్మసుతేన= నారదునిచే; దత్తం= ఇవ్వబడిన; శాప+అవధిం= శాపం యొక్క అంతాన్ని; సంప్రాప్య= పొంది; దివ్యేన= దేవతా సంబంధమైన; దేహేన= శరీరంతో; విదీప్యమానౌ= బాగా వెలుగుతున్నవారై; హరిం= శ్రీకృష్ణుణ్ణి; స్తుత్వా= స్తుతించి; స్వం= తమదైన; ధామ= స్థానాన్ని గూర్చి; సం+ఈయతుః= వెళ్లిపోయారు.

**తా॥** ఆ నలకూబర, మణిగ్రీవులిద్దరు శ్రీకృష్ణుని చేరికతో నారద మహర్షి యొక్క శాపం నుంచి విముక్తులై, దివ్య దేహాలు కలవారై ఆ దేవదేవుణ్ణి బాగా స్తోత్రం చేసి, తమ స్థానమైన అలకా నగరానికి వెళ్ళిపోయారు.

*304.* *అదృష్టపూర్వం భువి పూతనాదే*
*రుదంత ముత్పాత ముదీక్షమాణాః।*
*సమేత్య గోపాః సహమాధవేన*
*బృందావనం సత్వర మభ్యగచ్ఛన్॥* 39

**అర్థం:** భువి= లోకమందు; అదృష్టపూర్వం= ఇంతకుముందు కనబడనట్టి; పూతనా+ఆదేః= పూతన మొదలైన వారి యొక్క; ఉదంతం= వృత్తాంతాన్ని; ఉత్పాతం= ఉపద్రవాన్ని; ఉదీక్షమాణాః= ఆలోచించినట్టి; గోపాః= గోపకులు; సమేత్య= కలిసి; మాధవేన, సహ= కృష్ణునితో కూడ; సత్వరం= తొందరగా; బృందావనం= బృంద అనే పేరుగల వనానికి; అభి+అగచ్ఛన్= నివసించడానికి పోయారు.

**తా॥** లోకంలో ఇదివరకెన్నడు చూచియెరుగని పూతన, శకటాసురాది వృత్తాంతాన్నీ, గోపకులమందు అరిష్టసూచకమైన వికార కృత్యాన్ని గూర్చి గోపకులు అందరు సమావేశమై ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చారు. వ్రేపల్లెలో ఉపద్రవాలు కలుగుతున్నందువల్ల, ఈ చోటును విడిచివేసి, బృందావనమందు కుటుంబాలతో పాటు నివసించడం మేలని నిర్ణయించారు. కాబట్టి గోపకులు కృష్ణునితో సహ పయనించి, బృందావనానికి పోయారు.

*305.* *యేనౌషధీనా మధిపం పురస్తా*
*దాహ్లాదహేతుం జగతా మకార్షీత్।*
*తేనైవ దధ్యౌ మనసా వనంతత్*
*కృష్ణో గవాంక్షేమ సమృద్ధి మిచ్ఛన్॥* 40

**అర్థం:** పురస్తాత్= పూర్వం సృజించిన కాలమందు; యేన= ఏ మనస్సుతో; జగతాం= లోకాలకు; ఆహ్లాద హేతుం= ఆనందం కలిగించడానికి కారణుడైన; ఓషధీనాం= ఓషధులకు; అధిపం= అధిపతియైన చంద్రుణ్ణి; అకార్షీత్= (చేశాడో) సృజించాడో, తేన, మనసా, ఏవ= ఆ మనస్సుతోనే; కృష్ణః= కృష్ణుడు; తత్, వనం= ఆ బృందావనాన్ని; గవాం= గోవులయొక్క క్షేమ సమృద్ధిం= క్షేమాభ్యుదయాన్ని; ఇచ్ఛన్= కోరువాడై; దధ్యౌ= ధ్యానించాడు.

**తా॥** పూర్వం జగత్తును సృజించే కాలాన జగదాహ్లాదకరుడైన, ఓషధీశుడైన చంద్రుణ్ణి ఏ మనస్సుచేత సృజించాడో, కృష్ణుడు అటువంటి మనస్సుచేతనే గోవులకు గడ్డి, నీరు, నీడ మొదలైన సమృద్ధిగా కలిగి, వాటికి క్షేమాన్ని, అభివృద్ధిని కలిగించే విధంగా బృందావనం వెలసియుండాలని ధ్యానం చేశాడు.

'బృంద అంటే గోతర్ణకం– లేదూడగా– పేరు ఉన్నది. గోతర్ణక ప్రధానమైన వనం కాబట్టి, బృందావనమని కొందరు 'దండకావన' మన్నట్లే సామాన్యంగా బృందావనమని పేరు కలదని కొందరు; 'బృంద' అంటే ఐదు ముండ్లుగల పెద్ద పల్లేరుకాయ అని అర్థం.

పెద్ద పల్లేరుకాయలను కలిగియున్న ఆ వనాన్ని కృష్ణుడు గోవులకు సర్వశుభావహమైన వనంగా ఉండాలని శుభమైన మనస్సుతో సంకల్పించాడు అని భావం.

"శ్రీమత్ బృందావనం నామ వనం త్రిదశ పూజితమ్"– సంపత్కరమైన బృందావన మనే పేరుగల వనం దేవతలచేత పూజింపబడినది.

"బృందావన వనోత్పన్న కదంబ తరుకోటరః"– బృందావనమనే వనమందు కదంబతరువులు కలవు అని హరివంశ పురాణాదులందు 'బృందావనం' అనే పేరుతోనే ఆ వనం వ్యవహృతమైనది. కాబట్టి శ్రీకృష్ణుడు ఆ బృందావనం కేవలం గోవులకు అభివృద్ధిని కలిగించే శుభస్థలంగా ఉండాలని మంచి మనస్సుతో ధ్యానం చేశాడు. తలచినంతనే శోభయేర్పడింది.

306. అనుగ్రహాబ్ధేరివ వీచిభేదై
రాప్యాయయామాస శుభైరపాంగైః।
వనం పృథివ్యా ఇవ యౌవనం తత్
గోప్తా సతాం గోధన వంశ చంద్రః॥ 41

**అర్థం:** సతాం= సాత్త్వికుల యొక్క; గోప్తా= సంరక్షకుడైనట్టి; గోధన వంశ చంద్రః= గోవులే ధనంగా గల గోపకుల వంశమునకు చంద్రునివంటి వాడైన కృష్ణుడు; అనుగ్రహ+అబ్ధేః= కృప అనే సముద్రంయొక్క; వీచి భేదైః, ఇవ (స్థితైః)= తరంగ విశేషాలుగా ఉన్నట్టి; శుభైః= మనోజ్ఞమైన; అపాంగైః= కడగంటి చూపులచేత; పృథివ్యాః = భూమియొక్క; యౌవనం, ఇవ (స్థితం)= యౌవనం వలె ఉన్నట్టి; తత్, వనం= ఆ బృందావనాన్ని; ఆప్యాయయామాస= పోషించెను.

**తా॥** సాధు సంరక్షకుడును, గోధనులైన గోపాలుర వంశానికి వృద్ధినీ, ఆహ్లాదాన్నీ కలిగించే చంద్రుని వంటివాడైన శ్రీకృష్ణుడు, దయాసాగర తరంగాల వంటి మనోజ్ఞ కటాక్షాల చేత, భూమి యొక్క శోభావహమైన యౌవనంలాగా ఉన్నట్టి ఆ బృందావనానికి పుష్టిని జేకూర్చెను.

"కటాక్షః కోశతాఽపాంగః"- (ధనంజయ. ని.) బాహ్యంగా ఉపకరించిన శోభ ఇది.

307. ఆసీన్నిషేవ్యా పృథివీ పశూనాం
పుండ్రేక్షురమ్యాణి తృణాన్య భూవన్।
తస్మిన్నరణ్యే తరుభిః ప్రపేదే
కల్పద్రుమాణా మనుకల్పభావః॥ 42

**అర్థం:** తస్మిన్, అరణ్యే= ఆ బృందావనమందు; పృథివీ= భూమి; పశూనాం= గోవులకు, గేదెలకు; నిషేవ్యా= నివసింపదగినదిగా; ఆసీత్= ఉండినది; తృణాని=

గరుకపోచలు; పుండ్ర+ఇక్షు రమ్యాణి= రసవంతమైన చెఱుకు వలె రుచిగలవిగా; అభూవన్= అయినవి; తరుభిః= చెట్లచేత; కల్పద్రుమాణాం= కల్పతరువులకు; అనుకల్ప భావః= అముఖ్యం, రెండవ స్థానం; ప్రపదే= పొందినది, ఏర్పడినది.

**తా॥** శ్రీకృష్ణుడు మానసికంగానూ, బాహిరంగానూ తన కడకంటి చూపులచేత బృందావనమందు అనన్యమైన రామణీయకాన్ని పెంచాడు. కాబట్టి ఆ వనమందలి నేల మొరం, గులకరాళ్లు, ముండ్లు లేనిదై గోవులు, గేదెలు, మానవులు సంచరించడానికి, నివసించడానికి యోగ్యమైనది. అక్కడ పశువులకు మేతగా ఉండే గరుకపోచలు 'పుండ్ర' అనే మధుర రసంగల చెఱుకువలె ఎక్కువ రుచికరంగా ఉండినాయి.

"*రసాల ఇక్షుస్తద్భేదాః పుండ్రకాంతారకాదయః*"- (అమరం) అలాగే, బృందావనంలోని తరువులన్ని రుచిగల, సువాసనగల పుష్పఫలాలతో నిండియుండి, కల్పవృక్షాల కంటెను ముఖ్యమైనవిగా జనులకు తెలిసింది. అనుకల్పత్వం అంటె అముఖ్యత్వం. 'కల్పం' అంటె ముఖ్యత్వం. బృందావన తరువులు ప్రథమస్థానాన్ని పొంది, కల్పతరువులు రెండవ స్థానాన్ని పొందినాయి- అని భావం. ముఖ్యంగా కల్పతరువులతో సమానమైన శోభ బృందావన తరువులకు ఏర్పడిందనదగును.

*308. అదృష్టపూర్వై రధికాం విశేషై*
*రాలక్ష్య వన్యామమ రేంద్ర మాన్యామ్।*
*నందోపనంద ప్రముఖై ర్ననందే*
*నాకాధి రూఢైరివ నాథభూమ్నా॥* 43

**అర్థం:** నంద+ఉపనంద ప్రముఖైః= నందుడు, ఉపనందుడు అనే ప్రముఖులు గల గోపకులచేత; నాథభూమ్నా= శ్రీకృష్ణుని మహిమతో; అదృష్టపూర్వైః= ఇంతకు ముందు చూడబడని; విశేషైః= దృశ్యపదార్థాలచేత; అధికాం= సమృద్ధమైన; అమర+ఇంద్ర మాన్యాం= దేవేంద్రునికి మాన్యమైన; వన్యాం= వనసమూహాన్ని; ఆ

లక్ష్య= చూచి; నాక+అధిరూఢైః, ఇవ= స్వర్గమందు ఉన్న వారిచేతవలె; ననందే= సంతోషింపబడింది.

**తా॥** గోపకులలో నందుడు, ఉపనందుడు అనే వయోజ్ఞాన వృద్ధులు ఉన్నారు. "*తత్రోపనంద నామాஉ హ గోపోజ్ఞాన వయోధికః*" అని శ్రీమద్భాగవత సూక్తి. అట్టి ప్రముఖులుగల గోపకులు మునుపు ఎన్నడు చూడనట్టి పదార్థాలను ఇప్పుడు బృందావనమందు ప్రత్యక్షంగా చూచారు. ఈ మహిమ శ్రీకృష్ణునిదే అనుకొన్నారు. దేవేంద్రునికి మాననీయమైన పుష్పఫలాలతో సమృద్ధమైన నందన వనంలాగా ఆ బృందావనంలోని వనసమూహాన్ని చూచి వారు స్వర్గలోకాన్ని అధిరోహించిన వారివలె సంతోషపడినారు.

'విశేష' శబ్దానికి దృశ్యవస్తువు అనే అర్థమున్నది.

"*విశేషోஉ వయవే భేదే ద్రష్టవ్యోత్తమవస్తుని*"- (శబ్దార్ణవం). 'అమరేంద్ర మాన్యాం'- అనే పదానికి నిత్యసూరులకు నాయకుడైన శ్రియఃపతికి చాలా ఇష్టమైనది బృందావన మని అర్థం.

"*తేహ నాకం మహిమానః సచంతే*"- అనే శ్రుతి వాక్యార్థం వలె 'నాక' మనే శబ్దానికి దుఃఖలేశమైనా లేనట్టి 'పరమ పద'మని కూడా చెప్పనగును.

"*నాథభూమ్నా*"- అనే పదమందు పరమపద నాథుని యొక్క సౌలభ్య సౌశీల్యాది సంపత్తుచేత- అనే అర్థమూ పొసగడం రమణీయం.

"*తివత్తిలుమ్ పశునిరై మేయ్ప్పు ఉవత్తి*"- (తి.వా.మొ. 10-3-10). వైకుంఠవాసం కంటె బృందావనమందు గోసమూహాన్ని మేపుతూ సంరక్షించడం వల్ల, గోపకులు అద్భుతమైన పదార్థాలు కలిగియున్న బృందావనాన్ని చూచి, తాము మోక్షస్థానమైన వైకుంఠమందున్నట్లు భావించి ఆనందించారు.

309. దైత్యై స్తృణావర్త ముఖై రయత్నాత్
ముహుర్నిరస్తై ర్ముదితో ముకుందః।
అభుంక్త రామేణ సహాద్భుతం తత్
పుణ్యం వనం పుణ్య జనేంద్ర మాన్యమ్॥ 44

**అర్థం:** అయత్నాత్= యత్నం చేయకపోవడం వల్ల; నిరస్తైః= హతమార్చబడినట్టి; తృణావర్త ముఖైః= తృణావర్తుడు, వత్సాసురుడు, అఘాసురుడు మొదలైన; దైత్యైః= రాక్షసులచేత; ముహుః= మాటి మాటికి; ముదితః= సంతుష్టుడైన; ముకుందః= శ్రీకృష్ణుడు; అద్భుతం= ఆశ్చర్యమైన; పుణ్యం= పావనమైన; పుణ్యజన+ఇంద్ర, మాన్యం= యక్షులకు రాజైన కుబేరునిచే కొనియాడబడే చైత్రరథంవలె అందమైనట్టి; తత్= ఆ; వనం= బృందావనాన్ని; రామేణ సహ= బలరామునితో కూడా; అభుంక్త= అనుభవించెను.

**తా॥** శ్రీకృష్ణుడు శ్రమపడకుండా అనాయాసంగా, తృణావర్తుడు, వత్సాసురుడు, అఘాసురుడు మొదలైన దైత్యులను చంపినందువల్ల చాలా సంతోషించాడు. ఆ ముకుందుడు అద్భుతమైన పవిత్రమైన కుబేరుడు గౌరవించే చైత్రరథం వలె సుందరమైన ఆ బృందావనాన్ని తనకు సహాయుడైన బలరామునితో కూడి అనుభవించాడు.

310. సపక్ష కైలాస నిభస్యగోపా
బకస్య పక్షాన్ అభితో బబంధుః।
వనే తదన్యానపి ఘోరవృత్తీన్
క్షేప్తుం ప్రవృత్తా ఇవ కేతుమాలాః॥ 45

**అర్థం:** గోపాః= గోపకులు; సపక్ష కైలాస నిభస్య= రెక్కలతో కూడియున్న కైలాస పర్వతంతో సమానమైన; బకస్య= బకాసురుని యొక్క పక్షాన్= ఱెక్కలను; వనే= ఆ బృందావనమందు; తత్+అన్యాన్, అపి= ఆ బకాసురుని కంటె వేరైన

వారిని కూడా; ఘోర వృత్తీన్= క్రూర చేష్టలు కలవారిని; క్షేప్తుం= నిరసించడానికి; ప్రవృత్తాః= ప్రవర్తించినట్టి; కేతుమాలాః, ఇవ= ఉత్పాత మాలలుగాను; అభితః= (చెట్లకొమ్మలమీద) అంతట; బబంధుః= కట్టినారు.

**తా॥** శ్రీకృష్ణుడు బకాసురుణ్ణి చంపినాడు. ఱెక్కలతో కూడిన కైలాస గిరాలాగా తెల్లని వర్ణంగల బకాసురుని ఱెక్కలనే కాకుండా, ధేనుకాది రాక్షసుల (తోళ్ళ)ను కూడా, క్రూరమైన నడవడిగల వారిని నిరసించడానికి ఏర్పడిన ఉత్పాత మాలికల వలె నున్నట్లుగా, ఇతరులకు భయం కలుగునట్లుగా చెట్లమీది కొమ్మలకు గోపకులు కట్టినారు.

*311. పురస్కృతం మంగళ గీత వాద్యైః*
*పుంసః ప్రసత్త్యై జగతాం ప్రసూతేః।*
*కయాఽపిత స్పృహయాఽన్వతిష్ఠన్*
*కన్యావ్రతం కించన గోపకన్యాః॥* 46

**అర్థం:** తత్ర= అక్కడ; గోపకన్యాః= గోపకన్యలు; కయా, అపి, స్పృహయా= ఏదో ఒక ఫలాన్ని పొందే ఆశతో; జగతాం= లోకాలను; ప్రసూతేః= సృజించునట్టి; పుంసః= పురుషుని యొక్క; ప్రసత్త్యై= ప్రసాదంకోసం; మంగళగీత వాద్యైః= మంగళ గానవాద్యాలచేత; పురస్కృతం= పూజింపబడిన; కించన= ఒకానొక, కన్యావ్రతం= కన్యలచేత చేయబడిన నోమును; అన్వతిష్ఠన్= ఆచరించిరి.

**తా॥** అక్కడ గోపకన్యలు ఏదో ఒక ఫలాపేక్షతో జగదుత్పత్తికి ఉపాదాన కారణభూతుడైన పురుషోత్తముని అనుగ్రహాన్ని పొందడానికి మంగళ గీత వాద్యాలతో పూజింపబడిన ఒకానొక కన్యావ్రతాన్ని చేశారు.

**వ్యాఖ్య:-** గోపకన్యలు పురుషోత్తముని అనుగ్రహాన్ని పొందడానికి కన్యా వ్రతము ననుష్ఠించారు- అని సుశ్లోకితం.

గోపకన్యలకున్న ఫలాపేక్ష సామాన్యంగా 'నందుని పుత్రుడైన కృష్ణుడు మాకు వల్లభుడగు గాక' యని వారు నోము నోచారు. కృష్ణునితో విహరించదగిన అనుగ్రహాన్ని పొందవలెననియే వ్రతమాచరించారు.

*జగతాం ప్రసూతేః పుంసః ప్రసత్త్యై:*– జగత్కారణుడైన పురుషోత్తముని అనుగ్రహాన్ని పొందగోరి కన్యావ్రతాన్ని అనుష్ఠించారు.

*కించన కన్యావ్రతం:*– 'ఒకానొక కన్యావ్రతం' అనబడిందే కాని, స్పష్టంగా పేరు, ఫలం చెప్పబడలేదు. అందువల్ల 'కన్యావ్రతం' అంటే కన్యలచేత ఇష్టమైన పతిని పొందడానికి అనుష్ఠింపదగిన నోము అని అర్థం కదా! దీన్నిబట్టి, కన్య అంటే కాత్యాయని, ఆమె కోసం ఆచరించిన నోము అని అర్థమని కొందరు భావించవచ్చును. ఇది శ్రీమద్భాగవతమందు స్పష్టంగా చెప్పబడింది.

*పుంసః ప్రసత్త్యై:*– అనడం వల్లనూ, గోపికల వస్త్రాలను అపహరించడం చేత శ్రీకృష్ణుని– మదనగోపాలుని– అనుగ్రహాన్ని పొందే కోరికతో 'కన్యావ్రతం' అనుష్ఠింపబడినదని కొందఱి యభిప్రాయం. ఇది 'పరమత భంగం' అనే గ్రంథమందు శ్రీ వేదాంత దేశికులు చెప్పిన మాటనే 'పుంసః ప్రసత్త్యై' అని ఇక్కడ ప్రయోగించినారని భావించవచ్చును.

ముఖ్యంగా 'కన్యావ్రతం' మంగళగీతవాద్యాలచేత 'పురస్కృతం'– వ్రతానికి విశేషణంగా ఉపయోగింపబడినదీ పదం. 'పూజింపబడినది' అని అర్థం. 'పురః క్రియతే, ఇతి= పురస్కృతః' అని వ్యుత్పత్త్యర్థం.

"*పురస్కృతః పూజితేఽరాత్యభియుక్తేఽగ్రతః కృతే*"– (అమరం). గోపకన్యలు శ్రీకృష్ణుని అనుగ్రహాన్ని పొందే వాంఛతో కాత్యాయనీ వ్రతాన్ని ఆచరించారని విశ్వసించియే కదా! గోదాదేవి గోపికా భావాన్ని అనుకరించి స్నానాది నియమాలతో ధనుర్మాస వ్రతాన్ని అనుష్ఠించినదనడం ప్రసిద్ధ విషయం.

312. *నిశాత్య యస్నాన సముద్యతానాం*
*నిక్షిప్త మాభీర కిశోరికాణామ్।*
*కూలాదుపాదాయ దుకాల జాలం*
*కుందాధిరూఢో ముముదే ముకుందః॥* 47

**అర్థం:** ముకుందః= శ్రీకృష్ణుడు; నిశాత్యయస్నాన సముద్యతానాం= రాత్రి గడచి ప్రాతఃకాల స్నానానికి యత్నించిన; ఆ భీరకిశోరికాణాం= గోపకన్యల యొక్క; నిక్షిప్తం= విడిచియుంచినట్టి; దుకూలజాలం= తెల్లని పట్టు బట్టల సమూహాన్ని; కూలాత్= యమునానది యొక్క గట్టునుంచి; ఉపాదాయ= తీసుకొని; కుంద+అధిరూఢః (సన్) = మాఘ్య తరువును ఎక్కినవాడై; ముముదే= సంతోషించాడు.

**తా॥** గోపకన్య నోము కోసం ప్రాతఃకాల స్నానానికి యమునానదిలోకి దిగడానికి ముందు తమ దుస్తులను విడిచి దరియందు పెట్టి జలకాలాడుతున్నారు. వారు స్నానం చేస్తుండగా శ్రీకృష్ణుడు వచ్చి గట్టుమీద పెట్టిన తెల్ల పట్టు వస్త్రాలను- మొత్తం దుస్తులను- తీసుకొని మొల్ల చెట్టుమీదికెక్కి కూర్చొని సంతోషించాడు. విశేషమేమిటి? అంటే, గోపకన్యల వస్త్రాలను తీసుకొన్న తర్వాతనే ముకుందుడు కుంద వృక్షం మీదికెక్కాడు.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ" (భ.గీ.) అన్నట్లు, దేహాన్ని విడిచిన తర్వాతనే మోక్ష మివ్వడం సంభవమని జ్ఞాపకం చేయడానికి సంకేతమిది. ముకుంద పదం యొక్క అర్థం- 'ముక్తిని ఇచ్చేవాడు' అని కదా! కన్యావ్రత మాచరించడానికి స్నానం చేయునప్పుడే భగవానుని అనుగ్రహం కల్పించబడినది- అని అంతరార్థాన్ని తెలియజేశాడు శ్రీకృష్ణుడు ('ముక్తిని, భుక్తిని' అనే అర్థమిచ్చే 'ముకుం' అనే పదం అవ్యయం. 'ద' అంటే ఆ రెండింటిని ఇచ్చేవాడు, ముకుందుడు).

*313. స చైక హస్త ప్రణతిం విధూన్వన్*
*క్షౌమార్థినీనాం హరి రంగనానామ్।*
*అన్యోన్య హస్తార్పణ సంప్రవృత్త*
*మాసాం జహాసాంజలి మప్య.పూర్వమ్॥* 48

**అర్థం:** సః, హరిః= జయశీలుడైన శ్రీకృష్ణుడు; క్షౌమ+అర్థినీనాం= తమ కట్టు పట్టుబట్టలను (ఇవ్వవలసినదని) కోరుతున్న; అంగనానాం= గోపస్త్రీల యొక్క; ఏక హస్తప్రణతిం, చ= ఒక్కచేతితోనే చేయబడిన నమస్కారాన్ని కూడా; విధూన్వన్= అంగీకరింపనివాడు కాగా; అన్యోన్య హస్త+అర్పణ, సంప్రవృత్తం= ఒకరిచేతితో మరొక కన్యయొక్క చేతిని కలిపి చేయబడినట్టి; ఆసాం= ఈ కన్యల యొక్క; అపూర్వం= ఇంతకుముందు ఎక్కడ కూడా చూడబడనట్టి; అంజలిం, అపి= అంజలిని కూడా; జహాస= (అంగీకరింపక) పరిహసించాడు.

**తా॥** పూర్వశ్లోకమందు నగ్నంగా ఉన్న గోపకన్యల యొక్క స్వైర దర్శనం కాగలదని శ్రీకృష్ణుడు సంతోషించాడు- అని వర్ణింపబడినది. శ్రీకృష్ణునికి తెలియకుండా చీకట్లోనే గోపకన్యలు వచ్చి, యమునానదియొక్క మడుగులో స్నానం చేయదలచి గట్టున తమ దుస్తులను విడిచి నీరాడుతున్నారు. గోపకన్యలకు కనబడకుండా నల్లనయ్య వారి వెనుక వచ్చి, వారి వస్త్రాలన్ని గట్టునుంచి మెల్లగా అపహరించి కుందవృక్షం మీద పెట్టుకొని కూర్చున్నాడు. వారు స్నానం చేసిన తర్వాత గట్టుకు వచ్చి చూచుకొనేసరికి కట్టు పుట్టములు కనబడలేదు. అటు ఇటు వెదుకుతున్న నగ్న కన్యలకు కుందతరువు మీద తమ దుస్తులను పెట్టుకొని కూర్చొనియున్న కృష్ణుడు కనబడినాడు. కృష్ణుడు మన వెంటవస్తాడని అతనికి తెల్యకుండా నదికి మనం వచ్చినప్పటికీ, ఆయనెలాగో వచ్చి మన వస్త్రాలను అపహరించాడని భావించారు. మనం ఓడిపోయాం కదా! ఆయనయేజేత- జయశీలుడు అని సిగ్గుతో గోప్యమైన అంగాన్ని చేతులచేత కప్పుకొని, ఒడలంతా

ముడుచుకొంటూ వంగి నడుచుకొంటూ కుందతరువు దగ్గఱికి వచ్చారు. ఓ కృష్ణ భగవానుడా! మా కట్టుబట్టలను మాకు ఇవ్వవయ్యా! అని ప్రార్థించారు.

శ్రీకృష్ణుడు 'మీరు నాకు చేతులెత్తి నమస్కారం చేస్తే ఇస్తాను' అన్నాడు. కన్యకలు ఒక చేతితో గోప్యమైన అంగాన్ని దాచుకొని, మరొక చేతితో నమస్కారం చేశారు. 'నమస్కారం చేసే విధానమిది కాదు' అని శ్రీకృష్ణుడు ఏక హస్త ప్రణతిని అంగీకరించలేదు.

గోపకన్యలు ఒకరిమొగమొకరు చూచుకొంటూ సిగ్గుతో మగ్గుతున్నారు. 'మీరు రెండు చేతులెత్తి అంజలి ఘటిస్తే తప్ప మీకు మీ దస్తులను ఇవ్వను' అన్నాడు.

"ఇనియెన్హుమ్ పొయ్ క్కైక్కువారోమ్, తోషియుమ్ నానుమ్ తొషుతోమ్, తుకిలై ప్పణిత్తరుళాయ్"- (నాచ్చియార్ తిరుమొషి- 3వ దశకం-1).

గోపకన్యలు ఇద్దరిద్దరు ఒకరిచేతిని మరొకరి చేతితో జోడించి అంజలి ముద్రను ఘటిస్తూ, "ఓ కృష్ణా! ఇక మీద ఎన్నడు కూడా జలాశయానికి- మడుగుకు రాము సుమా! నా సఖి, నేను కలిసి నిన్ను సేవిస్తున్నాము. కృపతో మా వస్త్రాలను అనుగ్రహించుము" అని ఆర్తితో ప్రార్థించారు.

శ్రీకృష్ణుడు ఫక్కున నవ్వినాడు. "ఒకరు తన ఒక్కచేతిని ఎత్తి, మఱొకరు ఎత్తిన చేతితో జతజేస్తే 'బద్ధాంజలి' అవుతుందా! ఇది అపూర్వం కదా! ఇదివరకు ఎక్కడను కని, విని యెరుగని ప్రక్రియ మీ బుద్ధికెట్లు తోచింది? ఈ అంజలి బంధాన్ని శాస్త్రం ఒప్పుకొంటుందా?" అన్నాడు. ఎవరికి వారు తమ రెండు చేతులనెత్తి అంజలి ముద్రను ప్రదర్శిస్తే, గోప్యాంగ ప్రకాశమవుతుంది అనే భయంతో ఈ నెరజాణలు అపూర్వమైన పరస్పర హస్తార్పణచే కూర్చబడిన అంజలిని ప్రదర్శించారు- అని శ్రీకృష్ణుడు భావించాడు. కాబట్టి, కృష్ణభగవానుడు గోపకన్యల యొక్క అపూర్వమైన అంజలి బంధాన్ని పరిహసిస్తూ, అంగీకరించలేదు.

314. సచాఽఽఽత్మచండాతక మాత్రభాజాం
క్షౌమార్థినీనాం స్వయ మర్థ్య మానైః।
అనన్య హస్తార్పణ సంప్రవృత్తైః
తాసాం జహాసాంజలిభిస్తదీయైః॥ 49

**అర్థం:** సః= ఆ కృష్ణుడు; ఆత్మచండాతక మాత్రభాజాం= తమ శరీరమే సగం తొడలమీది భాగానికుండే వస్త్రంలాగా అడ్డంగా ఉన్నట్టి క్షౌమ+అర్థినీనాం= కట్టుపట్టు వస్త్రాలను కోరుతున్నట్టి; తాసాం= ఆ గోపకన్యలకు; స్వయం= కృష్ణునిచేత స్వయంగా; అర్థ్యమానైః= కోరబడుతున్నట్టి; అనన్య హస్తార్పణ సంప్రవృత్తైః= ఇతరులచేతి సంపర్కం లేకుండా చేయబడిన; తదీయైః= గోపకన్యలకే- ప్రత్యేకంగా వారి వారికే సంబంధించినట్టి; అంజలిభిః= అంజలి ముద్రలచేత (చేయబడుగాక అని ఆదేశించు రీతిగా); జహాస= నవ్వెను.

**తా॥** శ్రీకృష్ణుడు గోపకన్యల స్థితిని జూచి అంజలిని ఘటించే విధానాన్ని బోధించాడు. గోపకన్యలు లజ్జతో తమ మర్మాంగాలు కనబడకూడదనే భావంతో తమ శరీరమే తొడలమీద సగభాగం వరకు ఆచ్ఛాదింపబడి యుండగా, శ్రీకృష్ణుణ్ణి తమ వస్త్రాలను ఇమ్మని మొరపెట్టుకొంటున్నారు.

'ఆత్మన్' శబ్దానికి గల నానార్థాలలో శరీరమనే ఒక అర్థమున్నది.

"ఆత్మాయత్నో ధృతిర్బుద్ధిః స్వభావో బ్రహ్మవర్ష్మచ"- (అమరం).

"అర్థోరుకం వరస్త్రీణాం స్యాచ్చండాతక మంశుకమ్"- (అమరం).

"అర్థోరుకం వరస్త్రీణాం వాసశ్చండాతకః పుమాన్"- (అమరమాల)

వనితల యొక్క తొడలను సగం కప్పియుండే బట్ట అని అర్థం. చండం అతతి ఇతి= చండాతకం. చండం అంటే గుహ్యస్థానం. దాన్ని పొంది యుండే వస్త్రం 'చండాతకం'. చండాతకంవలె శరీరాన్ని కటినుంచి సగం తొడలమీది భాగం దాకా కప్పుకొని కన్నియలున్నారని భావం.

పూర్వశ్లోకమందు కన్యలకు తోచినట్లు చేసిన అంజలి బంధాన్ని చూచి పరిహసించాడు. గొల్లలకు 'అంజలి' శబ్దం యొక్క అర్థమే తెల్యదని (ఈ శ్లోకమందు) నవ్వినాడని భావం. సాధికారికమైన మాటను ఇలా చెప్పినాడు.

"దూరంగా ఉన్న, కనబడని, వస్తువులన్నిటినీ సాక్షాత్తుగా చూచే నా ముందు ఈ గోపనం- దాచుకోవడం చెల్లదు- వ్యర్థమే. చూడదగని వస్తువును కొంచెం చూడాలనే ఆశ(యం)తో నేనిట్లు ప్రవర్తిస్తున్నాను- అని మీరు భ్రమ పడుతున్నారేమో!" వెట్టి గొల్లలని పరిహసించాడు.

"మీకు దేహంమీది అభిమానం ఉండకూడదు. మీరు బద్ధాంజలులై యుండడమే నాకు చాలా ఇష్టం. మీరు మరొకరిచేతి స్పర్శ లేకుండా శాస్త్రీయంగా, ఎవరికి వారే, రెండు చేతులను దోసిలిగా మలచి అంజలి బంధంతో ప్రార్థించడం ఆవశ్యకం" అని శ్రీకృష్ణుడు- ముకుందుడు వస్త్రాపహారి స్వయంగా కన్నియలను ఆదేశించాడు అని పిండితార్థం.

(ఈ శ్లోకం కొన్ని గ్రంథాలలో అచ్చు కాలేదు అని తమిళ వ్యాఖ్య).

*315. ప్రసుప్త ముద్బోధయతా పరత్వం*
*వీరశ్రియో విభ్రమ మండనేన।*
*నీలాది నిర్వేశ నిధానధామ్నా*
*నాథో బభాసే నవయౌవనేన (వయసానవేన)॥* 50

**అర్థం:** నాథః= శ్రీకృష్ణుడు; ప్రసుప్తం= నిద్రించియున్న; పరత్వం= పరబ్రహ్మ భావాన్ని; ఉద్బోధయతా= మేల్కొల్పునట్టి; వీరశ్రియః= శౌర్య లక్ష్మియొక్క; విభ్రమ మండనేన= విలాసాలకు అలంకారమైన; నీలా+ఆది నిర్వేశ నిధానధామ్నా= నీళాదేవి మొదలైన గోపికల యొక్క భోగం యొక్క నిక్షేపానికి స్థానమైనట్టి; నవయౌవనేన= నూతన యౌవనంతో (నవేన= కొత్తదైన; వయసా= యౌవనంతో); బభాసే= ప్రకాశించెను, వయస్సు అంటే యౌవనం అని అర్థం.

"వయః పక్షిణి బాల్యాదౌ వయో యౌవన మాత్రకే" (విశ్వ నిఘంటువు)

**తా॥** శైశవంలోనే అద్భుత చరిత్రను ప్రదర్శించిన శ్రీకృష్ణుడు ఇంక మరుగుపడి యున్న పరబ్రహ్మ భావాన్ని ప్రకాశింపజేయునట్టి; వీరలక్ష్మియొక్క విలాసాలకు అలంకారమైనట్టి, నీళాదేవ్యాది గోపికల యొక్క భోగానికి సమర్థమైన నవయౌవనంతో ప్రకాశించాడు.

**వ్యాఖ్య:**– శ్రీకృష్ణుడు నవయౌవనంతో భాసించాడని వర్ణించే శ్లోకం.

శ్రీకృష్ణునికి ఐదేండ్లు మాత్రమే గడిచాయి. ఈ చిన్న ప్రాయమందే యౌవనానికి తగిన ఆకారం చేత విహరించే యోగమున్నందువల్ల 'నవయౌవనం' అనబడింది. కాని ఇది ముఖ్యమైన యౌవనం కాదని గ్రహింపవలసి యున్నది. ఐదేండ్ల ప్రాయంలోనే బాల్యదశలోనే పూతన, శకటాసుర, భంజనాది అద్భుత చేష్టలను ప్రదర్శించాడు. అయినా పరబ్రహ్మతత్త్వం నిండుగా ప్రకాశించలేదు.

*ప్రసుప్తం పరత్వం ఉద్బోధయతా:*– నిద్రించియున్న పరత్వాన్ని మేల్కొలిపే నవయౌవనంతో ప్రకాశించాడు. అంటే గోవర్ధన పర్వతాన్ని ఉద్ధరించే ఆశ్చర్యమైన ప్రక్రియను చేబట్టనున్నాడు కదా!

*వీరశ్రియో విభ్రమమండనేన:*– చాణూర ముష్టికులు అనే మల్లులను మర్దించే శౌర్య లక్ష్మి విలాసాలకు అలంకారంగా ఉండే నూతన వయస్సుతో శోభించాడు.

*నీళాది నిర్వేశ నిధాన ధామ్నా నవేన వయసాబభాసే:*– నీళాదేవి మొదలైన గోపికల భోగానికి సముచితమైన కౌశలం– సామర్థ్యం కలిగి యుండే నవయౌవనంతో భాసించాడు. చేయబోనున్న తన అద్భుత ప్రక్రియలచేత పరబ్రహ్మ భావం పరిపూర్ణంగా ప్రకాశింపజేయవలసి యున్నదని శైశవ దశలోనే యౌవన దశ అంకురించినట్లు శోభించాడు. ఎనిమిదవ యేట కంసుణ్ణి వధించాడు– అని పురాణ ప్రసిద్ధియున్నది.

కంసవధ తర్వాతనే "బలౌ యువానావివతౌ బలాఢ్యౌ"- బాలురే యువకుల లాగా బలరామకృష్ణులు బలాఢ్యులై భాసిస్తున్నారని ముందు చెప్పబోతున్నారు. అలాగే గోవర్ధనగిరిని ఉద్ధరించే సందర్భమందు-

"అముక్త బాల్యస్య సమగ్రశక్తేః క్షణార్ధవత్ సప్త దినాన్యతీయుః"- బాల్యదశ పూర్తిగా విడిపోకముందే యున్నట్టి సంపూర్ణ శక్తివల్ల ఏడు రోజులు సగమైన క్షణకాలం వలె గడిచినాయి అని ఇక ముందు చెప్పబడుతున్నందువల్ల- యువక దశలో ప్రకాశింపజేసే పరత్వాన్ని బాల్యదశలోనే ప్రదర్శింపజేయడం వల్ల నవయౌవనం చేత కృష్ణుడు భాసించాడని వివరింపబడింది.

316. విహార పర్వక్రమ చారుశౌరేః
కల్యం వయః కామగృహీతి యోగ్యమ్।
మనోభిరాస్వాద్యతమం ప్రపేదే
మాధుర్య మిక్షోరివ మధ్య భాగః॥ 51

**అర్థం:** విహార పర్వక్రమ చారు= విహారాలలో తారతమ్య క్రమం చేత మనోహరమైన; కామ గృహీతి యోగ్యం= మన్మథుని యొక్క పరిగ్రహమందు యోగ్యమైన; కల్యం= చతురమైన; వయః= యౌవనం; ఇక్షోః= చెఱుకు గడయొక్క మధ్యభాగః, ఇవ= నడిమి భాగంవలె; మనోభిః= మనస్సులచేత; ఆస్వాద్య తమం= మిక్కిలి ఆస్వాదించదగినట్టి; మాధుర్యం= మధురిమను; ప్రపేదే= పొందెను.

**తా॥** శ్రీకృష్ణుని వయస్సు, చెఱుకు గడయొక్క మధ్యభాగమందుండే మాధుర్యం ఎక్కువ ఆస్వాదింపయోగ్యంగా నున్నట్లున్నది.

'పర్వం' అంటే భాగం, కణపు అని అర్థం. శ్రీకృష్ణుడు చేసే క్రీడా విహారం ఒకదానికంటె మరొకటి విశేషంగా ఉండడం వల్ల విహారాల్లో ఉత్తరోత్తరం ఉత్కృష్టంగా ఉండడంవల్ల తరతమ భావం వరుసగా మనోజ్ఞమై యున్నది.

మన్మథుడు అధిష్ఠించదగిన వయస్సు కాబట్టి కల్యం అంటే చతురంగా ఉంది. "కల్యౌ నీరోగదక్షయోః" (విశ్వ. ని.).

శ్రీకృష్ణుని లీలలను చూస్తున్నవారి మనస్సులో ఆయన వయస్సు చెరుకు గడలోని మధ్యభాగంలో ఉండే మధురిమలాగా, మధురమైన రుచిని ఆస్వాదింప జేసింది. ఇదొకరకమైన కొత్త వయస్సు కాబట్టి కమనీయమైనదని భావం.

*317.* సమాశ్రితాం విభ్రమసైన్య భేదైః
కాంత్యా స్వయా కల్పిత చారువప్రామ్।
వ్రజస్త్రియః కృష్ణమయీం వ్యజానన్
క్రీడార్గళాం క్షేమపురీమపూర్వామ్॥ 52

**అర్థం:** వ్రజస్త్రియః= గోకులాంగనలు; విభ్రమసైన్య భేదైః= కన్నుల, కనుబొమ్మల విలాసాలు అనే సైన్య విశేషాలచేత; సమాశ్రితాం= కూడుకొనియున్నట్టి; స్వయా= తనదైన; కాంత్యా= కాంతిచేత; కల్పిత చారువప్రాం= నిర్మింపబడి అందమైన ప్రాకారం కలిగినట్టి; క్రీడా+అర్గళాం= గోపికా వస్త్రాపహారం మొదలైన విహారమే అర్గళం- గడియమ్రానుగా కలిగినట్టి; కృష్ణమయీ= కృష్ణరూపమైన; అపూర్వాం= పూర్వం లేనట్టి (నూతనమైన); క్షేమపురీం= ఆనందం యొక్క రాజధానిగా; వ్యజానన్= భావించారు.

**తా॥** గోకులాంగనలు అధికమైన తమ ఆనందం యొక్క రాజధానిగానే కృష్ణుణ్ణి భావించారు. ఆయన చేసే భ్రూనయనాది విలాసాలన్నీ ఆ రాజధాని నగరమందలి పదాతి సైన్యంగానూ; కృష్ణుని సౌందర్యమే- కాంతివలయమే ఆ నగరం యొక్క ప్రాకారంగానూ; గోపికా వస్త్రాపహారాది క్రీడయే ఆ నగరంలోకి ఇతరులు ప్రవేశించకుండా ద్వారబంధనం తర్వాత వేసే బేడెం- గడియ మ్రానుగానూ భావించారు.

"తద్విష్కంభేఽర్గళం ననా"- (అమరం).

"అర్గళం త్రిషు కల్లోలే దండే చాంతః కవాటయోః"- (అని మరొక నిఘంటువు)

కృష్ణుడు నిరతిశయ సంభోగానంద హేతువవడంవల్ల ఆయనను ఆనంద సామ్రాజ్యపురిగా గోపస్త్రీలు భావిస్తూ ఆనందించారు.

'కృష్ణమయీం క్షేమ పురీం' అనడంవల్ల అపహ్నవాలంకారం. 'విభ్రమసైన్య భేదైః'- కాంతిని ప్రాకారంగానూ, క్రీడను అర్గళంగానూ చెప్పడంవల్ల రూపకాలంకారం. వ్రజస్త్రీలు 'వ్యజానన్' అనడంవల్ల ఆ గోపస్త్రీలకు అతనితో సంభోగేచ్ఛా రూపమైన రతి అనురణిస్తున్నది. ముఖ్యంగా, కార్యం ప్రస్తుతం కాగా కారణాభిధానరూపమైన అప్రస్తుతాలంకార లక్షణమూ ఉన్నది.

*318.* వంశస్వనో వత్సవిహార పాంసుః
సంధ్యాగమస్తస్య చ వన్యవేషః।
ఆయాతి కృష్ణే వ్రజ సుందరీణా
మాసీచ్చతుః స్కంధ మనంగ సైన్యమ్॥ 53

**అర్థం:** కృష్ణే= కృష్ణుడు; ఆయాతి (సతి)= వస్తుండగా; వంశస్వనః= వేణునాదం; వత్సవిహార పాంసుః= గోపబాలురతో ఆడుకొని; బాలురవెంట (లేదూడల వెనుక) వస్తున్నప్పుడు పడిన ధూళి; సంధ్యా+ఆగమః= అతడు మలిసంజ వేళలో రావడం; తస్య= ఆ కృష్ణుని యొక్క; వన్యవేషః, చ= అడవిలో తిరిగి వస్తున్న రూపం కూడా; వ్రజసుందరీణాం= గోపాంగనలకు; చతుః స్కంధమ్= నాలుగు వ్యూహాలుగల; అనంగసైన్యం= మన్మథుని సైన్యంగా; ఆ సీత్ ఉండెను.

**తా॥** శ్రీకృష్ణుడు అడవిలో గోపబాలకులతో ఆడుకొని, ఆవుదూడల వెనుక, బాలురతో కలిసి ఇంటికి వస్తుండగా పిల్లన గ్రోవిని ఊదగా వినవస్తున్న వేణునాదం, లేదూడల వెనుక వస్తుండగా అతనిమీద పడిన దుమ్ము, ధూళి,

మలిసంజవేలలో అడవినుంచి తిరిగి గృహోన్ముఖుడై కృష్ణుని రాకడ (ఆగమనం) అడవిలోని పత్ర పుష్పాలనూ, నెమలి పింఛాన్ని ధరించి వస్తున్న కృష్ణుని అందమైన వేషమూ గోపస్త్రీలకు చతుర్వ్యూహంగా ఉన్న మన్మథుని సైన్యంగా ఉండెను.

కృష్ణుణి మురళీరవం, కృష్ణుని మీద పడిన ధూళికణాలు, మలిసంజ వేళలో కృష్ణుని ఆగమనం, మయూర పింఛాది వన్యవేషం ఈ నాలుగు కూడా గోపస్త్రీలకు కామోద్దీపకాలుగా ఆయెను అని భావం.

*319.* అనుశ్రవాణా మవతంసభూతం
బర్హావతంసేన విభూషయన్తీ।
అదివ్యయా చర్మ దృశైవ గోపీ
సమాధి భాజా మభజత్సమాధిమ్॥ 54

**అర్థం:** అనుశ్రవాణాం= వేదాల యొక్క; అవతంసభూతం= ఉత్తమాంగానికి ఆభరణంవలె నున్నట్టి కృష్ణుణ్ణి; బర్హా+అవతంసేన= మయూర పింఛరూపమైన ఆభరణంచేత; విభూషయంతీ సతీ= అలంకరిస్తున్నదై; గోపీ= ఒకానొక గోపస్త్రీ; అదివ్యయా= మానుషమైన; చర్మదృశా, ఏవ= తోలుకన్నుల చూపుతోనే; సమాధి భాజాం= యోగుల యొక్క; సమాధిం= సమాధిని; అభజత్= పొందెను.

**తా॥** వేదాలకు శిరోభూషణం లాగా ఉన్నవాడు శ్రీకృష్ణుడు. వేదాన్త శాస్త్రమందు ప్రతిపాదింపబడినవాడు భగవానుడని అర్థం. ఉత్తంసం, అవతంసం అనే శబ్దాలకు శిరోభూషణమనే అర్థం.

"పుం స్యుత్తంసావతంసౌ కర్ణపూరేఽపి శేఖరే"- (అమరం). అట్టి కృష్ణభగవానుని కిరీటానికి నెమలి పింఛాన్ని భూషణంగా ఒక గోపిక అలంకరించింది. 'అవతంస భూతం' అంటే ఆభరణంతో సమానమైనదని అర్థం. భూత శబ్దం సాదృశ్యవాచి. "భూతం న్యాయ్యే సమే ప్రాప్తే యథార్థా తీతయో రపి" (రత్నమాల).

కృష్ణభగవానుణ్ణి బర్హావతంసునిగా జేసిన గోపవనిత సమాధిని పొందింది. యోగులు దివ్యమైన దృష్టితో ఏకాగ్రమైన మనస్సుతో చూచి భగవానుని సాక్షాత్కారాన్ని పొందడం 'సమాధి' అంటారు. ఇక్కడ కృష్ణునికి మయూర పింఛాన్ని శిరోభూషణంగా అలంకరించిన గోపిక, పిమ్మట ఆయన శోభను- ఆ దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని తన తోలు కన్నులతోనే తెప్పవాల్చకుండా నిశ్చల చిత్తంతో చూస్తూ అట్లే నిలబడి యున్నది. దివ్య దృష్టితో యోగులు సమాధిని పొందినట్లు గోపిక మానుష చర్మచక్షువులతోనే కృష్ణుని రూపాన్ని చూస్తూ, సమాధిని పొందడం వల్ల ఆమె జన్మ సాఫల్యమైనది కదా!

*320. కలాపినాం కల్పిత మాల్యభావైః*
*పత్రై స్తదా పత్రలదేహకాంతిమ్।*
*అవాప్య సంచారితమాల మాద్యం*
*ఛాయాత్మతాం ప్రాపురివాస్య గావః॥* 55

**అర్థం:** తదా= అప్పుడు; గావః= నందుని గోవులు; కల్పిత మాల్య భావైః= కూర్చబడిన మాలికల రూపం కలిగినట్టి; కలాపినాం= నెమళ్ళయొక్క; పత్రైః= పింఛములచేత; పత్రల దేహకాంతిం= పచ్చని ఆకులు గల దేహం యొక్క కాంతిని కలిగినట్టి; సంచారితమాలం= నడయాడే తమాల తరువుగా ఉన్నట్టి; ఆద్యం= ఆది పురుషుడైన శ్రీకృష్ణ భగవానుణ్ణి; అవాప్య= పొంది; అస్య= కృష్ణుని యొక్క; ఛాయాత్మతాం= నీడవంటి భావాన్ని; ప్రాపుః, ఇవ= పొందినట్లు; అన్వసరన్= అనుసరించెను.

**తా॥** శ్రీకృష్ణుని మయూర పింఛాభరణాలు నాలుగు శ్లోకాలలో వర్ణింపబడుతున్నాయి. మయూర పింఛాలను మాలికలుగా కూర్చి శ్రీకృష్ణుడు అలంకరింపబడి యున్నాడు. పచ్చని ఆకుల కాంతి, కృష్ణుని నీలదేహ కాంతి కలిసి దట్టనైన చీకటి మ్రాను- తమాల తరువులాగా శోభిస్తున్నాడు. కృష్ణుడు ఆదిపురుషుడు కాబట్టి జంగమతమాల తరువు- నడయాడే కానుగు చెట్టులాగా ప్రకాశిస్తున్నాడు.

"కాలస్కంధ స్తమాలః స్యాత్ తాపిచ్ఛోఽపి"- (అమరం). తాపిచ్ఛ వృక్షం అంటే తాపంకల వ్యక్తిని కప్పునట్టి చెట్టు (తాపినం ఛాదయతి ఇతి= తాపిచ్ఛః). గడ్డిని మేసే గోవులు ఎండవలన కలిగిన తాపాన్ని పోగొట్టుకోవడానికి సాంద్రచ్ఛాయ గల చీకటి మ్రాకు నీడను ఆశ్రయిస్తాయి. నందుని గోవులు నడయాడే శ్రీకృష్ణుని దేహచ్ఛాయను జూచి, తమ తాపాన్ని శమింజేయడానికి నీడగా భావించి అతని దాపున చేరినాయి. పశువులన్ని శ్రీకృష్ణుని అధీనంలోనే ఉన్నాయి.

కృష్ణ శబ్దాన్ని మరుగుపరచి, 'సంచారితమాలం'గా అధ్యవసించడం వల్ల అతిశయోక్త్యలంకారం.

*321. వితన్వతా మాన్మథ మింద్రజాలం*
*పింఛేన తాపిచ్ఛ నిభో బభాసే।*
*అనేక రత్న ప్రభవేన ధామ్నా*
*శారాత్మనా శైల ఇవైంద్ర నీలః॥* 56

**అర్థం:** తాపిచ్ఛనిభః= తమాల వృక్షం లాగా శ్యామల వర్ణంగల శ్రీకృష్ణుడు; మాన్మథం= మన్మథునికి సంబంధించినట్టి; ఇంద్రజాలం= ఇంద్రజాలాన్ని; వితన్వతా= విస్తరింపజేసే; పింఛేన= శిఖి పింఛంచేత; అనేక రత్నప్రభవేన= బహువిధ రత్నాల కాంతులను ప్రసరింపజేసే; శారాత్మనా= విచిత్ర రూపమైన; ధామ్నా= తేజస్సుచేత; ఇంద్రనీలః= ఇంద్రనీలం అనునట్టి; శైలః, ఇవ= పర్వతంవలె; బభాసే= భాసించాడు.

**తా॥** తాపిచ్ఛ తరువు వలె శ్యామల వర్ణంగల శ్రీకృష్ణుడు, బర్హి పింఛం చేత కామునికి సంబంధించిన ఇంద్రజాలాన్ని విస్తరింపజేస్తున్నాడు. ఐంద్రజాలికులు మయూర పింఛాన్ని త్రిప్పుతూ ప్రేక్షకులను వ్యామోహింపజేస్తారు.

*"దేశకాలాపరోక్ష్యం యత్ పరోక్ష స్యైవ వస్తునః।*
*మంత్రౌషధి క్రియా భేదై రింద్రజాలం ప్రచక్షతే॥"*

కంటికి కనబడని వస్తువును మంత్రౌషధి క్రియలచేత ఆయా దేశకాలాల్లో కనిపింపజేసే విద్య ఇంద్రజాలమనబడుతుంది. వజ్రవైదూర్య మరకతాద్యనేక రత్నాల కాంతులను ప్రసరింపజేసే విచిత్ర రూపంగల ఇంద్రనీలమయ పర్వతంవలె పింఛంచేత ఇంద్రజాలాన్ని విస్తరింపజేస్తున్న కృష్ణుడు విచిత్రంగా శోభిస్తున్నాడు. "శారో వాయౌ సతుత్రిషు కర్బురే"- (అమరం).

*322. ముహుః స్పృశంతీ ముముదే యశోదా*
*ముగ్ధాంగనా మోహన వాంశికేన।*
*మనీషిణాం మాంగళికేన యూనా*
*మౌళౌధృతాం మండన బర్హమాలామ్॥ 57*

**అర్థం:** యశోదా= యశోద; ముగ్ధ+అంగనామోహన వాంశికేన= సుందరాంగనలను మోహింపజేయడానికి మురళిని- పిల్లన గ్రోవిని ఊదుతున్నట్టి; మనీషిణాం= ధ్యానం చేసే తాపసులకు; మాంగళికేన= క్షేమంకరుడైనట్టి; యూనా= నవయువకుడైన కృష్ణునిచేత; మౌళౌ= శిరస్సునందు; ధృతాం= ధరింపబడిన; మండన, బర్హమాలాం= అలంకారంగా ఉన్న మయూర పింఛములచే కూర్చబడిన మాలికను; ముహుః= మాటి మాటికి; స్పృశంతీ సతీ= స్పృశిస్తున్నదై; ముముదే= సంతోషించెను.

**తా॥** వేణునాదంచేత ముగ్ధాంగనలకు మోహాన్ని కలిగింపజేయువాడును, పరిశుద్ధమైన మనస్సుతో ధ్యానించే తపోధనులకు క్షేమంకరుడైన, యువకుడైన కృష్ణుని తలపైన అలంకారంగా ధరించిన శిఖిపింఛమాలను యశోద మళ్ళీ మళ్ళీ స్పృశిస్తూ, ఆనందించెను.

'వాంశికః- వంశః శిల్పం అస్య ఇతి= వాంశికః', వేణువాద్య శిల్పం కలవాడు. 'శిల్పం' ఇతి సూత్రేణ 'ఠక్' ప్రత్యయః.

మంగళం ప్రయోజనం అస్య ఇతి= మాంగళికః. మంగళమైన ప్రయోజనాన్ని కలిగించువాడు. ('ప్రయోజనం' ఇతి సూత్రాత్ 'ఠక్' ప్రత్యయః).

*323. కృతాస్పదా కృష్ణ భుజాంతరాళే*
*ప్రాలంబ బర్హావళి రాబభాసే।*
*విశుద్ధ హేమద్యుతిరబ్ధికన్యా*
*శ్యామాయ మానేవ తదంగ కాంత్యా॥* 58

**అర్థం:** కృష్ణ భుజాంతరాళే= శ్రీకృష్ణుని భుజాలమధ్యన, వక్షఃస్థలమందు; కృతాసదా= కల్పించబడిన స్థానంగల; ప్రాలంబబర్హావళిః= వ్రేలాడే కంఠాభరణ రూపమైన నెమలి పురుల సమూహం; విశుద్ధ హేమద్యుతిః= శుద్ధమైన బంగారు వన్నె కలిగినట్టి; తదంగకాంత్యా= కృష్ణుని శరీర కాంతిచేత; శ్యామాయమానా= శ్యామ వర్ణం కలదైన; అబ్ధికన్యా, ఇవ= సముద్రతనయయైన లక్ష్మీదేవివలె; ఆబభాసే= భాసించెను.

**తా॥** శ్రీకృష్ణుని వక్షఃస్థలమందు కంఠాభరణంగా వ్రేలాడుతున్నది మయూర పింఛాల సమూహం. చొక్కపు బంగారు వన్నెకల లక్ష్మీదేవి కృష్ణుని వక్షఃస్థలమందే నివసిస్తుంది. కృష్ణుని దేహకాంతి శ్యామవర్ణం కలది కాబట్టి లక్ష్మీదేవి శ్యామవర్ణం కలదిగా భాసిస్తుంది. బంగారు వన్నెతో శ్యామవర్ణం కలిసి ప్రకాశిస్తున్న లక్ష్మీదేవియే అన్నట్లు కృష్ణునికి కంఠాభరణంగా వక్షఃస్థలమందు వ్రేలాడుతున్న బర్హావళి కొంచెం బంగారు వన్నెతోనూ, ఎక్కువ శ్యామవర్ణంతోనూ ప్రకాశిస్తున్నదని ఉత్ప్రేక్షితం.

"*ప్రాలంబంబుజులంబిస్యాత్ కంఠాత్*"- (అమరం) మెడనుంచి చక్కగా ఉరమున వ్రేలాడే దండ ప్రాలంబమనబడును.

*324. సాచీకృతాని ప్రణయ త్రపాభ్యాం*
*వ్యావృత్త రాజీవనిభానిశౌరిః।*
*సభ్రూవిలాసాని దదర్శతాసాం*
*వక్త్రాణి వాచాల విలోచనాని॥* 59

**అర్థం:** శౌరిః= కృష్ణుడు; ప్రణయ త్రపాభ్యాం= ప్రేమ చేతను, సిగ్గుచేతను; సాచీకృతాని= అడ్డంగా త్రిప్పబడినట్టివి. కావుననే; వ్యావృత్తరాజీవ నిభాని= ముడువబడిన తామర రేకులతో సమానమైన; సభ్రూవిలాసాని= కనుబొమల విలాసాలతో కూడినట్టి; వాచాల విలోచనాని= అనేక భావాలు గల్గిన క్రీగంటి చూపులు గల; తాసాం= గోపికలయొక్క; వక్త్రాణి= ముఖాలను; దదర్శ= చూచెను.

**తా॥** గొల్లపడుచు కన్నెలకు శ్రీకృష్ణునిమీద ప్రేమ ఎక్కువగా నున్నది. కాని సిగ్గుకూడా ఎక్కువగా ఉండడంవల్ల నేరుగా శ్రీకృష్ణుని చూడలేక ముఖాలను అడ్డంగా త్రిప్పుకొన్నారు. మడత బడుతు చలిస్తున్న తామర పూరేకుల్లాగా కనుబొమల ముడుల విలాసాలు గల ఓరగంటి చూపులతో బహుభావాలను తెలియజేస్తున్న గొల్ల వధువుల ముఖాలను కృష్ణుడు చూచాడు.

*325. నిరంకుశ స్నేహ రసానువిద్ధాన్*
*నిష్పంద మందాలస నిర్నిమేషాన్।*
*వంశేన కృష్ణః ప్రతి సంబభాషే*
*వార్తాహరాన్ వామదృశాం కటాక్షాన్॥* 60

**అర్థం:** కృష్ణః= శ్రీకృష్ణుడు; నిరంకుశ స్నేహరస+అనువిద్ధాన్= ఆటంకంలేని ప్రేమరసంచేత పూయబడినట్టి; నిష్పందమంద+అలస నిర్నిమేషాన్= వేరొక విషయమై స్పందించని, మెల్లగా, సిగ్గుతో మగ్గుతున్న, ఱెప్పవాల్చనట్టి; వామదృశాం= అందమైన కన్నులు గల గొల్ల పడుచుల యొక్క; వార్తాహరాన్= సందేశాన్ని అందిస్తున్న; కటాక్షాన్= కడగంటి చూపులను గూర్చి వంశేన= వేణునాదంచేత; ప్రతిసంబభాషే= మారు మాటాడెను.

**తా॥** గొల్లపడుచుల ఓరచూపుల్లో అడ్డులేని ప్రేమరసమొలుకుతున్నది. తమ కోరికను నెరవేర్చుకొనుటకే స్పందిస్తూ, సిగ్గు ముంచెత్తగా, మెల్లగా ప్రేమానుభవాన్ని ప్రకటిస్తూ, ఱెప్పవాల్చని సుందరలోచనలైన గోపవధువులు సంభోగేచ్ఛతో బహుభావాలను కడగంటి చూపులతోనే కృష్ణునికి ప్రసారం చేశారు.

కటాక్షాలే వార్తాహరులైనాయి. సంభోగేచ్ఛను తెల్పే అపాంగదృష్టితోనే బాగా మాటలాడుతారు అంగనలు కాని నోటితో ఒక్కమాటనైనా పలుకరు కదా!

*"యద్గతాగత విశ్రాంతి వైచిత్ర్యేణ వివర్తనం।*
*తారకాయాః కళాభిజ్ఞాః తం కటాక్షం ప్రచక్షతే॥"*

అన్నాడు శార్ఙ్గదేవుడు. కనీనికను- కనుగ్రుడ్డును ఓరగా త్రిప్పగా అది అటుపోతూ, ఇటు తిరిగివస్తూ, ఒక్క క్షణం విశ్రాతిని పొంది మళ్ళీ మళ్ళీ భావాలను ప్రసరింపజేసే కడగంటి చూపును కళావిశారదులు 'కటాక్షం' అని నిర్వచించారు అని అర్థం. శ్రీకృష్ణుడు గోపాంగనల ప్రార్థనా రూపకటాక్షాలకు సముచితంగా తాను అంగీకరించినట్లు వేణుగానం చేత సమాధానమిచ్చాడు- బదులు చెప్పినాడు.

*326. అశిక్షితం తుంబురు నారదాద్యైః*
*ఆభీర నాట్యం నవ మాస్థితేన।*
*జగే సలీలం జగదేక ధామ్నా*
*రాగాబ్ధినా రంజ యతేవ విశ్వమ్॥* 61

**అర్థం:** తుంబురు, నారద+అద్యైః= తుంబురుడు నారదుడు మొదలైన వారిచేత; అశిక్షితం= నేర్వబడనట్టి; నవం= కొత్తదైన; ఆభీర నాట్యం= గొల్లల నాట్యాన్ని; ఆస్థితేన= అవలంబించినట్టి; రాగ+అబ్ధినా= రాగాలకు సముద్రుడైన; విశ్వం= ప్రపంచాన్ని; రంజయతా, ఇవ= రంజింపజేయువాని వలె నున్న; జగత్+ఏకధామ్నా= జగత్తుకు ముఖ్య ఆవాసస్థానమైన కృష్ణునిచేత; సలీలం= వినోదంగా; జగే= గానం చేయబడెను.

**తా॥** తుంబురుడు, నారదుడు మొదలైన మహాత్ముల చేతకూడా అభ్యసింప బడని కొత్తదైన గొల్లల నాట్యాన్ని ఆడసాగినాడు కృష్ణుడు.

*"యోఽసౌ ధ్వని విశేషస్తు స్వర వర్ణ విభూషితః।*
*రంజకో జన చిత్తానాం సరాగః కథితో బుధైః॥"*

జనులకు మనోరంజకమైన, వర్ణాలకు స్వర సమ్మేళనంచేసిన మధుర నాదం 'రాగం' అనబడుతుంది- అనే లక్షణంతో కూడిన శ్రీరాగాదులకు సముద్రంవలె నిధియైన వాడు కాబట్టి, జగదాధారుడైన శ్రీకృష్ణుడు సమస్త చేతనా చేతన ప్రపంచాన్ని రంజింపజేస్తున్న వానివలె మధురమైన గానాన్ని వినోదంగా పాడినాడు.

*327. అపత్రపా సైకత మాశ్రితానాం*
*రాగోదధౌ కృష్ణముఖేందు నున్నే।*
*హస్తావలంబో న బభూవ తాసాం*
*ఉత్పక్ష్మణా ముత్కలికా ప్లుతానామ్॥* 62

**అర్థం:** కృష్ణముఖ+ఇందు నున్నే= శ్రీకృష్ణుని యొక్క ముఖమనే చంద్రుని చేత వృద్ధి పొందిన; రాగ+ఉదధౌ= ప్రేమ అనే సముద్రమందు; అపత్రపా సైకతం= లజ్జ అనే ఇసుకతిన్నెను; ఆశ్రితానాం= ఆశ్రయించడంవల్ల మునిగినట్టి; ఉత్కలికా ప్లుతానాం= ఉత్కంఠతో నిండినట్టి/ విలాసతరంగాల యందు ఓలలాడుతున్నట్టి; ఉత్ పక్ష్మణాం= ఱెప్పలెత్తిన చూపులుగల; తాసాం= ఆ గోపస్త్రీలకు; హస్త+అవలంబః= చేయూత; న, బభూవ= ఉండలేదు.

**తా॥** శ్రీకృష్ణుని ముఖచంద్రునిచేత పొంగిన ప్రేమ సముద్రమందు లజ్జ అనే సైకత ప్రదేశాన్ని ఆశ్రయించినందువల్ల మునిగిపోయినారు గోపికలు. సముద్ర తరంగాలలో ఆసక్తితో తేలుతున్న గోపస్త్రీలు కృష్ణుని ముఖాన్ని తేరిపార జూస్తున్నారు. తమను ఉద్ధరిస్తాడనే కోరికతో చూస్తున్నప్పటికీ ఆ గోపాంగనలకు చేయూత, సహాయం లభించలేదు.

వ్యాఖ్య:- ప్రేమ సముద్రంలో పడి ఉక్కిరి బిక్కిరిగా చూస్తున్న గోపాంగనలకు చేయూత లభించలేదని సుశ్లోకితం.

చంద్రోదయం కాగానే సముద్రం ఉప్పొంగుతుంది. ఇసుక దిన్నెల మీదికి అలలు చేరి కల్లోలంగా ఉంటుంది. ఆ ఇసుకతిన్నెల మీదనున్న వ్యక్తులు తరంగాలలో తేలుతూ తమను గట్టెక్కించడానికి ఎదిరి చూస్తుంటారు. అయినా, సహాయమేదీ దొరకనప్పుడు ఆ వ్యక్తుల స్థితి ఎట్లున్నదో ఇందు వర్ణింపబడింది.

ఎవరైనా చూస్తారేమో అని గోపస్త్రీలు లజ్జ అనే ఇసుక తిన్నెలమీద గుమిగూడి యున్నారు. శ్రీకృష్ణుని ముఖం అనే చంద్రునిచేత ప్రేమ అనే సముద్రం ఉప్పొంగింది. ఇసుక తిన్నెల నాశ్రయించియున్న గోపాంగనలు నిండు వేడుక అనే కెరటాలలో పడి తేలుతున్నారు. ప్రేమ జలధి విలోల వీచికలలో ఓలలాడుతున్న ఆ గోపికలకు "ఇక్కడనే మాకు సర్వేంద్రియ సుఖమున్నది" అనే ఉత్కంఠ, ఆసక్తి మెండుగా నుండింది. కాని ప్రేమ సముద్రతరంగాలచే కల్లోలిత దశ సిద్ధించింది. 'ఉత్కలిక, ఉత్కంఠ, విలాస జల తరంగాలు' పర్యాయ పదాలు.

*"భవే దుత్కలికోత్కంఠాహేలా సలిల వీచిషు"*- (విశ్వ.ని.)

*"సర్వేంద్రియ సుఖాస్వాదో యత్రాస్త్రీతి మనః స్త్రి యాః।*
*తత్ ప్రాప్తీచ్ఛాం స సంకల్పా ముత్కంఠాం కవయోవిదుః॥"*

ఉత్కలిక అంటే ఉత్కంఠ. స్త్రీ యొక్క మనస్సు ఎక్కడ సర్వేంద్రియ సుఖాన్ని అనుభవించాలని ఉంటుందో, అక్కడికి పోయే ఆ సుఖాన్ని పొందాలనే ఆశ, ఆసక్తి 'ఉత్కంఠ' అనబడునని విజ్ఞుల వాక్కు.

ఉత్కంఠ అనే కెరటాలతో తేలిపోతూ, అభిసరిస్తూ, ప్రేమ సాగరంలో తహతహలాడుతున్న గోపాంగనలు కృష్ణుని ముఖాన్ని చూచే కోరికతో తమను దరికి జేర్చుమనే భావనతో తెప్పలను పైకెత్తి చూస్తున్నారు. ప్రేమసాగరంలో మునిగిపోతున్నందువల్ల ప్రాణాలను ధరించే వీలులేని స్థితిలో చేతిపట్టు దొరికితే

గట్టెక్కవచ్చునని ఆశిస్తున్న గోపికలకు హస్తావలంబనం- చేయూత లభించనే లేదు.

కృష్ణునిమీద అనురాగం అధికమైనది. సంతృప్తిని కలిగించే కృష్ణుడు సహాయ పడనందువల్ల ప్రాణధారణకోసం గోపికలు ఉత్కంఠతో అభిసారికలయ్యారు అని భావం.

శ్లేషానుప్రాణిత రూపకాలంకారం.

*328. అయంత్రిత స్వైర గతిః స తాసాం*
*సంభావితానాం కరపుష్కరేణ।*
*ప్రస్విన్న గండః ప్రణయీ చకాశే*
*మధ్యేవశానామివ వారణేంద్రః॥* 63

**అర్థం:** అయంత్రిత స్వైర గతిః= నియమింపబడని స్వేచ్ఛ గోచరించునట్టి; ప్రణయీ= అనురాగం కలిగినట్టి; ప్రస్విన్నగండః= చెమటపట్టిన చెక్కిళ్ళు గల; సః= శ్రీకృష్ణుడు; కరపుష్కరేణ= కమలం వంటి చేతితో; సంభావితానాం= లాలింపబడుతున్న; తాసాం, మధ్యే= ఆ గోపవధువులయొక్క నడుమ-

అయంత్రిత స్వైర గతిః= అడ్డులేని స్వేచ్ఛచే సంచరించునట్టి; ప్రణయీ= ప్రేమ కలిగినట్టి; ప్రస్విన్నగండః= మదజలంచేత తడిసిన గండస్థలాలు కలిగిన; వారణేంద్రః= గజరాజు; కరపుష్కరేణ= తొండంచేత; సంభావితానాం= లాలింపబడుతున్న; వశానాం, మధ్యే, ఇవ= ఆడ ఏనుగుల నడుమ ఉన్నట్లు; చకాశే= శోభించెను.

**తా॥** స్వతంత్రమైన స్వేచ్ఛాచరణుడు శ్రీకృష్ణుడు. అనురాగమూ కలవాడు. సాత్త్విక భావంచేత ఏర్పడిన స్వేదబిందువులచే చెక్కిళ్ళు శోభిస్తుండగా తన కరకమలం చేత గోపస్త్రీలను లాలిస్తున్నాడు. శ్రీకృష్ణుడు గోపస్త్రీల మధ్య, ఆడ ఏనుగుల నడుమ గజేంద్రుని లాగా శోభిస్తున్నాడు.

వ్యాఖ్య:- శ్రీకృష్ణుడు తన వద్దకు అభిసరించి వచ్చిన గోపస్త్రీల మధ్యలో ఆడయేనుగుల నడుమనున్న గజరాజులాగా క్రీడించి వారిని ఆనంద పరచాడని వర్ణితం.

*అయంత్రిత స్వైర గతిః:*- శ్రీకృష్ణుడు తన ఇష్టప్రకారం ప్రవర్తించే వాడు. కృష్ణుడు ఏ పనిచేయదలచినా ఆ కర్మకు విధినిషేధాలు లేవు. తనను ఆశ్రయించిన వారిని ఆనందపరచడం మొదల్కొని మోక్షమిచ్చు పర్యంతం స్వేచ్ఛగా ఏది ఆచరించినా, ఆయనకు స్వార్థం లేదని తెల్పుతున్న పదమిది.

*వారణేంద్ర పక్షమున:*- మదంచేత కలిగిన ఉద్రేకంతో అడ్డులేకుండా తిరుగుతున్న గజరాజ లక్షణాన్ని తెల్పుతున్నది.

*ప్రస్విన్నగండః ప్రణయీ:*- శృంగార రసభావ లక్షణమిది. ప్రణయంగల పురుషుడు సాత్త్విక భావరూపమైన స్వేద బిందువులు కపోలాలపై పొటమరించగా సంగమేచ్ఛగల స్త్రీలకు అనుకూల్యాన్ని గోచరింపజేస్తున్న లాంఛనమిది.

గజరాజ పక్షాన- మదగజం యొక్క గండస్థలాలు మదజలం స్రవించడం వల్ల తడిసి యుండడం స్వాభావికం.

*కరపుష్కరేణ సంభావితానాం:*- కరం కెందామరవంటిది. పుష్కరం అంటే కమలం.

*"పుష్కరం కరిహస్తాగ్రే వాద్య భాండముఖే జలే।*
*వ్యోమ్ని ఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః॥"*- (అమరం)

కమలంవలె సుకుమారమైన చేతితో మృదువుగా స్పృశిస్తూ లాలించడం. గజరాజు తనతోటి ఆడయేనుగులను తన తొండంతో నిమురడం.

*సః వశానాం మధ్యే వారణేంద్ర ఇవ చకాశే:*- *"వశాస్త్రీ కరిణీ వంధ్యా"* (అమరం) *"వశాకరిణ్యాం వంధ్యాయాం రామాయాం దుహితర్యపి"*- (వైజయంతి). వశా శబ్దానికి ఆడయేనుగు అని అర్థం.

ఇక్కడ శ్రీకృష్ణుడు వారణేంద్రునితో పోల్చబడడం వల్ల తన చుట్టూ చేరియున్న గోపస్త్రీలతో క్రీడించి, వారిని ఆనందపరచాడని విశదమవుతున్నది.

*329.* *విమోహనే వల్లవ గేహినీనాం*
*న బ్రహ్మచర్యం బిభిదే తదీయమ్।*
*సంపత్స్యతే బాలక జీవనం తత్*
*సత్యేన యేనైవ సతాం సమక్షమ్॥* 64

**అర్థం:** వల్లవ గేహినీనాం= గోపకుల భార్యల యొక్క; విమోహనే= సంభోగమందు; తదీయం= కృష్ణునికి సంబంధించిన; బ్రహ్మచర్యం= స్త్రీలతో సంగమించ కూడదని ఒక ఆశ్రమమందలి దీక్ష; న, బిభిదే= సడలలేదు; సత్యేన= సత్యమైన, యేన, ఏవ= ఏ బ్రహ్మచర్యం చేత; సతాం= సజ్జనుల యొక్క; సమక్షం= ఎదుట; తత్= ప్రసిద్ధమైన; బాలక జీవనం= పరీక్షిత్తు అనే శిశువు యొక్క బ్రతకడం; సంపత్స్యతే= సంపన్నం కాగలదో.

**తా॥** శ్రీకృష్ణుడు గోపకుల భార్యలతో సంభోగం జరుపడం వల్ల, ఆయన యొక్క బ్రహ్మచర్యం చెడలేదు. ఎందుకంటే, ఉత్తరార్ధం ఇలా వివరిస్తున్నది. రాబోయే కాలమందు కృష్ణుడు ఉత్తరా గర్భాన్ని అశ్వత్థామ అస్త్ర ప్రయోగంతో దగ్ధం చేయగా ఆ బాలకుణ్ణి ప్రతిజ్ఞ చేసి బ్రతికించగలడు. ఆ బాలుడే భారత వంశానికి వారసుడైన పరీక్షిన్మహారాజు.

**వ్యాఖ్య:-** శ్రీకృష్ణుడు సదా బ్రహ్మచారి యని సుశ్లోకితం.

"సురతం మోహనంప్రోక్తమ్"- (హలాయుధః)

శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ భారతేతిహాసమందు ప్రసిద్ధం కదా!

*"యది మే బ్రహ్మచర్యం స్యాత్ సత్యంచ మయితిష్ఠతి।*
*అవ్యాహతం మమైశ్వర్యం తేన జీవతు బాలకః॥"*

"పాదేన కమలాభేన బ్రహ్మరుద్రార్చితేన చ।
పస్పర్శ పుండరీకాక్షః ఆపాదతల మస్తకమ్॥"

అభిమన్యుని భార్యయైన ఉత్తర నిండుగర్భిణి. అశ్వత్థామ దుర్యోధనుని తృప్తికోసం 'అపాండవం' చేస్తానని ప్రతిజ్ఞ చేసినందువల్ల ఉత్తరా గర్భాన్ని తన అస్త్ర ప్రభావంతో దగ్ధం చేశాడు. "మమప్రాణాహి పాండవాః" అన్న శ్రీకృష్ణ భగవానుణ్ణి ఉత్తర ఆర్తితో ప్రార్థించింది. శ్రీకృష్ణ భగవానుడు లీలా మానుష విగ్రహుడు. కాబట్టి వ్యాసాది మహర్షులందరు చూస్తుండగా-

"నా యొక్క బ్రహ్మచర్యం సత్యంగా- చెడిపోకుండా, నా యందు స్థిరంగా, నా ఐశ్వర్యం బాధింపబడనిదిగా ఉన్నట్లైతే ఈ శిశువు జీవించుగాక" అని శపథం చేసి, బ్రహ్మరుద్రులచే పూజింబడిన పుండరీకాక్షుడైన శ్రీకృష్ణుడు ఆ శిశువు యొక్క పాదతలం నుంచి తల వరకు తన పాదపద్మంచేత స్పృశించిన వెంటనే ఆ శిశువు బ్రతికాడు.

('పుండరీకాక్ష' శబ్దానికి పరమ పద నాథుడని అర్థం.
"పుండరీకం పరంధామ నిత్య మక్షర మవ్యయమ్।
తద్భవాన్ పుండరీకాక్షః" భారతం)

సంపత్స్యతే:- భవిష్యత్కాలంలో శ్రీకృష్ణుడు చేయగల కార్యాన్ని ఆయన బాల్య క్రీడయందు చెప్పడంవల్ల 'భవిష్యతిల్యట్' అనే క్రియాపదం ప్రయోగింప బడింది.

బ్రహ్మచర్యంచేతనే దగ్ధబాలకుడు జీవించడం కృష్ణునియొక్క బ్రహ్మచర్యం స్ఖలనం కాలేదనడానికి ప్రమాణమని ఈ శ్లోకం ప్రకటిస్తున్నది. ముఖ్యంగా, విధి నిషేధ కార్యాలను ఏర్పరచే పరబ్రహ్మ రూపంగల కృష్ణుడు, మానవులందరు గోపికల దశవంటి దశను పొందవలెనని నేర్పడానికి ఇట్లు తాను ఆచరించాడు.

*"ధర్మ సంస్థాపనార్థాయ హ్యవతీర్య మహీతలే।*
*పరదారాభిగమనం కథం కుర్యాత్ జనార్దనః॥"*

ధర్మాన్ని స్థాపించడానికి భూమియందు అవతరించి, శ్రీకృష్ణుడు ఇతరుల భార్యలతో సంగమం ఎలా చేస్తాడు? అని పార్వతి అడిగింది. "*స్వశరీర పరిష్వంగాత్ రతిర్నాస్తి వరాననే॥*" ఓ వరానన! శ్రీకృష్ణుడు తన శరీరంతో కౌగిలించుకోవడం వల్ల అది 'రతి'- భోగం కాదు- అని మహేశ్వరుడు సమాధానమిచ్చాడు (పాద్మోత్తర ఖండం).

*330. స్వ సంభవం కృష్ణ మవేక్షమాణో*
*బంధు ప్రసూతంచ బలం వ్రజేశః।*
*నిసర్గ మైత్ర్యా నియతైక భావౌ*
*న్యయుంక్త తౌ వత్సకులాని గోప్తుమ్॥* 65

**అర్థం:** వ్రజ+ఈశః= వ్రేతలకు నాయకుడైన నందుడు; కృష్ణం= కృష్ణుణ్ణి; స్వసంభవం= తన పుత్రునిగానూ; బలం, చ= బలరాముణ్ణి కూడా; బంధు ప్రసూతం= స్నేహితుడైన వసుదేవుని పుత్రునిగానూ; అవేక్ష మాణఃసన్= భావిస్తూ; నిసర్గ మైత్ర్యా= స్వభావ సిద్ధమైన స్నేహం చేత; నియత+ఏక, భావౌ= స్థిరమైన, ఒకే రూపమైన అభిప్రాయమును కలిగియున్న; తౌ= ఆ రామకృష్ణులను; వత్సకులాని= లేదూడల సమూహాన్ని; గోప్తుం= కాపాడడానికి; న్యయుంక్త= నియోగించెను.

**తా॥** గోకుల నాయకుడైన నందుడు శ్రీకృష్ణుణ్ణి తన కుమారునిగానూ, వసుదేవుని పుత్రినిగా బలరాముణ్ణి- వీరిద్దరు తనకు విధేయులుగా నున్నారని తలచినాడు. రామకృష్ణులిర్వురు స్వాభావికంగా స్నేహం, అన్యోన్య ప్రేమను కలవారు. వారిద్దరి అభిప్రాయాలు కూడా ఒక్క విధంగానే యుండడం వల్ల, నందుడు రామకృష్ణుల నిద్దరిని లేగదూడల మందను సంరక్షించడానికి నియమించాడు.

331. అనన్య తంత్రః స్వయమేవ దేవాన్
పద్మాసనాదీన్ ప్రజనయ్య రక్షన్।
స రక్షకః సీరభృతా సహాఽఽసీత్
నేతా గవాం నందనియోగవర్తీ॥ 66

**అర్థం:** అనన్య తంత్రః= స్వతంత్రుడై; స్వయం, ఏవ= స్వేచ్ఛగానే; పద్మ+ఆసన+ఆదీన్= కమలాసనుడైన బ్రహ్మ మొదలైన; దేవాన్= దేవతలను; ప్రజనయ్య= పుట్టించి; రక్షన్= కాపాడుతున్న; సః= ఆ; నేతా= నాయకుడు; నందనియోగ వర్తీ, సన్= నందుని యొక్క నియోగమందు ఉన్నవాడవుతూ; సీర భృతా, సహ= నాగలిని ధరించిన బలరామునితో కూడ; గవాం= గోవుల యొక్క; రక్షకః= పాలకుడుగా; ఆ సీత్= ఉండెను.

**తా॥** ఇతరుల అధీనంలో ఉండక తాను తన సంకల్ప మాత్రంచేత బ్రహ్మాది దేవతలను ఉత్పాదించినవాడు శ్రీకృష్ణుడు. అట్టి దేవతలకు నాథుడై వారిని రక్షించే శ్రీకృష్ణుడు నందునిచేత బాలుడని లేదూడలను కాపాడడానికి నియుక్తుడైనను బలరామునితో కూడి ఆదరాతిశయంతో గోవులకు కూడా రక్షకుడుగా ఉండెను.

332. కథం వ్రజే చ్ఛర్కరిలాన్ ప్రదేశాన్
పద్భ్యామసౌ పల్లవ కోమలాభ్యామ్।
ఇతి స్నుతస్తన్య రసా యశోదా
చింతార్ణవే న ప్లవ మన్వవిందత్॥ 67

**అర్థం:** స్నుతస్తన్యరసా= చేపిన చనుబాల రసం కలిగిన; యశోదా= యశోద; అసౌ= (కృష్ణుడు) కుమారుడు; పల్లవ కోమలాభ్యాం= చిగురుటాకుల వలె చాలా మృదువుగా నున్న; పద్భ్యాం= పాదాలతో; శర్కరిలాన్= మొరం కలిగిన; ప్రదేశాన్= భూములను; కథం= ఎట్లు; వ్రజేత్= నడిచిపోవును?; ఇతి= అని; చింతా+అర్ణవే= విచార సాగరమందు; ప్లవం= పడవను; న, అను+అవిందత్= పొందలేకపోయెను.

**తా॥** శ్రీకృష్ణుడు చిగుళ్ళలాగా మెత్తగా ఉన్న పాదాలు కలవాడు. మొరం, గులకరాళ్ళు కలిగియున్న అడవి భూములందు బహుదూరం సుకుమారమైన పదాలతో ఎలా నా కుమారుడు నడిచి పోగలుగుతాడో అని పాలిచ్చి పెంచిన తల్లి యశోద దుస్తరమైన విచార సాగరంలో మునిగింది.

'శర్కరా' శబ్దానికి మత్వర్థీయమైన 'ఇలచ్' ప్రత్యయం చేరడం వల్ల 'శర్కరిలః' అనే రూపమేర్పడినది. 'శౄ-హింసాయాం' అనే ధాతునిష్పన్నమైనది శర్కరా. పీడించు మొరపనేల అని అర్థం.

"స్త్రీ శర్కరా శర్కరిలః శార్కరః శర్కరావతి" (అమరం).

"కుడైయుంశెరుప్పుం కొడాదే దామోదర నైనాన్
ఉడైయుం కడియన ఊన్రు వెమ్ పరల్గళుడై।
కడియ వెమ్ కానిడై క్కాలడినోవక్కన్రిన్ పిన్
కొడియేన్ ఎన్పిళ్ళైయై ప్పోక్కినేన్ ఎల్లేపావమే॥" (పెరియా 3-2-9)

గొడుగు, చెప్పులు ఇవ్వకుండా, త్రాటితో కట్టివేసిన నేను నా బిడ్డను కరకుటెండలో కాలుతున్న గులకరాళ్ళు అరికాళ్ళలో గ్రుచ్చుకొంటుండగా పసుల వెంట పంపినానే. ఇదంతా నా పాపమే అని తల్లి యశోదగా భట్టనాథులు బాధపడినారు.

333. విహార విత్రాసిత దుష్ట సత్త్వౌ
మృగేంద్ర పోతావివ ధీర చేష్టౌ।
బభూవతుః శాశ్వతికేన భూమ్నా
బాలౌ యువానా వివ తౌ బలాఢ్యౌ॥ 68

**అర్థం:** మృగేంద్ర పోతౌ, ఇవ= సింహపు పిల్లలవలె; ధీరచేష్టౌ= ధైర్యంగల చేష్టలు కలవారైనట్టి; విహార విత్రాసిత దుష్టసత్త్వౌ= వేటరూపమైన విహారం చేత

భయపెట్టబడుతున్న దుష్టజంతువులు గలిగినట్టి; బాలౌ= బాలురైన; తౌ= ఆ, బలరామకృష్ణులు; శాశ్వతికేన= నిత్యసిద్ధమైన; భూమ్నా= మహిమచేత; యువానౌ, ఇవ= యువకులవలె; బలాఢ్యౌ= మిక్కిలి బలశాలురై; బభూవతుః= శోభించుచుండిరి.

**తా॥** బలరామకృష్ణులు చిన్న పిల్లలే యైననూ, సింహపు పిల్లలవలె ఉదారమైన చేష్టలు కలవారై యుండిరి. అడవులలో, వేటాడునట్టి విహారంచేత శార్దూలాది దుష్టజంతువులను భయపెట్టుతూ తరుముతున్నట్లు దుష్టమృగాలను కూడా లక్ష్యపెట్టక సంచరిస్తుండిరి. యథార్థంగా, శాశ్వతమైన పరబ్రహ్మ భావరూపమైన మహిమచేత, బాలురుగా కనబడుతున్నప్పటికీ, యువకుల లాగా బలాఢ్యులై ప్రకాశించారు.

*334. సిందూరితౌ వత్సపరాగ జాలైః*
*సితాసితౌ బాలగజా వివద్వౌ।*
*ఉదార లీలా వుపలక్ష్య గోప్యః*
*సర్వాస్తదాఽ నన్యవశా బభూవుః॥* 69

**అర్థం:** తదా= అప్పుడు; వత్సపరాగజాలైః= లేగదూడల ధూళిచేత; సిందూరితౌ= సిందూరం పూయబడినట్లున్న; సిత+అసితౌ= తెలుపు నలుపు వన్నెగల్గినట్టి; బాలగజౌ, ఇవ= పిల్ల యేనుగులవలెనున్నట్టి; ఉదారలీలౌ= రమణీయ చేష్టలు కలిగినట్టి; ద్వౌ= బలరామకృష్ణులను; ఉపలక్ష్య= ఉద్దేశించి, చూచి; సర్వాః, గోప్యః= గోపస్త్రీలందరు; అనన్యవశాః= ఆ ఇద్దరిమీదనే మనస్సు కలిగినవారుగా/ ఆడయేనుగులుగా; బభూవుః = వెలసినారు.

**తా॥** బలరాముడు ధవళవర్ణశోభితుడు. శ్రీకృష్ణుడు శ్యామవర్ణ దేహంగలవాడు. వీరిరువురు అడవినుంచి లేగదూడల వెనుక నడుస్తూ రావడం వల్ల లేగల గిట్టలనుంచి లేచిన ధూళి వారిదేహాలమీద పడి సిందూర వర్ణశోభితులుగా ఉన్నారు. బాలురైననూ వీరు కలభాల- పిల్లయేనుగులవలె కనబడుతున్నారు. చేష్టలేమో చూచేవారి మనస్సును చూరగొంటున్నాయి. గోపస్త్రీ

లందరు ఈ కరికల భాలను జూచి ఆకర్షితులై కరిణుల- ఆడయేనుగు గున్నల వలె ఆ ఇద్దరిపైననే తమ చిత్తం లగ్నమైనట్లుగా శోభించారు.

"వశో జనస్స్పృహాయత్తే ష్వా యత్తత్త్వ ప్రభుత్వయోః"- (వైజయంతి) "అనన్య వశాః"- అన్న పదానికి రెండు అర్థాలున్నాయి. "వశాః" అంటే కరిణులు- ఆడయేనుగులు. "వశాస్త్రీ కరిణీ" (అమరం).

*335. గోపాయమానే పురుషే పరస్మిన్*
*గోరూపతాం వేదగిరో భజంత్యః।*
*భవ్యై రసేవంత పదం త దీయం*
*స్తోభ ప్రతిచ్ఛంద నిభైః స్వశబ్దైః॥* 70

**అర్థం:** పరస్మిన్, పురుషే= పరమాత్మ; గోపాయమానేసతి= గోపాలకునివలె ఆచరిస్తుండగా; వేదగిరః= వేద వాక్కులు; గోరూపతాం= గోవుల ఆకారాన్ని; భజంత్యః సత్యః= ఆశ్రయిస్తున్నవవుతూ; స్తోభ ప్రతిచ్ఛంద నిభైః= సామవేద గానంవలె ప్రతిబింబిస్తున్నట్లున్నట్టి; భవ్యైః= శుభప్రదాలైన; స్వశబ్దైః= తమ హుంభారవాలచేత; తదీయం, పదం= ఆ గోపాలకుని పాదాలను; అసేవంత= సేవించాయి.

**తా॥** పరబ్రహ్మ ప్రళయకాలమందు వేదవాక్కులను రక్షించువాడై ఇప్పుడు ఆల కాపరి- గోపాలకుడుగా ఆవిర్భవించాడు. కాబట్టి, ఆ వేదవాక్కులు కూడా గోవుల రూపంగా అవతరించి తమ 'హుంభా' అనే శబ్దాలతో ఆ గోపాలకృష్ణుని చరణార విందాలను సేవిస్తూ ఆనందించాయి.

*"స్వర్గేషు పశు వా గ్వజ్ర దిఙ్నేత్ర ఘృణి భూతలే।*
*లక్ష్య దృష్ట్యా స్త్రియాం పుంసి గౌః॥"*- (అమరం).

'గో' శబ్దానికి ఉన్న నానార్థాలలో ఇక్కడ 'వాక్కులు, పశువులు' అనే అర్థద్వయం వర్తిస్తుంది.

'స్తోభం' అనే పదం సామగానమందు 'హో-ఉ, హో ఉ' వంటి వర్ణ స్వరాలను తెల్పుతుంది. సామగానలోలుడు భగవానుడు. ఆ గోవులు సామవేదగాన స్వర మాధుర్యాన్ని పోలినట్టి తమ 'హుంభా' అనే భవ్య ధ్వనులతో గోపాలకృష్ణుని పాద పద్మాలను సేవిస్తూ, తమను స్వామికి సమర్పించుకొన్నాయి.

*336. అబాలిశో బాలిశవత్ ప్రజానాం*
*ప్రఖ్యాపయన్ ఆత్మని పారతంత్ర్యమ్।*
*న్యదర్శయత్ విశ్వపతిః పశూనాం*
*బంధేచ మోక్షేచ నిజం ప్రభుత్వమ్॥* 71

**అర్థం:** అబాలిశః= బాలుడు కానట్టి ఆదిపురుషుడు; బాలిశవత్= బాలునివలె; ఆత్మని= తనయందు; పారతంత్ర్యం= పరతంత్రతను; ప్రజానాం= జనులకు; ప్రఖ్యాపయన్= వెల్లడిస్తూన్నవాడై; విశ్వపతిః= అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీకృష్ణుడు; పశూనాం= సంసారులకు; బంధే, చ= సంసార బంధమందును; మోక్షే, చ= బంధం నుంచి విడిపించడమందును; నిజం= తనదైన; ప్రభుత్వం= ప్రభుత్వాన్ని; న్యదర్శయత్= ఉదాహరణగా ప్రదర్శించెను.

**తా॥** శ్రీకృష్ణుడు బాలిశుడు కాడు. ఆయన పరమపురుషుడు. అయినా, బాలిశునిలాగా ప్రవర్తిస్తున్నాడు. నందునిచే నియుక్తుడై తన విధేయతను-పారతంత్ర్యాన్ని ప్రజలకు ప్రకటిస్తున్నాడు.

"బాలిశోబాల మూర్ఖయోః"- (వైజయంతి). తన మహిమ తెలియనట్టి జనులకు తాను ఒకరి అధీనంలో బాలునివలె ఉండి పశువులను కట్టివేయడమూ, కట్టు విప్పి విడుదల చేయడమూ అనే తన విధులను ఆచరిస్తూ తన మహిమను తెలియజేస్తున్నాడు.

"ఆత్మానః పశవః ప్రోక్తాః సర్వే సంసార వర్తినః"- సంసారమందున్న జీవాత్మలను పశువులంటారని పౌరాణిక వచనం.

"పశవః పాశితాః పూర్వం పరమేణ స్వలీలయా।
తేనైవ మోచనీయాస్తే, నాన్యైర్మోచయితుం క్షమాః॥"

పూర్వం జీవాత్మలు సర్వేశ్వరుని చేత లీలగా సంసారమందు బంధింపబడినాయి. ఆ సంసారులు బంధాలు ఆ సర్వ స్వామిచేతనే విడువదగినవి. సంసార బంధంనుంచి విడిపించడానికి ఇతరులెవ్వరూ సమర్థులు కారు. ఇది సత్యం. "పతిం విశ్వస్య" అనే శ్రుతి రీతిగా, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన నందగోప తనయుడు పశువులనబడే జీవాత్మల బంధంగానీ, మోక్షంగానీ తన అధీనమైయున్నవని తార్కాణంగా ఆచరించి చూపించాడు.

337. ఆత్మోపమర్దేఽ ప్యను మోదమానాత్
ఆత్మాధికం పాలయతశ్చ వత్సాన్।
గావస్తదానీ మనఘా మవిందన్
వాత్సల్య శిక్షామివ వాసుదేవాత్॥ 72

**అర్థం:** తదానీం= కృష్ణుడు పశుపాలనం చేయునప్పుడు; ఆత్మ+ఉపమర్దే+అపి= తన యొక్క పీడనమందు కూడా; అనుమోదమానాత్= పొగడబడడం వల్లను; ఆత్మ+అధికం= తనకంటే ఎక్కువగా; వత్సాన్= లేదూడలను; పాలయతః, చ= పోషిస్తున్నవాడవడం వల్లనూ; వాసుదేవాత్= కృష్ణునివల్ల; గావః= గోవులు; వాత్సల్య శిక్షాం= తమ లేగలయందు వాత్సల్యం (గుణం) యొక్క అభ్యాసాన్ని; అవిందన్, ఇవ= పొందినవి- అన్నట్లున్నవి.

**తా॥** శ్రీకృష్ణుడు పశువులను అడవిలోకి తోలుకొని పోయి మేపుతూ, కాపరియై ఉండగా, లేగదూడలు కృష్ణుని కాళ్ళల్లో మెదలడం, చుట్టుముట్టి చాలా దగ్గరగా జేరి కాళ్ళను నాకడం మొదలైన చేష్టలతో తనను ఎంత బాధపెట్టినప్పటికీ, కృష్ణుడు ఆ దూడలను ఆదరంగా నిమురుతు- "నీవు మంచి కోడె లేగవు" అని

కొనియాడేవాడు. కృష్ణునికి ఆకలి దప్పులైనప్పుడు తాను మొదట లేదూడలకు కడుపునిండా పచ్చిగడ్డిని మేపి, నీటిని త్రాగనిచ్చి, తర్వాత తన ఆహారంతో ఆకలి దీర్చుకొనేవాడు. ఇది నిత్యకృత్యం కదా!

ఆవులు తమ కన్నదూడలు కాళ్ళల్లో మెదలుతూ పాలు త్రాగడానికి పొదుగు దగ్గర మూతిపెట్టి మెదుపుతుంటే తల్లి ఆవు తన కాళ్ళతో తన్ని దూరంగా ఉండడం, తమ లేగల ఆకలి దప్పులను విచారించక తామే- గడ్డిమేయడం మొదలైన స్వార్థ కృత్యాలకే పాటుపడే గోవులు, తమకంటే అధికంగా తమ లేగలను లాలించి, పోషించే కృష్ణునివలె మేము నడుచుకోలేకపోతిమే అని తల్లడిల్లాయి. ఆ కారణం వల్ల గోవులు నిత్యం తమ బిడ్డల విషయమై ఉండవలసిన వాత్సల్య గుణాన్ని కృష్ణుని వద్ద శిక్షణను పొందినాయి. నేర్చుకొన్నాయి, అన్నట్లు ప్రవర్తిస్తున్నాయి.

స్వరూపోత్ప్రేక్షాలంకారం. కృష్ణుని వాత్సల్యమే అధికమని వ్యక్తమైనది. స్వభావోక్త్యలంకారం. సంకరాలంకారం.

*338.* యోఽసా వనంత ప్రముఖై రనంతైః
నిర్విశ్యతే నిత్య మనంత భూమా।
వైమానికానాం ప్రథమః సదేవో
వత్సైరలేలిహ్యత వత్సలాత్మా॥ 73

**అర్థం:** అనంత భూమా= అవధిలేని మహిమగలవాడు; యః= ఎవడో; అసౌ= (అట్టి) ఇతడు; అనంత ప్రముఖైః= అనంత గరుడ విష్వక్ సేనాదులైన; అనంతైః= అసంఖ్యేయులైన నిత్యసూరులచేత; ముక్తాత్మలచేతను; నిత్యం= ఎల్లప్పుడు; నిర్విశ్యతే= సాక్షాత్తుగా అనుభవింపబడుతుంటాడు; వైమానికానాం= విమానాలచేత సంచరించే దేవతలలో; ప్రథమః= శ్రేష్ఠుడైన/ మొదటివాడైన; సః= ఆ ప్రసిద్ధుడైన; వత్సల+ఆత్మా= లేదూడల యందు మనస్సు గల్గినట్టి; దేవః= దేవుడైన శ్రీకృష్ణుడు; వత్సైః= లేదూడల చేత; అలేలిహ్యత= నాకబడెను.

**తా॥** ఆహా! ఎంత ఆశ్చర్యమో చూడండి. అనంత గరుడ విష్వక్సేనులు మొదలైన ఎన్నలేని నిత్యముక్తాత్మలచేత అంతంలేని వైభవంగల (ఎవరో) ఒక్కడు నిత్యం అనుభవింపబడుతున్నాడు.

"తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః"- పరమ పదనాథుడైన శ్రీమన్నారాయణుణ్ణి నిత్యసూరులు ఎల్లప్పుడు సేవిస్తుంటారు- అని శ్రుతి పల్కుతున్నది. విమానయానులైన దేవతలలో ఆద్యుడూ, దేవదేవుడూ అయిన ఆ కృష్ణభగవానుడు వాత్సల్యానికి వశపడినాడు. "విష్ణోః పదే పరమేమధ్వ ఉత్సః"- విష్ణు భగవానుని పాదాలయందు తేనెసోనలు జాలువారుతుంటాయి- అన్నది వేదవాణి. లేగదూడలు గోపాలకృష్ణుని చరణారవింద మకరందాన్ని నేరుగా తమ జిహ్వేంద్రియం చేత మళ్ళీ మళ్ళీ ఆస్వాదించాయి. భగవంతుని క్రీడ విచిత్రమైనది కదా!

339. మహీయసామండితపాణి పద్మం
దధ్యన్న సారేణ మధుప్లుతేన।
దృష్ట్వా ననందుః క్షుధయాఽ న్వితా స్తం
వత్సాను చర్యాసు వయస్య గోపాః॥ 74

**అర్థం:** వత్స+అనుచర్యాసు= లేగదూడల వెంట పోయినవారిలో; క్షుధయా= ఆకలితో; అన్వితాః= కూడినట్టి; వయస్య గోపాః= సమాన వయస్సుగల గోపకుమారులు; మహీయసా= శ్రేష్ఠమైన; మధుప్లుతేన= తేనె కలిపిన; దధి+అన్నసారేణ= మంచి పెరుగు కల్పిన అన్నం చేత; మండిత పాణిపద్మం= అలంకరింపబడిన కేల్దామర కలిగినట్టి; తం= ఆ కృష్ణుణ్ణి; దృష్ట్వా= చూచి; ననందుః = ఆనందించిరి.

**తా॥** గోపకుమారులందరు కలిసి లేదూడలను అడవిలో మేపడానికి వాటి వెంట వెళ్ళినారు. అడవిలో తేనెతెట్టలు సమృద్ధిగా లభించడం వల్ల, మంచి

పుట్టతేనెతో కలిపిన పెరుగన్నం నంద తనయుడు తన వెంట తెచ్చుకొన్నాడు. ఆకలివేసిన సమయంలో కృష్ణుడు చద్దిమూటను విప్పి రుచిగల దధ్యన్నపు ముద్దను కేల్దమ్మియందు పట్టుకోగా గోపకుమారులందరు చూచి, ఆకలితోనున్న వారు కాబట్టి, సంతోషంతో కృష్ణుని దగ్గరకు వచ్చారు. తన వయస్యులందరికి పెరుగన్నం పెట్టి, ఆకలి దీర్చి, కృష్ణుడు వారిని సంతృప్తి పరచినాడని తాత్పర్యం.

వయసా తుల్యాః= వయస్యాః. వయస్సుచే సమానుడైన చెలికాడు అని అర్థం. "స్నిగ్ధో వయస్యః సవయాః"- (అమరం). ఇట పోతన్న పద్యం స్మరణీయం.

*"సంగడీల నడుమ చక్కన గూర్చుండి*
*నర్మభాషణముల నగవు నెరపి।*
*యాగభోక్త కృష్ణుడమరులు వెలుగంద*
*శైశవంబు మెఱసి చల్ది గుడిచె॥"* (భాగ. దశ. పూ. 499)

*340.* *స్వాదూని వన్యాని ఫలాని తైస్తైః*
*స్నిగ్ధై రుపానీయ నిదర్శితాని।*
*రామాయ పూర్వం ప్రతిపాద్య శేషైః*
*స పిప్రియే సాదర భుజ్య మానైః॥ 75*

**అర్థం:** సః= కృష్ణుడు; తైః, తైః= ఆయా; స్నిగ్ధైః= స్నేహితులచేత; ఉపానీయ= తెచ్చి; నిదర్శితాని= చూపబడినట్టి; వన్యాని= వనమందు పుట్టిన; స్వాదూని= రుచిగల; ఫలాని= ఫలాలను; పూర్వం= మొదట; రామాయ= బలరామునికోసం; ప్రతిపాద్య= సమర్పించి; సాదర భుజ్యమానైః= ఆదరంతో భుజింపబడగా; శేషైః= మిగిలిన ఫలాలచేత; పిప్రియే= తోటివారితో కూడి భుజించి ప్రీతిని పొందెను.

**తా॥** కృష్ణునికోసం అతని స్నేహితులైన గోపకుమారులు, వేరే కొందరు కిరాతులు, బోయలు, వనమందు లభించిన రుచిగల ఫలాలను తెచ్చి 'ఇవి

మధురమైన ఫలాలు' అని చూపించారు. కృష్ణుడు ఆ ఫలాలను తీసుకొని మొదట గౌరవంగా అన్నగారైన బలరామునికి ఫలాలను సమర్పించాడు. మిగిలిన ఫలాలను బలరాముని శేషమనే ప్రీతిచేత తోటి వయస్యులతో పాటు కృష్ణుడు కూడా భుజించి సంతోషాన్ని పొందినాడు.

*341. తాభ్యాం తదా నందనిదేశితాభ్యాం*
*రక్షావతీం రామజనార్దనాభ్యామ్।*
*విశేష భోగ్యామ భజత్ విభూతిం*
*బృందావనం వ్యాపృతధేను బృందమ్॥* 76

**అర్థం:** తదా= అప్పుడు; వ్యాపృత ధేను బృందం= సంచరిస్తున్న ధేను సమూహంగల; బృందావనం= బృందావనం; నందనిదేశితాభ్యాం= నందునిచే నియుక్తులైనట్టి; తాభ్యాం= ఆ; రామ జనార్దనాభ్యాం= బలరామకృష్ణుల చేత; రక్షావతీం= రక్షణ కలదైనట్టి; విశేష భోగ్యాం= అధికంగా; ఉపభోగ్యమైన; విభూతిం= వైభవాన్ని; అభజత్= పొందెను.

**తా॥** నందుని యాజ్ఞా ప్రకారం ప్రవర్తిస్తున్న బలరామకృష్ణులిద్దరి చేతనే వాతోష్ణ, మృగ, పక్షి, దుష్ట సత్త్వాలనుంచి రక్షింపబడుతున్నది. కాబట్టి ధేనువులు 'అక్కడక్కడ ఎక్కడైనా సంచరించే బృందావనం, అందరికి అనుభవింపయోగ్యమైన పరిమళభరిత పుష్పాలచేతను, మధురమైన ఫలాలచేతనూ సమృద్ధిని పొంది, అధిక వైభవంతో రాజిలుతున్నది.

*342. అగాధ కాసారమహీన శష్ప*
*మతీక్ష్ణ సూర్యం తద చండవాతమ్।*
*ప్రచ్ఛాయనిద్రాయిత ధేనువత్సం*
*ప్రౌఢే నిదాఘేఽపి బభూవ భోగ్యమ్॥* 77

**అర్థం:** అగాధకాసారం= లోతుగా నీళ్లున్న సరస్సులు కలిగినట్టి; అహీనశష్పం= ఎక్కువ లేతగడ్డి గలిగినట్టి; అతీక్ష్ణ సూర్యం= ఎక్కువ వేడిమి లేనట్టి; అచండవాతం= పెనుగాలులు లేనట్టి; ప్రచ్ఛాయ నిద్రాయిత ధేనువత్సం= దట్టనైన నీడ గల చెట్ల క్రింద నిద్రించే ఆవులు, లేగలు కలిగినట్టి; తత్= ఆ బృందావనం; ప్రౌఢే= కఠోరమైన; నిదాఘే, అపి= గ్రీష్మకాలమందు కూడా; భోగ్యం= అనుభవయోగ్యంగా; బభూవ= ఉండెను.

**తా॥** ఆ బృందావనం, ప్రచండమార్తాండుడు ఎక్కువగా తపింపజేసే గ్రీష్మర్తువునందు కూడా ప్రాణాలకు సుఖాన్ని అనుభవింపజేయునట్లున్నది. ఆ వనమందలి సరస్సులు ఎండిపోకుండా అగాధమైన జలం కలిగియున్నాయి. ఎక్కడ జూచినా, నవనవలాడే పచ్చి గడ్డిగల నేలతో నిగనిగలాడుతున్నది.

"గ్రీష్మే చండానిలోఽ నిలః"- (వైజయంతి). నిండు వేసవిలో పెనుగాలులు వీచుతుంటాయి. కాని బృందావనమందు మాత్రం జంఝూమారుతాల జాడ, పొడ కూడా లేదు. సమశీతోష్ణ ప్రదేశంగా భాసిస్తున్నది. కాబట్టి, మఱ్ఱి, రావి, జువ్వి చెట్ల యొక్క సాంద్రత చ్ఛాయలో పాడియావులు, తమ లేగదూడలతో పాటు నెమరు వేస్తూ, హాయిగా నిద్రిస్తుంటాయి. సకల భూతాలకు సంక్షేమస్థమై ఆనందావహంగా శోభిస్తున్నది బృందావనం.

*343. నవ్యాధి పీడా నచదైత్య శంకా*
*నాసీత్ గవాం వ్యాఘ్ర భయంచ తస్మిన్।*
*స్వ బాహు కల్పేన బలేన సార్ధం*
*నారాయణే రక్షతి నందలక్ష్మీమ్॥* 78

**అర్థం:** తస్మిన్= ఆ బృందావనమందు; నారాయణే= శ్రీకృష్ణుడు; స్వబాహు కల్పేన= తన బాహువులతో సమానుడైన; బలేన= బలరామునితో; సార్థం= కూడా; నంద లక్ష్మీం= నందుని సంపదను; రక్షతి (సతి)= రక్షిస్తుండగా; గవాం= గోవులకు;

వ్యాధిపీడా= రోగాల బాధ; న, ఆసీత్= లేకుండెను; చ= మరియు; దైత్య శంకా= రాక్షసులచే (గోవులు అపహరింపబడే) అనుమానం; న= లేదు; వ్యాఘ్ర భయంచ= పులుల వలని భయమూ; న, ఆసీత్= లేకుండెను.

**తా॥** నారాయణుడు (కృష్ణుడు) తన బాహువులవంటి - తనకు సహకరించే బలదేవునితో కూడి నందగోవుని ఐశ్వర్యాన్ని (పశుసంపదను) రక్షిస్తున్నప్పుడు గోవులకు రోగాల బాధలేదు. రాక్షసులు గోవులను అపహరిస్తారనే అనుమానమూ లేకుండెను. పశువులను భక్షించునట్టి శార్దూలాది క్రూర మృగాల వలన భయం బృందావనమందు గోవులకు లేశమాత్రమైనా లేకుండెను.

స్వబాహుకల్పేన బలేన సార్థం= తనకు కుడి భుజం వంటి బలరామునితో కూడి అని అర్థం.

"రామస్య దక్షిణో బాహుః"- రామచంద్రునికి కుడి భుజమైన వాడు- అని లక్ష్మణుడు పేర్కొనబడినాడు కదా!

*344. నిరీతయస్తే నిరపాయవాంఛాః*
*నిః శ్రేయ సాదప్యధిక ప్రమోదాః।*
*ప్రపేదిరేఽ పూర్వయుగానుభూతిం*
*గోపాస్తదా గోప్తరి వాసుదేవే॥* 79

**అర్థం:** తదా= అప్పుడు; వాసుదేవే= కృష్ణుడు; గోప్తరి (సతి)= కాపాడువాడై యుండగా; నిర్+ఈతయః= ఈతి బాధలు లేనట్టి; నిర్+అపాయ వాంఛాః= అపాయకరమైన కోరికలు లేనట్టివారు; అత ఏవ= కావుననే; నిః శ్రేయసాత్, అపి= మోక్షం కంటెను; అధిక ప్రమోదాః= ఎక్కువ ఆనందం కలిగియున్నట్టి; గోపాః= గోపకులు; అపూర్వయుగ+అనుభూతిం= నాలుగు యుగాలలోను లేనట్టి ఒక విలక్షణమైన యుగమందలి అనుభవాన్ని; ప్రపేదిరే= పొందినారు.

**తా॥** శ్రీకృష్ణుడు రక్షకుడైయున్నప్పుడు గోపకులకు ఈతిబాధలు లేవు.

*"అతివృష్టి రనావృష్టి ర్మూషికాః శలభాః శుకాః।*
*అత్యాసన్నాశ్చరాజానః షడైతాః ఈ తయః స్మృతాః॥"*

వానలు ఎక్కువ కురియడం, వానలు కురియకపోవడం, ఎలుకలు, మిడుతలు; చిలుకలు, రాజులు చాలా దగ్గరగా ఉండడం అనేవి ఈతిబాధలు ఆరు విధాలు. కరువు కాటకాలు ఏర్పడడం, పైరు పంటలు చెడిపోవడం, రాజుల సాన్నిహిత్యం– వీటివల్ల ప్రజలు సుఖంగా జీవించలేరు కదా! గోపకులకు ఆపదలను కలిగించే ఆశలే లేకుండెను. వారికోరికలన్నీ సఫలమయ్యేవి. అనిష్టం నివృత్తి అయ్యి, ఇష్టమైనదే ప్రాప్తమవుతుండెను. కాబట్టి, గోపకులకు పరమ పురుషార్థమైన మోక్షానందం కన్న మించిన ఆనందమే కలుగుతుండేది. వేయి మాటలెందుకు, నాలుగు యుగాలలోనూ చేరనట్టి ఒక అలౌకిక యుగానుభవాన్ని పుష్కలంగా పొందినారు. ఇది సర్వరక్షకుడైన శ్రీకృష్ణుని మహిమయే.

*345.* వత్సానుచర్యా చతురస్య కాలే
*వంశ స్వనైః కర్ణ (శ్రోత్ర) సుధాం విధాతుః।*
*గతాగత ప్రాణ దశా మవిందన్*
*గోపీజనాస్తస్య గతాగతేషు॥* 80

**అర్థం:** వత్స+అనుచర్యా చతురస్య= లేదూడల వెంట పోవడమందు సమర్థుడైనట్టి; కాలే= సముచిత సమయంలో; వంశ స్వనైః= వేణువు యొక్క నాదాల చేత; కర్ణసుధాం= వీనుల విందును; విధాతుః= చేయునట్టి; తస్య= ఆ కృష్ణుని యొక్క గత+ఆగతేషు= (అడవికి) పోవడమందు, రావడమందు; గోపీజనాః= గోపాంగనలు; గత+ఆగత, ప్రాణదశాం= ప్రాణం పోయినట్టి, ప్రాణం వచ్చినట్టి, అవస్థను; అవిందన్= పొందిరి.

**తా॥** లేదూడలను మేపడానికి వాటి వెనుక పోయే చతురుడైన వాడును, తగిన సమయంలో వివిధోపాయాలను సూచించే రీతిగా వేణువును ఊదుతూ, కర్ణామృతమైన- చెవులకు చవులూరించే నాదాలను కల్పించేవాడు శ్రీకృష్ణుడు. కాబట్టి, కృష్ణుడు అడవికి పోయినప్పుడు వ్రజాంగనలు తమ ప్రాణంపోయిన దశను, అడవినుంచి వచ్చినప్పుడు ప్రాణం వచ్చిన దశను పొందినారు. కృష్ణుడే తమ ప్రాణమని భావించేవారు గొల్ల ముద్దియలు (గోభిః, కృష్ణ రసాయనం పిబంతీతి= గోప్యః- ఇంద్రియాలచే కృష్ణరస ద్రవ్యాన్ని పానం చేసేవారు గోపికలు- అని వ్యుత్పత్త్యర్థం). కాబట్టి, గోపికలు కృష్ణ విరహాన్ని ఒక్క క్షణమైనా సహించ జాలకుండిరని భావం.

*346.* అఘ్రాత వర్త్మాన మరణ్య భాగే
ష్వారణ్యకై రాశ్రిత ధేను భావైః।
కేనాపి తస్యాపహృతం కిరీటం
ప్రత్యాహరన్ ప్రైక్షత పత్రినాథః॥ 81

**అర్థం:** అరణ్య భాగేషు= అరణ్య ప్రదేశాలయందు; ఆశ్రిత ధేను భావైః= ఆశ్రయించిన ధేను భావం కలిగినట్టి; ఆరణ్యకైః= అడవులలో అధ్యయనం చేయబడే వేద భాగాలైన ఉపనిషత్తులచేత; అఘ్రాత వర్త్మానం= వాసన చూడబడిన కృష్ణుణ్ణి; తస్య= ఆ కృష్ణభగవానుని యొక్క; కేన, అపి= ఎవడో ఒక్కని చేతనో; అపహృతం= అపహరింపబడిన; కిరీటం= మకుటాన్ని; ప్రత్యాహరన్= మళ్ళీ తెస్తున్న; పత్రినాథః= గరుత్మంతుడు; ప్ర+ఐక్షత= బాగా చూచినాడు.

**తా॥** అడవిలోనే అధ్యయనం చేయబడే వేదభాగాలు ఆరణ్యకాలు, వేదాంతాలు- అనబడుతాయి. అట్టి ఆరణ్యకాలు గోరూపాలను ధరించి అడవిలో పలుదిశలలో సంచరిస్తున్నాయి. అట్టి గోవులు, కృష్ణుడు అడవిలో ఏయే మార్గాలలో సంచరిస్తున్నాడో ఆ మార్గాలను మూర్కొంటున్నాయి- ఆఘ్రాణిస్తున్నాయి. "గావః

*పశ్యంతి గంధేన*"- పశువులు వాసన జూచి వస్తువును పసిగట్టడం వాటి స్వభావం కదా!

ఆరణ్యకాలు అంటే వేదాంతాలే- ఉపనిషత్తులే గోవులు కాబట్టి "సర్వోపనిషదోగావః". వేదాంతాలచే ప్రతిపాద్యుడు భగవానుడు. అరణ్య భాగాలలో సంచరించే శ్రీకృష్ణుణ్ణి 'పరబ్రహ్మ' యనే గౌరవంతో, ఆరణ్యకాలు పశువులై నందువల్ల కృష్ణుడు నడచిన మార్గాన్ని- నేలను వాసన జూడడం నైసర్గికం.

ఒకప్పుడు ఎవడో ఒక రాక్షసుడు (కేనాపి) భగవంతుని కిరీటాన్ని అపహరించాడు (అతడెవడనే విషయం తర్వాతి శ్లోకంలో విశదమవుతుంది). ఆ భగవత్కిరీటాన్ని పక్షిరాజైన గరుత్మంతుడు మళ్ళీ తెస్తూ, ఆరణ్యకాలనబడే వేద భాగాలు పశువులయ్యి కృష్ణుడు సంచరించిన మార్గాన్ని- నేలను- ఆఘ్రాణించే దృశ్యాన్ని (ఆకాశం నుంచి) చూచాడు.

"*సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తో శిరోగాయత్రం చక్షు స్తోమ ఆత్మాసామతేతనూః*"- అని శ్రుతిపల్కినట్లు గరుత్మంతుడు వేదమూర్తి కాబట్టి ఆరణ్యక దృశ్యాన్ని కనిపెట్టగలిగినాడు. శ్రీకృష్ణుణ్ణి బాగా చూచాడు (కోరికను నెరవేర్చుకొనే పక్షి చూపు చాలా చురుకైనది (Bird's eye view). వేదమూర్తియైన విహగేశ్వరుడు వేద వేద్యుడైన కృష్ణుణ్ణి సంవీక్షించాడు.

*347. దేవస్య దుగ్ధోదశయస్య దైత్యాత్*
*వైరోచనా ద్వ్యాళభుజోపనీతః।*
*కృష్ణస్య మౌళౌ కృత బర్హచూడే*
*న్యస్తః కిరీటో నిబిడీబభూవ॥* 82

**అర్థం:** వైరోచనాత్= విరోచనుని పుత్రుడైన; దైత్యాత్= బలియనే రాక్షసుని నుంచి; వ్యాళభుజా= సర్పాలను భుజించే గరుడుని చేత; ఉపనీతః= తేబడిన;

దుగ్ధ+ఉద, శయస్య= పాలకడలి యందు పవళించిన; దేవస్య= పరవాసుదేవుని యొక్క; కిరీటః= మకుటం; కృతబర్హచూడే= అలంకరింపబడిన మయూర పింఛ భూషణం కలిగినట్టి; కృష్ణస్య= శ్రీకృష్ణుని యొక్క; మౌళౌ= శిరస్సునందు; న్యస్తః= సమర్పించబడినదై; నిబిడీ బభూవ= దట్టంగా సరిపోయి యుండెను.

**తా॥** క్షీరాబ్ధి శాయియైన పరవాసుదేవుని కిరీటాన్ని విరోచనుని కుమారుడైన బలి (చక్రవర్తి) యనే రాక్షసుడు అపహరించాడు. అపహర్త ఎవడో తెలుసుకోవ డానికే చాలాకాలం గడిచింది. తుదకు పాతాళమందున్న బలి యనే రాక్షసుణ్ణి నాగాంతకుడైన గరుత్మంతుడు నిర్జించి, పరమపురుషుని కిరీటాన్ని తీసుకొని వస్తూ, దారిలో కృష్ణుని అడుగు జాడలున్న నేలను మూర్కొంటున్న గోరూపధారులైన ఆరణ్యకాలను, గోపాల చక్రవర్తియైన శ్రీకృష్ణ భగవానుని వీక్షించాడు.

చిరకాలం నుంచి అన్వేషిస్తున్న ఖగేశ్వరుడు 'అహో!' పరమ పురుషుని లీల అద్భుతమని గ్రహించి, క్షీరాబ్ధిశాయి యొక్క గొప్ప కిరీటాన్ని ఇక్కడ శ్రీకృష్ణుని శిరస్సునందు అలంకరించాడు. అంత పెద్ద కిరీటం బాలగోపాలకృష్ణుని శిరస్సున సమర్పించగా, సముచితంగా సరిపోయింది.

*నిబిడీ బభూవ:*- ఈ క్రియాపదం 'అభూత తద్భావే' అనే సూత్రం చేత 'చ్వి' ప్రత్యయంతో ఏర్పడింది. నిబిడంగా లేనిదైననూ, ఇతడు వైకుంఠుడే అయినందున ఆ కిరీటం శ్రీకృష్ణుని మౌళికి సముచితాకారం కలదై నిబిడంగా సరిపోయింది అనే భావాన్ని తెల్పుతున్న క్రియా పదమిది.

*కృతబర్హచూడే మౌళౌ:*- శ్రీకృష్ణుని శిరస్సున మయూర పింఛాలు భూషణంగా ఉన్నాయి. ఈ పదం కృష్ణుడు జారుడు కాదు, జగన్నాథుడని వివరిస్తుంది. నెమలి జంటకు శారీరక సంపర్కం ఉండదు. మగనెమలి తొలకరి కారుమేఘాలు క్రమ్మగా, పురివిప్పి ముగ్ధ మనోహరంగా నాట్యమాడుతుంది. ఆడ నెమలి ఆ నాట్యాన్ని చూస్తూ ఆనందిస్తూంటుంది. ఆ సమయంలో నాట్యమాడుతున్న మగ నెమలి కన్నుల్లో నుంచి కారే ఆనంద బాష్పబిందువులను ఎదుట నున్న ఆడనెమలి

పానం చేస్తుంది. తత్ఫలితంగా ఆడ నెమలి కొన్ని రోజులకు గ్రుడ్లుపెట్టి, పొదిగి పిల్లలను చేస్తుంది. ఈ విధంగా పవిత్రమైన మయూర పక్షిజాతి రమణీయంగా వృద్ధి జెందుతుంది. భగవానుడు కృష్ణావతారంలో మాత్రమే తలపైన శిఖిపింఛాన్ని ధరించి, తన యోగీశ్వరత్వాన్ని వ్యక్త పరచాడు.

పరవాసుదేవుని పెద్ద కిరీటం, కృష్ణుని తలపైన శిఖిపింఛం కిరీటం లోపల ఉండడంవల్ల నిబిడమై సరిగా అమరింది- అని భావించరాదు. ముఖమండలం మీద కిరీటానికి ముంగురులకు మధ్యనున్న నెమలిపింఛం సహజ భూషణంగా రామణీయకతను అతిశయింపజేస్తున్నది. భగవత్కిరీటం సకలదేవతలు కృష్ణణ్ణి బృందావనమందు సేవించి సర్వాభరణాలను సమర్పించి సంభావించడానికి యోగ్యంగా విభ్రాజితమైనది. 'కిరీట' శబ్దం పుంలింగంలోనూ, నపుంసక లింగంలోనూ ప్రయోగింపబడును.

"కిరీటం పుంనపుంసకమ్".- అనే అనుశాసనం వల్ల పుంలింగమందు ప్రయుక్తమైనది. ఆ పరవాసుదేవుడే ఈ వాసుదేవుడు- అనే వైనాన్ని వేదాత్ముడైన వైనతేయుడు వెల్లడించాడు.

*348.* సమాహితై రగ్నిషు యాయజూకై
రాధీయమానాని హవీంషి భోక్తా।
భక్త్యై కలభ్యో భగవాన్ కదాచిత్
పత్నీభి రానీత మభుంక్త భోజ్యమ్॥ 83

**అర్థం:** సమాహితైః= ఏకాగ్ర చిత్తులైన; యాయజూకైః= యజ్ఞశీలురచేత; అగ్నిషు= ఆహవనీయాది త్రేతాగ్నులయందు; ఆధీయ మానాని= వ్రేల్చబడుతున్న; హవీంషి= హవిస్సులను; భోక్తా= భోజన శీలవంతుడైన; భక్త+ఏక, లభ్యః= భక్తులకు మాత్రం లభింపదగినవాడైన; భగవాన్= పూజ్యుడైన కృష్ణుడు; కదాచిత్= ఒకప్పుడు; పత్నీభిః= యజ్ఞంచేస్తున్న ఋషుల భార్యలచేత; ఆనీతం= తేబడిన; భోజ్యం= ఆహారాన్ని; అభుంక్త= భుజించెను.

**తా॥** అరణ్యంలో గోపకులకు ఆకలివేసింది. వారి ఆకలిని దీర్చడానికి సమీపంలోనే సమాహిత చిత్తులై బహుశ్రద్ధతో యాగం చేస్తున్న ఋషుల దగ్గఱికి పోయి 'అన్నదానం చేయండి' అని అడిగి పొందండి– అని కృష్ణుడు గోపకులను పంపించాడు.

కృష్ణుని ప్రేరణచేత యజ్ఞవాటికకు పోయి అడిగిన గోపకులను ఋషులు 'గొల్లలు అపాత్రులు కాబట్టి అన్నదానం మీకు చేయలేము– మొల గడిగితే తల గడుగరు, తల గడిగితే మొల గడుగని ఆచార భ్రష్టులైన మీకు అన్నం పెట్టము'– అని కసరి పంపించారు. ఆ వార్తను గోపకుల ద్వారా విన్న కృష్ణుడు 'ఆ ఋషుల భార్యలను అడగండి' అని మళ్ళీ గోపకులను పంపించాడు. ఆ గోపకులు కృష్ణుడు చెప్పిన రీతిగా పోయి ప్రార్థించిన వెంటనే ఆ ఋషుల పత్నులు "భాగవతార్చనం *భగవతః పూజావిధేరుత్తమం*" అన్నట్లు 'భగవంతుణ్ణి, భగవంతుని భక్తులను ఆరాధించడం కంటే మించిన యజ్ఞం వేరే ఏముంటుంది?' అని సంతోషాతిశయంతో షడ్రసోపేతమైన భక్ష్య భోజ్య చోష్య లేహ్యాలు అనబడే నాలుగు రకాల వంటకాలను సిద్ధం చేసి తెచ్చి సమర్పించారు. యజ్ఞంలో విధిపూర్వకంగా అగ్నులయందు సమర్పించిన చరుపురోడాశాది హవిస్సును 'యజ్ఞ భోక్తాచ ప్రభురేవ,' అన్నట్లు, భుజించేవాడు కృష్ణభగవానుడు. యాయజూకులే అగ్నులయందు హవిస్సులను సమర్పించాలి– అని విధి. "న పత్నీ జుహుయాత్"– యజ్ఞశీలుని భార్య హోమం చేయరాదు' అని శాస్త్రం ప్రతిషేధించింది. అయినప్పటికీ, అత్యంత భక్తితో ఋషిపత్నులు తెచ్చి సమర్పించిన మృష్టాన్నాన్ని శ్రీకృష్ణుడు భుజించాడు. తోటి గోపకులకు కూడా పెట్టి వారి ఆకలిని దీర్చాడు. హవిస్సును భుజించినట్లే ఋషపత్నులు తెచ్చిన ఆహారాన్ని స్వీకరించిన కృష్ణభగవానుడు సంతోషించి ఋషిపత్నులకు యజ్ఞం చేసిన ఫలం కన్న మిన్నయైన ఫలాన్ని ప్రసాదించాడు. యాయజూకులైన ఋషులు సిగ్గుతో తలలు వంచుకున్నారు. ఇట్లు భాగవతమందలి కథను సంగ్రహించిన శ్లోకమిది.

*349. కరాంబుజ స్పర్శ నిమీలి తాక్షాన్*
*ఆమర్శనై రాకలితార్ధ నిద్రాన్।*
*వత్సాన్ అనన్యాభిముఖాన్ సమేనే*
*ప్రహ్వీకృతీన్ భక్తి భరావనమ్రాన్॥ 84*

**అర్థం:** సః= ఆ శ్రీకృష్ణుడు; కర+అంబుజ స్పర్శేన= కేల్దామరతో స్పృశించడం చేత; నిమీలిత+అక్షాన్= మూసుకోబడిన కన్నులు కలిగినట్టి; ఆమర్శనైః= చేతితో దేహాన్ని పూర్తిగా నిమురడం చేత, ఆకలిత+అర్ధ నిద్రాన్= పొందబడిన సగం నిద్ర కలిగినట్టి; అనన్య+అభిముఖాన్= తనవైపు ముఖాలను పెట్టినట్టి; ప్రహ్వా+ఆకృతిన్= వంచిన ఆకారాలను కలిగినట్టి; వత్సాన్= లేదూడలను; భక్తి భర+అవ నమ్రాన్= భక్త్యతిశయంచేత వంగియున్నట్లుగా; మేనే= తలచెను.

**తా॥** స్పష్టం.

**సుబోధినీ వ్యాఖ్య:-** కృష్ణుని కరస్పర్శచేత దూడలు సుఖనిద్రను అనుభవించాయి.

శ్రీకృష్ణుడు లేదూడలను తన కరకమలంచేత స్పృశించాడు. వెంటనే అవి సుఖంగా తమ కన్నులను మూసుకొన్నాయి. ఆయన సుకుమారమైన కేల్దామర చేత దూడల శరీరాలను సమగ్రంగా పునుకడంతోనే అవి కృష్ణునికి అభిముఖంగా వంగి సగం నిద్రపోతున్న సుఖాన్ని పొందినాయి. శ్రీకృష్ణుడు, అవి తన పట్ల భక్తి భరంచేత- ప్రేమాతిశయంచేత వినయంగా నమస్కరిస్తున్నట్లు భావించాడు. "అప్యథాతిశయోభరః"- (అమరం). 'భర' శబ్దానికి ఆధిక్యం, అతిశయం అని అర్థం. దూడల స్వభావాన్నిబట్టి 'స్వభావోక్త్యలంకారం. కృష్ణుడు అనుకొన్న రీతి 'ఉత్ప్రేక్షాలంకారం'.

350. రోమంథ ఫేనాంచిత సృక్వి భాగై
రస్పందనై రర్ధ నిమీలితాక్షైః
అనాదృత స్తన్య రసై ర్ముకుందః
కందూయితై ర్నిర్వృతి మాప వత్సైః॥ 85

**అర్థం:** ముకుందః= శ్రీకృష్ణుడు; రోమంథ ఫేన+అంచిత సృక్వి భాగైః= నెమరు వేయడం చేత నురుగుతో పూయబడిన పెదవుల చివరలు కలిగినట్టి; కందూయితైః = గోకబడినవి కాబట్టి; అస్పందనైః= కదలక ఉన్నట్టి; అర్ధనిమీలిత+అక్షైః= సగం మూసుకొన్న కన్నులు కలిగినట్టి; అనాదృత స్తన్యరసైః= ఆదరింపబడని పాల రుచిగల; వత్సైః= లేదూడలచేత; నిర్వృతిం= ఆనందాన్ని, సుఖాన్ని; ఆప= పొందినాడు.

**తా॥** శ్రీకృష్ణుడు లేదూడలయందు అధిక వాత్సల్యం కలవాడని వర్ణితం.

లేదూడలు నెమరు వేస్తున్నాయి. పశువులు గడ్డిని గబగబా మేసి, తర్వాత ఒక్కచోట విశ్రాంతిని పొందుతున్నప్పుడు మేసిన ఆహారాన్ని, ఒక్కొక్క కబళాన్ని-కడిని నోటిలోనికి తెచ్చుకొని నెమ్మదిగా నములుతుంటాయి. ఆ సమయాన వాటి పెదవుల చివరలో నురుగు బయటకు వస్తుంది. వాటికి అది ఒక సుఖానుభవం. "ప్రాంతావోష్ఠస్య సృక్విణీ" (అమరం). పెదవికిగల ప్రాంత భాగాలను 'సృక్విణీ' అంటారు ('సృక్వి' ఏకవచనం. 'సృక్విణీ' ద్వివచనం). కృష్ణభగవానుడు దూడల శరీరాన్ని దురదపోవు రీతిలో చేతి గోళ్ళతో గోకుతుంటే కదలక మెదలక, సుఖానుభవం వల్ల కన్నులను సగం మూసుకొన్నాయి. ఆ లేదూడలు తల్లి పాలను త్రాగాలనే అపేక్ష లేనంత సుఖాన్ని అనుభవిస్తుంటే, ముకుందుడు కూడా స్వయంగా సుఖాన్ని పొందినాడు. వాటి సుఖమే తన సుఖంగా భావిస్తున్న భగవానుడు వాత్సల్యగుణ మహాసముద్రుడు కదా!

351. సిషేవిరే శాద్వలితాన్ ప్రదేశాన్
కృష్ణస్య ధామ్నా మణి మేచకేన।
వసుంధరా యామపి కేవలాయాం
వ్యాపారయంతో వదనాని వత్సాః॥ 86

**అర్థం:** వత్సాః= దూడలు; మణిమేచకేన= ఇంద్రనీలమణి వంటి శ్యామల వర్ణంగల; కృష్ణస్య= కృష్ణుని యొక్క; ధామ్నా= కాంతిచేత; శాద్వలితాన్- శాద= లేతగడ్డి చేత; వలితాన్= పచ్చగా చేయబడిన; ప్రదేశాన్= భూములను; కేవలాయాం, అపి= గడ్డిలేనిదైనను; వసుంధరాయాం= భూమియందు; వదనాని= ముఖాలను; వ్యాపారయంతః (సంతః)= పెట్టుతున్నవవుతూ; సిషేవిరే= సేవించెను.

**తా॥** ఇంద్రనీలమణివంటి శ్యామలవర్ణంగల కృష్ణుని కాంతిచేత భూములు పచ్చిగడ్డి గలవిగా నున్నాయి. భూమిమీద నిజంగా గడ్డిలేకపోయిననూ, దూడలు భూమిమీద ముఖాలను పెట్టి, తృణభ్రమతో కృష్ణుని కాంతిని మాత్రం సేవించాయి.

352. నవ ప్రసూతాః స తదా వనాంతే
పయస్వినీ రప్రతిమాన దోహాః।
పరిభ్రమశ్రాంత పదాన్ అదూరాత్
ప్రత్యాగతాన్ పాయయతే స్మ వత్సాన్॥ 87

**అర్థం:** సః= ఆ కృష్ణుడు; వన+అంతే= వనమధ్యస్థలమందు; నవప్రసూతాః = కొత్తగా ఈనినట్టి; అప్రతిమానదోహాః= ఎక్కువ పాలు కలిగియున్న; పయస్వినీః= పాడియావులు; పరిభ్రమ శ్రాంత పదాన్= అక్కడక్కడ నడవడంచేత- తిరుగడం చేత అలసిపోయిన కాళ్ళుగల; అదూరాత్= సమీపం నుంచి; ప్రత్యాగతాన్= తిరిగి వచ్చినట్టి; వత్సాన్= దూడలను; తదా= అప్పుడు; అపాయయత్= త్రాగనిచ్చెను, త్రాగింపజేసెను.

**తా॥** కొన్ని ఆవులు ఆడవిలోనే కొత్తగా ఈనినందువల్ల పొదుగునిండా పాలు కలిగియున్నాయి. కొన్ని రోజుల దాకా ఈనిన ఆవుల పాలను పిదుకరు

కాబట్టి, పాడియావులు అప్రతిమాన దోహులు అనబడినాయి. కొన్ని రోజుల క్రితం పుట్టిన లేదూడలను ఇంటివద్దనే ఉంచుతారు. అవి కొట్టాలకు దగ్గరనున్న భూముల్లో గంతులు వేస్తూ తిరుగుతుంటాయి, కాబట్టి సాయంకాలం వరకు అలసిపోయి యుంటాయి. కృష్ణుడు పాడియావులను అడవిలో మేపి సాయంకాలం ఇండ్లలోకి తోలుకొని వచ్చాడు. ఆవుల పాలును పిదుకనీయక, వెంటనే దగ్గర భూముల్లో తిరిగి అలసిపోయి వచ్చిన దూడలనే వాటి తల్లుల పాలను త్రాగునట్లు చేశాడు. ఇందు, కృష్ణుడు గోవులను పాలించడమందు ఎంత శ్రద్ధ కలవాడో తెల్పబడినది.

*353. నివిశ్య మూలేషు వనద్రుమాణాం*
*నిద్రాయితానాం నిజతర్ణకానామ్।*
*అంగాని గాః సాదర మాలిహంతీ*
*రమంస్త సంభావ్యగుణాః స్వమాతుః॥* 88

**అర్థం:** వనద్రుమాణాం= అడవిలోని చెట్ల యొక్క; మూలేషు= మూలప్రదేశాల యందు; నివిశ్య= ఉండి; నిద్రాయితానాం= నిద్రిస్తున్న; నిజతర్ణకానాం= తమకు అప్పుడే పుట్టిన దూడలయొక్క; అంగాని= అవయవాలను; సాదరం= ప్రేమతో; ఆలిహంతీః= సమగ్రంగా నాకుతున్న; గాః= ధేనువులను (కృష్ణుడు చూచి); స్వమాతుః = తన తల్లియైన యశోద యొక్క; సంభావ్య గుణాః= కొనియాడదగిన వాత్సల్య గుణాలు (కలవి)గా; అమంస్త= తలచెను.

**తా॥** ధేనువుల వాత్సల్య గుణాన్ని కృష్ణుడు చూచి తన తల్లి గుణాన్ని తలచుకొనెను.

అప్పుడే పుట్టిన లేదూడలు చెట్లక్రింద నిద్రబోతున్నాయి. 'తర్ణక' శబ్దం సద్యస్కాలాన జన్మించిన దూడకు వర్తించే పేరు. ఆ తర్ణకల అవయవాలను వాటి తల్లి యావులు ప్రేమతో నాకుతున్నాయి.

"సద్యోజాతస్తు తర్ణకః"- (అమరం). దూడను కన్నట్టి ఆవు వెంటనే ఆ దూడ దేహమందున్న మురికిని తన నాలుకతో నాకి తొలగించి, వాత్సల్యంతో పాలనిచ్చి పోషిస్తుంది. కృష్ణుడు ఆ ధేనువుల, లేదూడల దృశ్యాన్ని చూచాడు. తన తల్లియైన యశోద తనను ఎంత ప్రేమతో లాలించి పోషిస్తున్నదో అన్న విషయాన్ని స్మరించుకొన్నాడు. తన తల్లియైన యశోద యొక్క వాత్సల్యగుణం ఈ పాడియావులకూ ఉండడం శ్లాఘనీయమన్న భావం బాలగోపాలకృష్ణునికి స్ఫురించింది.

*354. సనైచికీః ప్రత్యహమాతపాంతే*
*ప్రత్యుక్తఘోషా ఇవ వత్సనాదైః।*
*మధూని వంశ ధ్వనిభిః ప్రయచ్ఛన్*
*నినాయ భూయోఽపి నివాస భూమిమ్॥* 89

**అర్థం:** సః= కృష్ణుడు; ప్రత్యహం= ప్రతిదినం; ఆతప+అంతే= సాయంకాలమందు; వంశధ్వని భిః= వేణు నాదాలచేత; మధూని= తేనెసోనలను; ప్రయచ్ఛన్= కురిపిస్తున్నవాడై; వత్సనాదైః= దూడల అరుపులతో; ప్రత్యుక్త ఘోషాః, ఇవ (స్థితాః) = మారుధ్వనిగలవియో అన్నట్లున్నట్టి; నైచికీః= ఉత్తమ గోవులను; భూయః, అపి= మళ్ళీ; నివాస భూమిం= కొట్టాలకు; నినాయ= తోలుకొని పోయెను.

**తా॥** కృష్ణుడు ప్రతిదినం ధేనువులను సాయంకాలం వాటి కొట్టాలకు చేర్చుతాడు. పగలంతా అడవిలో గోవులను మేపుతుంటాడు. అవి స్వేచ్ఛగా చరిస్తుంటాయి. ఎండ పోయిన సాయం సమయాన వేణునాదం చేస్తాడు. తేనెసోనలు నోటిలో పడినట్లు- తియ్యగా నున్నట్లు ఆ పిల్లనగ్రోవి ధ్వని చెవులకింపుగా ఉంటుంది. ఇల్లు దగ్గర అవుతున్న కొలది దూడలను ఉద్దేశించి తల్లియావులు అరవగా, కన్నదూడలు ప్రత్యుత్తరమిస్తున్నవో అన్నట్లు ఉంటుంది ఆ వేణునాదం. లేదూడలు ఇండ్లల్లో కట్టివేయబడి యుంటాయి కాబట్టి తల్లియావులకు తొందరగా తమ నివాస భూముల్లోకి ప్రవేశించాలనే ఆరాటం

కలుగునట్లు వేణునాదాన్ని వినిపిస్తాడు. 'నైచికీ' అనే పదం ఎంత నీచమైన- సన్నని- చిన్న స్వరంతో పిలిచిననూ వినివచ్చునట్టి ఉత్తమ గోవుకు వర్తించే పేరును తెలుపుతుంది.

"ఉత్తమా గోషు నైచికీ"- (అమరం). ఆ గోవులన్నీ ఉత్తమమైనవే. అందువల్ల చెవులకు చవులూరించే కృష్ణుడు ఊదిన పిల్లనగ్రోవి యొక్క సద్దును ముద్దుగా విన్న ఆ పాడియావులను మళ్ళీ వాటి వాటి కొట్టాలకు చేర్చునట్లు తోలుకొని పోయినాడు.

355. సమావ్రజన్ విశ్వపతిర్వ్రజాంతం
గోభిః సమం గోపవిలాసినీనామ్।
ఉల్లాసహేతుః సబభూవ దూరా
దుద్యన్ వివస్వానివ పద్మినీనామ్॥ 90

**అర్థం:** గోభిః, సమం= ఆవులతో కూడి; వ్రజాంతం= కొట్టాల దగ్గఱికి, (వ్రజసమీపాన్ని); దూరాత్= దూరంనుంచి; సమావ్రజన్= చేరవస్తున్న; విశ్వపతిః= సర్వస్వామియైన కృష్ణుడు; దూరాత్= దూరాన (తూర్పుదిక్కున); ఉద్యన్= ఆవిర్భవిస్తున్న; వివస్వాన్= సూర్యుడు; గోభిః= కిరణాలచేత; పద్మినీనాం, ఇవ= పద్మసమూహాలకువలె; గోపవిలాసినీనాం= గొల్ల పడుచులకు; ఉల్లాసహేతుః= వికాస, ప్రమోద హేతువు; బభూవ= ఆయెను.

**తా॥** ఆవులతో కూడి గొల్లపల్లెకు దగ్గరగా వస్తున్న విశ్వపతియైన కృష్ణుడు, దూరాన ప్రాగ్దిశలో ఉదయిస్తున్న సూర్యుడు తన కిరణాలచేత కమలాల వికాసానికి కారణమైనట్లు; గోపవిలాసినులకు ఆనందహేతువయ్యాడు. "అంతోఽస్త్రీ వసితేమృత్యౌ స్వరూపే నిశ్చయేఽంతికే"- (వైజయంతి). సూర్యుడు ఉదయిస్తుంటే తామరలు వికసిస్తాయి. అట్లే మలిసంజలో ఆవులమందను కొట్టాలలో చేర్చడానికి వ్రేపల్లెకు దగ్గరగా వస్తుంటే, ఇంక కొంచెం దూరాననే ఉన్ననూ, కృష్ణుడు గొల్ల పల్లెలోని బిబ్బోకవతులు సంతోషంతో ఉబ్బిపోవడానికి కారణమయ్యాడు. ఉపమాలంకారం.

356. నివర్తయన్ గోకుల మాత్తవంశో
మందాయమానే దివసే ముకుందః।
ప్రియాదృశాం పారణయా స్వకాంత్యా
బర్హావృతం వ్యాతనుతేవ విశ్వమ్॥ 91

**అర్థం:** దివసే= పగలు; మందాయమానేసతి= స్వల్పమవుతుండగా; ఆత్తవంశః = పొందిన వేణువాద్యం కలవాడై; గోకులం నివర్తయన్= గోకులానికి మరలి వస్తున్నట్టి; ముకుందః= మోక్షానందాన్ని ఇచ్చునట్టి కృష్ణుడు; ప్రియాదృశాం= ప్రియురాండ్ర కన్నులకు; పారణయా= తృప్తిని కలిగించే; స్వకాంత్యా= తన శరీర కాంతిచేత; విశ్వం= సమస్త ప్రపంచాన్ని; బర్హావృతం, ఇవ= నెమలి పింఛంచే ఆవరింపబడినట్లుగా; వ్యాతనుత= చేసెను.

**తా॥** మోక్షానంద ప్రదుడైన కృష్ణుడు ప్రొద్దు క్రుంకుతున్నప్పుడు ఆలమందను మరల్చుకొని గోకులానికి తిరిగి వస్తుండగా వేణువాద్యనాదం చేస్తున్నవాడై ప్రియురాండ్రైన గోపస్త్రీలకు కనువిందు చేసే తన దేహకాంతిచేత, విశ్వాన్ని నెమలిపింఛంతో ఆవరింపబడినట్లు చేశాడు. కృష్ణుణ్ణి జూచిన గోపికలు ఆనంద పరవశులయ్యారు. సాయం సంధ్యారాగంచేత విశ్వం రాగరంజితమయింది. వేణునాదంచేత మనస్సు ఆ కృష్ణమయింది. నెమలిపింఛంచేత శరీరాన్ని స్పృశింప జేస్తే చిత్తం తన్మయం చెందినట్లు, కృష్ణుని దేహకాంతిచేత ప్రేయసీమణుల కన్నులు విభ్రమానురక్తిని పొందినాయి- అని వర్ణితం.

357. బాలం తరుణ్యస్తరుణంచ బాలాః
త మన్వరజ్యంత సమాన భావాః।
తదద్భుతం తస్య విలోభనం వా
తస్యైవ సర్వార్హ రసాత్మతా వా॥ 92

**అర్థం:** బాలం= బాలుడైన కృష్ణుణ్ణి; తరుణ్యః= యువతులు; తరుణం= యువకుడైన; తం= ఆ కృష్ణుణ్ణి; బాలాః, చ= బాలికలు కూడా; సమాన భావాః= సమానమైన వయస్సు, స్వభావం కలవారవుతూ; అను+అరజ్యంత= అనురాగం కలిగియుండిరి; అద్భుతం= ఆశ్చర్యమైన; తత్= అనురంజనం; తస్య= ఆ కృష్ణునియొక్క విలోభనం, వా= ప్రలోభమో, లేదా; తస్య, ఏవ= ఆ కృష్ణునియొక్క సర్వ+అర్హ, రసాత్మతా, వా= అందరికీ ఆస్వాదించదగిన నిరతిశయానంద రూపమో, నిర్ణయింప శక్యం కాదు.

**తా॥** బాలకృష్ణుడు యువతులకు వారితో సమాన వయస్సు, స్వభావం కలవాడుగానూ, యువకుడైన కృష్ణుణ్ణి బాలికలు చూచి తమతో సమాన ప్రాయం, భావం కలవాడుగానూ అనురక్తిని చెందియుండడం ఆశ్చర్యమే. ఇటువంటి స్థితి మరెక్కడనూ కనబడడం లేదు కదా!

తనకు సముచితమైన వయస్సులేని స్త్రీలకు అనురంజనం కలిగించడం నిజంగా వారికి అనురూపమైన ఆకారాన్ని ప్రదర్శించి, వారిని ప్రలోభపెట్టడమే అయి ఉంటుంది. "రసోవైసః" అనే శ్రుతి పల్కినట్లు, అందరు అనుభవింప దగిన రసస్వరూపుడైన శ్రీకృష్ణుని నిరతిశయమైన ఆనంద రూపమే కావచ్చును. ఇద మిత్థమని నిర్ధారింప నలవికాదు కదా! అని తాత్పర్యం.

"న విశ్వమూర్తే రవధార్యతే వపుః"- (కు.సం.5-78). విశ్వమూర్తి యొక్క రూపం ఇట్టిదని నిర్ధారణ జేయబడదు.

*358.* *అవేదిషాతాం పృథుకౌ పితృభ్యాం*
*తారుణ్యపూర్ణౌ తరుణీజనేన।*
*వృద్ధౌ పురావృత్త విశేష విద్భిః*
*క్లృప్తేంద్ర జాలావివ రామకృష్ణౌ॥* 93

**అర్థం:** రామకృష్ణౌ= బలరామకృష్ణులిర్వురు; క్లృప్త+ఇంద్రజాలౌ, ఇవ= కల్పింపబడిన ఇంద్రజాలికులవలె; పితృభ్యాం= యశోదానందులు అనే

తల్లిదండ్రులచేత; పృథుకౌ= అర్భకులుగానూ; తరుణీజనేన= యువతీజనం చేత; తారుణ్య పూర్ణౌ= నిండు యౌవనం కలవారుగానూ; పురావృత్త విశేష విద్భిః= ఇతిహాస విశేషాలను తెలుసుకొనియున్న వారిచేత; వృద్ధౌ= పురాణ పురుషోత్తములుగానూ; అవేదిషాతాం= తెలియబడినారు.

**తా॥** గత శ్లోకమందు విహారపరులైనవారు కృష్ణుణ్ణి అనుభవించిన విధం తెల్పబడింది. ఈ శ్లోకంలో దాన్నే వివరణ రూపంగా, రామకృష్ణుల విషయమై అందరి అనుభవ ప్రకారం తెల్పబడుతున్నది.

బలరామకృష్ణులు ఇద్దరు కూడా ఇంద్రజాలం చేస్తున్న వ్యక్తులవలె ఒక్కొక్కరికి ఒక్కొక్క రీతిగా కనబడుతున్నారు. తల్లిదండ్రులైన యశోదకు, నందునికీ బాలురుగానే కనబడుతున్నారు. పడుచుతనంగల స్త్రీలకు నవయువకులుగా గోచరిస్తున్నారు. పురావృత్తం అంటే ఇతిహాసం తెలిసిన వృద్ధులకు భగవానుని అవతార పురుషులుగానే కనబడుతున్నారు. ఇంద్రజాల విద్యను నేర్చినవాడు తానొక్కడేయైనను నానారూపాలను కలవాడుగా దర్శింపబడుతాడు. అట్లే, ఈ బలరామకృష్ణులిద్దరు వారి వారి బుద్ధికి తోచిన రూపం కలవారుగా తల్లిదండ్రులకు బాలకులుగానూ, యువతకులకు నిండుయువకులుగానూ, పెద్దలకు పురాణ పురుషోత్తములుగా కనబడడంవల్ల ఉపమాలంకారంచేత అనుప్రాణితమైన ఉల్లేఖాలంకారం. ఒక్కవస్తువే అనేక విధాలుగా వర్ణింపబడడం ఉల్లేఖాలంకార లక్షణం.

*359.* *అథాపదానం మదనస్య దాతుం*
*ఆదాతు మాలోకయతాం మనాంసి।*
*నవం వయో నాథ సమం ప్రపేదే*
*గుణోత్తరం గోపకుమారికాభిః॥* 94

**అర్థం:** అథ= కృష్ణుని యౌవన ప్రాదుర్భావం తర్వాత; గోపకుమారికాభిః= గోపకన్యలచేత; మదనస్య= మన్మథుని యొక్క అపదానం= పరాక్రమాన్ని; దాతుం=

ఇచ్చుటకు; ఆలోకయతాం= చూచేవారియొక్క; మనాంసి= మనస్సులను; ఆదాతుం= చూరగొనుటకును; గుణోత్తరం= ఉత్కృష్టమైన గుణాలు కలిగినట్టి; నాథసమం= కృష్ణునికి తగినట్టి, కృష్ణునితో సమానమైన; నవం= కొత్తదైన; వయః= యౌవనం; ప్రపేదే= పొందెను.

**తా॥** కృష్ణుడు యౌవనాన్ని పొందిన వెంటనే నందవ్రజంలో అప్సరసలు అవతరించి, గోపకన్యలుగా ఉన్నవారు మన్మథుని పరాక్రమానికి అవకాశమిచ్చునట్టి ప్రేక్షకుల చిత్తాన్ని ఆకర్షించే నవయౌవనాన్ని, లజ్జ, సౌకుమార్యం, లావణ్యాది గుణాలను పొంది ప్రకాశించారు. *"అపదానం పరాక్రమః"*– (వైజయంతి).

*360. అనంగసింధో రమృత ప్రథిమ్నా*
*రసస్య దివ్యేన రసాయనేన।*
*మహీయసీం ప్రీతి మవాప తాసాం*
*యోగీమహాన్ యౌవన సంభవేన॥* 95

**అర్థం:** మహాన్, యోగీ= యోగీశ్వరుడైన కృష్ణుడు; అనంగ సింధోః= కామ సముద్రం యొక్క; అమృత ప్రథిమ్నా= అమృత సారమైనట్టి; రసస్య= శృంగార రసానికి; దివ్యేన= దేవలోక సంబంధమైన; రసాయనేన= రసాయనమైనట్టి; తాసాం= ఆ గోపకన్యల యొక్క; యౌవన సంభవేన= నవయౌవనోదయం చేత; మహీయసీం= మహత్తరమైన; ప్రీతిం= ఆనందాన్ని; అవాప= పొందెను.

**తా॥** శ్రీకృష్ణుడు గొప్పయోగి. కామమనే సముద్రమందలి అమృతసారమో, శృంగార రసం వృద్ధిపొంది దేవలోకమందలి రసాయనం (ఔషధం) అయినదో అన్నట్లున్న గోపకన్యల యౌవనోదయంచేత మహానందాన్ని పొందినాడు.

*"ఏవ ముక్త్వా మహా బాహుర్మహాయోగేశ్వరో హరిః"*– అనియు, *"యత్ర యోగేశ్వరః కృష్ణః"* అనే శాస్త్ర ప్రకారం శ్రీకృష్ణుడు మహాయోగి. యోగియైన శ్రీకృష్ణుడు గోపకన్యల సంభోగాన్ని కోరడం విరుద్ధం. పూర్వమే ఋషులకు,

అప్సరలకు వారు కోరిన ఫలాన్ని ప్రసాదించాడు. కృష్ణావతారంలో మీరు గోపకన్యలుగా అవతరించినప్పుడు మీ కోరిక తీరుస్తానని శ్రీరాముడు ఋషుల హృద్గత భావాన్ని గ్రహించి సంకల్పించుకొన్నాడు. ఇప్పుడు స్వార్థమే అవతరించినట్లున్న గోపకన్యల ప్రాచీన తపస్సుకు ఫలమీయనున్నాడు- అనే అర్థమున్నందువల్ల విరోధాభాసాలంకారం.

*361.* విజృంభమాణస్తనకుడ్మలానాం
వ్యక్తోన్మిషద్విభ్రమ సౌరభాణామ్।
మధువ్రతత్వం మధురాకృతీనాం
లేభే లతానామివ వల్లవీనామ్॥ 96

**అర్థం:** (సః= ఆ కృష్ణుడు); విజృంభ-లానాం/ విజృంభమాణ= వేగంగా ఎదుగుతున్న; స్తన= చన్నులు అనే; కుట్మలానాం= మొగ్గలు కలిగినట్టి; వ్యక్తో-ణాం/ వ్యక్త= స్ఫుటంగా; ఉన్మిషత్= వికసిస్తున్న, వీచుచున్న; విభ్రమః= విలాసం; సౌరభాణాం= వాసనవలె ఉన్నట్టి; మధుర+ఆకృతీనాం= మనోజ్ఞమైన ఆకారంగల; వల్లవీనాం= గోపకన్యలకు; లతానాం, ఇవ= తీగల వలె; మధువ్రతత్వం= తుమ్మెదయొక్క నియమాన్ని; లేభే= పొందెను, గోపికల విషయమై మధువ్రత భావాన్ని కృష్ణుడు పొందాడు.

**తా॥** లతలకు మొగ్గలు తొడిగినట్లు గోపకన్యలకు చను మొగ్గలు పొటమరించాయి. చనుమొగ్గలు క్రమంగా ఎదుగుతున్నాయి. వికసింపనున్న మొగ్గలవాసన వీచినట్లు గోపకన్యల విలాసం దేహంపైన తళుక్కుమంటున్నది. వికసిస్తున్న మొగ్గల వాసనకు జంటి తుమ్మెద తీగను జేరి పూదేనెను ఆస్వాదిస్తుంది. అట్లే శ్రీకృష్ణుడు గోపకన్యల విభ్రమ విలాసాలను అనుభవించ దలచాడు. కాబట్టి, కృష్ణుడు మధువ్రతత్వాన్ని పొందినాడని స్పష్టపరచబడింది.

*362.* అతిప్రసంగా దవ ధీరయంత్యా
ప్రాచీనయా సంయమితో నియత్యా।
పాంచాల కన్యామివ పంచ భుక్తాం
ధర్మః సతీరాదృత తాదృశీస్తాః॥ 97

**అర్థం:** తాదృశీః= కృష్ణునితో కలియడానికి పోతున్నట్టి; తాః= (అభిసారికలైన) ఆ గోపకన్యలను; అతిప్రసంగాత్= అతి ప్రసంగంవల్ల; అవధీరయంత్యా= తిరస్కరింప బడుతున్న, తొలగింపబడుతున్న; ప్రాచీనయా= ప్రాచీనపుదైన; నియత్యా= నియమం చేత; సంయమితః= నియమింపబడిన ధర్మం; పంచభుక్తాం= ఐదుగురు పాండవులచేత అనుభవింపబడిన; పాంచాల కన్యామివ= పాంచాల దేశపు రాజకన్యయైన ద్రౌపదిని వలె; సతీః= పతివ్రతలుగా; అదృత= ఆదరించెను.

**తా॥** ఈ శ్లోకం సూక్ష్మధర్మాన్ని బోధిస్తున్నది. 'అతిప్రసంగం' అంటే ఒకప్పుడు ఒక్కచోట క్రమం తప్పి జరిగిన విషయాన్ని మరొక్కచోట ఎత్తి చూపుట గానీ, జరుపుటగానీ చేస్తే. అది 'అతిప్రసంగం' అనబడుతుంది. ద్రౌపది పూర్వజన్మలో తపస్సు చేసి పొందిన వర ప్రభావంవల్ల పంచభర్తృకయై కూడా ఒక నియమాన్ని పాటించిన ఆ ధర్మం తర్వాత కాలాన ఆదరింపబడలేదు. గోపికలు కూడా పూర్వజన్మ కర్మఫలంగానే కృష్ణభగవానుని చెంతకు భోగానుభవం కోసం అభిసరించారు. కృష్ణుని బ్రహ్మచర్యం చెడలేదని (64వ) శ్లోకమందే చెప్పబడింది కదా! ద్రౌపదికి పంచభర్తృకత్వం ఎట్లు అనుమతింపబడినదో, అట్లు, ఇప్పుడు ఇతర స్త్రీలయందు ఆపాదింపబడుట లేదు కదా! గోపకన్యలు కృష్ణునితో కలియబోతున్నందువల్లనూ, ఒక్కొక్క గోపిక అనేక రూపాలతో నున్న, ఒక్క కృష్ణుణ్ణి తన భర్తగా పొందడంవల్లనూ, గోపకన్యలు ధర్మమార్గ భ్రష్టులు కాలేదు. ద్రౌపదివలె, గోపికలు కూడా దైవకృపవల్ల ఏర్పడిన ఫలితాన్ని అనుభవిస్తున్నందున వారియందు దోషం లేదు. శ్రీకృష్ణుడు గోపస్త్రీలను ద్రౌపదిని వలె, పతివ్రతలుగా ఆదరించాడని

సుశ్లోకితం. దేశికులు, ధర్మసూక్ష్మాన్ని తెలిసిన వారే గ్రహింపదగిన ఈ విషయాన్ని అపూర్వంగా ప్రదర్శించారని విద్వత్తల్లజులు ప్రశంసించారు.

*363. దిశా గజానామివశాక్వరాణాం*
*శృంగాగ్ర నిర్భిన్న శిలోచ్చయానామ్।*
*సతాదృశా బాహుబలేన కంఠాన్*
*నిపీడ్య లేభే పణితేన నీళామ్॥* 98

**అర్థం:** సః= ఆ కృష్ణుడు; దిశాగజానాం, ఇవ= దిగ్గజాలవలె; శృంగ+అగ్ర, నిర్భిన్న శిలోచ్చయానాం= కొమ్ముల కొనలచే పడగొట్టబడిన పర్వతాలు గల; శాక్వరాణాం= వృషభాలయొక్క; కంఠాన్= మెడలను; తాదృశా= ప్రసిద్ధమైనట్టి; బాహుబలేన= భుజబలంచేత; నిపీడ్య= విరిచివేసి; పణితేన= శుల్కంచేత; నీళాం= నీళాదేవిని; లేభే= పొందెను.

**తా॥** ఆ బాలకృష్ణుడు దిగ్గజాలలాగా కొండలనెత్తమ్ములను తమ కొమ్ముల చేత పెల్లగించినట్టి ఎద్దుల యొక్క మెడలను విరిచివేశాడు. రాక్షసులను మర్దించినట్టి బాహుబలంచేత ఏడెద్దులను చంపి వీర్యశుల్కయైన నీళాదేవిని చేబట్టినాడు. విదేహ నగరమందు యశోదాదేవి తమ్ముడైన కుంభకుడు గోపతిగా నుండెను. పూర్వం కాలనేమి అనే అసురునియొక్క ఏడుగురు పుత్రులను ఓడించిన కృష్ణుని మీద ప్రతీకారం, పగ చేత అపకారం చేయడానికి ఎద్దులరూపంలో ఆ నగరంలో నివసించారు. ప్రజలను, పశువులను భయపెడుతూ, పైరులను మేస్తూ ఉపద్రవాన్ని సృష్టించారు. ప్రజలు పగలు కూడా వీథుల్లో సంచరించక గృహద్వారాలను మూసుకొని లోపల ఉండేవారు. నగరమంతా కళాహీనంగా ఉండేది. వాటి వలన కలిగే బీభత్సాన్ని కుంభకుడు నివారింపజాలలేదు. తుదకు, ఆ వృషభాలను అణచివేసిన వ్యక్తికి తన కూతురైన నీళాదేవిని ఇస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ఒకప్పుడు ఆ బాలకృష్ణుడు ఆ నగరానికి వచ్చి తన ప్రాణాన్ని పణంగా పెట్టి, ఏడు వృషభాలను తన బాహుబలంచేత అణచివేసి, వాటి కంఠాలను,

పీకలను నొక్కి చంపివేశాడు. ప్రతిజ్ఞా ప్రకారం కుంభకుడు, లౌకిక పరిణయ ప్రక్రియచేత నీళాదేవిని కన్యాదానం చేసి కృష్ణుని అధీనం చేశాడు. ఆ బలరామకృష్ణులకు దివ్య శక్తియుండడం వల్ల బాల్యమందే అవసరమున్నప్పుడు, యౌవనం ఆవహించే ప్రవృత్తి యుండింది- అని ఈ కథ 'హరివంశం' అనే గ్రంథమందు స్పష్టంగా ఉంది. "శాక్వరో వృషభే ఛందోవిశేషే శాక్వరం మతమ్"- (విశ్వ నిఘంటువు).

*364. కరేణ దంభోళి కఠోర తుంగాన్*
*దేహాన్ పృథూన్ దానవ దుర్వృషాణామ్।*
*విమృద్యనూనం విదధేముకుందః*
*ప్రియాస్తన స్పర్శ విహార యోగ్యామ్॥* 99

**అర్థం:** ముకుందః= శ్రీకృష్ణుడు; దానవదుర్వృషాణాం= రాక్షస రూప దుష్ట వృషభాలయొక్క; దంభోళి కఠోరతుంగాన్= వజ్రాయుధం వలె కఠోరమైన ఎత్తైన; పృథూన్= దృఢంగా బలిసియున్న; దేహాన్= దేహాలను; కరేణ= చేతితో; విమృద్య= మర్దించి; నూనం= నిశ్చయంగా; ప్రియా-యోగ్యాం/ ప్రియా= ప్రియురాలైన నీళాదేవి యొక్క; స్తన= వక్షోజాలను; స్పర్శ విహార= మెదిపే వినోదానికై; యోగ్యాం= అభ్యాసాన్ని; విదధే= చేసెను.

**తా॥** శ్రీకృష్ణుడు అసురరూపంలో ఉన్న వృషభాల యొక్క వజ్రాయుధం లాగా కఠోరమైన, బలిసియున్న పెద్ద దేహాలను చేతితోనే మర్దించాడు. నీళాదేవి స్తనాలు అతి కఠినమైనవి కాబట్టి, ఈ వృషభ మర్దనం చేసిన కృష్ణుని హస్తం నీళాదేవి యొక్క కఠిన స్తనాల మర్దన కోసం మొట్టమొదట అభ్యాసం చేసినట్లు అయింది. వినోదంగా స్తన కాఠిన్యాన్ని సహించుకోవడానికై మొదట వృషభ మర్దన చేసిన చేతికి అలవాటైనదేమో అన్నట్లున్నదని ఉత్ప్రేక్షింపబడింది.

"యోగ్యాఽభ్యాసార్కయోషితోః"- (విశ్వ నిఘంటువు).

365. ఆత్మీయ పర్యంక భుజంగ కల్పౌ
అక్షేప్య రక్షాపరిఘౌ పృథివ్యాః।
నీలోపధానీ కరణాత్ సమేనే
భూయిష్ఠధన్యౌ భుజ పారిజాతౌ॥ 100

**అర్థం:** సః= శ్రీకృష్ణుడు; ఆత్మీయ పర్యంక భుజంగ కల్పౌ= తన పడకయైన శేష సర్పంతో సమానమై యున్నట్టి; పృథివ్యాః= భూమియొక్క; అక్షేప్యరక్షా పరిఘౌ= అడ్డులేకుండా రక్షించడానికి పరిఘల-అర్గళాల-రూపంగా ఉన్నట్టి; భుజపారిజాతౌ= పారిజాతాల వంటి భుజాలను; నీలా+ఉపధానీ కరణాత్= నీళాదేవికి దిండ్లుగా చేయడం వల్ల భూయిష్ఠ ధన్యౌ= గొప్ప భాగ్యం కలవిగా; మేనే= తలచెను.

**తా॥** శ్రీకృష్ణుని బాహువులు ఆయన పర్యంకమైన శేషసర్పాన్ని పోలియున్నవి. భూమిని నిరాటంకంగా రక్షించే అర్గళాల- బేడెముల రూపంలో ఉన్నవి. అట్టి, పారిజాతాలవంటి తన భుజాలను నీళాదేవిని కౌగలించుకోవడానికి ఉపయోగ పరచినందువల్ల ఆ భుజాలు మహాభాగ్యం కలవని కృష్ణుడు భావించాడు. శ్రీకృష్ణుని భుజాలు మృదువైనవి, బలంగలవి. పరిమళభరితమైనవి. అందువల్ల నీళాదేవి శరీరాన్ని ఆలింగనం చేసుకొన్నప్పుడు ఆమెకు దిండ్లుగా ఉపయోగపడిన తన భుజ పారిజాతాలు మిక్కిలి కృతార్థమైనవని తలచినందువల్ల, నీళాదేవిపైన కృష్ణుని (తన) కున్న ప్రేమాతిశయం ప్రకటితమైనది.

"పరిఘో యోగభేదేఽస్త్రే ముద్గరేఽర్గళఘాతయోః"- (విశ్వని.).

366. రాగాదిరోగ ప్రతికార భూతం
రసాయనం సర్వదశానుభావ్యమ్।
ఆసీదనుధ్యేయతమం మునీనాం
దివ్యస్య పుంసో దయితోపభోగః॥ 101

**అర్థం:** దివ్యస్య= పరమపదమందు ఉండే; పుంసః= పురుషుడైన కృష్ణుని యొక్క; దయిత+ఉపభోగః= పత్నితో సంగమం అనే; సర్వదశా+అనుభావ్యం= అన్ని దశలలో (వేళల్లో)/ అన్ని దశలను (అవస్థలను) అనుభవింప దగినట్టి; రాగ+ఆదిరోగ ప్రతికారభూతం= ప్రేమానురాగాది రోగాలకు ప్రతిక్రియ- విరుగుడైన రసాయనం- అయిన దివ్యౌషధం; మునీనాం= ఋషులకు; అనుధ్యేయతమం= మిక్కిలి ధ్యానించ దగినదై; ఆసీత్= ఉండెను.

**తా॥** దివ్యపురుషుడైన కృష్ణుని యొక్క ప్రియురాలితో ఉపభోగం అనేది సర్వదశలలో అనుభవింపదగిన దివ్యౌషధం. రాగాది రోగాలను తొలగించే రసాయనం. ఋషులకు ఎక్కువ ధ్యానింపదగినదని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** శ్రీకృష్ణుడు పరంధాముడు. ఆయన ప్రియురాంద్రతో సంగమించే లీల వర్ణితం.

ఇది సంసారులకు సర్వదశలలో స్మరింపదగిన రసాయనం, దివ్యౌషధం. కాబట్టి, ప్రేమానురాగాది రోగాలకు విరుగుడైన భేషజం. లోకంలో ప్రసిద్ధమైన ఔషధాన్ని కొన్ని సమయాలలో మాత్రమే సేవించవలసి యుంటుంది. అట్టి సమయాన్ని ప్రతీక్షించి సేవించదగినట్టి ఔషధం కాదిది. అన్ని వేళల్లో ఈ భగవల్లీలా సమయాన్ని సేవించి తరించవచ్చు. దయితోపభోగం రసాయన మనడం విరోధాభాస గర్భితమైన రూపకం. లోకంలో స్త్రీ పురుషుల పరస్పర సంగమం, రోగాలకు హేతువు. వయసురాని బాలబాలికల విషయంలోనైతే సర్వరోగాలకు కారణమైన అనర్థాన్ని కలిగిస్తుంది.

చక్షుః ప్రీతి, మనస్సంగమం అనే మొదలైన పది మన్మథావస్థలు- అనంగదశలు- కలిగి కామపీడితులవడం సత్యం. విభావానుభావ సంచారి భావాలు శృంగార రసాన్ని ఉద్దీపింపజేస్తాయి. అట్లే, దయితోపభోగాది పదాలను విన్నంతనే రాగాదిరోగాలు విజృంభిస్తాయి కదా! కాబట్టి, దయితోపభోగం రసాయనం ఔషధమనడం విరోధంగా తోస్తుంది కదా! ఈ విరోధాన్ని పరిహరించే సమాధానం ఇలా చెప్పబడుతున్నది. బాల్యదశలోనే నీళాకృష్ణుల ఉపభోగం

గానీ, గోపికలతో కృష్ణుణి సంభోగ విషయంగానీ, లోక సంగ్రహణార్థమే అని ప్రదర్శింపబడింది. పురుషోత్తముడైన శ్రీకృష్ణభగవానుని లీలా కథలను స్మరించిననూ, విన్ననూ సంసారుల జనన మరణ రూపమైన వ్యాధిని పోగొట్టుకొని, ఐహికాముష్మిక సుఖాలను పొందుతారని భాగవతాది పురాణాలు ప్రబోధిస్తున్నాయి.

*"సంసార సింధు మతిదుస్తరముత్తితీర్షోః నాన్యః ప్లవోభగవతః పురుషోత్త మస్య। లీలా కథారసనిషేవణ మంతరేణ"*- (భాగవతం 12 స్కం.)

భగవానుని లీలా కథ- చరిత్ర- అనే రసాయనాన్ని సేవించకుంటే సంసారులు సుఖంగా జీవించలేరు. భగవానుని కథాశ్రవణం అనే నౌకలో పయనిస్తేగానీ మానవుడు దాటశక్యంగాని ఈ సంసారమనే సముద్రాన్ని దాటి ఆవలి గట్టుకు చేరలేడు.

*"భజతే తాదృశీం క్రీడాం యాంశ్రుత్వా తత్పరోభవేత్"*- (భాగవతం). గోపికలతో శ్రీకృష్ణ భగవానుడు క్రీడించినట్టి కథలను విన్న ప్రాణులు భగవత్కాములవుతారని చెప్పబడింది. కాబట్టి, రాగాది రోగాలకు ప్రతిక్రియయైన రసాయనం- దివ్యౌషధం. "కృష్ణ రసాయనంపిబ"- అన్న సూక్తి సమర్థిస్తున్నది. ఇంక విరోధ వాక్యమనరాదు కదా! విరోధాభాసాలంకారం.

*మునీనామనుధ్యేయ తమం:*- సంభోగపదం చెవిలో బడినంతనే సంసారులు అనురాగవంతులవుతారు. భగవత్క్రీడాది కథలను విన్నంతనే భగవద్రూప విషయ మాహాత్మ్యం వల్ల చిత్తశుద్ధి కలుగుతుంది. అంతరంగం ఆనందరస తరంగిత మవుతుంది. కాబట్టి, రాగాది రోగపరిహారకమైన, నిత్యం ఆస్వాదింపదగిన రసాయనం కదా!

పరాశర, పారాశర్య, పరాంకుశ, పరకాలాది మహామునులు కూడా ముక్తిని కలిగించే శ్రీకృష్ణ లీలారసాయనాన్ని సర్వదేశ, సర్వకాలాలలోనూ సేవించి, స్మరించి, జనులకు మార్గదర్శకులయ్యారు.

*367. అనుద్రుతా నూనమనంగ బాణైః*
*సులోచనా లోచన భాగధేయమ్।*
*ప్రత్యగ్రహీషుః ప్రతి సంనివృత్తం*
*త్యక్తేతరై రక్షిభిరాత్మనాచ॥* 102

**అర్థం:** సులోచనాః= గోపస్త్రీలు; ప్రతి సంనివృత్తం= తిరిగివచ్చినట్టి; లోచన భాగధేయం= కనువిందుగానున్న కృష్ణుణ్ణి; నూనం= నిశ్చయంగా; అనంగ బాణైః= మన్మథ బాణాలచేత; అనుద్రుతాః, సత్యః= అనుసరించినవారై; త్యక్త+ఇతరైః= విడిచిపెట్టిన వేరే విషయాలు గల; అక్షిభిః= కన్నుల చేతనూ; ఆత్మనా, చ= మనస్సు చేతనూ, దేహంచేత కూడా; ప్రత్యగ్రహీషుః= ఎదురేగిరి.

**తా॥** విదేహదేశమందు వీర్యశుల్కమైన సీతను పెండ్లాడి తిరిగి వచ్చినట్టి, సులోచనాలోచన చకోర పక్షులకు చంద్రునివంటి వాడైన శ్రీరాముణ్ణి జూచి, నయనానందంగా ఎదురేగినట్లే, విదేహదేశమందు తన పరాక్రమాన్ని ఉంకువగా జేసి నీళాదేవిని పెండ్లాడి తిరిగివచ్చిన శ్రీకృష్ణుణ్ణి జూచిన గోపికలు, ఆయన విరహం వల్ల మన్మథ బాణాలచే పీడింపబడినవారు కాబట్టి, ఆ బాధను పరిహరించుకోవడానికి మాటడకుండా, ఇతర విషయాలమీద ఆసక్తిలేని కన్నులతో, మనస్సుతో, శరీరంతో వేగంగా పోయి ఎదుర్కొన్నారు. వేరే దేశాన విజయాన్ని పొందివచ్చిన కృష్ణుణ్ణి సేవించడం గోపికలు తమ కన్నుల భాగ్యమని ఆనందించారు.

*368. వ్రజోపకంఠే విబుధానుభావ్యో*
*గోపీజనై రాత్మ గుణావదాతైః।*
*సమావృతో నందసుతశ్చకాశే*
*తారాగణై రిందురివాంతరిక్షే॥* 103

**అర్థం:** విబుధానుభావ్యః= జ్ఞానులచేత ధ్యానింపదగిన; నందసుతః= శ్రీకృష్ణుడు; వ్రజ+ఉపకంఠే= గోకులానికి సమీప ప్రదేశమందు; ఆత్మగుణ+అవదాతైః= ఆత్మగుణాల చేత పరిశుద్ధులైన; గోపీజనైః= గోపీజనులతో-

అంతరిక్షే= ఆకాశమందు; విబుధ+అనుభావ్యః= దేవతలచే ఆహారంగా సేవింపదగినట్టి; ఆత్మగుణ+అవదాతైః= తమ కాంతులతో తెల్లగా నున్నట్టి; తారాగణైః = నక్షత్ర సమూహాలచేత; సమావృతః= ఆవరింపబడిన; ఇందుః, ఇవ= చంద్రునివలె; సమావృతఃసన్= చుట్టూ ఆవరింపబడినవాడై; చకాశే= ప్రకాశించాడు.

**తా॥** దేవతలు చంద్రకళలను ఆహారంగా సేవిస్తారు. చంద్రుడు అమృత కిరణుడు కదా! "ప్రథమాంపిబతేవహ్నిః"– మొదటి కళను అగ్నిదేవుడు ఆహారంగా పానం చేస్తాడు అన్న విధంగా దేవతలచేత కళానిధియైన చంద్రుడు సేవింప బడుతాడు. కృష్ణుడు విద్వాంసులచేత ధ్యానింపబడుతాడు. ఆకాశంలో స్వీయకాంతులతో తెల్లగా మెరుస్తున్న చుక్కలతో ఆవరింపబడిన చంద్రునివలె, గోకులానికి దగ్గరి ప్రదేశమందు తమ గుణాలచే శుద్ధభావం గల గోపీజనులచే చుట్టూ ఆవరింపబడినవాడై శ్రీకృష్ణుడు శోభించాడు. గోపీజనంతో నున్న కృష్ణునికి తారాగణంతో నున్న చంద్రుడు ఉపమానం. కృష్ణభగవానుడు పుణ్యశ్లోకుడు. ఆయన ఆత్మగుణాలను సేవించే గోపికల గుణాలు కూడా (అవదాతం) పరిశుభ్రమైనవే. కృష్ణునికై అభిసరించేవారు కదా!

"అవదాతః సితే పీతే విశుద్ధే ప్రవరేఽపి చ"– (విశ్వః). అంతరిక్షమందు తన చుట్టూ తారాగణంతో ప్రకాశించే చంద్రునిలాగా గోకులం దగ్గరికి చేరగానే, గోపీజనులందరు చుట్టూరా చేరిన కృష్ణుడు ఆహ్లాదకరంగా ప్రకాశించాడు. సర్వేంద్రియాలకు సంతృప్తిని కలిగించాడు శ్రీకృష్ణుడు.

*369.* హత్వా సయూథం తృణరాజషండే
రామాచ్యుతౌ రాసభదైత్యముగ్రమ్।
అతోష యేతాం భృశమాత్మ భృత్యాన్
స్వాద్యైః సుధా పిండనిభైః ఫలౌఘైః॥ 104

**అర్థం:** రామ+అచ్చుతౌ= బలరామకృష్ణులు; తృణరాజషండే= తాళవనమందు; ఉగ్రం= క్రూరుడైన; సయూథం= బంధువర్గంతో కూడియున్న; రాసభదైత్యం= గాడిద రూపాన్ని ధరించిన ధేనుకుడనే రాక్షసుణ్ణి; హత్వా= సంహరించి; స్వాద్వైః= మధురములైన; సుధాపిండనిభైః= అమృతపు ముద్దలలాగా ఉన్న; ఫల+ఓఘైః= ఫలసమూహాలచే; ఆత్మభృత్యాన్= తమ అనుచరులైన గోపాలకులను; భృశం= మిక్కిలి; అతోష యేతాం= ఆనందింపజేసిరి.

**తా॥** బలరాముడు, కృష్ణుడు పెద్ద తాళ వనానికి గోపకుమారులతో కలిసి పోయారు. అక్కడ ధేనుకుడనే క్రూర రాక్షసుడు గాడిద రూపాన్ని ధరించి, తన బంధువర్గంతో తాళవనమంతా ఆక్రమించి స్వేచ్ఛగా సంచరిస్తున్నాడు. రామకృష్ణులు ధేనుకుని ఆగడాలను- దుష్టచేష్టలను- సహించలేదు. కాబట్టి, బలరాముడు ఆ రాసభ రూపంలో ఉన్న ధేనుకాసురుణ్ణి సంహరించాడు. కృష్ణుడు ధేనుకాసురుని వెంట నున్న రాక్షస సమూహాన్ని వధించాడు. తర్వాత మిక్కిలి మధురమైన, అమృత గోళాల తుల్యంగా ఉన్న తాళవృక్ష ఫలాలనన్నీ బలరామకృష్ణులు తమతోపాటు గోపాలకులుగా ఉన్న పిల్లలందరికి పంచి, తినిపించి, వారిని సంతోషపరచారు. “తృణరాజాహ్వాయస్తాళః”- (అమరం).

*370. కదాచిదాసాదిత గోపవేషః*
*క్రీడాకులే గోపకుమార బృందే।*
*స్కంధేన సంగృహ్య బలం బలీయాన్*
*దైత్యః ప్రలంబో దివముత్పపాత॥* 105

**అర్థం:** ఆసాదిత గోపవేషః= స్వీకరించిన గోపకుమారుని ఆకారంగల; బలీయాన్= బలవంతుడైన; ప్రలంబః= ప్రలంబుడు అనే పేరుగల; దైత్యః= రాక్షసుడు; గోపకుమార బృందే= గోపకుమారుల సమూహం; కదాచిత్= ఒకప్పుడు; క్రీడా+ఆకులే, సతి= హరిణా క్రీడనకం అనే ఆటలో వ్యగ్రమైయుండగా; బలం= బలరాముణ్ణి;

స్కంధేన= భుజమూలంచేత; సంగృహ్య= గ్రహించి- ఎత్తుకొని; దివం= ఆకాశానికి; ఉత్పపాత= ఎగిరినాడు.

**తా॥** ప్రలంబుడనే పేరుగల రాక్షసుడు గొల్లపిల్లవాని వేషంతో రంధ్రాన్వేషియై గోపకుమారులతో పర్యటించసాగాడు. వాడు మిక్కిలి బలవంతుడు. గోపకుమారులు బలరామకృష్ణులు కలిసి, హరిణా క్రీడనకమనే ఆటలో మగ్నులై యున్నారు. ఆ క్రీడలో ప్రలంబుడు కూడా స్వయంగా పాల్గొన్నాడు. ఆటలో ఇద్దరిద్దరు పాల్గొని, పరుగెత్తే వ్యక్తులు లక్ష్యస్థానం చేరేలోపల మరొక వ్యక్తిని వెనుకవేసి, తాను ముందు లక్ష్యాన్ని చేరుకొంటే గెల్చినట్లు పరిగణింపబడే ఆట విధానమది. ఓడినవాడు గెల్చిన వ్యక్తిని భుజంమీద ఎత్తుకొని లక్ష్యం వరకు పరుగెత్తాలి. ఇది ఆట నియమం. ఈ ఆటలో ప్రలంబుడు ఓడిపోయాడు. నియమాన్ని అనుసరించి బలీయుడైన ప్రలంబుడు విజేతయైన బలభద్రుణ్ణి భుజస్కంధం మీద ఎత్తుకొన్నాడు. కాని, లక్ష్యస్థానంవైపు పరుగెత్తుటకు బదులు ప్రలంబుడు ఆకాశానికి ఎగిరిపోయాడు. దూరంగా పోయి బలరాముణ్ణి వధింప తలచాడు. ('హరివంశం' ఈ ఆటను హరిణాక్రీడనకం' అని పేర్కొన్నది).

*371.* పపాత భూమౌ సహసా సదైత్యః
తన్ముష్టినా తాడిత శీర్ణ మౌళిః।
మహేంద్ర హస్త ప్రహితేన పూర్వం
వజ్రేణ నిర్భిన్న ఇవాచ లేంద్రః॥ 106

**అర్థం:** సః= ఆ ప్రలంబుడనే రాక్షసుడు; తత్+ముష్టినా= బలభద్రుని పిడికిలి చేత; తాడిత శీర్ణమౌళిః= కొట్టబడిన, శిథిలమైన శిరస్సు కలవాడై; పూర్వం= వెనుకటి కాలాన; మహేంద్ర హస్త ప్రహితేన= దేవేంద్రుని హస్తంచేత విసరివేయబడిన; వజ్రేణ= వజ్రాయుధంచేత; నిర్భిన్నః= రెక్కలు తెగిపోయిన; అచల+ఇంద్రః, ఇవ= పెద్ద పర్వతం వలె; సహసా= వేగంగా; భూమౌ= నేలమీద; పపాత= కూలబడినాడు.

**తా॥** బలభద్రుడు తన నెత్తుకొని పోతున్నవాడు గోపకుమారుడు కాదు, ఆ వేషం వేసుకొన్న రాక్షసుడని గమనించాడు. వెంటనే ఆ రాక్షసుని తలమీద బలభద్రుడు పిడికిలితో బలంగా గుద్దినాడు. ఆ దెబ్బకు మెదవిరిగిపోయి, వెనుకట, దేవేంద్రుని వజ్రాయుధంతో రెక్కలు నరకబడిన గొప్ప పర్వతంలాగా, ప్రలంబుడు వేగంగా భూమిమీద కూలబడినాడు.

*372. స్వవాససా క్లుప్త కళంక లక్ష్మీః*
*కాంత్యాదిశ శ్చంద్రిక యేవలింపన్।*
*రరాజ రామో దనుజే నిరస్తే*
*స్వర్భానునా ముక్త ఇవోడు రాజః॥* 107

**అర్థం:** దనుజే= ప్రలంబుడనే రాక్షసుడు; నిరస్తే సతి= చంపబడగానే; స్వవాససా= తన నీల వస్త్రంచేత; క్లుప్తకళంక లక్ష్మీః= కల్పింపబడిన కళంకం యొక్క శోభ గలిగినట్టి; కాంత్యా= (తన తెల్లని) దేహకాంతిచేత; చంద్రికయా, ఇవ= వెన్నెలచేత వలెనే; దిశః= దిక్కులను; లింపన్= పూతవేస్తున్నట్టి, లేపనం చేస్తున్నట్టి; రామః= బలరాముడు; స్వర్భానునా= రాహువుచేత; ముక్తః= విడువబడిన; ఉడురాజః, ఇవ= నక్షత్రేశుడైన చంద్రునివలె; రరాజ= ప్రకాశించెను.

**తా॥** బలరాముడు ప్రలంబునిచే ఎత్తుకొని పోబడినందున రాహుగ్రస్త చంద్రునివలె నుండెనని గ్రహించదగియున్నది. ప్రలంబుని చంపిన తర్వాత బలరాముడు రాహువుచేత విడువబడిన చంద్రునివలె ప్రకాశించాడు. చంద్రుడు తెల్లని కాంతి కలవాడు. చంద్రబింబం నడుమ కళంకం శోభిస్తుంటుంది. అయినా, తన దేహకాంతిచే- వెన్నెలచేతనే కదా దిక్కులన్ని ధవళాయమానంగా శోభింపజేస్తాడు. బలరాముడు చంద్రునివంటి వాడని పోల్చబడినాడు. బలరాముడు తెల్లని దేహం కలవాడు. నీలవస్త్రాన్ని ధరిస్తుంటాడు. నీలాంబరుడని బలరామునికి పేరున్నది. ఈ నీలాంబరం, చంద్రునికి కళంకం లాగా, శోభావహమైయున్నది.

రాహువు గ్రసించి విడిచిన చంద్రుడు దశదిశల యందు వెన్నెలను ప్రసరింప జేసినట్లే, ప్రలంబుణ్ణి చంపగానే, వాని పట్టుచే విడువబడిన బలరాముడు పలు దెసలనున్న జనులను ఆహ్లాదింపజేశాడు. ఇది ఉపమాలంకారం.

*373. వినైవరామేణ విభుః కదాచిత్*
*సంచారయన్ ధేనుగణం సవత్సమ్।*
*వనశ్రియా దూరవిలోభితాక్షః*
*కంచిత్ యయౌ కచ్ఛ మదృష్ట పూర్వమ్॥* 108

**అర్థం:** కదాచిత్= ఒకప్పుడు; రామేణ, వినా, ఏవ= బలరాముడు లేకుండా; సవత్సం= దూడలతో కూడియున్న; ధేను గణం= ఆలమందను; సంచారయన్= నడుపుకొంటూ; విభుః= సర్వేశ్వరుడైన కృష్ణుడు; వనశ్రియా= వనం యొక్క శోభచేత; దూరవిలోభిత+అక్షః= దూరంగా ఆశింపజేయబడిన కన్నులు కలవాడై; అదృష్టపూర్వం= ఇంతకుముందు చూడబడనట్టి; కంచిత్= ఒకానొక; కచ్ఛం= యమునా తీరమందలి జల ప్రదేశాన్ని గూర్చి; యయౌ= వెళ్లెను.

**తా॥** ఒక సమయాన బలరాముడు లేకుండా ఒంటరిగానే లేగలతో కూడియున్న గోవుల మందను తోలుకొంటూ శ్రీకృష్ణభగవానుడు, తన కన్నులను వనలక్ష్మి ప్రలోభపెట్టగా ఎప్పుడు చూడనట్టి దూరంగా ఉన్న యమునా తీరమందలి జలప్రదేశానికి పోయినాడు అని కాళియ మర్దనకు ఉపోద్ఘాతం సుశ్లోకితం.

*374. యదృచ్ఛ యాచారిత ధేను చక్రః*
*కూలాంతికే విశ్వజనానుకూలః।*
*కళిందజాం కాళియపన్నగస్య*
*క్ష్వేళోద్గమైః కజ్జలితాం దదర్శ॥* 109

**అర్థం:** యదృచ్ఛయా= స్వేచ్ఛచేత; కూలాంతికే= తీరం దగ్గర; చారిత ధేనుచక్రః = సంచరింపబడిన ఆవుల మందగల; విశ్వజన+అనుకూలః= సమస్త జనం యొక్క హితాన్ని కోరే కృష్ణుడు; కళిందజాం= యమునా నదిని; కాళియ పన్నగస్య= కాళియుడనే సర్పంయొక్క; క్ష్వేళ+ఉద్గమైః= విషపు బుసబుసలచేత; కజ్జలితాం= కాటుకలాగా నల్లబడినదానిగా; దదర్శ= చూచెను.

**తా॥** సమస్త జనుల క్షేమాన్ని అభిలషించే శ్రీకృష్ణుడు ఎదురులేకుండా, ఆలమందను తోలుకొంటూ పోయి, అక్కడ కాళియుడనే గొప్ప నాగుపాము యొక్క విషజ్వాలలచేత మశిబూసినట్లు నల్లబడి, అందమంతా చెదరిపోయిన యమునా నదిని చూశాడు.

"స్వచ్ఛందం నిర్నిమిత్తంచ యదృచ్ఛేత్యభిధీయతే"- (హలాయుధః)
"చక్రం సైన్యే జలావర్తే రథాంగే చయరాష్ట్రయోః"- (వైజయంతి)

375. విషాగ్నినా ముర్మురిత ప్రతానే
వైరోచనీ తీర వనావకాశే।
అహీంద్ర మాస్కందితు మధ్యరుక్షత్
కాష్ఠాకృతిం కంచన నీప వృక్షమ్॥ 110

**అర్థం:** అహీంద్రం= కాళియుడనే నాగరాజును; ఆస్కందితుం= శోషింప జేయుటకు; విషాగ్నినా= విషాగ్నిచేత; ముర్మురితప్రతానే= ముసుర్కొనబడిన తరుగుల్మాదులుగల; వైరోచనీ తీరవన+అవకాశే= సూర్యసుతయైన యమున యొక్క తటమందలి వన ప్రదేశమందు; కాష్ఠాకృతిం= కట్టె రూపంగల; కంచ= ఒకానొక; నీపవృక్షం= కడపచెట్టును (శ్రీకృష్ణుడు); అధ్యరుక్షత్= అధిరోహించెను.

**తా॥** శ్రీకృష్ణుడు కాళియుడనే నాగరాజును దమింపజేయ- అణచివేయ దలచాడు. ఆ సర్పరాజు యొక్క విషాగ్నిచే చిమ్మబడిన మిణుగురులు యమునా తీర వనప్రదేశాన్ని ఆకులు పూలు లేకుండా, మాడగొట్టాయి.

"ముర్మురస్తుతుషానలః"- (వైజయంతి). అక్కడ కేవలం కట్టెగా నున్న కదంబ తరువును కృష్ణుడు ఎక్కినాడు.

*376.* మధుద్రవై రుల్బణ హర్ష బాష్పై
రోమాంచితా కేసరజాల కేన।
పత్రాంకురైశ్చిత్ర తనుశ్చకాశే
కృష్ణాశ్రితా శుష్క కదమ్బశాఖా॥ 111

**అర్థం:** కృష్ణ+ఆశ్రితా= కృష్ణునిచే ఆశ్రయింపబడిన; శుష్క కదంబశాఖా= ఎండిపోయిన కదంబ తరువు యొక్క కొమ్మ; మధుద్రవైః= మకరంద రసాలచేత; ఉల్బణ హర్ష బాష్పై= ప్రకటితమైన ఆనందబాష్పాలు కలిగినట్టి; కేసరజాలకేన= కింజల్కాల సమూహంచేత; రోమ+అంచితా= గగుర్పాటుచే ఒప్పినట్టి; పత్ర+అంకురైః = చిగురుటాకులచేత, మకరికాది పత్రరేఖలచేత; చిత్రతనుః= వింతయైన, ఆకర్షణీయమైన రూపంకలదై; చకాశే= ప్రకాశించెను.

**తా॥** ఎండిపోయిన కడపచెట్టుకొమ్మకు, తనమీద నెక్కిన కృష్ణుణి మహిమ చేత మకరంద రసాలు ఒల్కగా ఆనందబాష్పాలు అధికమయ్యాయి. కేసరాలు, రోమాలు గగుర్పొడిచినట్లైనాయి. చిగుళ్ళు పొటమరించడం వల్ల మకరికాది పత్ర రేఖలతో చిత్రింపబడిన, ఆకర్షణీయమైన శరీరంగలదై ప్రకాశించింది. పడుచుతనం పొంగుతున్న నాయికా రూపంవలె కదంబ తరుశాఖ శోభించింది. మధుద్రవాదుల యందు ఆనందబాష్పాదులను ఆరోపించడం వల్ల ఏకదేశ వివర్తి రూపకాలంకారం. నాయికాత్వరూపణం వ్యంజితం. "స్ఫుటం ప్రవ్యక్తముల్బణమ్" (అమరం).

*377.* నిపత్య. సంక్షిప్త పయోధికల్పే
మహాహ్రదే మందరపోత రమ్యః।
విషవ్యపోహాదమృతం విధాతుం
స్వాదూదయం క్షోభయతిస్మ సింధుమ్॥ 112

**అర్థం:** మందరపోతరమ్యః= మందర పర్వతం యొక్క పిల్లవలె రమణీయంగా ఉన్న శ్రీకృష్ణుడు; సంక్షిప్త పయోధికల్పే= చిన్న సముద్రంతో సమానమై యున్న; మహాహ్రదే= గొప్పమడుగునందు; నిపత్య= పడి; విషవ్యపోహాత్= విషం పోవడం వల్ల; అమృతం= జలం; స్వాదు+ఉదయం= మాధుర్యం కలిగియుండునట్లుగా; విధాతుం= చేయడానికి; సింధుం= సముద్రాన్ని, (యమునా) నదిని; క్షోభయతి, స్మ= కలత పెట్టాడు.

**తా॥** పూర్వం మందరాచలం, పాలకడలి యందు హాలాహలం విజృంభించగా దాన్ని పోగొట్టి మధురమైన అమృతం వెలువడుదాకా ఆ కడలిని చిల్కినట్లే, శ్రీకృష్ణుడు చిన్న మందర పర్వతంలాగా శోభించాడు. కృష్ణుడు ఆ యమునా నదిలో దూకి కాళియ సర్పవిషాన్ని పోగొట్టి, స్వచ్ఛమైన చల్లని మధురమైన నీరుండునట్లు చేయడానికి చిన్న సముద్రంగా ఉన్న నదిని క్షోభింపజేశాడు. 'అమృత' శబ్దానికి జలం అని అర్థం.

"పయః కీలాల మమృతం"- 'సింధు' శబ్దానికి సముద్రం, నది- అని అర్థ ద్వయం. "దేశేనద విశే ఽ షేబ్ధౌ సింధుర్నా సరితి స్త్రియామ్"- (ఉభయత్ర అమరం). "పోతః పాకోఽ ర్భకో డింభః"- (అమరం).

*378.* *కృతాహతిః కృష్ణ నిపాత వేగా*
*దానద్ధరూపా వితతై స్తరంగైః*
*సర్పాపసారౌషధి సంప్రయుక్తా*
*భేరీవ సా భీమతరం రరాస॥* 113

**అర్థం:** కృష్ణ నిపాతవేగాత్= కృష్ణునియొక్క (నీటిలోకి) దూకిన వేగం వల్ల; కృత+ఆహతిః= చేయబడిన నీటి దెబ్బగల; వితతైః= విస్తారమైన; తరంగైః= అలలచే; ఆనద్ధరూపా= (తోళ్ళతో) కట్టబడిన ఆకారంగల; సా= ఆ యమునా నది; సర్ప+అపసార+ఔషధి, సంప్రయుక్తా= పాములను తొలగించే ఔషధం చేత పూయబడినట్టి; భేరీవ= భేరివలె; భీమతరం= మిక్కిలి భయంకరంగా; రరాస= శబ్దించెను.

**తా॥** కృష్ణుడు కాళియ మడుగున్న యమునా జలమందు దూకిన వేగం వల్ల నీటికి కలిగిన దెబ్బ, యమునా నదిలో ఉన్న పాములను తొలగించే ఔషధంతో పూయబడిన చర్మంగల భేరీ వాద్యంవలె అతిభయంకరంగా ధ్వనించింది. భేరి– నగార చర్మంచేత కప్పబడి, దృఢంగా కట్టబడి యుంటుంది. ఆ చర్మంపైన ఒక విధమైన ఔషధం పూయబడియున్నందువల్ల, ఆ భేరీ తాడనంచేత కలిగిన శబ్దాన్ని, భేరీనాదాన్ని విని సర్పాలు పారిపోతాయనే విషయం ప్రసిద్ధం. వీటికి దెబ్బ తగిలినందువల్ల, యమున ఆకారం కూడా విస్తారమైన తరంగాలు చుట్టూరా వ్యాపించడం చేత తోళ్ళపట్టాలచే కట్టబడిన భేరి– నగార– యొక్క ఆకారంలాగా ఉండింది. కృష్ణుడు దూకిన వేగంచేత ఆయన పాదాలచే కలిగిన జలాభిఘాతం, భేరీ తాడనం వల్ల కలిగిన శబ్దం– ధ్వని– వలె భీషణంగా ఉండింది.

*379.* ప్రసక్త కృష్ణ ద్యుతిభి స్తదీయైః
పృషత్కణైరుత్పతితైః ప్రతూర్ణమ్।
అదృశ్యతాఽ ఉద్యోతి తమంత రిక్షం
పీతాన్ధకారై రివ తారకౌఘైః॥ 114

**అర్థం:** ప్రసక్త కృష్ణద్యుతిభిః= కలిసిన కృష్ణుని కాంతులుగల; తదీయైః= యమునా నదికి సంబంధించిన; ప్రతూర్ణం= మిక్కికి వేగంగా; ఉత్పతితైః= పైకి ఎగసిన; పృషత్ కణైః= జలబిందు కణాలచేత; అంతరిక్షం= ఆకాశం; పీత+అంధకారైః = త్రాగబడిన చీకట్లుగల; తారకా+ఓఘైః= చుక్కల సమూహాలచేత; ఆ ద్యోతితం, ఇవ= అంతటా భాసించినట్లు; అదృశ్యత= కనబడెను.

**తా॥** శ్రీకృష్ణుని మేఘశ్యామ వర్ణంగల దేహకాంతులతో కలిసి వృద్ధిపొంది, వేగంగా దూకినందువల్ల తొందరగా యమునా నదీజలబిందు కణాలు పైకి లేచినాయి. యమునానది నీలవర్ణం కలదైననూ పైకి ఎగసిన బిందు కణాలు మాత్రం తెల్లగా నున్నవైనందువల్ల ఆకాశం, అంధకారాన్ని మ్రింగి తళతళ మెరసే

నక్షత్రాల కాంతులతో ప్రకాశించినట్లు కనబడినాయి. పైకి వేగంగా ఎగసిన బిందుకణాలు నక్షత్రాల వలె ధవళంగా భాసించాయని ఉత్ప్రేక్ష.

*380. ఉదగ్ర సంరంభ ముదీక్ష్య భీతాః*
*తార్క్ష్య ధ్వజం తార్క్ష్య మివా౽౽ పతంతమ్।*
*ప్రపేదిరే సాగర మాశ్రితౌఘాః*
*కాకోదరాః కాళియ మాత్రశేషాః॥* 115

**అర్థం:** ఆశ్రిత+ఓఘాః= ఆశ్రయింపబడిన యమునా ప్రవాహంగలవైన; కాకోదరాః= నాగుపాములు; ఉదగ్రసంరంభం= ఎక్కువ కోపం కలిగిన; తార్క్ష్యం, ఇవ= గరుత్మంతునివలె; ఆ పతంతం= వచ్చి మీదపడుతున్న; తార్క్ష్య ధ్వజం= గరుడ ధ్వజుడైన కృష్ణుణ్ణి; ఉదీక్ష్య= పైకి లేచి చూచి; భీతాః= భయపడినవై; కాళియమాత్ర శేషాః, సంతః= కాళియుడు ఒంటరిగా మిగిలియుండునట్లు చేసినవవుతూ; సాగరం= సముద్రాన్ని; ప్రపేదిరే= పొందినాయి.

**తా॥** యమునా ప్రవాహంలో ప్రవేశించి నివసించియున్న నాగుపాములన్ని, అధిక కోపంతోనున్న గరుడ పక్షిలాగా వచ్చి తమ మీద పడనున్న గరుడధ్వజుడైన శ్రీకృష్ణుణ్ణి చక్కగా పైకి లేచి చూచి భయపడినాయి.

"సంరంభః సంభ్రమే కోపే"- (అమరం). తమను చంపడానికే వచ్చినాడను కొని, అప్పుడే కాళియుడనే ఫణిరాజు తప్ప, తక్కిన సర్పాలన్నీ భయంతో సముద్రంలోకి చేరబోయినాయి. యమునా హ్రదంలో కాళియుడొక్కడే మిగిలి యున్నాడు.

*381. అథాంభసః కాళియ నాగముగ్రం*
*వ్యాత్తాననం మృత్యు మివో జ్జిహానమ్।*
*భోగేన బధ్నంత మపోహ్య శౌరిః*
*ప్రహ్వీకృతం తత్ఫణ మారురోహ॥* 116

**అర్థం:** అథ= పాములు పోయినవెంటనే; శౌరిః= శ్రీకృష్ణుడు; ఉగ్రం= క్రూరమైన; వ్యాత్త+ఆననం= తెరచిన నోరుగల; మృత్యుం, ఇవ= మృత్యువువలె; అంభసః= నీటినుంచి; ఉత్+జిహానం= పైకి లేచి వస్తున్నదై; భోగేన= (తన) శరీరంతో; బధ్నంతం= కట్టివేస్తున్న; కాళియనాగం= కాళియుడనే చాలా పడగలుగల నాగసర్పాన్ని; అపోహ్య= విడగొట్టి; ప్రహ్వీకృతం= వంచబడిన; తత్ఫణం= ఆ కాళియుని పడగమీద; ఆరురోహ= ఎక్కెను.

**తా॥** యమున నుంచి సర్పాలన్నీ తొలగిపోయిన తర్వాత, కాళియుడు భయంకరంగా నోరు తెరచుకొన్న మృత్యువువలె కాటువేయడానికి నీటి నుంచి పైకి లేచి వస్తూనే శరీరంతో బంధిస్తున్న బహుఫణాలుగల కాళియ నాగును, ఉబ్బి విడిపించుకొన్నాడు కృష్ణుడు. *"నాగాః బహుఫణాః సర్పాః"*- (యదవ. ని.) కాళియుని పడగను వంచి కృష్ణుడు దానిమీదికి ఎక్కినాడు.

*382. సద్యోమహానీల మయీం ముకుందః*
*సపద్మ రాగామివ పాద పీఠీమ్।*
*క్రామన్ ఫణాంకాళియ పన్నగస్య*
*గ్రస్తోదితో భానురివావభాసే॥* 117

**అర్థం:** కాళియ పన్నగస్య= కాళియ నాగం యొక్క; ఫణాం= పడగను; మహానీలమయీం= ఇంద్రనీలమయమైన; సపద్మరాగాం= పద్మరాగంచే పొసగబడిన; పాదపీఠీం, ఇవ= పాదపీఠిని వలె; సద్యః= ఆ క్షణాననే; క్రామన్= ఆక్రమిస్తున్న; ముకుందః= కృష్ణుడు; గ్రస్త+ఉదితః= రాహువుచే గ్రసింపబడిన; భానుః, ఇవ= సూర్యునివలె; అవభాసే= భాసించాడు.

**తా॥** ఎక్కిన క్షణాననే కాళియుని పడగమీద అడుగుపెట్టాడు కృష్ణుడు. ఇంద్రనీలమణి మధ్య ఎఱ్ఱని పద్మరాగ మణిని పొదిగినట్లున్న పాదపీఠంవలె నల్లని పడగ నడుమ ఎఱ్ఱని మణితో శోభిస్తున్నది కాళియుని పడగ. కాళియుని పడగమీద అడుగు పెట్టిన కృష్ణునికి పాదపీఠంగా ఉండే ఆదిశేషుని మీద పాదం

పెట్టినట్లు సుఖంగా ఉండింది. విశాలంగా ఉన్న పడగమీద నిల్చిన కృష్ణుడు రాహుగ్రస్తమై ఉదయించిన సూర్యబింబంవలె అధికంగా భాసించాడు.

*383. ఫణామణీనాం ప్రభయోపరక్తే*
*ఖేలన్ బభౌ చక్రిణి చక్రపాణిః।*
*ప్రదోష సిందూరిత మంబువాహం*
*ప్రాచేతసో నాగ ఇవో పమృద్నన్॥* 118

**అర్థం:** ఫణామణీనాం= పడగలమీద ఉన్న మణులయొక్క; ప్రభయా= కాంతిచేత; ఉపరక్తే= ఎఱ్ఱబారిన; చక్రిణి= కాళియ సర్పమందు; ఖేలన్= ఆడుతున్న; చక్రపాణిః = కృష్ణుడు; ప్రదోష సిందూరితం= మలిసంజలో సిందూరంవలె ఎఱ్ఱబారిన; అంబువాహం= మేఘాన్ని; ఉపమృద్నన్= మర్దిస్తున్న; ప్రాచేతసః= వరుణునికి సంబంధించినట్టి; నాగః, ఇవ= (పడమటిదైన) దిగ్గజంవలె; బభౌ= ప్రకాశించాడు.

**తా॥** పడగలయందున్న మణుల కాంతిచేత అరుణ వర్ణశోభితమై కుండలాకారంగా శరీరాన్ని కలిగియున్న కాళియ సర్పంమీద చక్రధారియైన శ్రీకృష్ణుడు ఉల్లాసంగా ఆడుతుండెను. "*చక్రీ వ్యాళః సరీసృపః*"- (అమరం). సూర్యుడు అస్తమించే ప్రదోషకాలంలో సిందూర వర్ణంతో శోభించే మేఘాన్ని పీడిస్తున్న పడమటి (అంజనం అనే) దిగ్గజమో అన్నట్లు కృష్ణుడు భాసించాడు. "*ప్రచేతా వరుణః పాశీ*"- (అమరం). 'పశ్చిమ దిక్పాలకుడైన వరుణదేవునికి సంబంధించిన దిగ్గజం' అని 'ప్రాచేతసోనాగః' అనే మాటలకు అర్థం.

*384. ప్రణేముషాం ప్రాణభృతాముదీర్ణం*
*మనోవినేష్యన్ విషమాక్ష వక్త్రమ్।*
*అకల్పయత్ పన్నగ మర్దనేన*
*ప్రాయేణ యోగ్యాం పతగేంద్ర వాహః॥* 119

**అర్థం:** పతగేంద్ర వాహః= పక్షిరాజ వాహనుడైన శ్రీకృష్ణుడు; ప్రణేముషాం= నమస్కరించునట్టి; ప్రాణభృతాం= ప్రాణులయొక్క; ఉదీర్ణం= ఉద్రేకించిన; విషమ+అక్ష వక్త్రం= బేసి సంఖ్యగల, ఇంద్రియాలే ముఖాలుగా గల; మనః= మనస్సు (ల)ను; వినేష్యన్= వినయాన్ని పొందింపగోరుతున్నవాడై; పన్నగమర్దనేన= కాళియుణ్ణి మర్దించడం చేత; విషమాక్ష వక్త్రం= క్రూరమైన కన్నులు, ముఖాలుగల; మనః= మనస్సును; వినేష్యన్= దుర్మార్గం నుంచి మరల్చగోరుతున్నవాడై; ప్రాయేణ= తరచుగా; యోగ్యాం= అభ్యాసాన్ని; అకల్పయత్= చేసినాడన్నట్లున్నది.

**తా॥** గరుడ వాహనుడు నమస్కారంచేసే ప్రాణులయొక్క ఉద్రేకించినట్టి సమసంఖ్యలేని ఇంద్రియాలే ముఖాలుగా కలిగియున్న మనస్సులను వినయంగా ఉండునట్లు చేయగోరేవాడు. కృష్ణుడు పన్నగమర్దనం చేత క్రూరమైన కన్నులు ముఖాలుగల మనస్సును దౌష్ట్యం నుంచి నివర్తింపజేయ గోరినవాడై కౌశలాన్ని అభ్యసిస్తున్నట్లున్నది.

**వ్యాఖ్య:–** గరుడ వాహనుడైన కృష్ణుడు కాళియమర్దనం చేత దాని దుష్టమైన మనస్సును సంస్కరించడానికి అభ్యాసం చేస్తున్నట్లున్నదని వర్ణితం.

"*కవయస్తు బహుళం ప్రయుంజతే*". మహాకవులు విశాలభావాలను ప్రకటించడానికి సముచిత పదాలను సంగ్రహించి ప్రయోగిస్తుంటారు. 'పతగేంద్ర వాహనుడు' అనే పదం సాభిప్రాయం. పన్నగమర్దన సామర్థ్యమున్న పక్షిరాజును వాహనంగా కలవాడు శ్రీకృష్ణుడు అనే అభిప్రాయాన్ని గర్భీకరించుకొన్న పదమిది. ఇది పరికరాంకురాలంకార లక్షణం. "వాహోనాయానేऽశ్వేవృషభేऽపిచ"– (రత్నమాల).

వినమ్రులైన ప్రాణుల మనస్సు వికృతిజెంది క్రౌర్యంగా వర్తించే విధంగా ఉన్నప్పుడు వారి మనస్సులను వినయంగా ఉండే రీతిగా సంస్కరించడానికి అపేక్షించే, వినయన క్రియా కౌశలాన్ని సంపాదించడానికి పన్నగమర్దనం అభ్యాసంగా కృష్ణునిచే స్వీకరింపబడిందని సారాంశం.

ఒక వ్యక్తి, బాక్సింగ్ ముష్టియుద్ధంలో నైపుణ్యం సంపాదించడం కోసం దృఢంగా ఉండే దిండులాంటి వస్తువును వ్రేలాడవేసి, ఆ వస్తువుమీద గట్టి పిడికిలితో పలుసార్లు గ్రుద్దుతూ, అభ్యాసం చేయడం లోకపరిపాటి కదా!

భగవానునికి నమస్కరించే ప్రజలు మనస్సు విపరీతంగా వర్తించడానికి ఐదు జ్ఞానేంద్రియాలే ముఖాలుగా కలది. ఐదు కర్మేంద్రియాలు కూడా ముఖాలుగా కలదైనను విషమంగా- సమస్థితిలో లేనివని చెప్పడానికి పది ఇంద్రియాలను విభజించి చెప్పబడింది. విషమ శబ్దానికి బేసి సంఖ్య కలిగినవని, క్రూరమైనవని అర్థం. అందువల్ల 'విషమాక్ష వక్త్రం' వికారంగా వున్న ఇంద్రియాలే మనస్సుకు ముఖాలని స్పష్టీకృతం. ఇది మనస్సుకు విశేషణం.

వికృతిజెందినట్టి మనస్సులను బాగుజేయదలచినాడు కృష్ణుడు. ప్రాణభృతాం 'మనాంసి' అని బహువచనం ఉండవలసిందే, అయినా, జాత్యేక వచనంగా 'మనః' అని ఏకవచనం ప్రయుక్తమని గ్రహించాలి.

*"చక్షురాద్యుక్త విషయం పరతంత్రం బహిర్మనః"*- అన్నట్లు,కన్నులు మొదలైన పంచజ్ఞానేంద్రియాలకే, మనస్సుకు వక్తృత్వంగా ఔచిత్యమని చెప్పబడింది.

*"అక్షమింద్రియ మక్షోనా రథాంగ వ్యవహారయోః"*-(రత్నమాల). ఇట్టి మనస్సుతో సాధర్మ్యాన్ని, సమానధర్మాన్ని చెప్పడానికి 'విషమాక్ష వక్త్రం, ఉదీర్ణం' అనే రెండు విశేషణ పదాలు పన్నగానికి కూడా వర్తిస్తున్నాయి. కాళియుడు కూడా ఉద్రేకం కలవాడు, ఉద్వృత్తుడు. నిప్పులు చెరుగుతున్న కన్నులూ, రెండు నాలుకలను బయటకు దీసి విషజ్వాలలను వ్యాపింపజేస్తూ, బుస్సు, బుస్సు మనే ముఖాలూ కలవాడు.

*"తస్యాక్షిభిర్గరళ ముద్వమతః శిరస్సు యద్యత్సమున్న మతినిశ్వసతో రుషోచ్చైః"*- శ్రీ భాగవత సూక్తిచేత క్రూరమైన కన్నులు, పలుముఖాలు కలవాడు కాళియుడు అని స్పష్టమవుతున్నది. అంతా వికృతత్వమే. మనస్సుతో కూడి

దశేంద్రియాలు- ఏకాదశేంద్రియాలు ఎట్లు విషమం- బేసిసంఖ్యగా క్రూరంగా ఉన్నవో, అట్లే కాళియుని ముఖాలు కూడా విషమమైనవే.

*"యద్యచ్ఛిరోన నమతేఽంగ శతైక శీర్షః, తత్తన్మమర్ద ఖలదండ ధరోంఘ్రి పాతైః"* (శ్రీ భాగవతం. 10-16-28) కాళియ సర్పానికి నూట యొక్క శిరస్సులుండెను. అది యెప్పుడు ఏ శిరస్సును వంచకుండెనో అప్పుడా శిరస్సును ప్రచండ దండధారియైన శ్రీకృష్ణుడు తన పాదాల త్రొక్కుడులతో నలగగొట్టుతుండెనని అర్థం. కాళియ మర్దనం చేత కృష్ణుడు, చెడ్డ మనస్సును వినయంగా ఉండునట్లు చేసే కౌశలాన్ని, సామర్థ్యాన్ని సంపాదించడం కోసం అభ్యాసం చేస్తుండెను అని ఉత్ప్రేక్షింపబడింది. 'ప్రాయేణ' అనే మాట ఉత్ప్రేక్షను సూచిస్తుంది.

*"మన్యే శంకే ధ్రువం ప్రాయోనూన మిత్యేవ మాదిభిః।*
*ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైః ఇవ శబ్దోఽపి తాదృశః॥"*

ఈ పదాలన్ని ఉత్ప్రేక్షా వ్యంజకాలు. యోగ్యాప్రతిపాదన సిద్ధికోసమే పన్నగమర్దనం చేయబడింది.

*"సుబహుశ్రుతోఽప్య కృతయోగ్యః కర్మస్వయోగ్యోభవతి"*- అన్నాడు సుశ్రుతుడు. బాగా చదువు నేర్చిన వాడైనా పనిచేసే నేర్పులేకపోతే, పనిచేయడానికి యోగ్యుడు కాడని అర్థం. శ్రీమద్రామాయణంలోనూ *"అస్త్రయోగ్యాంతరేష్వపి"* అని 'యోగ్యా' శబ్దం ప్రయుక్తం. 'యోగ్యాం' అనే పాఠమూ ఉంది.

*"యోగ్యం క్లీబే పూపయాన చందనాభ్యాసవాచకమ్।*
*ప్రవీణోపాయ వచ్ఛక్త యోగార్హేష్వప్య యం త్రిషు॥"*

అని 'నానార్థరత్నమాల' కూడా ఆ మాటకు అనుకూలంగానే ఉంది. ఆ విధంగా ఉన్ననూ-

*"యోగ్యః ప్రవీణ యోగార్హోపాధి శక్తేషు వాచ్యవత్।*
*క్లీబ మృద్ధ్యౌషధే పుష్యేనాస్త్ర్యభ్యాసార్కయోషితోః॥"*

అనే మేదినీ కోశాన్ని, సుశ్రుతాది ప్రయోగ బాహుళ్యాన్ని అనుసరించి 'యోగ్యాం' అనే స్త్రీ లింగ పాఠమే ఆదరింపబడింది అని శ్రీ అప్పయ్య దీక్షితులచే వ్యాఖ్యాతం.

*385.* *తద్భోగ బృందే యుగపన్ముకుందః*
*చారీ విశేషేణ సమైక్షి నృత్యన్।*
*పర్యాకులే వీచిగణే పయోధేః*
*సంక్రాంత బింబో బహుధేవ చంద్రః॥* 120

**అర్థం:** యుగపత్= ఒకే సమయాన; తత్+భోగబృందే= ఆ కాళియ సర్పం యొక్క పడగల సమూహమందు; చారీ విశేషణ= ఒక్కపాదాన్ని ఎత్తివైచి చిత్రంగా; నృత్యన్= నర్తిస్తుండిన; ముకుందః= శ్రీకృష్ణుడు; పయోధేః= సముద్రం యొక్క; పర్యాకులే= చంచలమైన; వీచిగణే= తరంగాల సమూహమందు; బహుధా= పలువిధాలుగా; సంక్రాంత బింబః= సంక్రమించిన బింబాలుగల; చంద్రః, ఇవ= చంద్రునివలె; సమైక్షి= కనబడుతుండెను.

**తా॥** ఒకే సమయంలో కాళియుని నూటయొక్క పడగల మీద ఒక్కపాదం చేతనే విచిత్రంగా నాట్యం చేస్తుండెను కృష్ణుడు. అప్పుడు సముద్రంలోని ఉవ్వెత్తుగా లేచి చంచలంగా ఉన్న తరంగాల మీద సంక్రమించిన అనేక బింబాలుగల చంద్రునిలాగా కృష్ణుడు కనబడినాడు.

*"భోగోరాజ్యే ఘనే సౌఖ్యే పాలనాభ్యవహారయోః।*
*ఫణేదేహే చ సర్పస్య వేశ్యాదీనాంభృతావపి॥"* (వైజయంతి).

'చారీ విశేష' మంటే ఒకే పాదం చేత కాలు, పిక్క, తొడ, నడుము ఒక్క సమయమందే అల్లల్లాడునట్లు, సమంగానూ, చంచలంగా, సుడిలాగా తిరుగుతూ చేసే విచిత్రమైన నాట్యమని అర్థం. 'చర' ధాతువుకు కరణార్థమందు 'ఇఞ్' ప్రత్యయం చేరిన తర్వాత 'కృదికారాదక్తినః' అని 'ఙీష' అనేది చివర చేరడం వల్ల 'చారీ' అనే రూపమేర్పడింది.

"విచిత్ర మంఘ్రి జంఘోరు కటికర్మ సకృత్ కృతమ్।
చారీస్యాత్ కరణే జీషి చరేరిఙ్ ప్రత్యయాంతతః॥" (సంగీత రత్నాకరం)

"ఏక పాదప్రచారోయః స చారీత్య భిధీయతే॥" (శారదా తనయః)

సమ, అస్థిర, ఆవర్తేత్యాది రూపమైన నృత్యాన్ని 'చారీ' అంటారు. సముద్ర తరంగాలమీద చంద్రుని ప్రతిబింబాలు నాట్యమాడుతున్నట్లు కనబడినాడు కాళియ ఫణాల మీద ఆడుతున్న కృష్ణుడు. అద్భుతమైన నృత్యం లాగా ఉంది కాళియమర్దన.

*386. తదుత్త మాంగం పరికల్ప్య రంగం*
*తరంగ నిష్పన్న మృదంగ నాదమ్।*
*ప్రశస్య మాన స్త్రి దశైర కార్షీత్*
*అవ్యాహతా మారభటీ మనంతః॥* 121

**అర్థం:** అనంతః= శ్రీకృష్ణుడు; తత్+ఉత్తమ+అంగం= ఆ కాళియుని శిరస్సును; రంగం= నాట్యస్థానంగా; పరికల్ప్య= కల్పించి; తరంగ నిష్పన్న మృదంగ నాదమ్= కెరటాల సవ్వడియే మృదంగనాదంగా (అమర్చి); త్రిదశైః= దేవతలచేత; ప్రశస్య మానః (సన్)= పొగడబడుతున్నవాడై; అవ్యాహతాం= అప్రతిహతమైన; ఆరభటీం= నటనయొక్క ఆర్భాటాన్ని; అకార్షీత్= చేసెను.

**తా॥** శ్రీకృష్ణుడు కాళియుని శిరస్సును నాట్యరంగమైనట్లు కల్పిస్తే యమునా జలతరంగాల ధ్వని మృదంగనాదమయింది. "అనంతోనాగరాడ్విష్ణుః"- (విశ్వ.ని.) దేవతలందఱు భళా! అని కొనియాడుతుండగా అడ్డులేని నాట్యాన్ని ఆర్భాటంగా ఆడినాడు. అనంతుడు కాబట్టి ఆటకు అంతం లేకుండా, కొంచెమైనా ఆగకుండా, ఆర్భాటంగా కాళియఫణాల సమూహాన్ని రంగస్థలం చేసి నృత్యం చేస్తుంటే, నదీతరంగాల ధ్వనియే మృదంగ నాదమయింది. ఈ అద్భుత నాట్యాన్ని చూస్తుండే దేవతలు ఆనందంతో కృష్ణుణ్ణి పొగడుతుండినారు.

387. ఏకేన హస్తేన నిపీడ్య వాలం
పాదేన చైకేన ఫణా ముదగ్రామ్।
హరిస్తదా హన్తు మియేష నాగం
స ఏవ సంసారమి వాశ్రితానామ్॥ 122

**అర్థం:** హరిః= శ్రీకృష్ణుడు; తదా= అప్పుడు; ఏకేన= ఒక; హస్తేన= చేతితో; వాలం= తోకను; నిపీడ్య= ఇరుకపట్టి; ఏకేన= ఒక; పాదేన= కాలుతో; ఉత్+అగ్రాం= పైకె ఎత్తినట్టి; ఫణాం, చ= పడగను కూడా; నిపీడ్య= అణచివేసి; సః, ఏవ= ఆ కృష్ణుడే; ఆశ్రితానాం= ఆశ్రితుల యొక్క; సంసారం, ఇవ= సంసారాన్ని వలె; నాగం= కాళియనాగును; హంతుం= నశింపజేయడానికి; ఇయేష= తలచినాడు.

**తా॥** శ్రీకృష్ణుడు నర్తన చేస్తున్నప్పుడే ఎడమచేత్తో సర్పం యొక్క తోకను పట్టుకొని పీడించి, కుడికాలుతో పైకి లేచిన పడగను అదిమివేసి తొక్కుతుండెను. ఆ సమయాన ఆ కృష్ణుడు తనను ఆశ్రయించిన భక్తుల సంసారాన్ని నశింపజేయ దలచినట్లే కాళియ సర్పాన్ని నశింజేయగోరినాడు. ఆశ్రితుల సంసార సర్పాన్ని హతమార్చే వాడే కదా కృష్ణుడు. యమునా నదీజలం విషమయమవడమే కాక, కాళియుని విషజ్వాలలచేత పరిసర ప్రాంత వాతావరణమంతా కలుషితమై పశుపక్ష్యాదులు, చెట్లు చేమలు కూడా నశిస్తుంటే, కృష్ణుడు కాళియ సర్పాన్ని హతమార్చగోరాడు.

388. సపన్నగీనాం ప్రణిపాతభాజాం
ద్రవీభవన్ దీన విలాపభేదైః।
ప్రసాదితః ప్రాదిత భర్తృభిక్షాం
కిమస్య నః స్యాదపదం దయాయాః॥ 123

**అర్థం:** ప్రణిపాత భాజాం= పాదాలకు నమస్కరించే; పన్నగీనాం= కాళియనాగ పత్నుల యొక్క; దీన విలాపభేదైః= దుఃఖపూరితమైన ప్రార్థనలచేత; ద్రవీభవన్=

మనస్సు కరిగిన వాడైన; సః= ఆ కృష్ణుడు; ప్రసాదితః= ప్రీతిగలిగినవాడై; భర్తృభిక్షాం= పతిభిక్షను; ప్రాదిత= ప్రసాదించాడు; నః= (సంసారులమైన) మన విషయంలో; అస్య= శ్రీకృష్ణ భగవానుని యొక్క; దయాయాః= దయకు; అపదం= స్థానం కానిది; కిం, స్యాత్= ఏమి ఉండును?

**తా॥** కాళియనాగపత్నులు కృష్ణుణ్ణి పాదాలమీద పడి నమస్కరించారు. పతియొక్క ప్రాణం పోతుందనే భయంతో ఏడుస్తూ పలురీతుల ప్రార్థన చేశారు. శ్రీకృష్ణుని మనస్సు కరిగింది. అనుగ్రహం కలిగింది. నాగపత్నులకు మాంగల్య భిక్షను పెట్టాడు. అతి క్రూరమైన సర్పాన్ని వదలివేశాడు. శరణాగతి చేసిన వారి యొక్క అపరాధాలను సహించే, దీన దయాళుడైన భగవానుని కృపకు పాత్రులు కాని వారెవరున్నారు? కాళియుని అఖర్వ గర్వాన్ని అణచివేసిన శ్రీకృష్ణుడు నాగపత్నుల ప్రార్థనవల్ల కృపాపరవశుడై కాళియుణ్ణి చంపక, ప్రాణంతో విడిచి పెట్టాడు. భగవద్దయ ప్రణిపాతప్రసన్న కదా!

*389. లోలాపతచ్చరణ లీలాహతి క్షరిత హాలాహలే నిజఫణే*
*నృత్యంత మప్రతిఘకృత్యం తమప్రతిమ మత్యంత చారు వపుషమ్।*
*దేవాదిభిః సమయ సేవాదరత్వ రితహేవాక ఘోషముఖరైః*
*దృష్టావధాన మథుతుష్టావ శౌరి మహిరిష్టావరోధ సహితః॥*

124

**అర్థం:** అథ= తర్వాత; అహిః= కాళియ సర్పం; ఇష్ట+అవరోధ.సహితః (సన్)= ప్రియురాండ్రైన అంతఃపుర స్త్రీలతో కూడినవాడై; లోల–హాలాహలే/ లోల= చలిస్తున్న; ఆ పతత్= పడుతున్న; చరణ= పాదం యొక్క; లీలాహతి= వినోదపు దెబ్బచేత; క్షరిత= కారిపోయిన; హాలాహలే= విషం కలిగిన; నిజఫణే= తన పడగయందు; నృత్యంతం= నాట్యమాడే వాడును; అప్రతిఘకృత్యం= ఎదురులేని చేష్టితాలు కలవాడును; అప్రతిమం= సాటిలేనివాడును; అత్యంత చారువపుషం= మిక్కిలి అందమైన శరీరం కలవాడును; సమయ–ముఖరైః/ సమయ= ఆ సమయాన; సేవా=

సేవించే; ఆదర+ ఆదరంగల; త్వరిత= తొందరచేత; హేవాక= స్వేచ్ఛగా; ఘోష= స్తుతించే నాదాలచే; ముఖరైః= ధ్వనిస్తున్న; దేవ+ఆదిభిః= దేవతలు మొదలైన వారిచేత; దృష్ట+అవధానం= చూడబడిన ధారణ పోషణ స్థితిగల; శౌరిం= శూరుడైన కృష్ణుణ్ణి; తుష్టావ= స్తోత్రం చేశాడు.

**తా॥** కాళియుడు తన పత్నులతో కూడి శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేశాడు. తన పడగల మీద వినోదంగా నాట్యం చేసిన విధానం కాళియునికి, తమ పతియొక్క ప్రాణభిక్షను ప్రసాదించినందున కాళియుని పత్నులకు కూడా ప్రమోదావహ మయింది. కాళియుని శిరస్సులమీద నాట్యం పరాక్రమంతో కూడిన ఒక లీల.

*లోలా పతచ్చరణ లీలా హతిక్షరిత హాలాహలే నిజఫణే:*- కాళియుడు దీర్ఘకాయుడు, శతైక శీర్షుడు. మడుగులో దూకిన కృష్ణుణి శరీరాన్ని తన దేహంతో చుట్టి కట్టివేయగా ఊపిరాడని కృష్ణుడు తన శ్వాసను బిగించి ఉబ్బిపోయాడు. కాళియుని కాయం సడలిపోగా కాళ్ళతో తన్ని వాని తలను వంచి, తలమీదికెక్కాడు. పాము, తలను స్వయంగా మీదికెత్తితేగాని పడగను విప్పదు కదా! విశాలమైన దాని పడగల సమూహం ఒక నాట్యరంగమయింది. స్వయంగా వంచక మీదికెత్తిన పడగ మీద దూకి తైతక్కలాడాడు కృష్ణుడు. అప్పుడు కృష్ణుని పాదం అడుగునుంచి నడుము వరకు మెరుపులాగా కదలుతూ పడగమీద పడుతుండింది. ఆ చరణ లీలాహతి, ఆపాదాభిఘాతం తనకు లీల, వినోదంగానే ఉండింది కాని కాళియునికి ప్రాణ సంకటమయింది. ఆది అప్రతిఘ కృత్యం. 'ప్రతిఘ' అంటే కోపంతో వేసే దెబ్బ. "ప్రతిఘౌ రుట్ ప్రతీఘాతౌ" (వైజయంతి). ఎదురుదెబ్బ లేని కృత్యం, మర్దనం అది. కాళియ సర్పం యొక్క తలప్రాణం తోకకు రాకుండా, దాని తోకను కృష్ణుడు తన ఎడమ చేతితో దృఢంగా చిక్కబట్టి కుడికాలుతో పడగమీద విచిత్రంగా నృత్యం చేశాడు. కాళియుని విషమంతా కక్కించాడు. కాళియుని ఫణా మణిమండలంపైన నాట్యమాడే కృష్ణుని ఆకార- రూపసౌందర్యం ఎంతో చూడముచ్చటగా నుండింది. శ్రీకృష్ణుడు అప్రతిముడు- సామాన్యుడు కాదు- అని, అతని పరాక్రమలీలను సేవించవలెననే ఆశతో, ఆ సమయాన దేవసిద్ధ

గంధర్వాదులెందరో వేగంగా వచ్చి, ఆ నృత్యరూపధారణమూ, ఆ వేషానికి తగినట్లు అద్వితీయమైన నృత్తౌచిత్య పోషణమూ అద్భుతంగా ఉన్నదని హేవాకంగా- ఎవరికి తోచినట్లు వారు స్వేచ్ఛగా శ్రీకృష్ణ భగవానుని స్తుతించారు. "హే వాకః స్వాచ్ఛంద్యం"- (చక్రవర్తి). ఆ దేవప్రముఖుల స్తోత్రనాదం భూనభోంతరాళంలో ప్రతిధ్వనించింది.

కాళియుడు, తన గర్వాన్ని మాత్రం అణచివేసి తనను రక్షించాడని, తమ పతియొక్క ప్రాణాన్ని రక్షించుమని ప్రార్థించి అనుగ్రహింపబడిన తన అవరోధుల- అంతఃపుర స్త్రీలతో కూడి, శ్రీకృష్ణభగవానుని సర్వజన సౌహార్దాన్ని ప్రశంసించాడు.

*"అవరోధోఽ ంతఃపుర స్త్రియాం"*- (నిఘంటువు). ఈ సన్నివేశం అందరిచేత స్తుతింపబడింది. 'అనుప్రాసం' అనే శబ్దాలంకారంగల శ్లోకమిది. దేశికులు నృత్యానికి అనుగుణమైన ఈ ఛందోవృత్తాన్ని రచించారు. ఇట్టి రచన కవితార్కిక కేసరికే సరి.

*390. హరిచరణ సరోజ న్యాస ధన్యోత్తమాంగః*
*శమిత గరుడ భీతః సానుబంధ స్సనాగః।*
*యుగ విరతి దశాయాం యోగనిద్రానురూపాం*
*శరణ మశరణః సన్ ప్రాపశయ్యాం తదీయామ్॥* 125

**అర్థం:** హరి-అంగః/ హరి= శ్రీకృష్ణునియొక్క; చరణ సరోజ= పాదపద్మాల యొక్క; న్యాస= ఉంచడంచేత; ధన్య= కృతార్థమైన; ఉత్తమాంగః= శిరస్సులు గలవాడును; శమిత గరుడ భీతః= పోగొట్టబడిన; గరుడ= గరుత్మంతుని వలన; భీతః= భయం గలవాడును; సానుబంధః= తన వారితో కూడియున్న వాడునైన; సః = ఆ; నాగః= కాళియుడు; యుగవిరతి దశాయాం= యుగాంతకాలమందు; యోగనిద్రా+అనురూపాం= యోగనిద్రకు తగినట్టి; తదీయాం= భగవత్సంబంధమైన; శయ్యాం= పడకగా నుండే సముద్రాన్ని; అశరణఃసన్= వేరే దిక్కులేక; శరణం= నివాస స్థానంగా; ప్రాప= పొందెను.

**తా॥** శ్రీకృష్ణుని పాదముద్రలు తన తలలమీద పడినందువల్ల తనను ధన్యునిగా భావించాడు. యమునా హ్రదంలో తపస్సు చేస్తున్న సౌభరి మహర్షి ఒకనాడు మత్స్యపతిచేత, తన సంతానాన్ని పొట్టనబెట్టుకొంటున్న గరుడ పక్షినుంచి రక్షించడానికి ప్రార్థింపబడినాడు. అందువల్ల ఆ గరుడుడు ఈ యమునా ప్రాంతానికి వస్తే మరణించునని శాపం పెట్టాడు సౌభరి. ఆ విషయం తెలిసిన కాళియుడు గరుడునికి ఆహారం కాలేక ఈ యమునకు సముద్రం నుంచి వచ్చి చేరి ఇంత కాలాన్ని గడిపాడు. "నా పాదముద్రలు నీ తలల మీద ఉన్నందువల్ల గరుడుడు నిన్ను చంపలేడు, భయపడవలదు. కాబట్టి ఇప్పుడు నీవు ఈ యమునా నదినుంచి నీ మొదటి చోటుకు వెళ్ళిపొమ్ము" అని కృష్ణుడు కాళియునికి అభయమిచ్చి ఆజ్ఞాపించాడు. ఈ వృత్తాంతమే 'శమిత గరుడ భీతిః' అనే పదం వల్ల విశదమవుతున్నది. గరుడుని వల్ల పీడ విరగడై పోయింది.

*సానుబంధః* :- పుత్రమిత్ర కళత్రాదులతో కూడియున్నాడు కాళియుడు.

*"దోషోత్పాదేఽనుబంధః స్యాత్ ప్రకృత్యాదిషు నశ్వరే।*
*ముఖ్యాను యాయిని శిశౌ ప్రకృత స్యానువర్తనే॥"* (అమరం)

ప్రళయకాలమందు భగవానుని యోగనిద్రకు సముచిత శయ్యగానుండే సముద్రానికి గత్యంతరం లేక చేరుకొని, తన నివాస గృహంగా చేసుకొని ఉజ్జీవించాడు. *"శరణం గృహ రక్షిత్రోః"*- (అమరం). పౌరాణిక కథను ఉట్టంకించిన ఈ శ్లోకం మాలినీ వృత్త రచితం.

*391.* *వివిధ మునిగణోప జీవ్య తీర్థా*
*విగమిత సర్పగణా పరేణ పుంసా।*
*అభజత యమునా విశుద్ధి మగ్ర్యాం*
*శమిత బహిర్మత సంప్లవాత్రయీవ॥* 126

**అర్థం:** వివిధ-తీర్థా/ వివిధ= పలు విధాలుగా ఉండిన; మునిగణ= ఋషులకు; ఉపజీవ్య= సేవించదగిన; తీర్థా= రేవులు కలిగినట్టి; పరేణ= పరమాత్మయైన; పుంసా= శ్రీకృష్ణునిచేత; విగమిత సర్పగణా= తొలగింపబడిన సర్పాల సమూహంగల; యమునా= యమునానది; వివిధ మునిగణ+ఉపజీవ్యతీర్థా= అనేక ప్రకారాలుగా నున్న మునీశ్వర బృందానికి సేవింపదగిన వేదాంగాలు గల; పరేణ= ఉత్కృష్టుడైన; పుంసా= పురుషునిచేత; శమిత బహిర్మత సంప్లవా= పోగొట్టబడిన పాషండుల సంకరం గల; త్రయీ, ఇవ= వేదవిద్యవలె; అగ్ర్యాం= ఉత్కృష్టమైన; విశుద్ధిం= పరిశుద్ధిని; అభజత= పొందెను.

**తా॥** శ్రీకృష్ణ భగవానుడు తన పట్ల భక్తిని కలిగియున్న కాళియునికి తన స్థానాన్ని కృపజేసి ఉంచాడని గత శ్లోకం వల్ల తెలిసింది కదా! పరమ పురుషుడైన శ్రీకృష్ణుడు ఒక్క పాము కూడా మిగులకుండా అన్నిటినీ బయటకు పంపించిన తర్వాత వేదమూర్తియైన సూర్యుని పుత్రికయైన యమునానది మిక్కిలి పరిశుద్ధిని పొందింది.

అనేక ముని బృందాలు సాముదాయికంగా ప్రవేశించి స్నానానుష్ఠానాలను ఆచరించడానికి సముచితమైన రేవులను కలిగియున్న సూర్యతనయ (యమున), ఆర్షజనులందరు సదాచారాలను, ధర్మాలను పరిశీలించి తెలుసుకోవడానికి తగిన మీమాంసాది శాస్త్రాలలో, వేదాంగాలలో, వేదార్థాలను నిర్ధారణ చేసే నైపుణ్యం గల పురుషుని చేత వేద బాహ్యుల ప్రసంగాలు తొలగింపబడి యున్న (త్రివేదీ- ఋగ్యజుస్సామ వేదాల సమాహారమైన) వేదవిద్యలాగా చాలా పరిశుద్ధిని పొంది యున్నది.

"తీర్థం మంత్రాద్యుపాధ్యాయ శాస్త్రే ష్వంభసి పావనే।
పాత్రోపాయావతారేషు స్త్రీ పుష్పే యోగయజ్ఞ యోః॥" (వైజయంతి)

శ్లేషతో కూడిన ఉపమాలంకారం కలగియున్న ఈ శ్లోకం 'పుష్పితాగ్రా' వృత్త రచితం.

"అయుజి నయుగరేఫతో యకారో,
యుజిచ నజౌ జరగాశ్చపుష్పితాగ్రా॥"

అని ఈ అర్ధ సమవృత్త లక్షణం.

392. అవధూత భుజంగ సంగదోషా
హరిణా సూర్యసుతా పవిత్రితాచ।
అపితత్పద జన్మనః సపత్న్యా
బహుమంతవ్యతరా భృశంబభూవ॥ 127

**అర్థం:** హరిణా= శ్రీకృష్ణుని చేత; అవధూత భుజంగ సంగదోషా= తొలగింపబడిన సర్పంయొక్క సంసర్గ రూపమైన దోషం గలిగిన; పవిత్రితా, చ= పావనం చేయబడినదియునైన; సూర్యసుతా= యమునా నది; తత్+పద, జన్మనః= ఆ విష్ణువు యొక్క పాదం నుంచి ఉద్భవించినట్టి; సపత్న్యాః, అపి= సవతియైన గంగానది కంటె కూడా; భృశం= చాలా ఎక్కువగా; బహుమంతవ్యతరా= బహుమానింప తగినది; బభూవ= ఆయెను.

**తా॥** శ్రీకృష్ణుడు యమునా నదికి కాళియ సర్పంతో సహవాసం కలిగిన దోషాన్ని తొలగించాడు. భుజంగ సంగమంటే విటునితో సంసర్గమని అర్థం. ఒక మంచి స్త్రీకి జారునితో సహవాసం ఏ విధంగా దోషాలకు కారణమవుతుందో అట్లే, సూర్యుని పుత్రికయైన యమునకు కాళియునితో కూడినందుకు కారణమైన దోషాన్ని శ్రీకృష్ణుడు పూర్తిగా పోగొట్టినాడు. పైగా యమునా జలంలో దూకి, మునిగి లేచినందువల్ల పైకి ఎగసిపడుతూ వ్యాపించిన అలలు కలిగిన కారణంగా కృష్ణుడు యమున యొక్క పాపాలనన్నిటినీ పంచబంగాళం చేసి యమునను విశేషంగా పావనం చేశాడు. అంతేకాదు, పరమర్షులెందరో ఆయా రేవుల ద్వారా యమునా సలిలాల్లో దోగి- స్నానం చేసి, నిత్యానుష్ఠానాలను ఆచరించినందు వల్ల విష్ణుపాదోద్భవయైన తనకు సవతియైన గంగానది కంటే కూడా యమున చాలా ఎక్కువ గౌరవంతో కీర్తింపబడుతున్నది.

బహుమంతవ్యతరా భృశం బభూవ:- శ్రీకృష్ణుడు యమునా జలాల్లో క్రీడలాడినందువల్ల ముందే యమున గంగకంటే బహుమంతవ్యయైనది. కాళియ సర్పంవలన కల్గిన దోషాన్ని కృష్ణుడు తొలగించినందువల్ల బహుమంతవ్యతరయైనది. మీదు మిక్కిలి మునిగణాలచే సేవింపదగిన తీర్థాదులచే కలిగిన పవిత్రాతిశయం వల్ల యమున అత్యర్థం బహుమంతవ్యతరయైనది.

తత్పదజన్మనః:- హరియొక్క పాదంవలన జన్మకలది (గంగానది) సాధారణంగా సమానాధికరణ పదాలకే బహువ్రీహి చెప్పబడుతుంది.

'అవర్జ్యో బహువ్రీహిర్వ్యధికరణో జన్మాద్యుత్తరపద' ఇతి వామన సూత్రం. కాబట్టి వ్యధికరణ బహువ్రీహి యని గమనీయం. 'ఔపచ్ఛందసికం' అనే వృత్త రచిత శ్లోకమిది.

యాదవాభ్యుదయ మహాకావ్యమందు 'నిర్బాధ గోచారణ' మనే
"చతుర్థసర్గ" సమాప్తం.

*కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే।*
*శ్రీమతే వేంకటేశాయ వేదాంత గురవేనమః॥*

ఇది శ్రీమాలోల నృసింహస్వామి కటాక్షపాత్ర, హరిత సగోత్ర, శ్రీమాన్ కారంచేటి తిరుమల మనోహరాచార్య ప్రథమపుత్ర వేంకట రాఘవాచార్య విరచిత ఆంధ్ర టీకా తాత్పర్య, సుబోధినీ వ్యాఖ్యా సమేత, శ్రీ వేదాంత దేశికాను గృహీత యాదవాభ్యుదయ మహాకావ్య మందలి 24 సర్గలలో నాల్గవ సర్గ.



## శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యుల రచనలు

మాఘ కావ్యవైభవమ్
గోదాస్తుతి - పరిమళవ్యాఖ్య
భగవద్విషయం - ఈడు అవతారికలు - ఆంధ్రానువాదం
భగవద్ధ్యాన సోపానమ్ - మనోరమా వ్యాఖ్యానమ్
శ్రీ మద్రామానుజులు - వర్ణాశ్రమధర్మాలు
శ్రీ రంగనాథపాదుకాసహస్రమ్ 5 సంపుటాలు
(రమణీయాంధ్ర టీకాతాత్పర్య వ్యాఖ్యాన సహితమ్)
గరుడ దండకమ్ - సుషమాంధ్ర టీకాతాత్పర్య వ్యాఖ్య
ఆళ్వార్లు - భక్తిప్రపత్తి మార్గాలు
శ్రీనారాయణ శతకమ్ - రాఘవీయ వ్యాఖ్య
దివ్య ప్రబంధత్రయి - ఆంధ్ర టీకాతాత్పర్య వివరణమ్
(తిరుప్పల్లాణ్డు - తిరుప్పళ్ళియెషుచ్చి - కణ్ణినుణ్శిఱుత్తామ్బు)
ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి - ప్రకాశికా వ్యాఖ్య
శ్రీ సుదర్శనాష్టకమ్ - జ్వాలా వ్యాఖ్య
శ్రీ రుక్మిణీ కల్యాణమ్ - వైష్ణవీ వ్యాఖ్య
కాంతా చతుః శ్లోకి - దీపికా వ్యాఖ్య
యతిరాజ సప్తతి - చంద్రికా వ్యాఖ్య
అభీతిస్తవమ్ - సంజీవనీ వ్యాఖ్య
శ్రీస్తుతి - హిరణ్మయీ వ్యాఖ్య
ఉభయ వేదాన్తాల ఐక కంఠ్యమ్
దయాశతకమ్ - అమృతాస్వాదినీ వ్యాఖ్య
శ్రీ వేదాన్త దేశిక దర్శనమ్
న్యాస వింశతి - శ్రేయసీ వ్యాఖ్య
న్యాస దశకమ్ - బుధరంజనీ వ్యాఖ్య
శ్రీవరదరాజ పంచాశత్ - సర్వంకషా వ్యాఖ్య
శ్రీ అచ్యుత శతకమ్ - జ్యోతిర్మయీ వ్యాఖ్య
యాదవాభ్యుదయ మహాకావ్యమ్ (ప్రథమ భాగం) - సుబోధినీ వ్యాఖ్య



గ్రంథకర్త జననీ జనకులు

కీ॥శే॥ మనోహరాచార్యులు, వేంకటమ్మ



## వాచస్పతి, పండితరత్న
# శ్రీ మాన్ కె.వి. రాఘవాచార్యుల జీవన రేఖలు

జననం : విభవ, పుష్య శుక్ల ద్వాదశి, 22 జనవరి 1929

స్వగ్రామం : నారాయణపురం, ఎల్లారెడ్డిపేట మండలం, కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర.)

తల్లిదండ్రులు : కీ॥శే॥ తిరుమల వెంకటమ్మగారు, కీ॥శే॥ తిరుమల మనోహరాచార్యులు గారు

భార్య : కీ॥శే॥ పద్మావతి

సంతానం : డా.॥ కె.వి.రమణాచార్యులు ఐ.ఎ.ఎస్; మనోహరాచార్యులు; శకుంతల; రమాదేవి, సువర్ణ

చదువు : సంస్కృతం ఎం.ఏ; తెలుగు ఎం.ఏ; బి.ఇడి

సోదర సోదరీమణులు : తిరుమల పార్థసారథి, తిరుమల నరసింహాచారి, డా॥ తిరుమల శ్రీనివాసాచారి, కీ॥శే॥ డా. వెంకట రమణాచారి, కొండమ్మ, శ్రీనివాసమ్మ

గురువులు : తండ్రిగారు, దివ్యప్రబంధాలు (ద్రావిడం), సంస్కృత సాహిత్యం, శ్రీమాన్ నమిలకొండ శ్రీరంగాచార్య స్వామి వారు, (నారాయణపురం), బ్ర.శ్రీ. భావికృష్ణ శాస్త్రిగారు (నారాయణపురం), బ్ర.శ్రీ. జోగా వెంకన్న శర్మగారు.

ప్రోత్సాహకులు : కారంచేటి తిరుమల వెంకట నరసింహాచార్యులు గారు (మెదక్)

భగవత్ విషయ బోధకులు : ఉ.వే. శ్రీమాన్ కండ్లకుంట (ఎలిజర్ల) సీతారామాచార్య స్వామి వారు

వృత్తి : విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు

ప్రవృత్తి : పురాణ, ప్రబంధ కాలక్షేపం; దైవమానుషయాజ్ఞికం; గ్రంథ పఠనం, రేడియో టివీ ప్రసంగాలు